# ఉపన్యాసదర్పణము

(ఆంధ్ర సాహిత్య దర్పణము.)

*



*

*

వెల రు. 2/-

1936

సాహిత్యభూషణ

నందిరాజు చలపతిరావు

ప్రణీతము.

A GUIDE TO

# TELUGU COMPOSITION.

ఆంధ్రసాహిత్య దర్పణము

# ఉపన్యాసదర్పణము.



BY.

**N. Chalapati Rao.**

*Author of the Modern English Telugu Dictionary Sivapuranam & Several Telugu Works.*

THIRD EDITION

FOR STUDENTS

Preparing for IV, V & VI Forms.
Intermediate & B. A., Classes.

1936.

M. V. PRESS, ELLORE.



(Rs. 1-8-0.

శ్రీరస్తు.

# విషయసూచిక.

## మొదటిభాగము.

## రెండవభాగము.

# రెండవ కూర్పు.

ఆంధ్రసాహిత్య దర్పణమను నీ యుపన్యాసదర్పణము పునర్ముద్రణము గాంచు భాగ్యము గలిగినది. ఈ గ్రంథము ముద్రింపఁ బడినతోడనే విద్యార్థుల కాంధ్రభాషకుఁ బండితులెట్లు దీని నాదరించినదియు నిందలి యభిప్రాయములవలన దెలియనగును.

ఇది టెక్స్టు బుక్కు కమిటీవారి వలన అప్రూవు చేయఁబడినది. కాని ఇనస్పెక్టింగు ఆఫీసరులలో ననేకులకు ఆంధ్రభాషా సంప్రదాయ పరిచయము లేకుండుట చేతను, సులభశైలి, సులభశైలియని యర్థరహితమైన మాట యొకటి వారిలో ననేకుల కలవాటగుటచేతను నీ గ్రంథము పొందదగినంత వ్యాప్తిఁ బొందలేదు. ఈ గ్రంథమును జదివిన వారిలో స్కూలు విద్యార్థులకంటె నాంధ్రభాషను నేర్చుకొన నభిలాష గల విద్యార్థులెక్కువగ నున్నారు. ఆంధ్రభాషలో నేదైన వ్రాయఁ గడంగువారికి తెలియఁదగిన సమస్తవిషయములను మిక్కిలి శ్రమపడి కూర్చి, పండితమండలిచేత నిట్టి గౌరవమును బడసిన నీ గ్రంథము ప్రతి పాఠశాలలో బఠనీయముగా నుంచకుండుటకు కారణమేమైయుండునో? అను ప్రశ్న మాంధ్రభాషాపరుల దృష్టి నాకర్షించుటకును, తన్నివారక మార్గము లారయుటకు నీ విషయమును గూర్చి వ్రాసితిని.

స్కూలుఫైనలు చదివిన విద్యార్థి తప్పులు లేకుండ మాతృభాషలో మనోభావాభిప్రాయముల వ్రాయలేకుండునట్టి స్థితిని సంకూర్చిన ఇనస్పెక్టింగు ఆఫీసరులును, వారేర్పఱచు సెలబసులును విసర్జనార్హములు.

స్కూళ్ళకై వ్రాయఁబడు గ్రంథములు, టెక్స్టుబుక్కు కమిటీవారంగీకరించిన గ్రంథములు, ఫోర్టుసెయింటుజార్జి గెజటునందు కలవు. ఆ వేల కొలది గ్రంథములలో నెన్ని యిప్పుడు జీవముతో నున్నవియో, ఎన్ని నామమాత్రావశిష్టములో, ఎన్ని పునర్ముద్రణమైన గాంచకపోయినవియో, యిట్టి యవస్థ సంభవించుటకు గారణమేమిగలదో, విచారించుట, ఆంధ్రులకెల్లరకు విధాయకకృత్యమని మనవిచేసికొనుచున్నాను.

ఇందు క్రొత్తగా "సంస్కృతసంధి" చేర్పఁబడినది.

ఆంధ్రులు మునుపటివలెనే నీ ఆంధ్రసాహిత్యదర్పణము నాదరించి ఆంధ్రభాషా సంప్రదాయము నుద్ధరింతురుగాత! ఇట్లు,

ఏలూరు, 1—23. ఆంధ్రభాషాపరుఁడు,
సుదిరాజు చలపతిరావు.

# తృతీయ ముద్రణము.

ప్రపంచయుద్ధ సమయమున, నీ గ్రంథము ద్వితీయ ముద్రణము గావించవలసి వచ్చినది. బహుపండితాదరణమును, బహుసహస్ర విద్యార్థి జనాభిమానమును గాంచి, యీ గ్రంథము తృతీయ ముద్రణము గాంచు భాగ్యమబ్బుట ముదావహము.

భారత భాగవత రామాయణాది గ్రంథములు తప్ప సాధారణముగా ఆధునిక కవికృత గ్రంథములు ఒకటి రెండుసారులు ముద్రింపబడుటయే సకృత్తుగా సంభవించుచుండును.

ఈ ముద్రణమున వర్ణోత్పత్తి ప్రకరణ మొకటి క్రొత్తగా చేర్పబడెను. సంస్కృతసంధి విపులోదాహరణ పూర్వకముగా బొందుపరుపబడెను.

ఈ యుపన్యాసదర్పణము టెక్స్టుబుక్కు కమిటీవారిచే తిరిగి అప్రూవు చేయబడెను. (2—6—36.)

ఆంధ్రవిశ్వవిద్యాలయము వారీ గ్రంథమును చదువదగిన గ్రంథముగా నిర్ణయించి కావించిన ప్రోత్సాహమునకు కృతజ్ఞుడను.

ఈ గ్రంథము ప్రతి పాఠశాలలోని గ్రంథ భాండాగారము నలంకరించదగినదిగా ఎంచబడియున్నది.

ఇందలి న్యాయోదాహరణముల "ఆంధ్రవాచస్పత్య" కర్తలు తమ నిఘంటువునం దుదాహరించి వ్యాప్తి కలిగించునపుడు గ్రంథనామమునైన నుదాహరింపలేదని భాషాపరులు పత్రికలలో వ్రాసియున్నారు.

ఈ న్యాయములలో గొన్ని తెలుగునుడినుండి సంస్కృత మెక్కింప బడినవి గలవు. చాల భాగము సంస్కృతాంధ్ర గ్రంథములనుండి బహుశ్రమకోర్చి యేర్చికూర్చినవియే, కొన్ని ఉపనిషత్తులనుండి సంగ్రహింప బడినవి. కొన్ని పురాణాఖ్యాయికలనుండియు, విస్తార భాగము సంస్కృ

గ్రంథముల నుండియు సేకరింపబడినవి. వాచస్పత్య కారులు తామే యే గ్రంథమునుండి వీనిని గ్రైకొనిరో తెలియజేయుట మాకు వలె సుకరముగాదు.

ఈగ్రంథము పేరు దాహరింపబడకున్నను 1912 వ సంవత్సరము నుండి వేలకొలది ప్రతులు వ్యయమగుచు నాంధ్రదేశమున ప్రాచీన గ్రంథములవలె స్థిరనివాస మేర్పరచుకొని వ్యాప్తి చెందుచున్న నీ ఆంధ్రసాహిత్య దర్పణము నందభిమానాదరములు గల వారందరో యుందురు. వారికీ న్యాయముల సంగతి తెలియబడక పోదు.

ఈ న్యాయముల వ్యాప్తికి తోడ్పడుచున్న వాచస్పత్య నిఘంటుకర్తల కెంతయు కృతజ్ఞుడను.

ఆంధ్రభాషా పయుండు నంత కాల మీ గ్రంథమితోధిక ప్రశస్తిని బడయునట్లు పరాత్పరు డనుగ్రహించు గాక !

ఇట్లు

ఏలూరు.
20—8—36

భాషాపరుఁడు,
నందిరాజు చలపతిరావు.

# పండితాభిప్రాయములు.

---

I have read your " UPANYASA DARPANAM with great pleasure. It contains exhaustive instructions regarding correct Telugu composition. From my experience of the candidates appearing for the University Examinations, in my capacity of a University Telugu Examiner, I can say that the book is indespensable to the college students who have obtained a minimum in Telugu composition in the University Examination, That the quality at present received by the college students in Telugu composition is deplorably poor, is manifest from the large number of failures in the recent I[illegible]diate Examination. The want of a suitable Guide to Telug[illegible]position [illegible]buted a great deal to this disastrous result. I am confident that if this book is regularly taught to the Intermidiate & School final students, the quality of Telugu composition will considerably improve and many sad failures will be avoided. Telugu composition is a fine art and requires regular training. I am sure your book supplies a long-felt want.

I heartily recommend it to the High School & College authorities and students.

MADRAS,
30th July 1912.

G, KANAKA RAJU, B. A. B. L.
*Govt. Translator & University,*
*Telugu Examiner & Etc.*

---

I congratulate you on the publication of your admirable work on "Telugu composition." which I have just received. In these days when great attention is paid to composition, your timely publication will enable the students to master the subject very easily. It is quite indispensable to every student of Telugu considering the very exhaustive and clear way in which the subject has been treated under various heads. I hope the work will command a rapid sale and repay you for the immense labour you have bestowed upon it.

NUZVID, 7—7—12.

V. KRISHNA RAU,
*Assistant Rajah's High School,*
*Nuzvid.*

---

Dear Sir,

I have gone th[illegible] your Upanyasa Darpanam and have great [illegible] in adding [illegible]timony to its great usefulness. I am of opinion that this is a very meritorious publication and is calculated to materially help the students who want to learn how to write a chaste, simple and idiomatic Telugu. The arrangement adopted in the Upanyasa Darpanam is very praiseworthy. The various parts of it are put together with great judgment and with due regard to the various classes of students for whom they are intended. This does great credit to your ability and energy. I fully hope it will meet with that encouragement which it so richly deserves. For my part, I shall not fail to bring your Upanyasa Darpanam to the notice of my students. Hoping to be excused for the delay.

Narsapur, 15-7-1912

I remain
Dear Sir,
DARBHA JAGANNADHA SASTRY,
Senior Telugu Pandit,
*Talyor High School, Narsapur.*

అయ్యా !

సీ. కళలద్రుతప్రకృతి ♦ కమ్ములవివరించి
సంధిరూపంబుల ♦ జతనపఱిచి
సంస్కృతాంధ్రములైన ♦ శబ్దముల్ వచియించి
బిందుభేదంబులఁ ♦ బొందుపఱిచి
మహదాదిభేదముల్ ♦ మమతతోడను జెప్పి
వివిధశబ్దావళి ♦ వేఱుపఱిచి
రేఫలభేదంబు ♦ సాఫల్యముగఁ జెప్పి
శబ్దవృత్తులనెల్లఁ ♦ జక్కఁపఱిచి
గీ. వాక్యకల్పనాదిగా ♦ వలయువాని
నన్నియును జెప్పి వ్యాసముల్ ♦ వన్నెమీఱ
వ్రాసియున్నవిగావున ♦ వ్యాసరచన
దీనికెనయగునది భువి ♦ లేనలేదు.

సీ. కావ్యవిషయశక్తి ♦ కములుప్పతిలుశక్తి
కనదలంకృతులుంచు ♦ నినుపపెట్టె
కవిసమయంబులు ♦ గన్పడు గగనంబు
కావ్యదోషవిభాగ ♦ కరణగురువు
న్యాయరత్నములెల్లఁ ♦ బాయనివారాశి
యనుకరణంబుల ♦ కాఁటపట్టు
దేశీయపదములఁ ♦ దెల్పుకోశంబిది
వర్ణముల్ గల్గుసు ♦ వర్ణశిఖరి
గీ. గ్రామ్యభాషా లతాళికి ♦ ఖడ్గమిదియ
బాలకులయజ్ఞానంబుఁ ♦ బాపుదివ్వె
పండితులసందియముఁదీర్పఁ ♦ బట్టుకొమ్మ
దీనికెనయగునదిభువి ♦ లేనలేదు.

సీ. నందిరాజాన్వయ ♦ మందార! మీరంపి
నట్టిపొత్తమునాకు ♦ నందెనిప్పుడు
చదివినాఁడనునిందు ♦ సర్వాంశములనెల్లఁ
బరమహర్షమునాకుఁ ♦ బ్రబలెడిన
నప్పకవీయము ♦ నందుఁ గన్పట్టుని
లక్షణావళులవి ♦ లక్షణముగఁ
జెప్పియుండుటచేత ♦ సేత్వాదిహిమనగ
పర్యంతవాసులౌ ♦ పండితులకుఁ
గీ. జాలనానందమొసఁగెడుఁ ♦ జాలునిదియ
వేయుమాటలనేఁటికను ♦ వ్రాయనేల
[illegible]పన్యాసదర్పణ ♦ మీశుకృపను
నిలను[illegible]ము రా ♦ జిలునుగాత.

గుం[illegible]రు,
ది 7 జూలై 1912 సం॥

ఇట్లు,
నోరి హనుమచ్ఛాస్త్రి.
మిషన్ కాలేజీ పండితుఁడు.

---

మహారాజశ్రీ నందిరాజు చలపతిరావుగారిచే రచింపఁబడి దయాపూర్వకంబుగా నాకుఁ బంపఁబడిన యుపన్యాస దర్పణంబును గాంచినాఁడను. ఇది పాఠశాలలయందలి బాలుర కెల్లరకు నాంధ్రవాక్యకల్పనా పాఠముల యందత్యంతోపయుక్తంబుగా నుండును. ఆంధ్రభాషా ప్రపంచంబునందలి యెల్ల పదార్థంబులను దెల్లంబుసేసి యానందంబుఁ గాంచు ఈదర్పణం బెంతయుందగును.

రాజమండ్రి,
9–8–1912.

ఆకుండి వ్యాసశాస్త్రి,
సీనియర్ పండితుఁడు,
వీరేశలింగము హైస్కూలు.

మీా యుపన్యాసదర్పణమను పుస్తకము మిగుల రమణీయముగా నున్నది. ఇది శులభశైలిని విపులముగా వ్రాయబడి యున్నది. ఇందలి విషయమెల్ల నుపాధ్యాయులవలనఁ గాకుండ మెట్రిక్యులేషన్ ఇంటర్ మీడియేట్ విద్యార్థులు స్వయముగానే గ్రహింపఁదగి యున్నది. క్రింది తరగతి విద్యార్థు లుపాధ్యాయుల బోధలవలన బాగుగా గ్రహింతురు. ఇందలి న్యాయము లానిలాగల కొన్నివిషయములు బహుతరగ్రంథ పరిశ్రమ చేసి సంగ్రహింపఁ బడినవై యున్నవి.

ఇట్లు,

నెల్లూరు, —7—12.

మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రి,
సి. ఎమ్. ఎస్. హైస్కూల్.

---

## కృతిప్రశంస.

ఈ యుపన్యాస దర్పణంబునం బెక్కువిషయములు నెక్కొలుపఁబడి యున్నవి. అందువల్లనే పొత్తము పెంపుఁజెందను, విద్యార్థుల కిది వివిదార్థ ప్రద మగుటను, కల్పకమనదగును. దీనికి ఆంధ్రసాహిత్యదర్పణ మని పేరిడుట సముచిత మని సంభావించుచున్నాను. విద్యార్థుల కీపొత్తము బాగుగాఁ గుదిరి యున్నదనియు చెప్పఁదగి యున్నది. వేయేల? ఈ గ్రంథము బహుగ్రంథ సారమగుటన్ బరిశంశనీయముగా నున్నది. దీనిని శ్రద్ధతోఁజదివినం బాలురు పండితులు గాఁగలగని భావించుచున్నాను. ఇది ఆంధ్ర వాఙ్మయంబున కలంకారము.

రాజమహేంద్రవరము.
10—7—12

కొక్కొండ వెంకటరత్నశర్మ,
మహామహోపాధ్యాయుఁడు

---

సుధీమణీ! ఆదరణంబున మీ పంచిన యుపన్యాసదర్పణంబు సామా గ్రంబుగఁ జదివితిని.

ఈ గ్రంథరాజంబు భాషాభిలాషులకుం భాషోపదేశకులకుం గడుం గడు చేయూతయై పరగెడి. ముఖ్యముగ నాంగ్లేయ భాషాభ్యాసకులకు దేశభాషాభ్యాసము నిర్బంధ వ్యాసలేఖనముననే కడతేరవలయునని విద్యాధికులచే నియమితంబయిన కతనను తదుపాధ్యాయు లెన్నియో విధంబుల వ్యాసరచనకు మార్గంబులఁ గఱపినను నయ్యాయి మార్గంబు లెల్లం బరీక్షాకారు లంగీకరింపమిచే నబ్బాలురు నిరుత్సాహులగుచుండిరి. ఇప్పుడన్ననో నిప్పొత్తంబు సర్వజనోపయుక్తంబై కల్పభూరుహంబు వలె సకలార్థ దాయియై మహీన్యవతారంబు మాడ్కి సుమనస్సంవేద్య గుణాలంకృతంబై [illegible] శంఖంబు చందంబున ఘంభీరధ్వని విరాజితంబై, భ[illegible] మంబై, దేశీయ సభాభవనంబు వడువున, నానార్థసమస్తపద [illegible] యొప్పారుచున్నయది. ఒక్క సంధి విషయంబుననేమి, శబ్దసౌష్ఠవంబుననేమి, యలంకారాది కావ్య విషయంబులనేమి, యిది యది యననేల సర్వవిధంబుల నుపయుక్తంబగుట నీగ్రంథంబున కతిశయోక్తి కాఁజాలదు.

గీ. దర్పణములోన నెల్ల య ♦ ర్థములుదోచు
విధము మీ పొత్తమున శబ్ద ♦ వితతు లెల్ల
కావ్యసంగతు లెల్ల సం ♦ గ్రహముగాను
కన్నులకుపండువైనట్లు ♦ గానుపించు.

చ. సులలితమైనసుబోధమును ♦ సొంపును నై యలరారువ్యాసముల్
పలువురుబాలు రాంధ్రమున ♦ వ్రాయఁగలేక పరీక్షలందు ని
ష్ఫలతనుఁ జెందు లోపమునుఁ ♦ బాపఁగఁ బ్రాజ్ఞదృష్టిచేత నీ
చలపతిరా వుపన్యసపుఁ ♦ జక్కనిదర్పణమొప్పు నన్నిటన్.

ఇట్లు బుధ విధేయుఁడు,
పాలపూడి నరసింహశాస్త్రి.
ఆంధ్రోపాధ్యాయుఁడు, బోర్డుహైస్కూలు,

హరపనహళ్ళి,
బళ్ళారిజిల్లా.

ఆర్యవర్యా!

తమరు సాదరముగ నంపిన "యుపన్యాస దర్పణ" మను గ్రంథమును సాంతముగఁ బఠించినాఁడ. తమరాంధ్రభాషా విషయమునఁ జేసిన పరిశ్రమ మెంతయు శ్లాఘనీయము. ఈగ్రంథమును సమగ్రముగను, శ్రద్ధగను జదివిన విద్యార్థుల కాంధ్రభాషయందు గొప్ప పాండిత్యము గలుగు నని నిశ్చయముగఁ జెప్పుచున్నాను.

ఉపన్యాస దర్పణమను నామమిద్దానికి సార్థకమై యొప్పుచున్నయది. ఇందలి ప్రకరణములన్నియు నిక్షుపర్వములఁబోలి రసావహములై యున్నయవి. [illegible]వ్యకావ్యములయందు భారత మెట్లో యట్లు వచనగ్రంథముల యందిది కల్ప[illegible]హీరుహమని త్రికరణ శుద్ధిగాఁ జెప్పఁగలను. ఇది విద్యార్థులకుఁ గామధేనువై, [illegible]డితులకు మిత్రమై, వ్యర్థవాగాడంబర పండిత[illegible] యుం[illegible]రాయ[illegible]చున్నది. ఇట్టియుత్కృష్ట గ్రంథరత్న మా చం[illegible] సజ్జన వినుతిఁగాంచి విస్తరిల్లి గ్రంథకర్త కత్యంత కీర్తిదాయకముగు[illegible].

కడప
10-7-1912

ఇట్లు విన్నవించు సజ్జనవిధేయుఁడు
జనమంచి శేషాద్రిశర్మ.

---

ఆర్యవర్యా!

తమచేఁ బంపఁబడిన యుపన్యాసదర్పణము నాముఖాగ్రముగా బరిశీలించినాఁడను. ఇందాంధ్రభాషోపన్యాస రచనకు వలయునంశంబులన్నియు బాలావబోధముగను, నత్యంత వైరళ్యముగను, సనాతనాధునాతనా గ్రంథస్థాంశోదాహరణ పూర్వకముగను బొందుపడియుండుటచేతఁ బాఠశాలాబాలుర కాంధ్రవ్యాసరచనకు నీగ్రంథము మిక్కిలి సహకారియగునని నొక్కివక్కాణించుచున్నాఁడను.

చిత్తగించవలెను.

పెద్దాపురము
11-7-1912

శలపాక వెంకట సూర్యప్రకాశము
Telugu Pandit
A. E. L. Mission High School,
Peddapur.

మీరుపంపిన "ఉపన్యాసదర్పణము" చదివి చూచితిని. మీ రొనర్చిన పరిశ్రమము విద్యార్థుల కత్యంతోపకారముగా నున్నది. ఇప్పు డిట్టి పుస్తకములు 6 ఫారమున కేమి, ఇంటర్మీడియటు క్లాసువారి కేమి అత్యంతోపయుక్తములు. అందులకు మార్గప్రదర్శకులు మీరని వ్రాయుటకు సంశయింపను. మానూ ల్లలో తప్పక దీని నుపయోగింప దలంచితిని. ఈ వత్సరము కూడఁ గొందఱు దీనిని వ్రాసి తెప్పించుకొను కుతూహలముతో నున్నారు. చిత్తగించవలెను.

బందరు, } చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి.
శతావధాని.

---

మ. రా. శ్రీ నందిరాజు చలపతిరావు పంతులుగారిచే రచింపఁబడి యాదగ [illegible] "ఉపన్యాసదర్పణము"ను [illegible] [illegible] డను.

[illegible] గ్రంథ పరిశీలనముచేసి సులభముగాఁ దెలియు టకై సోపాన క్రమంబున నీ దర్పణమునఁ బొందుపరచిన వ్యాక్యాంశ విష యము లన్నియు వ్యాసరచనాభ్యాసమొనర్చు విద్యార్థులకే కాక యువ్యా యులుగనుండు పండితులకుం గూడ నుపాదేయములని చెప్పవచ్చును. మఱియుఁ దత్తత్ప్రకరణములలో నునిచిన జాతీయోక్తులు, లౌకిక న్యాయ ములు, ఉపసర్గవిశేషములు, లక్ష్యభూతములగు పూర్వకవి ప్రయోగములు, లోనగునవి కడుంగడు హృదయంగమముగ నున్నయవి. ఇట్టి నిబంధను లాంగ్ల భాషలో నోహరిసాహరిగ నుదయించినవి. నేటి కాంధ్రవాఙ్మయమునకుఁ గల కొఱఁత తీర్చి భాషాపోషకముఁ జక్కని దర్పణమును నిర్మించి యిచ్చిన పంతుల వారి కనేక వందనములు. సర్వకళాధ్యక్షులు దీనిని గొలఁది కాలములోఁ బఠ నీయగ్రంథముగ విధించెదరని యూహించి పలుకనగును. ఇట్లు,

"కావ్యకంఠ" గొట్టి సూర్యనారాయణశాస్త్రి.
Senior Telugu Pandit.
Ripon Hindu Theological High School.
*Vizianagaram.*

అయ్యా !

తమరు పంపించిన యుపన్యాసదర్పణ మందినది. నేనామూలాగ్రముగా దీనిని బరిశీలించితిని. ఇది మిక్కిలి సులభశైలిని సయుక్తికముగా సమస్తాంశములు బోధపడునట్లు వ్రాయబడినది. ఉపన్యాస రచనకు దీనికంటె మంచి గ్రంథము మఱియొకటిలేదని నేను నిశ్చయముగాఁ జెప్పఁగలను. అనేకగ్రంథముల ననేక వారంబులు పరిశీలించిన వారిట్టిగ్రంథమును వ్రాయఁగలుగుదురుగాని సామాన్యులు వ్రాయలేరు. సమస్తగ్రంథసారమగు దీనిని బఠించిన విద్యార్థు [illegible] కాలములోఁ బరిజ్ఞాతలగుదురని నా నమ్మకము. దీనివలన సలక్షణభాషా [illegible]మును, గుణదోషపరిజ్ఞానమును, మనోహరమైన యుపన్యాసరచనా కౌశల[illegible] రసభావా లంకారజ్ఞానభావమును, లోకశాస్త్రపరిజ్ఞానమును, శీఘ్రకాల[illegible] [illegible] సందియము లేదు. ఇది [illegible] ముఖ్యముగా [illegible] [illegible] నేను నిశ్చయము [illegible] [illegible] యంశముల నేకములున్నవి. ఇట్టి [illegible] నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

భళ్ళమూడి దక్షిణామూర్తిశాస్త్రి

Chicacole
10—7—12

Telugu Pandit
Municipal High School.

---

అయ్యా !

మీరు పంపిన యుపన్యాసదర్పణమును జూచితిని. విద్యార్థుల మేలుకొఱకు [illegible] శ్రమపడి కొనినారు. నాయెఱింగి నంతలో నిదివఱలో నింతశ్రమ జేసిన వారు లేరు, అయితే విద్యార్థులందఱు సాధారణముగా కొనునట్టి వెలయుండిన బాగుగా నుండునని కోరుచున్నాను. వీలున్న యెడల మీరు తోచినంత వెల [illegible] నొక పుస్తకము వి. పి. గా పంపవలెను.

సికిందాబాదు.
[illegible],
21-7-12

చిలకమర్తి లక్ష్మీనరసింహము
ఆంధ్రోపాధ్యాయుడు
వెస్లియన్ మిషన్ స్కూలు

అయ్యా !

మీరంపిన "ఉపన్యాసదర్పణము" అందినది. అందలి విషయంబులను మాకవకాశమున్న కొలది పరిశీలించినారము.

బాలురుపన్యాస రచనయందు గమనింపవలయు విషయంబు లిందుఁ జిక్కగ సంలభశైలిని విశదీకరింపఁబడినవి. కావలయు వ్యాకరణవిషయంబు లన్నియు వివరింపఁబడినవి. సలక్షణమైన గ్రాంథికభాష యందనూయ జనించు కాలమున నిట్టి లక్షణగ్రంథము లుత్పన్నములై యాయనూయను ఖండించుట ధర్మమనియే తోఁచును. ఈగ్రంథము ఆంధ్ర భాషాభిమానులగు నెల్లర కత్యంతోపయుక్తమని చెప్పుట కెంతమాత్రమును సందియములేదు.

మీరుచేసిన పరిశ్రమమునకుఁ జదువరులు కృతజ్ఞులగుదురు గాత.

ఇట్లు విరమించుభవన్మిత్రులు,

Guntur }
11—7—12 }

KRISTNAMACHARI B. A. L. T.
Chairman, Board of Telugu Studies
*A. E. L. M. College Guntnr.*
MATUKUMALLY SARASWATI SASTRI,
Telugu Senior Pundit
*A. E. L. M. College Guntur,*

---

శ్లో॥ నందిరాజాన్వయోద్భూతశ్చలపత్యార్యశ్చకారతత్ ।
సర్వాన్గ్రంథాన్సమాలోక్యనూత్నోపన్యాసదర్పణం ॥
శ్లో॥ మంత్రవాద్యన్వయేజాతో వేంకటాఖ్యోద్విజస్సుధీః ।
సమ్యగ్విలోక్యతత్కోశం పరమానంద మాప్తవాన్ ॥

తమరు పంపిన పుస్తకమును సాకల్యముగ వీక్షించి యందుగల యంశంబుల నన్నిటిని జూడనాకు నామనంబత్యద్భుతానందంబు నొందె. ఈ గ్రంథరాజము హైస్కూళ్ళ బాలురకు బహూపయోగకరమని నా యభిప్రాయంబు విశదపరచితిని.

బాపట్ల. }
21-7-12 }

మంత్రవాది వేంకటశాస్త్రి,
బోర్డు హైస్కూలు తెలుగుపండితుడు.

అయ్యా !

తమరు విద్వన్ముఖమునఁ బ్రస్తుతహూణవిద్యార్థి సార్థభాషావృద్ధ్యుపయుక్తంబగునటుల రచియించి ప్రకటించిన స్వపరసాధనంబగు నాయొద్దకు నంపిన యీ యుపన్యాసదర్పణంబు నామూలాగ్రముగఁ బరిశీలించితి. ఇందలి యంశములలోఁ గొన్ని ప్రస్తుతపాఠశాలా విద్యార్థుల కుపయోగించునవియుఁ, మఱి కొన్ని మంచి యాంధ్ర పాండిత్యము కుదిరినవారి కుపయోగించునవియుఁ, ఇంక కొన్ని సరసకవితాశైలి ననుఘటించుట కనుకూలములైనవియుఁ, ఉపన్యాసరచనకు మిగిలినవియుఁ, గనుపట్టుచున్నవి. ఇందలి యంశములు ప్రతిబింబంబములుగఁ గనుపడుటం జేసి దీనికి దర్పణనామము సార్థకంబయి ... ణంబయగుచున్నది. కొద్దిదినములలో విద్యార్థులు [illegible] [illegible] ప్రత్తను నిందుపయోగింపఁ బ్రయత్నించెద.

12—7—1921
బెజవాడ

గో...
సి. యం. య... ...లు.

---

అయ్యా !

మీరు ప్రీతి పూర్వకంబుగా పంపిన యుపన్యాస దర్పణము చేరినది. ఇట్టి పూర్వపరిశోధన సహితముగా ప్రతి విషయంబునను ననేకవిధములగు దృష్టాంతములతో నిండి నిబిడీభూతమగు గ్రంథము నపూర్వమని తలంచెద.

పరిష్కృతపద్ధతిపరిశోధనము నాంగ్లేయభాషను పఠించు విద్యార్థులకు వ్యాసరచనయందు జ్ఞానాభివృద్ధిని గలుగఁజేయుటకు బృహస్పతియే మీ గ్రంథ స్వరూపంబున నవతరించినట్లు తలంచెద.

పొన్నూరు,
15—7—12

ఇట్లు విధేయుఁడు,
చెట్టూరు రామాచార్యులు
నేషనల్ హైస్కూలు తెలుగుపండితుఁడు.

---

అయ్యా!

వాఙ్మయ ప్రపంచమందలి పదార్థము లన్నియుం జూపట్టు నాంధ్ర భాషా యోషామణి విలాసదర్పణ మనఁజాలిన "ఉపన్యాసదర్పణము" అను గ్రంథరత్నమును, తాము ప్రీతిపురస్సరంబుగఁ బనుప నవలోకించి యమందా నంద కందళిత హృదయుండ నయితి. చిరకాలమునుండి యిట్టి గ్రంథము నొక దానిని రచియింపఁ గౌతూహలముఁ గలవాఁడ నైనను, కార్యావసరములచే నవ కాశము లేమి రచియింపనేరక, యిట్టి భాగ్య మబ్బు దెన్నండో యని వేచియుండి, తుదకు విపశ్చిద్వరేణ్యులగు మిమ్ముఁ గాంచితిని. ఉపన్యాస చంద్రిక, ఉపన్యాసపయోనిధి లోనగు గ్రంథంబుల, నాయా విషయంబులఁ గూర్చి మృదుమధుర శైలిని వచన రచనలఁ గాన్పించును గాని, వచన రచనఁ గావించు విధంబును, దానికిఁ గావలసిన సామగ్రియగు, సుశబ్దాపశబ్ద రేఫ శకటరేఫార్థా నుస్వార [illegible] వాక్య విభజన, దేశీయ, ఔచిత్యాలంకార లోనగు విషయ [illegible] ప్పాదు సారసంగ్రహ గ్రంథ మొక్కటియుఁ జూపట్ట [illegible] తలంచుచుండ, మీ గ్రంథమంతయు వాక్యపాలిక కల్పద్రుమ [illegible] బోలె వివిధార్థ ప్రదాయకముగఁ గన్పించుచున్నది. పాఠ శాలా [illegible] కననేమి, ఆంధ్రభాషనుఁ బాండిత్య మలవఱచుకొని నిర్దుష్టముగ, గద్య పద్య రచనలఁ గావింపఁగోరు ప్రతి భాషాభిమానికి నత్యంత సహాయకారిగ నున్నది. బహు గ్రంథములఁ బరిశీలించి, ఆయా సందర్భముల నుచిత ప్రమాణముల నిచ్చుచు, ప్రథమ భాగమందు, రేఫ, శకట రేఫ, అనుస్వార సుశబ్దాపశబ్దనిర్ణయ, సంధి, విసంధి లోనగు వ్యాకరణ విషయంబుల విశదీకరించుచు, ద్వితీయ భాగమందు, వ్యాసరచనోపయుక్త దేశీయములు, అలంకారములు, న్యాయములు, వాక్యార్థములు, ఉపసర్గ పదములు లోనగు విషయంబులఁ జేర్చి వచనరచనాకాలంబునఁ గలుగు వివిధ శబ్దార్థ సందియంబులనుఁ బోఁగొట్టు నీ యుత్తమ గ్రంథము రచియించిన మీయెడ నాంధ్ర భాషాకోవిదులందఱును, కృతజ్ఞులుగ నుందురని తలంచెదను.

కవిసంశయవిచ్ఛేదము, అప్పకవీయము, కవిమిత్రము, సర్వలక్షణసార సంగ్రహము, కావ్యాలంకారసంగ్రహము, లోనగు లక్షణ గ్రంథముల

వలనఁ గలుగు జ్ఞానమంతయు సంగ్రహముగ, నీ యొక్క గ్రంథము వలనఁ గలుగునని నమ్ముచున్నాఁడను. నాలుగు, అయిదు, ఆఱు, ఫారములయందును, కళాశాలలయందునుఁ జదువు విద్యార్థులకు నిబంధన గ్రంథముగ, దేశభాషా గ్రంథ నిర్ణాయక సభవారు నియమించిన నెంతయు నుపయోగకరముగ నుండును. అధునాతన వచన రచనా ప్రణాళికలనుఁ గల చమత్కారంబులను జూపించు నీ గ్రంథ మెంతయుఁ బ్రశంసనీయము. ఇట్టి సద్గ్రంథములను, రచియించుటకు వలసిన, సహాయోత్సాహ సంపత్తుల నాంధ్రభాషాభిమానులు మీ కొసంగుదురు గావుత.

ఇట్లు బుధజనవిధేయుఁడు,
ము. గోపాలక్రిష్ణయ్య
Telugu & Sanskrit Pandit,
*A. [illegible] College, Ongole.*

---

అయ్యా!

మీరు సాదరపూర్వకముగా మాకుఁ బంపించిన "[illegible]" లందినవి. చాల భాగము చదివినారము. అందు వ్యాకరణాలంకారాది విషయములు విపులముగను సుబోధకముగను సప్రమాణముగను వివరింపఁబడియున్నవి. గ్రాంథిక గ్రాంథికేతర భాషాభేదములు సోదాహరణముగఁ జక్కఁగఁ దెలుపఁబడినవి. అన్ని యంశములును సవిమర్శముగ, నతి పరిశ్రమముతో వ్రాయఁబడినట్లు స్పష్టముగ గాన్పించుచున్నవి. మీ గ్రంథరాజము జదువరులకు మిక్కిలి యుపయోగకరమని నిస్సందేహముగఁ జెప్పఁగలము. మఱియు నిది యుపాధ్యాయులకు సయిత మనేక విషయములలో నిఘంటువు వలె నుపయోగకరముగ నుండునని మా యభిప్రాయము. ఇట్లు విధేయులు,

R. Ch. High School, Pittapuram. 19th July 1912.

పురాణపండ మల్లయ్య శాస్త్రి.
కూచి నరసింహము,
*Head Master.*

అయ్యా !

మీరుపంపిన యుపన్యాసదర్పణమను గ్రంథము మాపాఠశాలాస్థాన మంటపం బలంకరించి మమ్ముల నందఱిని నిరతిశయానందభరితులఁ జేసినది. "ఇక్షోరగ్రాత్క్రమశః పర్వణి పర్వణి యథారసవిశేషః" అనురీతి అనగా చెఱకుకొన మొదలు క్రమక్రమముగా నొక్కొక్క గెణుపును తినుచు వచ్చిన యెడల యొక గెణుపు కన్నను మఱియొక గెణుపును, దానికన్నను మఱియొక టియును విశేష మధురరసము కలిగినట్లు తమగ్రంథములోని ప్రకరణములన్నియు నొకదానికన్నను మఱియొకటి యతిశయ రసవంతములగుటచేఁ బాఠకులందఱిని పట్టరాని సంతోషాక్రాంత చిత్తులనుగా జేసినవి. ఈ పాత్రము విద్యార్థు లందరికిని వాచక పుస్తకముగా వాడుకొనినయెడల శ్రీఘ్రకాలంబున నే యాంధ్రభాషావిశేష మనీషావంతులగుట కెంతయు నిస్సంశయము. కేవల విద్యార్థులకే గాక యుపాధ్యాయులకుఁగూడ నెంతో యుపకారిగ నుం [illegible] వీక్షణింపగలను. ఇట్లు,

అగ్రహారం కృష్ణశాస్త్రి,
మునిసిపల్ హైస్కూలు తెలుఁగుపండితుఁడు.

---

అయ్యా,

తమ యుపన్యాసదర్పణ మందినది. దాని నామూలాగ్రముగాఁ జదువుటకు సావకాశము లేకపోవుటచేత నక్కడక్కడ జదివిచూచితిని. ఆంధ్ర భాషాభ్యాసము చేయఁగోరువారికిఁ గావలసిన సాహాయ్యమంతయుఁ నించు మించుగా దీనివల్లఁ గలుగవచ్చునని నాకు దోఁచినది. ఈయుపన్యాసదర్పణ మధికమయిన భాషాపరిశ్రమానుభవముల ఫలముగాఁగాన వచ్చుచున్నది. ఇది తుదముట్టఁ జదువువారలకు నాంధ్రభాషలోని మర్మములన్నియుఁ దెలియ వచ్చునని తలంచుచున్నాను.

రాజమహేంద్రవరము
26—7—12

వడ్డాది సుబ్బారాయుడు,

ఆర్యా !

తమరు దయతో నంపిన మీ యుపన్యాసదర్పణము నా కవకాశమున్న కాలముల సమగ్రముగాఁ జదివితిని. బాలు రెన్నియో గ్రంథపాఠములవలన సంపాదించు కొనదగిన పాండిత్య మీ యుపన్యాసదర్పణావలోకనమువలన నలవరించుకొని వ్యాసములు వ్రాయుటకు శక్తులగుదురు. మఱియు నుత్తమ తమముగా గద్యకావ్యముల రచించుటకు పండితులకును నిది యాదర్శమై సార్థక నామమును వహింపగలదు.

గీ. నందిరాజకులోత్తంస ♦ నాకుమీరు
మనొసగినయుపన్యాస ♦ దర్పణంబుఁ
వితిని దీనియంతటి ♦ సరసమైన
గ్రంథమింతకు లేదిల ♦ నాంగ్లిష
వ్యాకరణాదిబహుశాస్త్రులు
కల్యముగాఁ బఠించి ♦ శాస్త్రనియతిగా
నదగువంశంబులు
మీ కావ్యమునందుఁగలిగి ♦ మిగుల రహించెఁ.

గీ. వ్యాసరచనకుమాత్రముల్ ♦ వరలకునికి
దేశ్యభాషానుమార్గంబు ♦ దెలియకునికి
నాంగిలేయాంధ్రభాషల ♦ నభ్యసించు
పాఠశాలలయందలి ♦ బాలురందు.

సీ. కొందఱు గ్రామ్యమే ♦ బొందిపంవలెనందుర
కొందఱు సంధులు ♦ గూడదందుర
కొందఱుగ్రంథముల్ ♦ గొనిగూడదగదందుర
కొందలంకృతుల్ ♦ గూడదందుర
కొందఱుసంశయం ♦ బొందిమానుచునుందుర
కొందఱసహ్యముల్ ♦ గూర్చుచుందుర

కొంద అసమాసంబె ♦ కోరినేయుచునుందుర్
కొందఱనర్థముస్ ♦ బొందుపరతు

గీ. రందఱునుమీయుపన్యాస ♦ మందు . లుగు
విషయములు లక్ష్యలక్షణ ♦ విధములగుచు
సందియంబునుదోలి యా ♦ నంద మొసగ
వ్యాసములుయోగ్యతరముగా ♦ వ్రాయగలరు.

గీ. అంధ్రబాలురపాలిటి ♦ కమరతరువు
గాననేకాంధ్రశబ్దాళిఁ ♦ గలయగూర్చి
కష్టములకోర్చిలోకోప ♦ కారమునకుఁ
బాటుపడినట్టిమీకిచ్చుఁ ♦ బసదుసిరులు.

ఇట్లు భవద్విధేయుడు,
...నుముల కోటయ్యశాస్త్రి
సీనియర్, తెలుగుపండితుఁ
మ...బూ...

---

*Dear Sir,*

తమరు పంపిన యుపన్యాసదర్పణమును జూచితిని గాని విరామము లేమిని సాంతముగఁ జూడనైతి. గ్రంథము కష్టపడి వ్రాసితిరనుటకు సందియము లేదు. విద్యార్థులకుఁ గావలసిన యనేక విషయము లిందుఁగలవు. విషయములును జక్కగానే వ్రాయఁబడియున్నవి. దీనిని ప్రతివిద్యార్థియు ..., ఆంధ్రభాష నుద్ధరింపవలయును.

చెన్నపురి
24-7-12

ఇట్లు విన్నవించు భవద్విధేయుఁడు,
వావిలికొలను సుబ్బారావు

---

ఆర్య వర్యా !

తాము దయతోఁ బంపిన యుపన్యాసదర్పణమను పుస్తకమును సంతోష పూర్వకముగా సాంతముగాఁ దిలకించితి. వ్యాకరణ విషయములేమి, అలంకారములేమి, తదితర విషయములేమి, నూతన పద్ధతుల నవలంబించి వ్రాయఁబడుట నాంధ్రభాష నభ్యసించు ప్రాణవిద్యార్థుల కత్యంతోపకారియై యున్నది. స్కూలుఫయినలు, ఇంటర్మీడియేటు విద్యార్థులు దీనిని తప్పక చదివిన వచన రచన వ్రాయుటకుం గేవల మనుకూలమై పరీక్షలం గడతేరుట సులభసాధ్యమని నా దృఢమయిన విశ్వాసము. ప్రతి పాఠశాలయం దాంధ్రోపాధ్యాయు లీ పొత్తమును తమ బాలురచే జదివింతురుగాక !

మా పాఠశాల యందు మీ చక్కని పొత్తమును టెక్స్టు పుస్తకముగాఁ బ్రవేశపెట్టుటకుఁ బ్రయత్నించుచున్నాడ.

గుత్తి<br>2-7-12

ఇట్లు తమ మిత్రుడు,<br>ఉప్పురపల్లె రంగాచార్యులు.

---

మ. రా. శ్రీ నందిరాజు చలపతిరావుగారు రచియించిన యీయుపన్యాసదర్పణము సాకల్యముగఁ గనుగొంటిని. ఇయ్యది పాఠశాలలయందు నాలుగవ తరగతి మొదలు ఇంటర్మీడియేటు పరీక్షవఱకుఁ జదువు విద్యార్థులకత్యావశ్యకమైన వివిధవిషయములచే నలంకరింపఁబడియున్న యది. మఱియు నియ్యది రాజకీయ పాఠశాలలం జదువు విద్యార్థులకేగాక యాంధ్రభాషయందు వ్యాసములు చక్కఁగ వ్రాయ నభిలాషగలవారికిని నెంతో యుపకారియై యుండఁగలదనుటకు సందియములేదు. ఇప్పుడు రాజకీయ పాఠశాలలయందు వచనరచనము నిర్బంధవిషయములలో నొక్కటిగనిర్ణయింపఁబడినదను విషయము సుప్రసిద్ధంబయి యున్నయది. వ్యాసములయం దేయేసందర్భముల నెట్టి పదము లుపయోగింప వచ్చునో యెట్టిపదము లుప

యోగింపరానో, వాక్యము లెట్లువ్రాసిన మనోహరముగ నుండునోయని సందేహమగ్న మానసులగుచు విద్యార్థుల కధిక వ్యథం గలిగించుచుండిరి. ఇప్పుడట్టి లోపమిద్దాన నివారింపబడెను, గాన నట్టిప్రయాస నుపాధ్యాయుల కియ్యకయే విద్యార్థులింక సుఖముగ వ్యాసరచనాభిజ్ఞులుఁ గాగలరని తలంచెద. దీనిని బఠించినచో, విద్యార్థులు వచనరచనా నైపుణ్యముఁగలిగి వ్యాసలేఖనపరీక్షయందుఁ దప్పక కడతేఱఁగలరని నొక్కి వక్కాణింపనగు. పరోపకార పారీణులగు శ్రీపంతులుగారనేక గ్రంథములను మిక్కిలి శ్రద్ధతో బరిశీలించి యీపుస్తకమును రచించి విద్యార్థుల కష్టములను దొలగించిరి. వేయేల? వ్యాకరణముఁ బ్రత్యేకముగఁ బఠింపకపోయినను నీగ్రంథమామూలాగ్రముగఁ గనుగొని యాయా యంశములఁ మనస్సునం దిడికొనిన విద్యార్థి నిర్దుష్టశైలియం దసమాన ప్రావీణ్యముగల వాడగును. మఱియు బాలురకు బోధింపఁదగిన యనేకాంశము లిందుండుచే నియ్యది యుపాధ్యాయుల కును, నావశ్యకంబై యున్నయది. విబుధజన శ్లాఘనీయంబగు నీ గ్రంథ మాంధ్ర విద్యార్థులకు వ్యాసరచన యందత్యంత సహకారిగ నుండఁగలదని నా యభిప్రాయము.

20-7-1912
కర్నూలు

ఇట్లు బుధజనవిధేయుఁడు,
ఆలూరు ఆదిశేషశాస్త్రి
మునిసిపల్ హైస్కూలు తెలుఁగు పండితుఁడు.

---

మిత్రరత్నమా!

తాము ప్రీతితో నంపిన యుష్మత్కృతి యుపన్యాసదర్పణం బనుపొత్తం బందె. అమందానందంబున నద్దానిం దిలకించితిని. ఈ యుత్తమ గ్రంథ పఠనాదులవలన నాంధ్రభాషయందు సులక్షణంబుగ వ్యాసరచనా చాతుర్యంబు ప్రతిబింబావలోకనంబువలె సులభంబుగ నలవడుటం జేసి దీని కీనామం బన్వర్థక

ఙ్గా నున్నయది. ఇదియునుంగాక యిప్పాశ్చాత్యవిద్యానూతన విద్యాతాపబాధ నోర్వఁజాలక శుష్కించు సలక్షణాంధ్రభాషాలత కమృతసేచన ప్రాయంబై యొప్పుచున్నది. ఇక్కాలమున నాంగ్లేయభాషాధ్యేతలగుచు వ్యాస రచనాదులయందు సలక్షణమగు నాంధ్రభాష నభ్యసింపఁగోరు విద్యార్థుల పాలిటికిది కల్పపాదప సదృశంబు. తెలుఁగు బాసయందుఁ బ్రశస్తంబులగు లక్షణగ్రంథంబులు, గావ్యనాటక పురాణేతిహాసంబులును బెక్కులు పెక్కుకాలము చదివి సంపాదింపఁదగిన లక్షణజ్ఞానము, లోకోక్తి చాతుర్యము, దేశీయపదప్రయోగ భవము, మున్నగునవి యీ పుస్తకపఠనంబున సులభంబుగఁ దెలియుం గావున నిది పఠనీయంబులేదు. ఆంధ్రదేశీయుల యభివృద్ధికొఱకుఁ బెక్కులు గ్రంథంబులు విమర్శించి యిక్కాలానుసారంబుగ నన్నివిషయములు సులభంబుగ బాలురకుఁ దెల్లమగునట్లు సువ్యాఖ్యానముతో నీ గ్రంథంబు రచించిన మీయెడఁ గృతజ్ఞత చూపుటకు నుపాయ మొక్కటిమాత్రము కనుపించుచున్నయది. అది యేదియన? విద్యార్థులత్యాదరంబున దీనిం జదివి సలక్షణంబుగఁ దెలుఁగు భాషయందు వ్యాసరచనయందు నేర్పరులయి యుష్మత్సంకల్పంబు సార్థకంబుఁ గావించుటయే సుమీ. ఆంధ్రదేశీయుల యభివృద్ధికొఱకుఁ బాటుపడు సత్పురుషవరేణ్యులకుఁ బరమేశ్వరుఁ డాయురారోగ్యముల నిచ్చి రక్షించుఁ గాతమని కోరుచున్నవాఁడను.

ఇట్లు వ్రాయుచున్నవాఁడు,

చిత్తూరు, 20-7-12. } చివుకుల సుబ్రహ్మణ్యశాస్త్రి,
తెలుఁగు పండితుఁడు, బోర్డుహైస్కూల్.

---

ఆర్యా!

తమరు పండితులయందభిమానముతో పంపిన "ఉపన్యాసదర్పణ" మను పొత్తము నాకరంబలంకరింప సద్దాని నామూలాగ్రము దర్శించితి. ఇందలి నియత విషయము లనేకములగు గ్రంథములం బరిశోధించి లక్ష్యలక్షణములతోఁ

కడురమ్యముగ నాతికఠినశైలితో రచియించినటులఁదెలియ నాయెను. ఇట్టి ప్రబంధనిర్మాణ మతికష్టతమమని నెక్కొని వక్కాణింపనగు. ఇయ్యది నవీన పద్ధతి ననుసరించి వచనరచనాధురంధరులగు విద్యార్థి బృందమునకు కల్పమహీరుహము చందంబున నిష్టార్థసిద్ధి నొడగూర్చి, ఆయాయి పరీక్షలలో కృతకృత్యులను గావింప నీప్రబంధమొక్కటియే చాలుననుటకు సందియములే(దు), మఱియు నీగ్రంథము వ్యాకరణ విషయమును బాలురకు సుఖసాధ్యముగ బోధించు వ్యాసరచనకొక్కింత లక్షణమే నుడుపుచున్నది. మొత్తముమీద నీప్రబంధము కడురమణీయ మయియున్నది. క్రింద తరగతిబాలురు పండితులబోధనచే నాయావిషయములఁ గనుఁగొననగు. ఇట్టిప్రబంధనిర్మాణదక్షుఁడును, అనవరత భాషాసేవైక రతుఁడును, అగు చలపతిరాయని కృతిరత్నము సుధీవరులయొక్కయు, విద్యార్థులయొక్కయు, హృదయసీమ నధిరోహించి తాండవమాడుచు నభిమతము లొసగి, యాచంద్రతారార్కముగ వారి పరిశ్రమ సఫలము గావింప నీశ్వరుని ప్రార్థించుచున్నాఁడ.

సుజనవిధేయుఁడు,

SARASWATI VENKATA RAMASASTRI.
Telugu Pandit,
*Municipal High School.*

WALAJANGAR,
22—7—12.

---

శ్లో॥ నందిరాజాన్వయోత్తంస । పండితానందదాయక ।
లిఖ్యేమదీయాం విజ్ఞప్తిం చలపత్యాఖ్య వీక్ష్యతామ్.

శ్రీ ఆర్యవర్యా!

నా యందలి ప్రేమచేఁ దమరంపిన యుపన్యాసదర్పణముం బ్రహృష్ట [illegible] నంది యాద్యంతముం గన్నులారఁ గాంచి యమందానంద కందళిత హృదయుఁడనైతి. సర్వవిషయములం దిలకించుటకు అద్దమనం దగిన యీ యుపన్యాసదర్పణము పండితప్రకాండులకుఁ బాఠశాలలయందలి బాలురకుఁ

బాలమనస్సులకు నవనవోల్లాసదాయకమై, ప్రీతిజనకమై, పరమోపకారకమై, యుపన్యాసరచనా విచక్షణులంజేయఁ జాలినదని విశ్వసించుచున్నాఁడ.

ఇఁక వ్రాయనేల సహృదయుల కన్నఁడును గోచరము గాని సంగతు లెన్నియో యిందుఁ బొందుపఱుపఁబడినవి.

కరంబు వ్యయప్రయాసలకోర్చి యిట్టిగ్రంథమును లోకమున కిచ్చినందులకుఁబ్రతివారలు నీపొత్తముఁ దెప్పించి, వీక్షించి, సారమును గ్రహించి కృతజ్ఞతను దెల్పుదురుగాత. నాసాధ్యమైనంతవఱకు మాబాలురకు యితరులకు యుంవలి విషయములఁదెల్పి తెప్పింపఁ బ్రయత్నింతు.

ఇట్లు వినీత వశంవదుఁడు,

29-7-1912 }
సికింద్రాబాద్. }

కప్పగంతు శ్రీరామశాస్త్రి,
Sanskrit & Telugu Pandit
Wesleyan Mission School.

---

ఆర్యవర్యా !

భవత్ప్రేషితంబగు నుపన్యాసదర్పణంబుగాంచి సంతోష చిత్తుండనైతి. అందలి విషయంబులు బాలురకే గాక యుపాధ్యాయులకును మిక్కిలి యుపయోగకరంబులని నా యభిప్రాయంబు. ఏ తద్గ్రంథ విమర్శన ఆంధ్రపత్రికకుం బంపినాఁడను. మదభిప్రాయంబు పద్య రూపంబుగా వ్రాసి పంపచుకొంటిని గాని కాలవ్యవధి లేక పోవుటచే నాలస్యమగును. ఇంతకు ధంబులు బయిండుచేయింపకున్న నిఁక వారము రోజులలో నా యభిప్రాయంబు మీ కందించెద. ఇప్పుడు 6 గ్రంథములు నా పేర బుక్కుపోస్టుగాఁ బంపుడు.

చిత్తగించవలెను.

జార్జిటవున్, }
చెన్నపురి. 24-7-12. }

పోకల వేంకటనరసింహారావు నాయుఁడు.
ముత్యాలపేట హైస్కూలు, తెలుఁగుపండితుఁడు.

---

ఆర్య వర్యా !

గీ. ఆదరంబున మీరిప్పు ♦ డనిపినట్టి
యీయుపన్యాసదర్పణం ♦ బెలమితోడ
సాంతమగుదాఁకఁజదివితి ♦ నయ్య ! నాదు
స్వాంతమున కెంతయో సంత ♦ సంబుగలిగె.

ఉ. పాటది యెంతయుంబడిన ♦ బాగుగ నిట్టికృషుల్ రచించుటల్
మాటలుగాదు, బుద్ధిమహి ♦ మంబును పొందిటియుండఁగావలెన్
నేటికి నాంధ్రభాషను గ ♦ ణింపనిట్టిది లేదటంచు ము
మ్మాటికిఁ జెప్పవచ్చును సు ♦ మా! మనబాసకు మేలుచేసితో !..

సీ. కని ద్రుతాంతములేవొ ♦ కళలేవొ తెలియంగ
వచ్చుఁగా నీదు క ♦ బ్బంబు వలన
రేఫశకటరేఫ ♦ రీతుల నెఱుంగగ
వచ్చుఁగా నీదు క ♦ బ్బంబు వలన
నానాప్రయోగ సం ♦ దర్భంబు లరయంగ
వచ్చుఁగా నీదు క ♦ బ్బంబు వలన
నాంధ్రభాషారహ ♦ స్యంబులన్నియు నేర్వ
వచ్చుఁగా నీదు క ♦ బ్బంబు వలన

మెచ్చితేలయ్య ! మీ గ్రంథ ♦ మొక్కదానిఁ
జదివి తెనుఁగునఁ బాండితి ♦ సంతరించు
కొనఁగవచ్చును నిజము స ♦ ద్గుణధురీణ
నందిరాజకులాంభోధి ♦ చందిరుండ.

బొబ్బిలి
20-7-21

కేతవరపు వెంకటశాస్త్రి,
హైస్కూలు పాఠశాలాంధ్రపండితుఁడు.

———:o:———

# పీఠిక.

## ఉపన్యాసదర్పణము.

—:O:—

శ్రీకృష్ణదేవరాయలనాఁడు విజృంభించి ప్రచారణముసల్పిన ఆంధ్రభాషాయోషామణి చల్లని బ్రిటీషు రాజ్యమున బ్రౌను దొరవారిచేతను, సర్వకళాపరిషత్తుచేతను మఱల తల యెత్తి దినదిన ప్రవర్ధమానమై నూతన వచన కావ్యకల్పనకుత్తేజమొసంగి యొక వెలుఁగు వెలింగెను.

కాల మొక్క రీతిగా నుండదు గావున ఆంధ్ర భాషా పాఠము నిర్బంధముగా తీసివేయఁబడినప్పటినుండియు, పిడుగు మొత్తినటుల భాషసన్నగిలఁ జొచ్చెను. ఇట్లుండ గవర్న మెంటువారు Telugu Composition ఆంధ్రోపన్యాసరచన నిర్బంధ పాఠముగా నేర్పఱచి కొంతవఱకు భాషా సతి నూరడించిరి.

ఈయూరడింపు సక్రమముగాకొనసాఁగక సంభాషణశైలి వి
హృదయసీమలయందు తాండవ మాడఁజొచ్చినది. అవక్రీతుఁ
"చదువకయె నాకు సర్వ వేదంబులు సర్వశాస్త్రములును సంభవిం
అని నట్లెప్పటి విద్యార్థులు శ్రమలేక వ్రాయఁదగిన సంభాషణ శై
యాడుచు దాని నుపాసించిన వారి మనోభిప్రాయమును గాంచనేరక
మొత్తి వ్రాఁతలు వ్రాయఁజొచ్చిరి.

స్కూళ్ళయందలి పండితులు కొందరు విద్యార్థులు వ్రాసిన వ్యాసములను దిద్దుట యెట్లని వితర్కింపసాఁగిరి. కొందరు విసంధిదోషముగా పరిగణించిరి. కాని విద్యార్థులు ఆంగ్లేయ భాషలో సంధిలేదు. మే మింటుమాటలాడునప్పుడు సంధి చేయము. అట్లే వ్రాయుదుమనిరి. మరి కొందఱు ఉకారాది నిత్యసంధులను మాత్రము గ్రహించెద మనిరి.

కొందరు పండితులు "అపశబ్దములు" పనికిరావనిరి. విద్యార్థులు దీనికి పరిహాసోక్తిగా "అపశబ్దభయంనాస్తి వ్యావహారిక భాషావాక్యసన్నిధౌ" అను వాక్యమును జూప సాగిరి.

"మహాగ్రాహపలాయంతే మశకానాంతు కాగతిః" అనునట్లు సంధి శబ్దములే యెగిరిపోవుచుండగా నిక సమాసము లెవనికిఁ గావలయును.

బాణాసురుని ప్రతాపమునకు పంచభూతములు చేష్టలుడిగి వైవర్ణ్యమును బొందినట్లు, భాషకు పూర్ణాదులవంటి కళా ద్రుతప్రకృతికములు పటాపంచలయ్యెను. శబ్దవృత్తులు వక్రించెను. సంధి వాక్య విరామమందు జొచ్చెను. అలంకారము లడుగంటెను. కావ్య దోషములు గుణములయ్యెను. రసము, ఔచితి వేఱు త్రోవలఁ బర్వులిడెను. దేశీయములు ఉన్మత్త ప్రలాపములాయెను. ఈ సందడిలో శబ్దములలో నడఁగి మడఁగియున్న అర్థానుస్వారము లుప్పున నూది వేయబడెను. శకటరేఫ, రైలు, స్టీమరుల నెక్కి వలసబోయెను. ధ్వని బాలుర యల్లరియందును, పండితులను గ్రాంథిక శైలిని దూలనాడుటయందు జొచ్చెను. అహాహా!

... మహిమున్ వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు త
త్సనీయస్థితిమూలమై నిలుప శ్రీనాథుండు పోషివన్మహా
లై సోముఁడు భాస్కరుండు వెలయింపం సొంపు వాటిల్లు నీ
గ్రాంథోక్తిమయ ప్రపంచమునఁ దద్ప్రాగల్భ్య మూహించెదన్॥

ట్టి భాష యీ మహాకలిసంక్షోభమున నక్కడక్కడఁ గల కొలఁది
ల వాక్కు జొచ్చెను.

పరమ శాంతులును, భాషాసేవైక రతులును, భాషాకోవిదులును, వాల్మీకి రామాయణాది బహుళగ్రంథవిధాతలును ప్రసిద్ధిగన్న కళాశాలా పండితులునగు బ్ర॥ శ్రీ॥ వావిలికొలను సుబ్బారాయ కవివర్యులు,

ఉ. కాటుక కంటినీరు చనుకట్టుపయింబడ నేల యేడ్చెదో
కైటభ దైత్య మర్దనుని గాదిలికోడల యోమదంబ యో
హాటక గర్భురాణి నిను నాఁకటికిం గొనిపోయి యల్ల "గ్రా
మ్యాటవినిం జరించు గుణహారుల" కమ్మనటంచుఁ దెల్పుచున్.

"నాకు భార్య బిడ్డలు లేరు, మీ బిడ్డలు, బిడ్డలబిడ్డలు, వారి బిడ్డలు పారంపర్యముగ... చార్వాకులుగానో, నాస్తికులుగానో, యగుదురు. వారిని జెఱచిన పాపము మీకుఁ దప్పదు" "ఆంధ్రభాషయు నాంధ్రవిద్యార్థులు సంపూర్ణముగఁ జెడకముందే యాంధ్రమహాజనులగు మీకు కార్యము చక్కఁదిద్దఁ గరములు మోడ్చి ప్రార్థించుచున్నాను" అని మహోపన్యాసము వ్రాసి భాషాభిజ్ఞులను, నిద్రనుండి లేపెను.

ఇట్లుండఁ ముద్రిత గ్రంథములయందలి యపశబ్దములు ఆంధ్రభాషకు కీడు చేయుచున్నవని తలంచి భాషాసతి నూరడించుటకై కింకిణులను సమర్పించిన అభినవవాగనుశాసనులు బ్ర॥ వేదము వేంకటరాయశాస్త్రిల వారు పచ్చయ్యప్పకళాశాలయందు సంభాషణ (గ్రామ్యశైలి) యొక్కదుష్టతను గూర్చి యుద్ఘోషించి వేను విధాయక కృత్యము నెక్కువసామర్థ్యముతో నిర్వహించిరి. కృష్ణాపత్రిక యొక సహజ గంభీర వాక్కులతో గ్రామ్యమును దూషించెను. ఆంధ్రప్రచారిణీ గ్రంథప్రచురణ కర్త లీశైలిని నిందించిరి. శశిరేఖయు నిది దుష్టమనియెను.

ఎవని దానమును గూర్చివ్రాయుటకు భాషాపదములు సమర్థములు గావో, ఎవని సౌజన్యమాన్యతనుగూర్చి వచించుటకు కవులకును సాధ్యపడదో, ఎవని ఆంధ్రభాషాభిరతినిగూర్చి వక్కాణించుటకు కేవల సరస్వతి అమోఘవాక్య మొక్కటి మాత్రమే సమర్థమో, అట్టి మహా... స్థాపింపఁబడిన ఆంధ్రపరిషత్తుకూడ నీగ్రామ్యశైలి దుష్టమని చాటిం...

సంభాషణ శైలి యవసరమగుచోట్లమాత్ర మనుసరింపదగినదని వాదాంశమే. ఆశైలి నేర్చుకొనుటకై ప్రయాసపడ నగత్యము లేదు. సలక్షణ... యే కష్టపడి సాధింపఁదగినదగుటను, విద్యార్థిదశయందే నేర్వదగినదగుటను, అది నిర్బంధ పాఠముగానుండుటచేతను, దాని నిర్వహణార్థమై యీ గ్రంథము రచింపఁబడినది.

గ్రంథమునుగూర్చిన మంచిచెడ్డలు పాఠకులును పండితులే నిర్ణయింపంగల కర్తలు. సలక్షణ భాషాశైలిని విద్యార్థులకు బోధించుట యెట్లోయని విచారించి విద్వత్ప్రసిద్ధమై యెల్లజనులచేత నంగీకరింపబడిన చిన్నయసూరి యొక్కయు, ఆంధ్ర

కవిత్వ విశారదులును, వచన కావ్యాభరణ మనఁదగిన రావుబహద్దరు వీరేశలింగము పంతులుగారు మున్నగువారి గ్రంథములను పైకొని వారు చనిన మార్గముల నాఁగసి అట్టి శైలినలవరచు కొనుటకు వలయు సూచకరణములను గూర్చి యథోచితముగా బాలావబోధముగా గూర్చితిని.

ఈ గ్రంథమును రచించుటలో నాకు బ్ర॥ మ॥ రావు బహద్దరు వీరేశలింగము పంతులుగారి గ్రంథము లెంతయో సాహాయ్యకము లయినవి. ఆంధ్రవిద్యాజనులకు సులభమును, భావప్రకటనప్రధానమునగు శైలి నేర్పుటలో పంతులవారి నిర్దుష్టగ్రంథములు వేనోళ్ళ పొగడఁబడవలసి యున్నవి. నాయశక్తివుపడి తెలిగించిన శారీరశాస్త్రము, జ్యోతిషశాస్త్రము నాంగ్లేయభాషాంతరీకరణములని యెవ్వరను కొనరు. ఇట్లు వ్రాయుటకు వారికి వారేసాటి. బహుశాస్త్రగ్రంథప్రధానమగు నామహాపురుషునికి ఆంధ్రజనులెల్లరు కృతజ్ఞులుగా నుండవలయును. ఏవిషయమును గూర్చి చూచినను వారి గ్రంథములలో నుండును. ప్రథమమున నుపన్యాస శైలియని యొకటి యేర్పరచినది వీరే. స్త్రీపునర్వివాహ చరిత్రయందలి వాక్యము లీశైలికి నిదర్శనములు. దేశీయములు వీరి సొమ్ము.

విద్యార్థులు వీరి గ్రంథములను తెఱచుచు చదువుచు మంచిశైలి నేర్చుకొన ప్రస్తుతము మనకుఁ గవర్నమెంటు ట్రాన్సులేటరుగానున్న మ. రా. రా. నకరాజు పంతులుగారి శైలియు, జనానా పత్రిక సంపాదకత్వముతో . రా. రా. రాయసము వెంకట శివుడు పంతులుగారి శైలియు ...ంచుగా వీరేశలింగము పంతులుగారి శైలి ననుకరించును. కాని ...వప్రకటనమందు మాత్రము పంతులుగారితో తులదూగలేరు. ఇట్లు వీరిరువురిని పేర్కొనుటచేత నిట్టి శైలి వ్రాయగల సమర్థులితరులు లేరని నా తలంపుగాదు. కాని పైవారి శైలి పంతులవారి శైలికి మిక్కిలి దగ్గరగా నుండును. వీరుభయులును నిర్దుష్టమయిన శైలి వ్రాయుదురు. అందును ట్రాన్సులేటరుగారి శైలి కొంచము ప్రౌఢము. వీరుభయు లుద్యోగధర్మములలోనుండి గ్రంథరచనకు దొరకొనకుండుట భాషాసతికి లోపము. బ్ర॥ మ॥ చిలకమర్తి లక్ష్మీనరసింహము

గారి శైలి మిక్కిలి సమంజసముగా నుండును. నేనీ గ్రంథమందనేకుల గ్రంథములనుండి యుదాహరణములు గైకొని యందులకు వారికి కృతజ్ఞతాభి వందనము లర్పించుచున్నాను.

ఇట్లు పలువురు గ్రంథములను రచించుచున్న భాష యెట్లభివృద్ధికి వచ్చును?

ఈ గ్రంథమందలి న్యాయములను గూర్చిన ప్రకరణము బ్ర॥ మ॥ వల్లంపల్లి మల్లికార్జున శాస్త్రిగారిచేత వారి శిష్యులమగు మాకొఱకై సమకూర్పఁబడినది. ఇన్ని న్యాయముల నొక ప్రోగుగాఁ గూర్చుటకై శాస్త్రుల వారు మావంటి విద్యార్థులకు బోధించుట యలవాటుచేసిరి. బహుగ్రంథములను-

నేనీగ్రంథము వ్రాయుటకు గుంటూరు కాలేజీలో నుపాధ్యాయులు గానున్న బ్ర॥ వల్లాది సోమయాజులగారి ఉపన్యాస చంద్రిక చాల సహాకారియయ్యెను.

ఈ గ్రంథమందు నేరచించిన వాక్యములు మిక్కిలి తక్కువ. అందులో పములున్న సవరించి విద్యార్థులకు బోధచేయుటకు పండితులు ప్రార్థితులు.

నేనీ గ్రంథము రచించునప్పుడు నాతో కూడనుండి, అనే విషయములను నాకు బోధించిన బ్ర॥ మ॥ కొండి భద్రాద్రి రా వారికిని, నా గ్రంథమును విని సంతోషించిన బ్ర॥ వేదము వేంకట వారికిని కృతజ్ఞతాభివందనము లర్పించుచు నేనీగ్రంథరచనకై విద్యార్థులు వ్యర్థముగా కుండఁ జేయుదురని కోరుచున్నాను.

ఇట్లు సజ్జన విధేయుఁడు,

నందిరాజు చలపతిరావు.

# ఉపోద్ఘాతము.

“ఎవ్వఁడు హంసములను, శుకములను మయూరములను శుక్లహరిత చిత్రములఁ గావించె నాయీశ్వరుఁడాయయి జంతువులకుఁ దత్తను రూపమయిన వృత్తిని గల్పించువాఁడు. మూఢులీ యర్థమెఱుఁగక వృత్తికయి పడరాని పాట్లుపడి కాలము వ్యర్థముగాఁ బోఁగొట్టుచున్నారు. విత్తము గడన యందొక దుఃఖము, కాపుదల యందొక దుఃఖము, వినాశమందొక దుఃఖము పుట్టించుచున్నది. ఇట్లు దుఃఖైక మూలమయిన విత్తమేల? కాల్పనా! ధర్మార్థము ధనము గోరుట కంటె నిస్పృహత్వము మంచిది. “అడుసు త్రొక్కనేల కాలు గడుగనేల.” ఆకాశమునందుఁ బక్షులచేత భూమియందు వ్యాళములచేత జలములయందు మీలచేత మాంసము భక్షింపఁ బడినట్లు సర్వత్ర విత్తవంతుఁడు భక్షింపఁబడియెడును. కాఁబట్టి ధనతృష్ణ మానికోలు వివేక కార్యము. తృష్ణయొకటి మానెనా యావల దరిద్రు డెవఁడు? ధనికుఁ డెవఁడు? దాని కెవ్వఁడెడమిచ్చెను, వానిమూర్ధమే దాస్యమునకు సింహాసనము. ఈసన్నికర్షము చేత నాయజ్ఞానము సర్వము నివర్తించినది. కృతార్థుఁడ నైతిని. గా నీతోడిసంగతికంటె నాకు లాభమొకటిలేదు. నీతోడి ప్రణయ కొఱఁతయు రాఁబోదు. ప్రణయము లామరణాంతములు, కోపము భంగురములు, త్యాగములు నిశ్శంకములు నగుట మహాత్ములకు

(నీతిచంద్రి.

ఆంధ్రవాఙ్మయమునకు వ్యాకరణ నియమమేర్పరచి ప్రామాణికుఁడు వాసిగాంచిన చిన్నయసూరి యాంధ్రభాషయందలి కొఱఁతనునివారింపఁ బూని నీతిచంద్రికయను వచన కావ్యమును నాతి కఠినశైలిని నిర్దోషముగ విరచించి ఖ్యాతిఁగాంచెను.

అందులోని యొక కొంచెము భాగ ముదాహరణముగాఁ గైకొని వచనకావ్య రచనకు ముఖ్యముగాఁ దెలిసికొనఁదగిన యంశముల నిందు స్థాలీపులాకన్యాయముగాఁ జూపుచుంటిమి.

" ఎవ్వఁడు:— అరసున్న సిద్ధము. చిత్రములఁ గావించెను;— ఇది సాధ్యము. ఎఱుఁగక;— సిద్ధము, వ్యాఘ్రముఁగాఁబోఁగొట్టు:— సాధ్యము ను. భక్షింపఁబడియె:— సాధ్యము. కొఱఁత:— సిద్ధము.

☞ ఈ విధముగా నరసున్నల పరిజ్ఞాన మావశ్యకము.

"చిత్రములఁ గావించెను." చిత్రములన్ + కావించెను:— ఇది ద్రుతప్రకృతికము. "జంతువులకుఁ దత్తదనురూప" జంతువులకున్ + తత్తదనురూప:— ద్రుతప్రకృతికము. "వ్యాఘ్రముగాఁ బోఁగొట్టుచున్నారు" వ్యాఘ్రముగాన్ + పోన్ + కొట్టు— ద్రుతములు. " ఆకాశమునందుఁ బక్షుల చేత భూమియందు వ్యాళములచేత" ఆకాశమునందున్ + పక్షులచేతన్, భూమియందున్ + వ్యాళములచేత:— ద్రుతప్రకృతికములు.

"ఈశ్వరుఁడాయయి" ఈశ్వరుఁడు:— కళ. "తత్తదనురూపమైన" అనురూపము— కళ. "వృత్తికై పడరాని " వృత్తికై — కళ. ఏలు:— కళ. ...మొకటి" తృష్ణ— కళ.

☞ ఈ విధముగాఁ గళా ద్రుతప్రకృతికముల పరిజ్ఞాన మావశ్యకము.

...శ్వరుఁడాయయి" ఈశ్వరుఁడు + ఆయయి:— ఉకారసంధి. ...ందొక" కాపులయందున్ + ఒక:— ఉకారసంధి. "ధనము ... ధనము + కోరుట:— సరళాదేశ సంధి. "ధనతృష్ణ మానికోలు" ...ష్ణన్ + మానికోలు:— ద్రుతలోపసంధి. "తృష్ణమొకటి" తృష్ణ + ఒకటి:— సంధిలేదు.

☞ ఈ విధముగా సంధుల పరిజ్ఞానమావశ్యకము.

"ధనము గోరుటకంటె" కోరు:— సాధురేఫ. "ఒక్క కొఱఁతయు ...రాబోదు. " కొఱఁత:— శకటరేఫ.

☞ ఈ విధముగా రేఫ శకటరేఫ పరిజ్ఞాన మావశ్యకము.

వృత్తి:— ఋకారము. తృష్ణ— ఋకారము. దరిద్రుఁడు:— రేఫ ఉకారము.

☞ ఈ విధముగా కొమ్ము ఱ్కారల వత్తువసుండి పరిజ్ఞాన మావశ్యకము.

"అడుసుంతొక్కనేల కాలుఁగడుగనేల" ఇది ప్రసిద్ధమయిన తెలుఁగు సామెత.

ఇట్టివి యుపయోగించుట రచనాచాతుర్యముఁ దెలియఁజేయును.

☞ ఈ విధముగా సామెతల పరిజ్ఞాన మావశ్యకము.

"హంసములను, శుకములను, మయూరములను, శుక్ల హరిత చిత్రములఁగావించె "యథాసంఖ్యాలంకారము. "ఆకాశమందుఁ బక్షులచేత భూమియందు వ్యాళములచేత జలమందు మీలచేత మాంసము భక్షింపఁబడినట్టు సర్వత్ర విత్తవంతుఁడు భక్షింపఁబడిమెడును" ఉపమాలంకారము.

☞ ఈ విధముగా నలంకార పరిజ్ఞానమావశ్యకము.

"వినాశ" వి + నాశ —ఉపసర్గము. ఇచట " వి " కర్థముకే
"నిస్పృహత్వము" నిర్ + స్పృహ:— ఇందిది నఞ్ అర్థకము=లేక
"వివేకము" వి + వేకము:— ఉపసర్గము. "సన్నికర్షము"సం + ని ఉపసర్గములు. అర్థాంతరముల నిచ్చుచున్నవి.
"సంగతి" సం + గతి:—ఉపసర్గము అర్థాంతరము నిచ్చుచున్నది.

☞ ఈ విధముగా నుపసర్గ పరిజ్ఞానమావశ్యకము.

"ఆయీశ్వరుఁడాయయి జంతువులకుఁ దత్తిదనురూప మయిన వృత్తిని గల్పించువాఁడు" ఈశ్వరుఁడు, వృత్తిని కల్పించువాఁడు. ఇది మూలవాక్యము. "ఆయయిజంతువులకు" అనునది వృత్తి కల్పనతో సంబంధము. "తత్తదను రూపమయిన" వృత్తికి విశేషణము. "ఆ" ఈశ్వరునికి విశేషణము.

☞ ఈ విధముగా వాక్యవృద్ధిరచనా పరిజ్ఞాన మావశ్యకము.

"పగతుర మనల మిగిలి నొగిలించుట కంతరంగంబున నెగులొందెదము. "అత్యుచ్ఛ్రియః పతనహేతు" వనియార్యులు వచియింతురు గావునఁ బెరిగెడివాఁడె విఱిగెడివాఁడు. నేఁడు శత్రునిరాసంబున "ధన్యోస్మి" యనుకొని విఱ్ఱవీగు దాయ రేపేమి మూఁడనున్నాఁడో, యెఱుఁగుదురు? సతతముఁ గంటికి ఱెప్పవలెఁ గాచుచుఁ బ్రోచుచుండు దేవరబుద్ధిని స్వామియే కనువెలుఁగుగా వెంటఁ జరియించు తలంపున, మేమందఱ మీకడకుం జనుదెంచినారము. నీయట్టి ఘనుని కరుణారసవృష్టి కలిగిన గదా, మాహృదయ తాపము చల్లారును. ఇన్నినాళ్ళును నందఱూనానన బ్రదికి, తుదకుఁ బౌరుషము చెడినప్పుడు శరీరధారణార్థం బొక్క నీచవృత్తికిలోనయి, రోఁతలకాలయము కానేల? ఈతఱి మిక్కిలి లోతు లేదుకాన, సాహసించి, యసహాయశూరులమై, జనులు మనమీఁదఁ జాలిం బెట్టఁ జోటులేకుండ, నాయురవసాన పర్యంతమును బోరి, యధ్రువంబులగు దేహంబులచే ధ్రువంబగుకీర్తి నార్జింతము."

(నీతిచంద్రిక - విగ్రహము.)

ఇది "అభినవగద్య తిక్కన" అను బిరుదువడసి, ఆంధ్రప్రపంచ వచనకావ్యముల కొఱఁతను విస్తార భాగముతీర్చిన రావుబహద్దరు శ్రీ వీరేశలింగము పంతులవారు రచియించిరి.

"అత్యుచ్ఛ్రియః పతనహేతుః" "ధన్యోస్మి" ఇవి అనుకృతులు

...tations.)

☞ "ఈ విధముగా వాక్యరచన యందనుకృతుల పరిజ్ఞానమావశ్యకము.

"నీ యాకాశపంచాంగము నాచెంగట విప్పఁజనదు. విక్రమంబున రాజచక్రంబు నాక్రమించుట యక్రమంబని చెప్పువాని నినుదప్ప నఱి యొక్కని నెక్కడను గనఁజాలను. ధర్మరహస్యముల సారస్యముఁ గొనముట్టఁగని పెట్టితిని. బాగు బాగు! దేవార్థముగాఁ దెచ్చిన పార్థివుల నావలన విడిపింప నంతకున కేని నంతకాంతకున కేనిఁ దరము కాదు.

నన్నేమో మీరు తలగిల్లి మొలవవేయుదురని భీతిల్లఁబోను. విన్నవారును గన్నవారును నవ్వ నీనోరునొవ్వ నీలట్టాభట్టీయము లేల నేకరువు పెట్టెదవు ? పాపము. నాపాపము మీమెడఁజుట్టుకొననేల ? మీరు గిలగిలఁ గొట్టుకొననేల ? ఆ యడురుమీకుఁ దొడరకుఁడ మామక పరశుధారచే నీనీచ శరీరంబులు తప్పించి నవీన దివ్యశరీరంబులు తెప్పించువాఁడ."

(ధర్మజరాజసూయము.)

ఇది యుభయభాషాపండితులును, అనేక గద్య కావ్య రచనాధురంధరులునగు నేతి వేంకట సుబ్బరాయ శాస్త్రిగారిచే రచియింపఁబడినది.

"ఆకాశ పంచాంగము" "తలగిల్లి మొలవ వేయుదురు." "లట్టా భట్టీయము" ఇవి లోకోక్తులు.

☞ ఈ విధముగా వాక్యరచనయందు లోకోక్తుల దేశీయములు (Idioms) పరిజ్ఞాన మావశ్యకము.

దిఙ్మాత్రముగాఁ జూపబడిన పయి విషయములేగాక రసము మున్నగు మఱికొన్ని కావ్యవిషయముల పరిజ్ఞానమావశ్యకము.

తొల్లిటికన్న యావత్ప్రపంచమునందును, విద్యాభ్యాసము చేయువారు నెక్కుడు కలిగియుండుటచే నందఱికి నందుబాటగు సులభ శైలి యావశ్యకమగుటచేతను, పశ్చిమదేశ సంఘర్షమువలన మనదేశమున కుటుంబ యాత్రకు ధనవ్యయ మెక్కువ కావలసి యందుల కుపయోగించు బహువిధములను గనుఁగొనుట ముఖ్యమగుటచేతను, దీరికగాఁ గూర్చుండి భాషయొక్క లోతుఁ గనుగొనుట కవకాశము లేక పోవుటచేతను, గ్రంథశైలి నానాటికి సులభ, సులభతర, సులభతమత్వములం బొందవలసివచ్చెను.

శైలి యేదియైనను పైని జెప్పఁబడిన యంశము లుపాదేయములు కావున వాని వివరణము యథోచితముగా బాలావబోధముగా నొనరింపఁబడును.

ఇప్పుడు సర్వకళా పరీక్షాధికారులు ఆంధ్రభాషావాక్యరచన నిర్బంధపాఠముగా నేర్పఱిచిరి. అందు రెండు ముఖ్యవిషయములు గలవు.

(1) విషయ పరిజ్ఞానము.

(2) విషయములను నిర్దోషమయిన శైలితో రసయుక్తముగా భావ ప్రకటన ప్రధానముగా వ్రాయు పాటవము.

ఈ రెంటిలో విషయపరిజ్ఞానము స్కూలుఫయినలు, (School Final) మెట్రిక్యులేషను, (Metriculation) ఇంటర్మీడియేట్ (Intermediate) విద్యార్థులకు వారావారి తరగతులయందుఁ జదువు వివిధ గ్రంథముల వలననే తెలియును, లేదా ఆ విషయములను బోధించుటకు ఇంగ్లీషున కావలసినంత గ్రంథ సముదాయము కలదు.

రెండవ విషయమగు సలక్షణముగా భాషను వ్రాయు పాటవముఁ గూర్చియే యెంతయుఁ బ్రయత్నము చేయవలెను.

ఈ ప్రయత్నము రెండు విధములు.

(1) భాషను సక్రమముగా నేర్చుకొనుట.

(2) లౌకిక భాషనుండి యసాధుత్వమును దిద్దుకొనుచు నేర్చుకొనుట.

లౌకికభాషనుగూర్చి యొకటి రెండుమాటలు:—

మనుజుఁడు పుట్టినది మొదలు తల్లితో మాటాడుట, పిల్లలతో నాడుకొనుట మొదలయిన పనులయందు, ఇతర జాతివారితో మాటాడుటయందును పెద్దవాండ్రయిన తరువాతఁ గూడ నే పనిలోనికిఁ బోయినను వచ్చుచుచ్చుట జనులతో మాటాడుటయందును, లౌకికభాష (Colloquial) యే సిద్ధపడి యుండును. విద్య గఱపునట్టి గురువులు సయితము పాఠములోనున్న శబ్దములను పరిశుద్ధముగా బోధ చేయుట తప్ప ఆ బోధ చేయుకాలములో సైతము నీ లౌకికభాషతోడనే నుడువు చుందురు.

కావున సాధుభాషను వ్రాయుఁదలఁచినవాఁడు సాధ్వసాధుశబ్దములను జక్కఁగాఁ దెలిసికొనుట యత్యావశ్యకమయియున్నది.

## లౌకిక భాష.

"పెద్దిభొట్లు— నిజము శెలవిచ్చారు. మంచిదినములు వచ్చినట్లయితే అంతా శుభమే. ఎవరి నొసటి వ్రాలెవరు చూచారండీ? ఆయనకే అదృష్టము వొర్లి గొప్పదశ పట్టగూడదండీ? ఏమి మహద్భాగ్యము. ఇప్పుడు డిప్టీకలెక్టర్లు తహశ్శీలుదారులు కొమ్ములతో బుట్టినారా? గీతయుంటేసరి. ఇప్పుడీపని కలిసివచ్చి పైవాండ్ల అనుగ్రహముంటే తహశ్శీలుదారీ అనగా యెంతండీ. అయిదు సంవత్సరములలో కానేవచ్చును. గ్రహబలము చూతాము పంచాంగం తెప్పించండి."
(ప్రణయమహిమ.)

## గ్రాంథిక భాష.

పెద్దిభట్లు— నిజము సెలవిచ్చితిరి. మంచిదినములు వచ్చినట్లయిన నంతయు శుభమే. ఎవరి నొసటి వ్రాలెవరు జూచిరి. ఆయనకె యదృష్టము దొరలి గొప్పదశ పట్టగూడదా? ఏమి మహాభాగ్యము. ఇప్పుడు "డిప్యూటీ కలెక్టరులు," "తహశ్శీలుదారులు" కొమ్ములతోఁ బుట్టిరా? గీతయుండినసరి. ఇప్పుడీ పని కలిసివచ్చి పైవాండ్ర యనుగ్రహముండినఁ "దహశ్శీలువారీ" యనఁగా నెంత. అయిదు సంవత్సరములలోఁ గానే వచ్చును. గ్రహబలముచూతము. పంచాంగముఁ దెప్పింపుఁడి."

ఈ ప్రకారముగా ఇంగ్లీషు భాషయందును గూడ సలక్షణమైన భాషయనియు పామరజన గ్రాహ్యమగు లౌక్యభాషయనియు రెండు దెఱంగులు గలదు.

గ్రామ్యభాష నాటకములయందును జాతీయోక్తులు యథావిధిగా వర్ణించునప్పుడును వాడఁబడుచున్నది. తక్కిన యెల్లసమయముల యందును సలక్షణమైన భాషయే వాడఁబడుచున్నది. సలక్షణమైన భాషయే ఆంధ్రుల కందఱికిని దెలియుభాష.

సలక్షణమై, సులభశైలితో గూడి, దేశీయ పదసమ్మిళితమై వ్యావళమై సరళమైన భాషయే విద్యార్థు లుపన్యాసరచనమం దుపయోగింపఁ దగినభాష. అట్టిభాషను నేర్పుటయే యీ గ్రంథోద్దేశ్యము.

ఉపన్యాసములు వల్లించి వానినే వ్రాయుట బాలకుల విద్యాభివృద్ధికి హానికరము. కాఁబట్టి ఆవిషయమును విడిచి పెట్టితిమి.

ఈ గ్రంథమును జదువరులు చూచి యానందించి యుపయోగము లాభము దెచ్చుకొనుటయే మాకు బ్రత్యుపకృతి.

ఇట్లు విన్నవించు సజ్జన విధేయుఁడు,

నందిరాజు చలపతిరావు.

---

# ఉపన్యాసదర్పణము.

——(౦)——

## CHAPTER. 1

### కళాద్రుతప్రకృతికవివరణము.

ఆంధ్రభాషలోని సమస్తశబ్దములు నవి యేభాషా భాగములోఁజేరిన వైనను, (1) కళలనియు (2) ద్రుతప్రకృతికములనియు రెండు తెఱఁగులంగా నుండును. తెలుఁగున వాక్యరచనకు నీకళా ద్రుతప్రకృతిక పరిజ్ఞాన మావశ్యకము.

ఎందువలన ననఁగా:— ఈభాషయందు రెండుశబ్దములు కలుపునపుడు సంధిచేయవలసి యుండును. అట్లు సంధిచేయు నప్పుడు శబ్దములు కళలైన పక్షమున నొకవిధము గాను, ద్రుతప్రకృతికములైన పక్షమున మఱియొక విధముగాను రూపమును బొందును.

### కళలు.

కళలనగా అచ్చు అంతమందుఁగల శబ్దములు. అనఁగా నకారమంతమందులేని శబ్దములు.

## Nouns & Pronouns.

### నామములయు సర్వనామములయు కళలు.

డు, ము, వు, లు అను ప్రథమావిభక్తి ప్రత్యయములు.

ఉదా:— రాముఁడు, వనము, ధనువు, ధనువులు.

**N. B.** అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని, పెక్కు, పలు, ఆ, ఈ, ఏ, నీ, నా, మన, తా, ఒకటి, రెండు మొదలగు సంఖ్యావాచకములు, ఇవి యన్నియు ప్రథమావిభక్త్యంతములగు సర్వనామములు.

అన్ని (అందఱు) ఇన్ని (ఇందఱు) ఎన్ని (ఎందఱు) కొన్ని (కొందఱు) పెక్కు (పెక్కులు, పెక్కురు) పలు (పలువురు) ఆ (వాఁడు, వారు, అది, అవి) ఈ (వీఁడు, వీరు, ఇది, ఇవి) ఏ (ఎవఁడు, ఏడు, ఏది ఎవరు, ఏవి, ఎవరు, ఎవ్వతె) నీ (నీవు, ఈవు, మీరు, ఈరు, మీరలు, ఈరలు) మన (మనము) ఇవి సర్వనామముల రూపాంతరములు.

తా, నా, ఈ రెండు శబ్దములును ప్రథమైక వచనమునఁ గళలు కావు.

బహు - తాము, తారు, మఱరు, మేము, నేను, ఏము ఇవి కళలు,

ద్వితీయావిభక్తి ప్రత్యయమగు, కూర్చి, కూర్చి, గుఱించి, గుఱించి చివర గల శబ్దములు.

ఉదా — హరిం గూర్చి. వనముం గూర్చి, నన్నుగుఱించి, దానిఁ గూర్చి, వారిఁగుఱించి.

చతుర్థీవిభక్తి ప్రత్యయమగు "కై" చివరగల శబ్దములు.

ఉదా — రామునికై, వనములకై

పంచమీవిభక్తి ప్రత్యయమగు "పట్టి" చివరగల శబ్దములు.

ఉదా—జ్ఞానముం బట్టి, నిన్ను బట్టి.

షష్ఠీవిభక్తి ప్రత్యయమగు "యొక్క" చివరగల శబ్దములు.

ఉదా— రాముని యొక్క, మాయొక్క, వానియొక్క.

N. B. ఈయొక్కకు గ్రంథములయందుఁ బ్రయోగము లేదు.

గూను, మేను, (మెడ) నాను, మీను, పేను, మ్రాను, బోను, ఇత్యాది శబ్దముల యందలి నకారము శబ్దములలో స్వతస్సిద్ధముగా నున్నది గావున ద్రుతముకాదు, కళయే.

N. B. ప్రతి శబ్దము విభక్తి ప్రత్యయము లేకయుండదు. ఆ ప్రత్యయములు కొన్ని చోట్ల లోపించుటచేతఁ అవి చేర్చఁబడినట్లు గాన్పించవు.

ఉదా— సీత, హరి, చెట్టు, కాకి, మేరు.

## Adjectives.

### విశేషణములు.

విశేషణములన్నియుఁ గళలే.

ఉదా— నల్లని, వచ్చుచున్న, తినిన, రాఁగల, చూచు, ఐన, "చూచుచు నావు" అనుచో ఉకారాంత విశేషణమునకు అచ్చుపరమగుటచే వచ్చిన నకారాగమముగాని ద్రుతముగాదు.

కొన్నియెడల ప్రథమేతరవిభక్తుల విశేషణములు అయావిభక్తులే కలిగి ద్రుతాంతములగును.

ఉదా:— విశాలమున్ననమును, అతి దీర్ఘమునకుం దోవకు.

సంబోధన విభక్తి యంతమందుగలవి కళలు.

ఉదా:— ఓరామ, ఓరామా, రాములార, రాములారా.

## Verbs

### క్రియలు

ము, రు, దు, వు, డు, మి, రి, ది, వి, అను ప్రత్యయములు గల సమాపక క్రియలన్నియుఁ గళలు.

ము.

చేయుము. వ్యతిరేకార్థక ఉత్తమపురుష బహువచనము.

వ్రాయుము. ప్రార్థనార్థక ఏకవచనము.

వ్రాయుదము. ఉభయకర్తృక ప్రార్థనార్థకము.

వ్రాయఁగలము. భవిష్యదర్థక ఉత్తమపురుష బహువచనము.

రు.

చేయుచున్నారు. వర్తమానార్థక ప్రథమపురుష బహువచనము.

చేయరు. వ్యతిరేకార్థక ప్రథమపురుష బహువచనము.

చేయుదురు. తద్ధర్మార్థక ప్రథమ పురుష బహువచనము.

చేయఁగలరు. భవిష్యదర్థక ప్రథమపురుష బహువచనము, మధ్యమ పురుష బహువచనము.

డు.

చేయుడు. అమహదర్థక వ్యతిరేకార్థక ప్రథమపురుష ఏకవచనము.
చేయుదు. తద్ధర్మార్థక మధ్యమపురుష ఏకవచన రూపాంతరము.
చేయఁగలదు. భవిష్యదర్థక ప్రథమ పురుష ఏకవచనము.

వు.

వ్రాయుచున్నావు. వర్తమానార్థక మధ్యమపురుష ఏకవచనము.
వ్రాయవు. వ్యతిరేకార్థక మహదర్థక మధ్యమపురుష ఏకవచనము. & వ్యతిరేకార్థక అమహదర్థక ప్రథమపురుష బహువచనము.
వ్రాయుదువు. తద్ధర్మార్థక మధ్యమపురుష ఏకవచనము.
వ్రాయఁగలవు. భవిష్యదర్థక, మధ్యమపురుష ఏకవచనము. & భవిష్యదర్థక అమహదర్థక ప్రథమపురుష బహువచనము.

ఁడు.

వచ్చుచున్నాఁడు. వర్తమానార్థక ప్రథమపురుష ఏకవచనము.
రాఁగలడు. భవిష్యదర్థక ప్రథమపురుష ఏకవచనము.
రాఁడు. వ్యతిరేకార్థక ప్రథమపురుష ఏకవచనము.

మి

ఉంటిమి. భూతార్థక ఉత్తమపురుష బహువచనము.

రి

వచ్చిరి. భూతార్థక ప్రథమపురుష బహువచనము.
వచ్చితిరి. భూతార్థక మధ్యమపురుష బహువచనము.

ది

వచ్చుచున్నది. అమహదర్థక వర్తమానార్థక ప్రథమపురుష ఏకవచనము.
వచ్చినది. భూతార్థక అమహదర్థక ప్రథమపురుష ఏకవచనము.

వి.

వచ్చితివి. భూతార్థక మధ్యమపురుష ఏకవచనము.
వచ్చుచున్నవి. అమహదర్థక వర్తమానార్థక ప్రథమపురుష బహువచనము.
వచ్చినవి. భూతార్థక అమహదర్థక ప్రథమపురుష బహువచనము.

క్త్వార్థకము వ్రాసి—వ్యతిరేకక్త్వార్థకము వ్రాయక. ఇది కళయైన క్త్వార్థకమున కనువ్యతిరేక మవుటచేతను, తఱుచుగాఁ బ్రయోగములు కాన్పించుటచేతను గళగానే కొందఱు వ్యాకరణ కర్తలు వ్రాసిరి. కాని యచ్చటచ్చట ద్రుతములు కాన్పించుటచేత నుభయమని తోఁచుచున్నది.

కళకు ఉదా. "కాదన కిట్టిపాటి యపకారము"

(భారతము ఆ-1)

ద్రుతప్రకృతికమునకు

ఉదా-క. "అనఘ యిది యేటితపమే
మనుపమ దుఃఖితులమగుట నాధారములే
కను సంతానోచ్ఛేదం
బున వ్రేలెదమధమలోకముల తెరవు సనన్."

(భారతము. ఆ-1)

వండుట. భావార్థకము.
వండమి. వ్యతిరేక భావార్థకము } ఈ రెండును ప్రథమా విభక్తులు.

## Indeclinables.

## అవ్యయములు.

1 ఇంచుక, కొంచెము ఆంత (ఇసుమంత, చీమంత, కాసంత, గోరంత) కించదర్థకములు.
2 భళీ, బలా, బాపు, బాపురే, మొదలగు ప్రశంసనార్థకములు.
3 ఓహో, ఔరా, మజ్ఝారే, మజ్ఝా, బాపురే, చాగురే, పారిపారి, హైసర,

అమ్మకచెల్ల, అమ్మచెల్ల, ఓచెల్ల, అయ్యారే, మొదలగు నాశ్చర్యార్థకములును.

4 అయ్యో, అకట, అక్కటా, కట్టా, కటకట, కట్టా, అన్న, అన్నన్న, ఆహా, అబ్బబ్బ, మొదలయిన సంతాపార్థకములును.

5 ఎప్పుడు, అప్పుడు, ఇప్పుడు, మొదలయిన యదా తదార్థకములు.

6 ఆటు, అట్టు, అట్టులు. ఆటులు. అట్లు. ఇటు. ఇట్లు. ఇట్టులు. ఇటులు. ఇట్లు. ఎటు. ఎట్టు. ఎట్టులు. ఎటులు. ఎట్టా. ఎట్లు మొదలయిన ప్రకారార్థములును.

7 ఏమి. ఏల. మొదలయిన కిమర్థకములును.

8 అ. ఆ. ఎ. ఏ అను ఏవార్థకములును.

9 ఊరక. మిన్నక. అను తూష్ణీమర్థకములును.

10 అంట. అంట. కదా. కద, కదరా. కదవే. అనుకిలార్థకములును.

11 చుమి, చుము, చుమ్మి, చుమ్మీ, అను నిశ్చయార్థకములును.

12 ఆ, ఓ, ఏ, అను సందేహార్థకములును.

13 ఒండె, మొదలగు వికల్పార్థకములును.

14 మఱి, మొదలయిన సముచ్చయార్థకములును.

15 ప్రార్థనార్థకముమీఁదవచ్చు, ఇ, ఈ, ఎ, ఏ, ఒ, ఓ అనునవి.
ఉదా—చూడుమి, వండుమీ, వండవె, వండవే, చూడవో, చూడవో అనునవియు.

16 ఇప్పుడు, ఇపుడు, ఇప్డు, అప్పుడు, అపుడు, అప్డు, ఎప్పుడు, ఎపుడు, ఎప్డు, మొదలైన కాలార్థకములును.

17 అంత, ఇంత, ఇదిగో, ఇగో, అదిగో, అనయము, ఛీ, తెరమిడి, ఉద్దవిడి, పదంపడి, మునుకొని, తలా, అద్దిర, ఇసీ, ఉవ్వెత్తు, ఎట్టు, ఎట్టా, ఎత్తిలి, ఒత్తిలి, ఎప్పటి, ఒకో, ఓచెల్ల, ఒండె, ఓటు, చేసి, ఓయి, ఓరి, ఓసి, కరము, సవి, హా, హుటాహుటి, హాహాకారి, కాని,

కాంబట్టి, చెత్తి, చెల్లవో, మిక్కిలి, వెండి మొదలగు ప్రతిపదోక్తావ్య
యములును (క్రియలనుండి పుట్టినవి)

ఇవియన్నియు గళలు.

---

## Exercises.

### సా ధ క ము లు.

### I

ఇందలి కళలను విడఁదీసి వ్రాయుఁడు.

"నావిని పింగళ కుండు దమనకా ! నీవు మాకు హితభృత్యుండవు. నీ వచనంబు మాకవశ్యగ్రాహ్యంబు. మేము నీకుఁ గొత్తవారమే ! ఏల జంకు వడియెదవు ? నీయిచ్చవచ్చిన చొప్పునం జెప్పవచ్చును. నావుడు దమనకుండు కరంబున నోరుమూసికొని యావచనంబు లాలించి బుద్ధి బుద్ధి యని దేవా ! యింకం గొంతముందు యమునా కచ్ఛంబునకుంబోయి యచట రిచ్చవడిన తెలుంగు దోఁపం గొంత సేపు చిత్రరూపంబు పగిది జూపట్టి మరలి యిరవున కరుదెంచితిరి" (నీతిచంద్రిక.) ఇందు 35 కళలుగలవు.

### II

"ఏ నప్పుడుప్పతిల్లెడు మది కలంక యెఱుక పడకుండ గాంభీర్యంబుఁ దెచ్చుకొని లేనకు పస్త్రాభరణాది సంభావన లొనర్చుటకు వారి వీరిం బిలిచి నియోగించుచు సంభ్రమించుట కనుంగొని యన్నియు వచ్చెం జాలు నిలు మని వారింపుచు నిలింప ద్వేషి యిట్లనియె. (ప్రభావతీ ప్రద్యుమ్నము అ 1.) ఇందు 15 కళలుగలవు.

### III

"పూర్వము రురువను నొక మునికుమారుఁడు యదృచ్ఛగాఁ దిరుగుచు, అద్భుత లావణ్యయైన ప్రమద్వరయను నొక కన్యను మేనకకును ఒకా నొక

విద్యాధరునికిని జన్మించి స్థూలకేశుఁడను మునిచేత స్వాశ్రమములో బెంపఁబడిన దానినిఁజూచి కామమోహితుఁడై వెంటనే స్థూలకేశునియొద్దికిఁబోయి యామెను దనకు వివాహార్థ మిమ్మని యడిగెను." (కథాసరిత్సాగరము లం. 2 త. 6.) ఇందు 22 కళలుగలవు.

## IV

"అట్లు దూఱి, యప్పటులెల్ల నన్ను రూక్ష వీక్షణంబుల నీక్షించుచు, సరోష పరుషాక్షరంబుల మఱియు నిట్లనియె. "ఓరీ! దుర్మతీ! నీవు మతి భ్రమగప్పి మాకడ గోరంతలు కొండంతలుగాఁ జదువఁజొచ్చితివి. అంతతో నైన నిలువక, నిర్భయంబుగ మాదేశమ్మును మమ్మును నూరక మీరనాడితివి. నీవు పాపవ్యస్తనుండవు, నీబుద్ధి పోనిచ్చుకొందువే? ఏవారలంగాని వారిని బట్టుకొన్న నైసర్గికదోషంబులు విడువవు." (నీతిచంద్రిక విగ్రహము) ఇందు 26 కళలు గలవు.

## V

"భవజ్జనకుండు పాండురాజా తెఱంగెఱింగి నన్నుఁగనుఁగొన్న తఱి సకలలోక గేయంబగు రాజసూయంబు సక్రమంబుగ నొనర్చువారు, శక్రుని కడ హరిశ్చంద్ర నరేంద్రుని పోల్కి సురరాజికిం బూజితు లగుదురు. మీరు మానవలోకంబునకుం జని నేనిందుండుటయును, హరిశ్చంద్రుండు రాజసూయంబుచేసిన కతమ్మున, శచీకాంత గృహాంతరంబునం దుండుటయును ధర్మజునిమదిఁ బాదుకొన నెఱుక పఱుపుఁడు." (ధర్మజ రాజసూయము) ఇందు, 25 కళలు గలవు.

## VI

"తాపసోత్తమా! నాకుం దమయెడంగల చనవున నొక మాటయడుగం దలఁచితిని. దానంగల యపరాధంబులు సహించుట దేవర కృత్యంబు, అది యెద్దియనిన, మహీమండలైశ్వర్యంబు బలవదేక భోగ్యంబైయుండు. బలవంతు లన్ననో యొకరిపై నొకరుందురు. ఏక ఫలాపేక్షులు పెక్కురున్నయెడం బోరు వాటిల్లకపోదు." (వచనసైమధము) ఇందు 24 కళలు గలవు.

## ద్రుతప్రకృతికములు.

---

ద్రుతమనఁగా నకార మంతమందుఁగల శబ్దములు.

ఇచట నకారమనఁగా అచ్చులేని హల్లు (న్) నకారపుపొల్లు, కాని దీనిపయిం గొన్ని చోట్ల నుకారము సంబంధించు చున్నది.

ఉదా—వచ్చెన్, వచ్చెను.

# NOUNS & PRONOUNS.

## నామములు - సర్వనామములు.

1 ద్వితీయావిభక్తి వర్ణములగు ని, ను, ల

ఉదా—కృష్ణుని, వనమును, వనములన్, ఎవ్వనిన్, ఏవారలను, ఎవ్వార లన్, తన్నున్, నిన్నున్, మిమ్మున్.

2 తృతీయావిభక్తి వర్ణకములగు, చేత, చే, తోడ, తో,

ఉదా—కృష్ణునిచేతన్, కృష్ణునిచేన్, కృష్ణునితోడన్, కృష్ణునితోన్, ఎవ్వనిచేతన్, వానిచేన్, దానితోడన్, వీరితోన్, రెంటిచేన్, మొ॥

3 చతుర్థీ విభక్తివర్ణకములగు కొఱకు.

ఉదా—గోవుకొఱకున్, అన్నింటికొఱకున్. కొందఱికొఱకున్. వాని కొఱకున్. మొ॥

4 పంచమీవిభక్తి వర్ణకములగు, వలన. కంటె.

ఉదా—రామునివలనన్. నీవలనన్. జ్ఞానమున కంటెన్. వారికంటెన్. అన్నిఁటివలనన్. మొ॥

5 షష్ఠీవిభక్తి ప్రత్యయములగు కి. కు, లో. లోపల.

ఉదా—భగవంతునికిన్. గృహమునకున్. వారిలోన్, అందఱి లోపలన్. మొదలయినవి.

N. B. లో. లోపల అనునవి మధ్యవాచకమగు అవ్యయములును గలవు.

ఉదా— సముద్రములోపలన్. (సముద్రమధ్యమున.) భూమిలోన్. (భూమిమధ్యమున)

6 సప్తమీవిభక్తి ప్రత్యయములగు - అందు. న.

ఉదా—వనమందున్. వనమునన్. అన్నిటియందున్. మొదలగునవి.

N. B. నేను. తాను. శబ్దములు ప్రథమలయ్యును ద్రుతప్రకృతికములే.

## Verbs క్రియలు.

1 భూతార్థక ప్రథమపురుష ఏకవచనము.

ఉదా—కొట్టెను. కొట్టించెను. మొదలయినవి.

2 వర్తమానార్థక ఉత్తమపురుష ఏకవచనము.

ఉదా—కొట్టించుచున్నాను. కొట్టుచున్నాను.

N B. ఇచ్చట ద్రుతము తప్పక ఉకారముతో సంబంధించియే యుండును.

3 భవిష్యదర్థక ఉత్తమపురుష, ఏకవచనము.

ఉదా:—కొట్టఁగలను, కొట్టించగలను, మొ.

4 తద్ధర్మార్థక ప్రథమపురుష ఏకవచనము.

ఉదా:—కొట్టున్, కొట్టెడిన్, కొట్టెడున్, మొద.

5 ఆశీరాద్యర్థకములగు, ఎడు, త వర్ణకములు.

ఉదా:— అయ్యెడున్, కావుతన్ మొద.

6 శత్రర్థకమగు - చున్.

ఉదా:— కొట్టుచున్, మొదలయినవి.

7 తుమున్నాద్యర్థకము.

ఉదా:— కొట్టన్. కొట్టఁగన్ మొద.

8 ఆనంతర్యార్థకము.

ఉదా:— కొట్టుడున్, మొద.

9 చేదాద్యర్థకము.

ఉదా:— కొట్టినన్. మొదలయినవి.

## Indeclinables — అవ్యయములు.

1. ప్రతిపదోక్తావ్యయములు (అనఁగా మఱియొక ప్రకృతివలనఁ బుట్టినవి, స్వతస్సిద్ధముగా నుండునవియని యర్థము.

ఉదా:—ఎంతయున్, ఎల్లన్, ఏనిన్, వలెన్, పోలెన్, కావునన్, కానఁ, కాఁబోలుఁ, గ్రిక్కునన్, క్రమ్మఱన్, కనుకన్, దనుకన్, మఱియున్ పిమ్మటన్. వెండియున్, కడున్, ఇఁకన్, ఎట్టకేన్, ఎట్టకేలకుఁ, ఎట్టకేనిఁ. మిగులఁ. వెంటఁ. వెంబడిఁ. మొదలగునవి.

2. సులభముగాఁ దెలియని ద్రుతాంతావ్యయములు.

(1) అగు ధాతువుయొక్క తుమున్నాద్యర్థకము, కాఁ, కఁ.

ఉదా:—ఇట్లుగాఁ జూచి, నిన్నుగఁదలఁచి.

(2) వచ్చుధాతువు యొక్క తుమున్నాద్యర్థకము, రాఁ.

ఉదా:— వానిని రాఁజేసి, మొదలగునవి.

(3) అట్టులఁ, ఇట్టులఁ, ఎట్టులఁ.

(4) సముచ్చయమగు. యు, ను.

## Exercises,

### సాధకములు.

☞ ఇందలి ద్రుతప్రకృతికములను విడఁదీయుఁడు.

1

"దుర్జన సాంగత్యము సంభవించిన తరువాత దుర్మార్గమునఁ బడక సన్మార్గమున బుద్ధి చరించుననుట వెఱ్ఱితనము. తొలుతఁ జేయరాని పని చేయుఁ

పోవునప్పుడు దానివలనఁ గలుగఁబోవు కష్టము లెట్టివని తెలియరాదు. మఱి యంతరాత్మ "ఈపని చేయవలదు. ఇది యకృత్యము." అని నొక్కి చెప్పుచున్నను నిచ్చకములాడు స్నేహితుల తియ్యని మాటలచేత మోసపోవుచుందుము. లోకానుభవములేని తఱిని రాఁబోవు కష్టముల స్వభావ మెఱుఁగనప్పుడు నిండు ప్రాయముననున్న పిల్లకాయలు దుస్సహవాసము వలనఁ జెడిపోవుటేమి యబ్బురము. కావునఁ దలిదండ్రులు వేయికన్నులఁ గాపాడుచుచుండఁగంపు నేస్తము మాన్పవలయును." (ప్రణయమహిమ) ఇందు 22 ప్రతిప్రకృతికములు కలవు.

## II

"అంత నక్కాంత కాంతునికి పంతసంబుగాఁ గొంత కొంత సల్లాపనంబు సఫలంబుచేసి యతఁడంత నింతకు మున్నిది యెన్నఁడును గన్నయదిగా దిప్పుడెప్పగిది నొదవెఁ జెప్పుమని గుచ్చిగ్రుచ్చి యడుగ నిది నేఁడు నేర్చినదికాదు. తొడవులనుండియు నేనెఱుంగునదియ యొక్క కారణంబున నిది యెఱుకపఱుపక నెఱయ మఱచియుండి నేఁడు బాలభానుపొందు మేఘసంఘవిశేష వీక్షణంబునం దలంచిన మానసంబులోనన పూనియుండి యిప్పటి నీదుఁడగంబువలనఁ గలిగి వెలివిరియ నిచ్చితినని పలికిన నతం డిట్లనియె" (కళాపూర్ణోదయము) ఇందు 23 ద్విత్రిప్రకృతికములు కలవు.

## III

"ఇట్లు వీరు బయలుదేరి పోవునపుడు ఊర్వశి తనకు సహాయకారియైన పురూరవశ్చక్రవర్తిని సెలవడుగఁగోరి తానుగా, అతనితో మాటలాడుటకు సిగ్గుపడి తన యభిప్రాయమును తన చెలియగు చిత్రరేఖతోఁ జెప్పి యడిగింప, ఆయన "మంచిది పోయి రావచ్చును. నామీఁదఁ దలంపుమాత్ర ముండవలయును." అని చెప్పఁగా ఆయనను విడిచిపోను మనస్సురాక తన చీర తీఁగమీఁదఁ జిక్కుకొన్నదని నెపము పెట్టి చిత్రరేఖను దానిని విడఁదీయుమని యిట్లు కొంతసేపు జాగుచేసి ఆయనను తిరిగి తిరిగి చూచుచు విడిచి,

పోవలసివచ్చెనే యను దుఃఖముతో ఎట్లో పోయి తన తావు చేరెను." (విక్రమోర్వశీయము) ఇందు 29 ద్రుతప్రకృతికములు గలవు.

## IV

"విజయాంకునిఁగూర్చియు గంధినిని గూర్చియు నసంబద్ధ ప్రలాపములతోఁ బొద్దుపుచ్చుచు నడుమ నడుమ పొడుము బీల్చుచు హుక్కా కటిదొకటి త్రాగుచు వేఁజు చేయుచుండిరి. ముసలివాఁడు విజయాంకుఁడని వారికిఁ దెలియదుగదా! లోకములో మనము సంచరించు నప్పుడు మన ప్రక్కనే దైవమును తిరుగుచుండును. మన మేమేమి చేసినను కనిపెట్టి యుండును. దైవమునందలి ప్రీతిచేత గాకపోయిన, భయముచేతనైన మనుజులు జాగరూకులుగా నుండుట మేలు." (విజయాంకసాహసము) ఇందు 21 ద్రుతప్రకృతికములు కలవు.

## V

"లోకములోఁ బండితులు కానివారు తమకొక్క విషమ దశప్రాప్తమయినప్పుడు, దైవమును గర్హింతురు. కాని, యాత్మకర్మ దోషంబుల నెఱుంగఁజాలరు. అపథ్యానురాగులగు రోగుల లాగున నృపాలురును హితతంత్రులగు మంత్రిమతి నతిక్రమించి యాత్మవంచకులయి యభినవ ప్రియులం బురస్కరించుకొని కార్యంబు ముగిసిన వెనుక గర్వము సర్వముందూలి యప్పుడెవృత్తము చేరుకొందురు. సుహృదులును హితకాములునునగు సచివుల వాక్యంబులాదరింపనివారు సహవాసి హితోపదేశంబు వినక చెడిన దీర్ఘ సూత్రుండను విసారంబు తీరున వినాశంబు నొందుదురు. అక్కథ, వక్కాణించెద నవధరింపుడు." (నీతిచంద్రిక-సంధి) ఇందు 17 ద్రుత ప్రకృతికములు కలవు.

## VI

"మహాత్మా! మనుష్య జన్మంబు జన్మంబులలో నెల్ల నుత్తమంబు. స్వర్గలోక జన్మంబులైన నిట్టివికావు. అందు నర జన్మమున నెట్లెట్లు భాగవత మహాత్ములతోడి సహవాసంబు ప్రచురంబుగ నలవడదు. కావున నాజన్మములం

ప్రయోజనం బెయ్యది ? నిరంతరము మీ పాద పరాగంబు సేవించువారికి హరిభక్తి గలుగుననఁ జిత్రింబేమి ? నీతోడి సంగమంబు ముహూర్తమాత్రము లభించి నంతన దుస్తర్కమూలమగు నా యవివేకము పొడ వడంగె." (శతఘంటం వెంకట రంగశాస్త్రిగారి వచన భాగవతము) ఇందు 13 ద్రుత ప్రకృతికములు కలవు.

---

## కళాద్రుత ప్రకృతిక విమర్శనము.

సంస్కృత భాషయందుఁ గల శబ్దజాలములో నజంత శబ్దములు ముస్వాతిక వంతును, హలంతశబ్దములు పాతికవంతును గలవు.

ఆంధ్రభాషయం దజంతములే కాని హలంతములు లేవు. ఒక్క నకారాంతములు మాత్రము ద్రుత ప్రకృతికములను పేరితోఁ బెక్కులు కలవు. ప్రథమాబహువచనమగు లు వర్ణముయొక్క ఉకారము లోపించి యొకానొకచో లకారము శబ్దాంతమందుఁ గానంబడుచున్నది. ఇట్లే, రేఫాంతములును గలవు.

ఉదా—చిలుకల్, పొలయలుకల్. "కలిగినవేకదా మకరికల్మఁ గొప్పుడు వ్రాసియుండుటల్."

"విప్పచ్చుచేతికి గన్నుల్గలవంచు నెంచి రపుడొంతేపిరమోఘాగ్రణుల్." (విజయవిలాసము) వత్తుర్వారు.

ఈ లకార రకారము లున్నందువలన సంధికాలమందుఁ గ్రొత్త మార్పులేవియును గలుగవు. కావున వీనినిఁ బరిగణించుట మాని నకారమును మాత్రము ద్రుతమను పేరఁ బెట్టి, అది కలదానికి ద్రుతప్రకృతిక మను పేరఁ బెట్టి దీని పర్యుదాస నిమిత్తమై యజంతములకుఁ గళలను పేరఁ బెట్టి వైయాకరణులింత దూరము శ్రమపడి నడచుటకుఁ గారణమేమనఁ నీ ద్రుతముపైఁ బరుషములు సరళములగుటయు, పరుషేతరములు పరమగునపుడు లోపము, స్వాత్వము

...ంమవు, సంశ్లేషమును, అచ్చుపరమైన యపుడు లోపసంశ్లేషములు లేకుండుట ...యు మొదలగు రూపభేదములు దీనివలనఁ గలుగుచున్నవి. కావున దీని నింత ...రము వక్కాణించవలసి వచ్చినది.

## Important Notes.

## ముఖ్యవిషయములు.

యొక్క—దీనిని ఆంధ్రవైయాకరణులు షష్ఠీవిభక్తిగాఁ బరిగణించిరి గాని యే కవియు దీనిం బ్రయోగించినట్లు కాన్పించదు. అర్థమునుజెప్పు కాలమందు మాత్రము దీనిని సంబదార్థమున వాడుచున్నారు.

అంత—ఇది పరిమాణార్థకమయిన ప్రత్యయమగునప్పుడును, సమస్తము ...ను నర్థమందును గళ.

అటుతరువాత నను నర్థమందు ద్రుత ప్రకృతికము.

ఉదా— గోరంతలు కొండంతలు చేసి - పరిమాణార్థము.

లోకమంతయు - సమస్తార్థము,

అంతం గొంత కాలమునకు - అటుతరువాత నను నర్థము.

వ్యతిరేకక్త్వార్థకము—ఇది ధాతువుమీఁద, "అక" అను ప్రత్యయము ...చే నేర్పడును.

ఉదా.—ఎఱుఁగక, ఇది కళగాని ద్రుత ప్రకృతికము కాదు.

ఉదా— "కావన కిట్టిపాటి యపకారము" (భారతము. ఆ. 1.

ఇక్కడ ద్రుతప్రకృతికమైన యెడల సంధిరాక పోవును.

ఉదా— "నావలని ప్రయోజన మెఱుఁగక యేలిక" (చిన్నయసూరి ...)

ఇక్కడ ద్రుత ప్రకృతికమైన యెడలసంధి రాన ప్పుడు యకారాగమ ...ము వచ్చును.

"క. అనఘ యిదియేటి తపమే
మనుపమ దుఃఖితులమగుట నాధారములే
కను సంతానోచ్ఛేదం
బున వ్రేలెద మధమలోకముల తెరవు సనన్" (భారతము ఆ.2

ఇందు "లేకను" అనునది కొందఱు ద్రుతప్రకృతికముగా భావించెదరు. మఱికొందఱు కళగా నంగీకరించియు "ను" అను దానిని సముచ్చయముగా భావించిరి. అయితే నన్నయభట్టు వ్యతిరేకక్త్వార్థకము క్త్వార్థకముతోపాటు కళగానే పరిగణించి సర్వత్ర కళగానే ప్రయోగించెను. కావున నీపద్యమునందు ద్రుతప్రకృతికముగా నెంచుట యతని తాత్పర్యము గాదు.

మఱియేమన్నను, ఆధారములేక + అనుసంతానోచ్ఛేదము=అను=అనుసరించిన (అనఁగా నవిచ్ఛిన్నమయిన) సంతాన = కులవిస్తారముయొక్క, ఉచ్ఛేదము = తెగిపోవుట. అని యర్థము. కావున నీవ్యతిరేకక్త్వార్థమును కళగానుండుటకు సందియ మించుకయు లేదు.

న్ను, నూ, ఇత్యాదులు సముచ్చయార్థమందు లౌకిక భాషయందు వ్యవహరింతురు గాని గ్రాంథికమందవి యగ్రాహ్యములు.

ఉదా— వాఁడున్ను నేనునూ వచ్చితిమి — అసాధువు.
వాఁడును, నేనును వచ్చితిమి — సాధువు.

## Exercises.

### సాధకములు.

ఇందలి కళాద్రుతప్రకృతికములను విడఁదీయుఁడు.

### I

" అప్పుడా రాజు ఆ కొడుకును జూచి మిక్కిలి సంతోషముతో దేవేంద్రునికి జయంతుఁడను కొడుకువలె నాకీ కొడుకు కలిగెను." అని చెప్పెను. అప్పుడు ఊర్వశికి ఆ దేవేంద్రుని పేరు విన్నతోడనే తన పూర్వపు

వృత్తాంతము స్మృతికిరాఁగా, ఇఁక నీరాజును బాయవలయునే యనుకొని కన్నుల నీళ్ళు విడుచుకొనెను." (విక్రమోర్వశీయము.)

## II

"హరికథా శ్రవణ ప్రవణహృదయుండైన పరీక్షిన్నరోత్తముండు శుక యోగిసత్తమున కిట్లనియె. మునివరేణ్యా, భగవంతుఁడఖిల భూతములకు సముఁడు, ప్రియుఁడు, సుహృదుఁడు నయ్యు నేలయింద్రుని తదర్థ విషముఁడై దైత్యులఁ దెగటార్చె ! సాక్షాత్పరమానంద స్వరూపుఁడై నిర్గుణుండైన యప్పరమాత్మునకు సురలవలనం గాఁగల యర్థంబు నసురులవలన వెఱపును వారి యెడఁబగయుఁ గన్పట్టదు." (శతఘంటము వెంకటరంగశాస్త్రిగారి వచన భాగవతము.)

## III

"అంత జనకుండు ఆబ్రాహ్మణునికి నమస్కరించి, అతఁడు, ఓ యీ మంచిబుద్ధికలవాఁడవు అగుమని దీవింప, మనస్సులో ఏమి వేఱుగానున్నది. ఈ మాశీర్వాదక్రమము అనుకొని, అయ్యా ! ఇటుఁ గూర్చుండుఁడు, అనఁగా, పనిలేదు దూతనుగదా నేను, సమాచారము వినుఁడని యిట్లనియె." (ప్రసన్న రాఘవము.)

## IV

"ఇంతలో ఒకగొప్పసందడి వినరాఁగా ద్రౌపది భయపడుచు ధర్మ రాజుతో, పరాక్రమముచేత గర్వించినవాని గొంతువలెనున్నది. ఇఁక నేమయిన అప్రియసమాచారము వినకముందు ప్రాణత్యాగముచేయుట మంచిది" అనఁగా, ధర్మరాజు, "ఇంక నాలస్యము లేదు. మాయమ్మగారికిని నీ సవతు లకును ఏదైన సమాచారముచెప్పి పంపెడిపక్షమున కానిమ్ము, అనెను." (వేణీసంహారము)

## V

"మూత్రపిండములు—వీనికి సంస్కృతమున వృక్కలని పేరు. కటిక నాఁడమ్రు వీనిని పక్కరగుండెలనియు, ఉలవకాయలనియు, వాడుదురు. ఇవి

కనుకశబ్దము వీఁపువైపున వెన్నుపూసలకును నడ్డిపూసలకును నడుమగా వెన్నె ముక కిరుప్రక్కలను కొజియొకటియు నుండును. ప్రక్కరగుండె సీమచిక్కుడు గింజ యాకారముగా నుండును, సీమ చిక్కుడుగింజను చూడనివారది యించు మించుగా ముద్దగానుండు మనచెవిని బోలి యుండునని యెంచుకోవచ్చును.” (శారీరశాస్త్ర సంగ్రహము)

## VI

“అప్పుడిరావతి తన పరిచారికయగు నిపుణికతోఁగూడ ఆతోఁటం యందలి యుయ్యెల చక్కదగ్గఱవచ్చి మయికముచేత కాళ్ళ తడబడ తన ప్రాణేశుని వెదకునప్పుడు, ఆమెపరిచారికయైన నిపుణిక, “అమ్మా! మనము మల్లెపువ్వును వెదకుచున్నాము, మన కంటికి గండుఁజీమ కానఁబడుచున్న” అనెను. ఆమాటవిని యిరావతి అది యేమిటిదనియడుగ, ఆమె మాళవికను చూపెను.” (మాళవికాగ్నిమిత్రము)

## VII

“ఇట్లు ప్రియావృత్తాంతమునువిని విక్రమాదిత్యమహారాజు ఆమెను ఉత్కంఠతో తలంచుకొని బ్రాహ్మణుని యిష్టమును నెఱవేర్పఁ బ్రతీహారుని నియమించి, ఆమెయొక్క దృఢానురాగమును పరీక్షింను ఇంక నాయూను మాసములలో కొంచమే శేషించి యుండుటయును ఆలోచించి, వెంటనే మంచిమంత్రులకు రాజ్యమునొప్పగించి ప్రతిష్ఠానమునకు పోయి శ్వేతాసిత చ్ఛవసనయు విబుధార్పితవైభవయు కృశయునైన కాంతను ప్రతిపచ్చంద్ర రేఖనుంబోని దానిని చూచెను.” (కథాసరిత్సాగరము)

## VIII

“వారణాసియందు ధావకమల్లుఁడను చాకివాఁడుగలఁడు. ఒక నాఁడు వాఁడు మిగుల బట్టలు గుంజవ బడలికచేత మయిమఱచి గుఱ్ఱుపెట్టి నిద్రం బోవుచుండెను. అనడికి కేయి వాని యిల్లొక దొంగ చొచ్చెను. అప్పుడు వాని యింటివాకిటఁ గాలిబండముతో గాడిదె నిలుచుండెను. ఆయింటికి పెంపుడు కుక్క దాపునఁ గూర్చుండి చూచుచుండెను.” (చిన్నయసూరి నీతిచంద్రిక)

## IX

"బుద్ధిబలంబుగలవానికిం దక్కబలంబు లేకుండినం గొఱంతలేదు. ధీరశక్తి విరహితునకుం దక్కంగల బలిమి యెంతగలిగిన నపత్కల్పంబయి చను. తొల్లియొక్క శశకంబు నేర్పునంజేసి యొక సింగంబుం ద్రుంగించె నక్కథ వక్కాణించెద నవధానంబుతోడ వినుము" (చిన్నయసూరి నీతిచంద్రిక)

## X

"హుతాశనునకు సమీరంబుంబలె మధుమాసంబు సహాయంబగుగాత మర్థలాభంబును సేమంబును బునర్దర్శనంబు నయ్యెడుమని దీవించిన దేవేంద్రుని యానతి ముత్యాల సేసంబోలె శిరంబునందాల్చి యైరావణకుంభి కుంభాస్ఫాలన కర్కశంబగు కరంబున వాస్తోష్పతి తన్ను సంస్పర్శించి గౌరవించిన మన్మథుండు మధుసహాయుండై హిమవత్పర్వతంబు సేరంజనియె నాసమయంబునందు" (హరవిలాసము)

---

ప్రకరణము 2.

# CHAPTER II.

## సంధి.

ఇంగ్లీషుభాషలో సంధిలేదు. కాని ఉచ్చారణ కాలమందు మాత్రము సంధిచేసి నట్లే పదములలోని కొన్ని యక్షరములను లోపింపఁజేసి, కొన్నిటి యుచ్చారణములను మార్చి పలుకుచున్నారు. ఇది వ్రాయునప్పుడు అట్టి మార్పు లేమియుఁ గలుగకుండుటచేత ఉచ్చారణ మాత్రమందుఁగల యీ మార్పులకై శాస్త్రము పుట్టలేదు.

సంస్కృతభాషా ప్రణాళిక ననుసరించిన యీ యాంధ్రభాషయందు సంస్కృతమునందు వలెనే సంధి యావశ్యకమై యున్నది.

తెలుఁగుబాస అజంతమని యిదివఱకే తెలుపఁబడి యున్నది. అందు వలన నచ్చులసంధియే ప్రధానము.

అచ్చులకు సంధిలేకుండఁ గూడ నచ్చటచ్చట గద్యకావ్యములయందుఁ బ్రయోగము గానంబడుచున్నది.

ఉదాహరణము—

"శ్వాసకోశములు రెండును దాపాపుగా హృదయ కుహరమునంతా నాక్రమించుకొని యుండునని వెనుకనే చెప్పఁబడినది. హృదయము శ్వాసాశయములచే నించుమించుగా చుట్టఁబడి యున్నది. ఈ రెంటిలో కుడి పుపుసము మూఁడు వృత్తములను గలదిగానున్నది. అవి వరుసగా. ఊర్ధ్వవృత్తము, మధ్యవృత్తము అధోవృత్తము, అనఁబడును." (శారీరశాస్త్రసంగ్రహము.)

"అని తన తల్లి సాధ్వీమతల్లి యగుటంబట్టి తన ప్రకృతికి శీలభంగగుణము విరుద్ధమని వక్కాణించి, శీలముకై కాలుసేతులు దండనమర్పించిన మహాపురుషునికి సారంగధరునికి సాటియెందుఁ దేఁగలము! ఊర్వశి వలపును తీటఁబుచ్చిన యర్జునుండును వరూధినిం ద్రోచి చనిన ప్రవరుండును అట్టి యీ దిట్టతనంబునకై యిట్టిచేష్టం బొరయరైరిగదా." (సారంగధర చరిత్ర టిప్పణము.)

ఇట్లు సంధివిడచుటకుఁ గారణమేమనః—సంస్కృత వ్యాకరణమున సంధి ప్రకరణములో "సంహితాయాం" అని సూత్రము, సంధి ప్రకరణము అక్షరములకు సంబంధించు నట్లుగా వ్రాయఁబడి యున్నది. "సంహిత" అనగా అక్షరముల వ్యవధానములేని యుచ్చారణము, అట్టి యుచ్చారణము వివక్షించు నపుడు, ఈ సంధులగునని సూత్ర తాత్పర్యము.

"సంహిత" వివక్షించనిచో (అనఁగా గొంచెముకాలము రెండుశబ్దముల నడుమ నాగి యుచ్చరించినచో) ( , ) సంధిలేకున్నను దోషము లేదు అని దాని తాత్పర్యము.

కావున సంస్కృతము ననుసరించిన తెలుఁగునందుఁగూడ సంహిత వివక్షించనిచో సంధిచేయక పోవచ్చును. అట్లు చేయకపోవుటయే కొన్నిచోట్ల నొంపునకును, కొన్నిచోట్ల సంశయ పోవుటకును గారణమై యుండును.

ఇట్లు పద్యకావ్యములయందును గొంచెముగఁ గాన్పించును. ఇదియే మనస్సునం దుంచుకొని వాక్య విరామమందు సంధి లేకున్నను దోషము లేదని—

ఉదా—"పడగనున్న హానుమ భయవిహ్వలుఁడుగాను
అరదమునకు సూతుఁ డచ్యుతుండు"

"సర్వ తీర్థాభి గమనంబు సర్వవేద । సమధిగమము సత్యంబుతో సరియుగావు । ఎఱుఁగుమెల్ల ధర్మములకు నెందుఁబెద్ద । యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైన బుధులు" ఇత్యాదులను నిర్వహించిరి.

N. B. ఈ చోటులయందుఁ బరమైన యచ్చునకు యడాగమము లేదు. అట్లు లేకుండుటయే సంహితావివక్ష లేకపోవుట సూచించు చున్నది.

సంధియనఁగా—మొదటి శబ్దముయొక్క తుదనున్న యచ్చుపోయి రెండవ శబ్దము మొదటనున్న యచ్చువచ్చుట.

## ఆకారము.

1 అకారమునకచ్చుపరమైనయపుడు సంధి కొన్నిచోటుల నిత్యము, కొన్ని చోటుల వికల్పము, కొన్నిచోటులలేదు.

ఉదా—చింత + ఆకు. చింతాకు.

మేన + అత్త = మేనత్త. మేన + అత్త = మేనయత్త.

అమ్మ + ఇచ్చెను. అమ్మయిచ్చెను.

N. B. అయ్య. అమ్మ. అప్ప. అక్క. అన్న. ఎడు. ఏసి. అంత. ఈ శబ్దములు పరమైనయపుడు అన్ని యచ్చులకు సంధి నిత్యము గావున ఆకారమునకును నట్లే.

నిత్యము—ఉదా— రామ + అయ్య=రామయ్య.

లక్ష్మి + అమ్మ=లక్ష్మమ్మ.

రామ + అక్క=రామక్క.

భీమ + అన్న=భీమన్న.

బార + ఎడు=బారెడు.

ఇంత + ఏసి=ఇంతేసి.

కొండ + అంత=కొండంత.

నిత్యముగా రానివి—స్త్రీ లింగములకు, స్త్రీ సమములకు దత్సమములకు, సంబోధనములకు నచ్చుపరంబగునపుడు సంధిలేదు.

ఉదా—సీత + ఆమె=సీతయామె. (స్త్రీలింగము)

గోడ + అడ్డము=గోడయడ్డము (స్త్రీసమము)

ధాత + ఆతండు=ధాతయతండు (తత్సమము)

చెలువుడ + ఇమ్ము=చెలువుడయిమ్ము (సంబోధనము)

వికల్పము—పయిరెండు తెలుంగులుగాక తక్కిన అకారమునకు సంధి వికల్పము.

ఉదా—పుట్టిన + ఇల్లు=పుట్టినిల్లు, పుట్టినయిల్లు, పుట్టినిల్లు.

ఉదా—చిన్న + అన్న=చిన్నన్న, చిన్నయన్న.

B. N. స్త్రీ సమములనఁగా మువర్ణక డువర్ణకములు ప్రథమావిభక్తి లోరానివి.

మఱియొక విధము—ఆమ్రేడితము పరమైనయెడ ప్రథమాద్యచ్చులకు సంధి నిత్యముగావున అకారమునకును నిత్యమే. ఉదా—అన్నన్నా. అబ్బబ్బా. ఔరౌర.

రాముల + అందు=రాములందు. రాములయందు.

ఎనిమిదవ + అది=ఎనిమిదవది. ఎనిమిదవయది.

---

## Exceptions.

### నిపాతములు.

1 పేదాదిశబ్దముల కాలుశబ్దము పరంబగునపుడు కర్మధారయంబునందు (ర) వచ్చును.

ఉదా—పేద + ఆలు=పేదరాలు.

ఇట్లే, పేద. బీద. ముద్ద. బాలింత. కొమ. జవ. ఐదువ. మనుమ. మొ॥ లగువానికిని వచ్చును.

2. కర్మధారయ సమాసమందుఁ దత్సమంబులకుఁ ఆలుశబ్దము పరమగునపుడు అకారమున కుకారమును. రేఫమును వచ్చును.

ఉదా—ధీర + ఆలు=ధీరురాలు.

గుణవంత + ఆలు=గుణవంతురాలు.

N. B. పేదయొక్క ఆలు అను షష్ఠీసమాసమందు ఈరేఫ రాకుండుటకై కర్మధారయ సమాసమందని సూత్రములోఁ జెప్పబడినది.

ఉదా—పేదయొక్క + ఆలు=పేదయాలు, బీదయొక్క + ఆలు=బీదయాలు మొ.

N. B. దీర్ఘాచ్చులకు సంధిలేదు.

ఉదా—నా + అది=నాది. మా + అది=మాది. నవలా + అవి=నవలాయవి.

నాది, మాది యనుచోట సమాసమునందు, అది యవి శబ్దముల అకారమునకు లోపముగాని సంధిగాదు.

ఉదా—మా + అమ్మ = మా యమ్మ. మీ + ఇల్లు = మీయిల్లు. మా + ఊరు=మాయూరు.

## Exercises.

## సాధకములు

## I

### నిత్యసంధులు.

పెద్దన్నా! యిచ్చటనుండుము. నేనును జిన్నక్కయ్యయు నీతో వచ్చుచుంటిమి. నీవు ముందుబోతివేని మాకుఁగొండంత భయముకలుగును, నీవుఁ వచ్చునప్పుడు పెద్దప్పతోఁ గూడఁ జెప్పివచ్చితివా ? చిన్నన్నగూడ వచ్చెదనని నాతోఁ జెప్పెను, నేను వచ్చువఱకు మూరెడు తోవయైనను నడువకుము. మనమెల్లరముఁగలసి పోయి గంపెడుపండ్లు తెచ్చికొందము. ఆ తోఁటలో గడవలంతేసి పండ్లుగలవు. మన పెద్దయ్యగారి తోఁటలోని కన్న రామమ్మ తోఁటలోని పండ్లు మంచివి.

☞ ఇందలి అకార నిత్యసంధులు విడఁదీయుఁడు.

## II

### నిత్యముగాని సంధులు

☞ యడాగమము గలని.

ఓ మిత్రమ ! ఇద్దేశమునందు వారిధార యధికముగాఁ బ్రవహించుటచేఁ దోఁట యెంతయో శోభిల్లియున్నది. ఇందలి పువ్వుల గొప్పిదమును గాంచితివా ? ఇచ్చటన యుండి చెట్టుపైనున్న యలరులం గోసికొందము.

## III

### వికల్పసంధులు.

"చింత యాకంచైనన్" అని రామలింగని పాండురంగ మాహాత్మ్యము నందుఁ గలదు. చింతాకుపుల్లన. వేపాకు చేదు. వంగాకున ముండ్లుండును. మా మేన యత్త పుట్టినింటికిని మా మేనత్త మెట్టినయింటికినిఁ గీర్తిదెచ్చెను. ఆమె మేనల్లుఁడనై నేనించుక పేరుఁజెంద లేకుండుటయే కాక యామె మేన యల్లుఁడనని చెప్పుకొనుటకైనను జాలకయుంటిని.

☞ ఇందలి వికల్పసంధులను విడఁదీయుఁడు.

## VI

మన యిండ్లకన్న రాజులిండ్లు పెద్దవై యుండుటయేకాక రమ్యతయుఁ గలిగి విలువ యెక్కువయుండి, కొండంతపాడవు గలిగి యుండును. అట్టియింటి యుండువానికి సుఖము గలుగకుండునా ? బీదలయింట నించుక యానంద మల వడదు. నారలయిండ్లు రమాకాంతయుండు పద్మము లన వచ్చును.

☞ ఇందలి యన్నిసంధులను విడఁదీయుఁడు.

N. B. "గంగనుకాసె" గంగ+అనుకాసె. అని యాముక్తమాల్య యందుఁ గానవచ్చుచున్నది. కాని యంతమాత్రముచే నది వికల్పసంధి యని యనఁగూడదు. తరుచుగనుండు ప్రయోగములు ప్రమాణముగాని యెచ్చటనో యొకటి కవిసాహసముచేఁ బ్రయోగించినది ప్రమాణముగాఁ దీసికొనరాదు.

### ఇకారము.

1. మధ్యమపురుష క్రియల యికారమునకు సంధినిత్యము.

ఉదా—వ్రాసితివి+అది=వ్రాసితివది.

వచ్చితిరి + ఇంటికి = వచ్చితి రింటికి.

2. ప్రథమోత్తమ పురుషంబుల యికారమునకు సంధి వికల్పము.

ఉదా—చూచిరి + ఆర్యులు = చూచిరార్యులు, చూచిరి యార్యులు.

తింటిమి + అన్నము = తింటిమన్నము, తింటిమియన్నము.

3. ఏమి, మఱి, కి (షష్ఠి) అది, అవి, ఇది. ఇవి. ఏది. ఏవి.

వీని యికారమునకు సంధి వైకల్పికము.

ఉదా — ఏమి + ఉన్నది = ఏమున్నది. ఏమి యున్నది.

మఱి + ఒకటి = మఱొకటి. మఱియొకటి.

వానికిన్ + ఇచ్చెను = వానికిచ్చెను. వానికి నిచ్చెను.

N. B. ఇచట (కి) అను దానికిని పై అచ్చునకును ద్రుతమున్నను సంధిని విధించుటచే నకారము లోపించునని యీసంధివిధియే తోపించుచున్నది.

అది + ఇమ్మ = అదిమ్మ. అది యిమ్మ.

అవి + ఎక్కడ = అవెక్కడ. అవియెక్కడ.

ఇది + ఎవరిది = ఇదెవ్వరిది. ఇది. యెవ్వరిది.

ఇవి + ఉన్నవి = ఇవున్నవి. ఇవియున్నవి.

ఏది + అయ్యా = ఏదయ్యా. ఏదియయ్యా.

ఏవి + అమ్మ = ఏవమ్మ. ఏవియమ్మ

4. "అవ" పరమగునపుడు ఇకారమునకు సంధి వైకల్పికము.

ఉదా — ఎనిమిది + అవ = ఎనిమిదవ. ఎనిమిదియవ.

5. క్త్వార్థక ఇకారమునకును ప్రథమావిభక్తి ఇకారమునకును ప్రథమాతుల్య ఇకారమునకును షష్ఠీసమాస ఇకారమునకును సంధి లేదు.

ఉదా — వచ్చి + ఇచ్చెను = వచ్చియిచ్చెను — క్త్వార్థకము.

హరి + ఇతఁడు = హరియితఁడు — ప్రథమ.

ఎత్తిరి + ఐనది = ఎత్తిరియైనది — ప్రథమాతుల్యము.

నది + ఒడ్డు = నదియొడ్డు — షష్ఠీసమాసము.

Exception — "జనవులసంతరిగాక" మొదలగు ప్రయోగములు వ్యాకరణ మెఱుఁగక వ్రాయఁబడినవి కావు. ఇవి దేశీయము. ఇట్లే "అటు చూపటు" "ఇటు చూపటు" అనియును గలదు. ఇదియును దేశీయమే "జనవలసి యుంటె

ఱుంతే” అనికూడ వేంకటకవి ప్రయోగించి యుండుటచే వికల్ప సంధియని తలఁచినట్లు తోఁచుచున్నది.

## Exercise.

### సాధకము.

### I

రాముఁడియాకతి యాఁదలఁబూని యవ్వానరులు స్వామీ! మేము వెడలుచుంటిమని చెప్పి యరిగిరి యా రవికులమణి యోసుగ్రీవా! నీవీ పుడమి యెల్లనెప్పుడు చూచితివని యడుగ నోరామా! మాయన్నయు నేనును గలహము బెందితిమి యందు నతనిచేఁ దరుమఁబడి యెనిమిదిసారు లెనిమిది దిక్కులకుఁ బారిపోయి తుదకుఁ దొమ్మిదవసారి ఋశ్యమూకముం జేరితిని. అటుపైఁ బదియవ తడవ నాపై నాతఁడు వచ్చుటయేలేదు.

ఇందలి ఇకార సంధులను విడఁదీయుఁడు.

### ఉకారము.

1. ఉకారమున కచ్చుపరంబగునపుడు సంధినిత్యము.

ఉదా—రాముఁడు + అతఁడు=రాముఁడతఁడు.

అతఁడు + ఎక్కడ=అతఁడెక్కడ.

ఇతఁడు + ఒక్కఁడు = ఇతఁడొక్కఁడు.

ఇంపు + అగు = ఇంపగు.

2. చతుర్థ్యాది విభక్తులయొక్కయు, నన్ను. మమ్ము. నిన్ను. మిమ్ము అనువానియొక్కయు శత్రర్థకచువర్ణకము యొక్కయు ఉకారమునకు సంధి వికల్పము.

ఉదా—నీకొఱకున్ + ఇచ్చితిని = నీకొఱకిచ్చితిని, నీకొఱకునిచ్చితిని.

నాకున్ + అనుభవమా=నాకనుభవము, నాకుననుభవము, రామునియందున్ + ఆసక్తి=రామునియందాసక్తి, రామునియందు నాసక్తి.

నన్నున్ + అడిగెన్ = నన్నడిగెన్, నన్ను నడిగెఁ.

మమ్మున్ + ఎంచెఁ = మమ్మెంచెఁ, మమ్ము నెంచెఁ.

నిన్నున్ + అడిగెఁ = నిన్నడిగెఁ, నిన్ను నడిగెఁ.

మిమ్ముఁ + ఊరక = మిమ్మూరక, మిమ్ము నూరక.

వచ్చుచుఁ + ఉన్నాఁడు = వచ్చుచున్నాఁడు. వచ్చుచు నున్నాఁడు.

N. B. ఈ సూత్రమందు, ఉకారమునకును, పరమైన యచ్చునకు నడుమ ద్రుతమున్నను సంధి విధి సామర్థ్యమువలన నకారలోప మూహింపఁబడుచున్నది. కావున నిచ్చటను, ఇఁక, అఁటు, చుఁడు అను శబ్దములయందును దప్ప నేయచ్చునకుఁగాని నకారమున్నచో సంధిరాదని తాత్పర్యము.

నన్నయభట్టు మొదలు, తెలుఁగు వ్యాకరణముఁ జేసిన యెల్లరును ప్రథమేతర విభక్తులయందు, ఉకారమునకు సంధి వికల్పముగా విధించిరి. వారి పక్షమున ద్వితీయావిభక్తిలో నన్ను, మమ్ము. నిన్ను. మిమ్ము, లకు సంధి వచ్చినను "రాముఁ + అడిగెఁ." ఇత్యాదులయందు సంధి రాకుండుటను, తృతీయలో నుకారము లేనందునను చతుర్థ్యాది విభక్తులయందు నుటయే సహజమై కాన్పించుచున్నది. ద్వితీయావిభక్తియందు నన్ను మమ్ముల కప్రాప్తముగు చుండఁగా నవి సూత్రమందు స్వీకరించఁబడినవి.

చువర్ణకమనఁజాలదా? శత్రర్థక చువర్ణక మననేల? అనినచో. కాంచుఁ, వచ్చుఁ. ఇత్యాదులయందలి "చు" అనుదానికి సంధి రాకుండుటకు విధింపఁబడినది.

3 ఉదంతతద్ధర్మార్థవిశేషణమున కచ్చుపరంబగునపుడు నుగాగమంబగు.

ఉదా— చేయు + అతఁడు = చేయునతఁడు.

చేసెడు + అతఁడు = చేసెడు నతఁడు.

4 షష్ఠీసమాసమందు. ఉకార, ఋకారముల కచ్చు పరంబగు నపుడు నుగాగమంబగు.

ఉదా—రాజు యొక్క + ఆజ్ఞ = రాజునాజ్ఞ.

విధాతయొక్క + ఆనతి = విధాతృనానతి.

5 సమాసంబుల నుదంతములకును, పుంపువులకును బరువ సరళములా పరంబగునపుడు నుగాగమంబగు.

ఉదా—చిగురు + కైదువు = { చిగురుంగయిదువు / చిగురుఁగయిదువు / చిగురున్గయిదువు.

తళుకు + గజ్జెలు = { తళుకుం గజ్జెలు / తళుకుగజ్జెలు / తళుకున్గజ్జెలు.

సింగపు + కొదమ = { సింగపుంగొదమ / సింగపుఁగొదమ / సింగపున్గొదమ.

ఉన్నతంపు + గొడుగు = { ఉన్నతంపు గొడుగు / ఉన్నతంపు న్గొడుగు / ఉన్నతంపుంగొడుగు.

6 కర్మధారయములయం దుకారమున కచ్చు పరంబగునపుడు టు గాగమంబగు.

ఉదా—నిగ్గు + అద్దము = నిగ్గుటద్దము.

కఱకు + అమ్ము = కఱకుటమ్ము.

సరసపు + అలుక = సరసపుటలుక.

(1) Exception—కొన్ని యెడల ఉకారాంత వ్యతిరిక్తస్థలములయందును, కర్మధారయము కాని సమాసములయందును గూడటుగాగమంబు గానంబడుచున్నది.

ఉదా—మిద్దె + ఇల్లు = మిద్దెటిల్లు,

పల్లె + ఊరు = పల్లెటూరు.

దుక్కి + ఎద్దు = దుక్కిటెద్దు,

పడుక + ఇల్లు = పడుకటిల్లు.

ప్రయో—పాపజవరాలిబంగారు - పడుకటిల్లు ” (విజయవిలాసము)

తేనె + ఈగ = తేనెటీగ.

పక్క + ఎముక = పక్కటెముక.

వేలుపు + ఆవు = వేల్పుటావు.

మదము + ఏనుఁగు = మదపుటేనుఁగు

7. కర్మధారయంబునఁ బేర్వాదిశబ్దముల కచ్చు పరంబగునపుడు టుగాగమంబు విభాషనగు. (వికల్పము)

ఉదా— పేరు + ఉరము = పేరుటురము. పేరురము.

చిగురు + ఆకు = చిగురుటాకు. చిగురాకు.

పొదరు + ఇల్లు = పొదరుటిల్లు. పొదరిల్లు.

N. B పొదరు—పొద + రు = పొదరు.

8. సమాసంబున కుఱు, చిఱు, కడు, నడు, నిడు, శబ్దముల ఱ,డ, లకు అచ్చు పరంబగునపుడు ద్విరుక్తటకారంబగు.

ఉదా—కుఱు + ఉసురు = కుట్టుసురు.

చిఱు + ఎలుక = చిట్టెలుక.

కడు + ఎదురు = కట్టెదురు.

నడు + ఇల్లు = నట్టిల్లు.

నిడు + ఊరుపు = నిట్టూరుపు.

(1) **Exception.**— “కడునెండ కోర్వక కుక్కనంతకు,

నడుగక యచ్చ నుప నడచియుగాత్రిటవిలా”

(భారతము-అరణ్యపర్వము).

(“కడునధికుతోడఁ దొడరిన,”భారతము-సభాపర్వము).

“కడు + ఎండ = కడునెండ” అనుచో సమాసము కాదు గావున ద్విరుక్తటకారము రాలేదు “కడు నధికు” ఇదియు నట్లే.

N. B. ఓగురూ (3) ఇటురమ్మ-ఇత్యాదులయందు, ప్లుతము గావున సంధి లేదు.

## Exercise.

### సా ధ క ము.

### I

రాముఁ డప్పుడు, లక్ష్మణు నీక్షించి మనము సీతకొఱకు వనమునం దున్న పుష్పాదుల కించుక యత్నము జేసి యని యామెకు నిత్తము. మన మామె యానందముకొఱకు నెదలోఁ గుఱుతుంచుకొని యెల్లచోటులయందు నట్టి పని సేయుట కుద్యమములోనే యుందము. ఈమె పేరాసగలది కాదు గావున మంచివస్తువులఁ జూచుచుండియు మనల నడుగ సంకోచించుచు నుండును. నన్నేని, నిన్నునేని నరుదగు నొక చిగురుటాకు, మధురంపుఁబండు, చెట్టునాకు, చిగురుంగొమ్మగాని యడుగ నేరదు. కట్టైనటుం గల తేనెటీఁగ తేనెపెరలో మిద్దెటింటఁ బరుండి నట్లుండునని సూచించును గాని, కడు మొండిబడి బతిమిలియు నమ్మధు వడుగదు.

☞ ఇందలి సంధులను విడఁదీయుఁడు.

N. B. అ, ఇ, ఉ, ఈ మూఁడింటికిఁ దప్పఁ దక్కిన యచ్చులకు వెనుఁగులో సంధి లేదు.

### హ ల్సం ధి.

1. ప్రథమమీఁది క చ ట త ప లకు, గ స డ ద వ లు బహుళముగ నగు.

ఉదా—వాఁడు + కొట్టె = వాఁడుగొట్టె, వాఁడుకొట్టె.

అపుడు + చనియె = అపుడుసనియె, అపుడు చనియె.

మిత్రుఁడు + చేరెన్ = మిత్రుఁడుసేరెన్, మిత్రుఁడుచేరెన్.

నీవు + టక్కరివి = నీవుడక్కరివి, నీవుటక్కరివి.

మీరు + తలఁడు = మీరుదలఁడు, మీరుతలఁడు.

వారు + పోరు = వారువోరు, వారుపోరు.

2. కళలగు క్రియాపదములు, అప్పుడు, ఇపప్పుడు, ఎప్పుడు మొదలగు నవ్యయములును ద్విధమాతుల్యములు కావున వీనికిఁ బరముగా గసడదవలు వచ్చును.

ఉదా—అప్పుడు + కలిగెన్ = అప్పుడుగలిగెన్, అప్పుడుకలిగెన్.

ఇప్పుడు + చనియెన్ = ఇప్పుడుసనియెన్, ఇప్పుడుచనియెన్.

ఎప్పుడు + టీకవ్రాసెన్ = ఎప్పుడు డీకవ్రాసెన్, ఎప్పుడు టీకవ్రాసెన్

అప్పుడు + తరిమెన్ = అప్పుడు దరిమెన్, అప్పుడు తరిమెన్.

ఎప్పుడు + పడియెన్ = ఎప్పుడు వడియెన్, ఎప్పుడు పడియెన్.

వత్తురు + పోదురు = వత్తురు వోదురు, వత్తురు పోదురు.

3 తెలుఁగులమీఁది సాంస్కృతిక పరుషములకు గసడదవలు రావు.

ఉదా—వాఁడు + కంసారి = వాఁడు కంసారి.

వీఁడు + చక్రపాణి = వీఁడు చక్రపాణి.

అయది + టంకృతి = అయది టంకృతి.

అది + తథ్యము = అదితథ్యము.

ఇది + పథ్యము = ఇది పథ్యము.

N. B. తెలుఁగులమీఁది తత్సమశబ్దంబుల పరుషములకు సరళాదేశము రాఁగూడదుగాని తత్సమంబులమీఁది, తత్సమముల యొక్కగాని, తత్సమముల మీఁది తెలుఁగు శబ్దముల యొక్కగాని పరుషములకు సరళములు రావచ్చును.

ఉదా—క. "కావలిరై సురరాజ్య

శ్రీవాలింపఁగఁదగు విశేషంబున" (భారతము - ఉద్యో)

ఇది సంస్కృతముపై సంస్కృతమునకు నుదాహరణము.

ఐనను గొన్ని యెడలఁ దెనుఁగులపై సంస్కృతశబ్దముల పరుషములకుఁ గూడ నీయాదేశములు కాన్పించుచున్నవి.

ఉదా—"ఎవ్వండువరించెడువాఁడు ధన్యుఁడు మునిప్రవరా" (కాశీఖండము)

క. " అది మొదలుగాఁగ విష్ణుని,

మదినిల్పి యతండు నాకు మగఁడగునని యి
ట్లు దపంబు సేయుచుండెద "

(నిర్వచనోత్తర రామాయణము అ. 5.)

" పెంపువరీక్షింపమొ నింపమోచెలియ యేభూపాలురందైన"

(వసుచరిత్రము 3. ఆ.)

" వీ । రల్గొపించిన నంతకుండు జెడునీ రా యోర్చువారు"

(ఉత్తర హరివంశము అ. 4.)

ఈ ప్రయోగ భేదములన్నియు బహుళగ్రహణముచే సంగ్రహింపఁ బడు చున్నవి. కావున నివి తప్పులనుటకు సాహసింపఁగూడదు.

4 ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడదవలగు.

ఉదా—కూర + కాయ = కూరగాయలు
కాలు + చేయి = కాలుసేతులు.
టక్కు + టెక్కు = టక్కుడెక్కులు.
తల్లి + తండ్రి = తల్లిదండ్రులు.
ఊరు + పల్లె = ఊరువల్లెలు.

——( o )——

## Exercise.

### సా ధ క ము లు

### I

దేవుఁడు పుట్టించిన వాఁడు గానకుండునా ? నారు వోసిన వాఁడు నీరువోయఁడా ? వాఁడు నూడకుండిన మనముఁ దలయెత్తఁగలమా ? ఇది తెలియక కొందఱు దామే పాటవము గలవారమని పెక్కులు తక్కిరి మాటలాడుచుందురు. వారు చాలనప్పుడు గొన్ని పొల్లుమాటలు పలికినను గ్రియ కవి

టాటోటు మాటలు రాకపోవు. కాలుసేతులు చల్లఁగా నున్నంతకాలము నైవాఁడు కన్నులకుఁ గానరాడు.

☞ ఇందలి హల్సంధులను విడఁదీయుఁడు.

## II

కుటుంబమునకుఁ దల్లి దండ్రులు మూలమేగావున వారు ప్రేమమున నందఱియందుఁ దుల్యులే. తఱచుగ నప్పచెల్లెండ్రు గలిసియుందురు. అన్నదమ్ములు గలసి యుందురు. కాని యన్నదమ్ములకు నప్ప చెల్లెండ్రపైఁ బ్రేమ లేకుండదు. తల్లి దండ్రులకుఁగోలె సమము గాదు. మాతాపితల ప్రేమమాత్రము సర్వత్ర సమముగా నుండును. ప్రేమము పలుచోటుల వేఱుగానే కానవచ్చుచున్నది. కాని, అది కుటుంబమునకు మేలుకాదు.

నీవే పెద్దవాఁడవా ! కానిమ్ము. ఇప్పుడు పలుమాటలేల ? నాయనా! పదపద. ఈవయస్సులు చదువవలనఁ దేలవు. పెక్కుపలుకులు పలికిన సిద్ధాంతము లేటుపడును.

☞ ఇందలి సంధుల యసాధుసాధుత్వములను విడఁదీయుఁడు.

N. B. తల్లి దండ్రులు యిత్యాదుల దీర్ఘములకు హేతువు గాన్పించదు. మాతాపితలు, అనుచో మాతృశబ్దముపైని ఋకారమునకు, అకారము వచ్చినది. కాని మనవున్న ఋకారమునకు దీర్ఘము కాదు. “మిత్రావరుణాలు, అగ్నిష్టోములు,” ఇత్యాదులయందు మనవున్న యచ్చునకు దీర్ఘము రాలేదా యందరేమో ? ఎక్కడనైనను సంస్కృత వ్యాకరణములో, “ఆకారము వచ్చును. ఈకారమువచ్చును.” అని చెప్పెను గాని దీర్ఘమని చెప్పలేదు. మఱియు నీయాకారాది విధులేవో కొన్ని శబ్దములకుఁ జెప్పెనుగాని, ద్వంద్వసమాసమున్న చోటులనెల్లఁ జెప్పలేదు. ఇంకనేల ! సంస్కృత వ్యాకరణము సర్వత్ర తెనుగున కుపయోగించునా !

## ద్రుత ప్రకృతికమునకు హల్లులు పరమగుచోఁ గలుగు మార్పులు.

1 ద్రుతప్రకృతికముమీఁది కచటతపలకు గజడదబ లగును.

ఆద్రుతము, అరసున్నగాని, నిండుసున్నగాని, ఉకారముగలదిగాఁ గాని పైహల్లుతోఁ గలసినదిగాని యగును.

ఉదా—పూచెను + కలువలు=పూచెనుగలువలు.

తోఁచెను + చుక్కలు=తోఁచెనుజుక్కలు.

చేసెను + టక్కులు=చేసెనుడక్కులు.

నెగడెను + తమములు=నెగడెనుదమములు.

మొగిడెను + పద్మము=మొగిడెనుబద్మము.

ఉదా—పూచెనుగలువలు= { పూచెం గలువలు, పూచెఁగలువలు, పూచెన్గలువలు.

తోఁచెనుజుక్కలు= { తోఁచెం జుక్కలు, తోఁచెఁ జుక్కలు, తోఁచెన్జుక్కలు.

చేసెనుడక్కులు= { చేసెండక్కులు, చేసెఁడక్కులు, చేసెన్డక్కులు.

నెగడెనుదమములు= { నెగడెందమములు, నెగడెఁదమములు, నెగడెన్దమములు.

మొగిడెనుబద్మము= { మొగిడెంబద్మము, మొగిడెఁబద్మము, మొగిడెన్బద్మము.

2 ద్రుతమునకు, కచటతపలకు, ఆదేశముగారాని గజడదబలుగాని, స్థిర వర్ణములుగాని పరంబులగునపుడు ద్రుతమునకు లోపముగాని, పైహల్లుతోఁ గలియుటగాని, ఉకారము గలిగి యుండుటగాని యగును.

ఉదా—వచ్చె + గోవులు= { వచ్చెగోవులు, వచ్చెన్గోవులు, వచ్చెను గోవులు.

మెఱసెను + ఖడ్గము= { మెఱసెఖడ్గము, మెఱసెన్ఖడ్గము, మెఱసెను ఖడ్గము.

N. B. కచటతపలు పరుషములు, గజడదబలు సరళములు, తక్కిన యక్షరములు స్థిరములు.

3 ద్రుతమునకు వర్గములలోని రెండు నాల్గక్షరములుగాని సరళములు గాని పరంబగునపుడు, ఒకానొకచోట బూర్ణ బిందువుగానం బడియెడి.

ఉదా—వచ్చెను + ధాత్రీపతి=వచ్చెంధాత్రీపతి,

పాడెను + గంధర్వుడు=పాడెంగంధర్వుడు.

కన్ + దోయి=కందోయి.

"కల్మిం జనియించు దుర్యశము మేల్కని లేహనవేళ వాఙ్మయా ర్వం జెడు మాణిబంధ నికరంబుల" (ఆముక్తమాల్యద)

"అంజదవుగాక నను జెం
తం జేరఁగనీక యెంతతగ్గినమిరియా
లుం జొన్నలుసరిగావే
లంజతనమునందుఁ గొమరులంబిలువనొకో" (ఉత్తరహరివంశము)

4 చివరనున్న ద్రుతంబునకుఁ బైనుండు అచ్చునకుగాని, ద్రుతమునకుఁ గాని లోపము బహుళముగనగును.

ఉదా—వాఁడువచ్చెన్, వాఁడువచ్చె, వాఁడువచ్చెను.

N. B. ఈలోపంబు పద్యాంతమందు గణము ననుసరించివచ్చును. (అనఁగా నీమూఁడు రూపములలో నేదియో యొకటి వచ్చునని తాత్పర్యము.)

గురువంత మందుఁగల పద్యమునకు ద్రుతలోపంబును, ద్రుతముపై నచ్చు గలిగియుండుటయు లేదు. పొల్లు నకారము మాత్రము వచ్చునని తాత్పర్యము.

ఉదా—"అతిశయముగ బుద్ధిమంతుఁడగు బుధసేవన్"

5 కొన్నియెడల ద్రుతముమీఁద నింకొక నకారము గానవచ్చును.

ఉ—అదియును న్గాక. దినసంబునుంబోలె.

6 తొలి హ్రస్వము పైనిగల దుత్రమునకు, అరసున్నగాని, లోపము గాని కలుగవు.

Exception— ఇఁక, ఆఁట, చుఁడు. వీనిలో మాత్రము ప్రథమ హ్రస్వముపై నరసున్న కానఁబడియెడిని.

ఉదా— చెంగలువ, ముంగొంగు, క్రొంబసిఁడి, కన్దోయి, పెన్గాలి.

7 దీర్ఘములపై దుత్రము పై హల్లుతో సంశ్లేషము నొందదు.

ఉదా— తాఁజదివె, తానుజదివె, నేఁజదివితి. నేనుజదివితి.

"తాంజదివె, నేంజదివితి" అని యుండదు.

ఇశ్లే— నీవు రాఁజింతించెను, నీవురాను జింతించెను.

మంచిదిగాఁదలఁచెను, మంచిదిగాను దలఁచెను. మొ.

8 సమాసంబున దుత్రమునకు లోపముగలుగును.

ఉదా— ఎల్లయర్థములు, ఎల్లకలుషములు.

N. B. ఈయెల్లశబ్దము సమాసములేనప్పుడు విశేష్యమునకు ముం దుండదు. ఉదా— జనులెల్లన్.

ఇచ్చట యెల్లన్ అనునది సమాసముకాదు, గావున పరమందే యున్నది.

9 సమాసంబునందు దుత్రంబునకు స్వత్వంబులేదు.

ఉదా— చిగురుదైదువు.

సమాసమున ద్రుతమునకు లోపము గలుగునను సూత్రముచే లోపము కలుగుచుండఁగా ద్రుతమునకు స్వత్వరూపమే సంభవించదు. అట్లుండ ద్రుతము నకు స్వత్వములేదని, స్వత్వ నిషేధమేలయందురో, ద్రుత మనఁగా సమాసంబు లందు విధించిన నుగాగమ రూపమైన దుత్రమునకు స్వత్వము లేదని యిచ్చటఁ జెప్పుటగాని, స్వతస్సిద్ధ నకారమునకుఁ గాదు, అది లోపమునే పొందును. ఆలోపము దీనికేల లేదని యంటిరేని నుగాగమము విధించిన సామర్థ్యముచే లోపమురాదు. (అనఁగా నీ నుగాగమ నకారమునకు లోపము వచ్చునేడః నుగాగమము వచ్చునని చెప్పనేల ? కావున రాదు.

ఉదా— ఎల్లన్ + కలువములు=ఎల్లకలువములు.

ఇది స్వతస్సిద్ధ నకారము గావున లోపమువచ్చినది.

చిగురు + కైదువు= } చిగురుసైదువు, చిగురుంగైదువు, చిగురుఁగైదువు.

ఇది నుగాగమ నకారము కావున స్వత్వము రాలేదు. తక్కిన రూపములు వచ్చినవి.

10. తలఁబ్రాలు మొదలగు సమాసంబుల ద్రుతమునకు లోపములేదు.

ఉదా— తలఁబ్రాలు.
ఒడిఁబ్రాలు.
సేసఁబ్రాలు.
ఊరఁబంది.
ఊరఁబిచ్చుక.
తోడఁబుట్టువు.
తోఁబుట్టువు
ఒల్లఁబాటు, ఒడఁబాటు.

11 ఆకారాంతములైన గుణవాచకశబ్దములకు "తన" యను ప్రత్యయంబు పరంబగునపుడు నుగాగమంబగు.

ఉదా—చక్క + తనము= { చక్కందనము, చక్కఁదనము. చక్కద్దనము.

12 సమాసంబులందుఁ బ్రాతాదుల తొలి యచ్చుమీఁది వర్ణమునకు బహుళంబుగా లోపము గలిగి, లోపించఁగా మిగిలినదానికిఁ బరుషములు పరములగునపుడు నుగాగమంబగు.

ఉదా—ప్రాఁత + కెంపు=ప్రాఁగెంపు, ప్రాఁతకెంపు.

లేఁత + కొమ్మ=లేఁగొమ్మ, లేఁతకొమ్మ.

పూవు + తోఁట=పూఁదోట, పూవుతోఁట.

కెంపు + తామర=కెందామర, కెంపుదామర.

చెన్ను + తోవ=చెందోవ, చెన్నుదోవ. మొ.

N. B. "మీఁదు + కడ=మీఁగడ" అని సూత్రమందు బహుళగ్రహణముచేయుటచేత నిత్యముగానే వచ్చినది.

13 క్రొత్తశబ్దమునకుఁ బూర్వసూత్రముచే లోపమురాఁగా, లోపించఁగా మిగిలినదానికిఁ గొన్నియెడల నుగాగమంబును, కొన్ని యెడల పై హల్లునకు ద్విత్వమును గలుగును.

ఉదా—క్రొత్త + చాయ=క్రొంజాయ
క్రొత్త + చెమట=క్రొంజెమట
క్రొత్త + పసిండి=క్రొంబసిండి
} నుగాగమమునకు

క్రొత్త + కారు=క్రొక్కారు
క్రొత్త + తావి=క్రొత్తావి
} ద్విత్వమునకు.

"కెందూళి, కెంజడలు," అనియిట్లు కానంబడుచున్నవి. "క్రొత్తకుండ" ఇత్యాదులయందు బహుళ మన్నందువలన లోపములేదు. (అనఁగాఁ "గ్రొత్తకుండ" యనియేకాని "క్రొక్కుండ"యని యుండదు. "క్రీఁగడుపు" ఇత్యాదులయందు లోపించఁగా మిగిలినదానికి బహుళ గ్రహణముచే దీర్ఘము వచ్చును.

ఉదా—క్రిందు + కడుపు=క్రీఁగడుపు.
క్రిందు + కాలు=క్రీఁగాలు.
క్రిందు + తోడ=క్రీఁదోడ.

మఱియు నొక నొక శబ్దమునకు నొకానొకశబ్దముపరమగునపుడు వెనుకటివలె లోప నుగాగమములువచ్చును. కొన్ని చోటుల లోప ద్విత్వములు వచ్చును. వీనినిఁ బ్రయోగములవలన నెఱుఁగునది.

ఉదా—పది + తొమ్మిది= పందొమ్మిది.
తొమ్మిది + పది= తొంబది.
వంక + చెఱఁగు= వంజెఱఁగు.
సగము + కోరు= సంగోరు.
} నుగాగమము.

నిండు + వెల= నివ్వెల.
నిండు + వెఱఁగు= నివ్వెఱఁగు.
నెఱ + తఱి= నెత్తఱి.
నెఱ + నడుము= నెన్నడుము.
నెఱ + మది= నెమ్మది.
నెఱ + వడి= నెవ్వడి.
} ద్విత్వము.

## Exercise,

### సాధకము.

### I

ఈలేమొగము చక్కనిదై తోఁచుచుండెంగదా! తూర్పుదిక్కునం జుక్కలదొరయు నెల్లెడ నాకసంబునఁ జుక్కలును నొక్కమొగిని గన్పట్టె, చెందొవలుల్లసిల్లుచుండె, అడంగెను జీఁకటులు, మొగిడెఁ దామరలు, గోష్ఠమునకె గోవులు సేరుచున్నవి, మన్మథుఁ డెక్కెడెను ధనువును. కందోయి కింపుగ వెన్నెలలున్నోఁచె. తెమ్మెరయునుం జల్లంగ వీచుచుండెను. మరుండు స్వారిరాఁ గోఁడెకాండ్రకుఁ జెంగలువలు వెంగుమ్మవలెఁ దోఁచుచుండెను. మనుజులెల్ల నెల్ల కార్యంబులు నుజ్జగించి పడుకటిండ్ల కరుగుచుండిరి. మరుండు చిగురున్గోలలు నూరుచుండె. మొల్లలు మొల్లంపుం బరిమళముఁ బూని తెల్లందనమునఁ బూఁదోఁటలలోఁ గ్రొంజాయల నొప్పి క్రొత్తావుల వెదఁజల్లుచున్నవి. చెంగలువ డిగ్గియలనుండి కెందూళులు రేచుచుఁ బెనుఁగాలి వీచుచున్నది. చకోరకమ్మలు పదులు, తొంబదులుగాఁ గూడి యాఁకఁటి నెవ్వగదీర వెలివెన్నెలలఁ గ్రీఁగడుపులు సంగోరుగా నింపుకొని క్రీఁడలం దలలపైఁ జేర్చికొని నెమ్మది నిదిరించుచున్నవి.

☞ ఇందలి సంధులను విడఁదీయుఁడు.

## Miscellaneous.

### వివిధములగు సంధులు.

1 అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తరచుగానగు.

ఆమ్రేడితమనఁగా రెండుపర్యాయము లుచ్చరించు దానిలో రెండవ రూపము.

ఇది (1) అత్యంతార్థమందును— (Intensity)

ఉదా— ఔరౌర, ఏమేమి, ఏమియేమి.

(2) సర్వవ్యాప కార్థమందు—

ఉదా— ఇంటింటన్ = ప్రతియింటను,

(3) గుణవాచకములకు ప్రకారార్థమందు—

ఉదా— ఇంతింత,

ఈయర్థములలో వచ్చును.

2 ఆమ్రేడితంబు పరంబగునపుడు "కడ, ఎదురు. కొన. చివర. తుద తెన్ను. తెరువు. నడుము. పగలు, పిడుగు, బయలు, మొదలు" వీని తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల అకారాంతంబగు ద్విరుక్తటకారంబగు.

ఉదా— కడ + కడ = కట్టకడ

ఎదురు + ఎదురు = ఎట్టయెదురు.

కొన + కొన = కొట్టకొన

చివర + చివర = చిట్టచివర

తుద + తుద = తుట్టతుద

తెన్ను + తెన్ను = తెట్టతెన్ను.

తెరువు + తెరువు = తెట్టతెరువు.

నడుము + నడుము = నట్టనడుము.

పగలు + పగలు = పట్టపగలు.

పిడుగు + పిడుగు = పిట్టపిడుగు.

బయలు + బయలు = బట్టబయలు.

మొదలు + మొదలు = మొట్టమొదలు.

3. ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగానగు.

ఉదా—అప్పటికిన్ + అప్పటికిన్ = { అప్పటుప్పటికిన్ / అప్పటికప్పటికిన్.

అక్కడఁ + అక్కడఁ = { అక్కడక్కడఁ / అక్కడనక్కడఁ

ఇంటన్ + ఇంటన్ = ఇంటింటన్, ఇంటనింటన్.

ఊరన్ + ఊరన్ = ఊరూరన్, ఊరనూరన్.

ఇంచుక + ఇంచుక = ఇంచించుక, ఇంచుకించుక.

నాఁడు + నాఁడు = నానాఁడు, నాఁడునాఁడు.

4 ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమపురుష మువర్ణకము, ప్రథమా విభక్తి ఁడు వర్ణకములకు లోపంబు విభాషనగు.

ఉదా—ఉండుము + ఉండుము = ఉండుండుము, ఉండుముండుము.

కొట్టుఁడు + కొట్టుఁడు = { కొట్టుకొట్టుఁడు / కొట్టుఁడుకొట్టుఁడు.

5 సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్లలోపంబు బహుళంబుగానగు.

ఉదా—ప్రాఁత + యిల్లు = ప్రాయిల్లు, ప్రాఁతయిల్లు.

లేఁత + దూడ = లేదూడ, లేఁతదూడ.

పూవు + రెమ్మ = పూరెమ్మ, పూవురెమ్మ,

6 అందందుకు మొదలగునవి ప్రయోగముల ననుసరించి యొఱుఁగవలెను.

ఉదా—అదుకు + అదుకు = అందదుకు.

ఇంకులు + ఇంకులు = ఇఱ్ఱింకులు.

ఇగ్గులు + ఇగ్గులు = ఇల్లిగ్గులు.

చెదరు + చెదరు = చెల్లచెదరు, చెల్లాచెదరు.

తుమురు + తుమురు = తుత్తుమురు.

తునియలు + తునియలు = తుత్తునియలు.

మిట్లు + మిట్లు = మిఱుమిట్లు.

7 పకారాది ధాతువులు పరమగునపుడు కర్మార్థకశబ్దము యొక్క ము వర్ణకమునకు లోప పూర్ణబిందువులు విభాషనగు.

ఉదా—భయము + పడెన్ = { భయపడెన్, భయంపడెన్, భయముపడెన్.

సూత్రము + పట్టైన్ = { సూత్రపట్టైన్, సూత్రంపట్టైన్, సూత్రము పట్టైన్.

మోసము + పుచ్చెను = { మోసపుచ్చెను, మోసంపుచ్చెను. మోసము పుచ్చెను.

పదము + పడి = { పద పడి, పదం పడి, పదము పడి.

8 మధ్యమపురుష మువర్ణమునకు హల్లు పరంబగునపుడుగాని, పైన నక్షరములు లేనప్పుడుగాని లోపము వికల్పము.

ఉదా—చూడుము + నన్ను = చూడు నన్ను, చూడుము నన్ను. ఇటు చూడు, ఇటు చూడుము.

అచ్చుపరంబగునపుడయితే, చూడుము + అనియెన్ = చూడుమనియెన్ వినుము + అనియెన్ = వినుమనియెన్, ఇక్కడ లోపము లేదు.

9 వ్యతిరేక మధ్యమ పురుష ము వర్ణమునకు నెల్లయెడల లోపము వికల్పముగానగు.

ఉదా—నమ్మకుము + ఇటు = నమ్మకిటు, నమ్మకుమిటు.

చూడకుము + వానిని = { చూడకు వానిని చూడకుము వానిని.

అక్కడికి వెళ్ళకు, అక్కడికి వెళ్ళకుము.

10 అనుకరణంబున విసర్గమునకు లోపంబు గలుగును.

ఉదా—వర్ధతాంశ్రీః + అనియె = వర్ధతాంశ్రీయనియె.

11 అనుకరణమున నమశ్శబ్దము తుది అకారమున కోత్వము వికల్పము గానగు.

ఉదా— తుభ్యంనమః + అనె = { తుభ్యం నమోయనె తుభ్యం నమయనె.

N. B. ఒకానొకచో నమశ్శబ్దమునకుఁ గాక యితరమునకుఁ గూడ నీ కార్యము గాన్పించు చున్నది.

" గతానుగతికో లోకోయటంచున్"

12 అనుకరణంబునఁ దుది హల్లునకు ద్విత్వము వచ్చును.

ఉదా—కింతత్ + అనియెన్ = కింతత్తనియెన్

కస్త్వం + అనియెన్ = కస్త్వమ్మనియెన్.

13 అనుకరణంబునం దహమాదుల మకారమునకు ద్విత్వము వికల్పముగానగు.

ఉదా—దాసోహం + అనియెన్ = { దాసోహమ్మనియెన్ / దాసోహమనియెఁ. }

కర్తవ్యం + అనెఁ = కర్తవ్యమ్మనెన్. కర్తవ్యమనెన్

11 ఉదంతనామముల కనుకరణమునందు వు గాగమంబగు.

ఉదా—ఇయంధేనుః + అనెఁ = ఇయంధేనువనెన్.

15 ఆ, ఈ, ఏ, ఇవి త్రికము.

ఉదా—ఆ + కాంత = అక్కాంత, ఈ + చోటు = ఇచ్చోటు ఏ + విధము = ఎవ్విధము.

## Exercise.

### i

ఓరోరీ ! పట్టఁపట్టుఁడు, కొట్టుఁడు, కొట్టుఁడని పిట్ట పిడుగులవలె మీఁదబడు రక్కసులను లెక్క సేయక యప్పటప్పటికిఁ దగునట్లు తప్పించుకొనుచుఁ దన వాలాగ్ని నించించుక యింటింట నిడుచు నక్కడక్కడ వాని చక్కందన మెన్నుచుఁ బట్టపగలెల్లరుఁ జూచుచుండఁ నిది పాతయిల్లిది క్రొత్త యిల్లిది లేఁ జెట్టిది పూఁగొమ్మయని చింతించక యందుంగల గృహస్థులెల్లఁ గన్నులు మిఱుమిట్లు గొలుపఁ జూచి చెల్లాచెదరై, తుత్తునియలై తుట్టతుద కిట్టింటిలింక నించుకేనియు భయుంపడక పూదోటతోపాటు కూతురిపట్టినట్లున్న యిళ్ళన్నియుఁ దహించి చిట్టచివరకు దెట్ట తెరవుఁజేసెను. అట్టియెడ బెట్టిదపు రక్కసులెల్ల నోరీ ! మిత్రుఁడా యటు

ప్రకరణము 3.

# CHAPTER III.

## వర్ణోత్పత్తి ప్రకరణము.

ఏ భాషకైనను శబ్దము ప్రధానము. ఆ శబ్దములు అక్షరధ్వని వలన నేర్పడుచున్నవి. ధ్వనిని తెలుపుగుర్తులు అక్షరములు. ఏ ధ్వనిని భాగించుటకు వీలులేదో అది అక్షరము.

ప్రతి భాషకును ధ్వనినిచ్చు వర్ణముల పుట్టుక ఒక్క విధముగానే యుండును.

మనుజుడు నిరంతరము శ్వాసకోశమునుండి గాలిని లోపలికిపీల్చి మరల పైకి విడిచిపెట్టుచున్నాడు. ఇందులో లోపలినుండి పైకివచ్చు గాలికి "నిశ్వాస మని పేరు. ఈ నిశ్వాసవాయువు వలననే వర్ణములు పుట్టుచున్నవి. శబ్దమును పలుకవలెనను కోర్కె మనస్సులో కలుగగానే అది జఠరాగ్నిని ప్రేరేపించును. ఆ కదలికవలన నిశ్వాసవాయువు బయలుదేరి ఉరము, కంఠము, శిరసు, జిహ్వామూలము, దంతములు, నాసిక, ఓష్ఠములు, తాలువులతో కలిసి యా యా వర్ణములను బుట్టించును. ఈ నిశ్వాసవాయువు గళమునుండి వెడలునప్పుడు కొన్ని అక్షరముల పలుకుబడికి గళము సంకోచము నొందును. అప్పుడు వెడలు ధ్వని నాదమని పేరు.

### అచ్చులు.

హల్లు లస్వతంత్రములు, అచ్చులు స్వతంత్రములు, హల్లులయొక్క సహాయ్యము లేక అచ్చుల నుచ్చరింపవచ్చును. అచ్చుల సహాయము లేక హల్లుల ఉచ్చారణము సుకరముగాదు. కావున అచ్చులు ముందు చెప్పబడును. అచ్చులలో అ ఆ ఇ ఈ లు పుట్టిన కంఠము, మృదుతాలువుల స్థానక్రమమును బట్టి అవి ముందుగా జెప్పబడినవి. ఉత్తరోష్ఠమున బుట్టి, అధరోష్ఠము కరణముగా నుండుటచేత ఉ, ఊ, తరువాతను, ఋ, ౠ, ఌ, ౡ కొంచెము (ర,ల) అను హల్లుల ధ్వనిగల వగుటచేత వాని తరువాతను క్రమ మేర్పడినది. ఏ, ఐ, ఓ, ఔ లు, అచ్చులతో అచ్చులు గలుపుటచేత వానికి తరువాత చెప్పబడినవి.

## హల్లులు.

హల్లుల ఉత్పత్తిక్రమమును బట్టియే వాని క్రమ మేర్పడినది. జిహ్వామూలము (నాలుక మొదలు) తాలువు (దవడ) మూర్ధము నోటిలోని భాగము, దంతములు (పన్నులు) ఓష్ఠములు (పెదవులు) వరుసగా నున్నందున కవర్గ ముందుగాను, తరువాత చవర్గ, దానితరువాత త, ఉపవర్గలు వరుసగా వచ్చినవి.

హల్లులను పలుకునప్పుడు ఆ వర్ణోత్పత్తి స్థానములకు, జిహ్వామూలము, జిహ్వామధ్యము, జిహ్వాగ్రము, జిహ్వోపాగ్రములను స్పృశించును (తాకును).

ఈ స్పర్శమును గలుగజేయుటకు కొన్ని అభ్యంతర ప్రయత్నములు గలవు. ఇవియే హల్లులకు ముఖ్యమైనవి. ఇవి అచ్చులకు లేవు. ఇది వ్యాకరణశాస్త్రక్రమము

అ, ఇ, ఉ, ఋ, ౡ హ్రస్వములు, అ+అ = (ఆ)ఆ ఈ ఊ ౠ ౡ దీర్ఘములు.

అ + ఇ = ఏ
అ + ఈ = ఏ
అ + ఏ = ఐ
అ + ఉ = ఓ
అ + ఓ = ఔ

} ఏ, ఐ, ఓ, ఔ సంయుక్తాచ్చులు.

అచ్చులంత స్ఫుటమైన ఉచ్చారణలేక, హల్లులంత ఉచ్చారణ విహీనముగాక ఉభయమధ్యముగా నున్న అక్షరములు ం ః వీనికి ప్రత్యేకోచ్చారణ సులభముగాదు, కావున ఒక అక్షరముతో కలిపి యుచ్చరించుచుందురు.

సంస్కృతము (స్వర) ప్రధానమైన భాష. అపస్వరోచ్చారణ మహాపాపమని తలంపబడుచు భాషాసంప్రదాయము కాపాడ బడుచుండెను.

| [illegible] | హ్రస్వమా దీర్ఘమా | సాధనము. | కరణము. | ప్రయత్నం | విశేషము. |
|---|---|---|---|---|---|
| అ | హ్రస్వము | కంఠము | ఓష్ఠము | సంవృతము | |
| ఆ | దీర్ఘము | ,, | ,, | .. | |
| ఇ | హ్రస్వము | తాలువు | జిహ్వామధ్యము | వివృతము | |
| ఈ | దీర్ఘము | ,, | .. | .. | వీని నుచ్చరించు |
| ఉ | హ్రస్వము | ఉత్తరోష్ఠము | అధరోష్ఠము | .. | నప్పు పెదవులుదీ |
| ఊ | దీర్ఘము | ,, | .. | .. | ర్ఘములై వర్తుల |
| ఋ | హ్రస్వము | దంతపంక్తి | .. | .. | ములగును. |
| ౠ | దీర్ఘము | ఊర్ధ్వభాగమం | .. | .. | |
| | | దున్న ఉన్నత | | | హనుమూలా |
| | | ప్రదేశము | | | ప్రాంతములు |
| ఌ | హ్రస్వము | పార్శ్వములు | జిహ్వామధ్యము | వివృతతర | స్పృశింపబడు |
| ౡ | దీర్ఘము | ,, | .. | ప్రయత్నం | |
| ఎ | హ్రస్వము | కంఠము | .. | వివృతతమ | హనువులు మిగు |
| ఏ | దీర్ఘము | తాలువు | .. | ప్రయత్నం | లవ్యత్యస్తము |
| ఐ | హ్రస్వము | ,, | .. | వివృతతర | లుగావు |
| ఒ | దీర్ఘము | కంఠము | .. | ప్రయత్నం | ఇదిలకారోకా |
| ఓ | హ్రస్వము | కంఠోష్ఠస్థానం | .. | వివృతతమ | రసమభివ్యాహా |
| ఔ | దీర్ఘము | ,, | .. | ప్రయత్నం | రంవల్లకల్గినది |

N. B. హ్రస్వము=కుఱుచ, దీర్ఘము=నిడుద, అ, ఆః, కంఠ్యములు= కంఠముతో బలుకదగినవి ఇ ఈ తాలువులు = దవడలతో పలుకఁబడునవి. ఉ ఊ ఓష్ఠములు=పెదవులతో పలుకఁబడునవి. ఋ ౠ మూర్ధము=నోటిలోని గోళాకారమున పలుకబడి శిరస్సునందు ధ్వనించునవి. ఌ ౡ దంత్యములు = దంతములతో పలుకఁబడునవి ః విసర్గ: ఇది ప ఫ బ భ లకు ముందువచ్చిన ఉపధ్మానీయమనియు క ఖ గ ఘ లకు ముందువచ్చిన జిహ్వామూలీయమనియు చెప్పఁబడును. దీనికి విడిగా ప్రయోగము లేదుగాన దీని పూర్వాచ్చునుబట్టి ఉత్పత్తిస్థాన మేర్పడుచుండును.

## హల్లుల పట్టిక

| వర్గములు. | పరుష ములు | వర్గ ప్రథమాక్షరములు. | సరళ ములు. | వర్గ యుక్కులు | అను నాసికము. | ఉత్పత్తిస్థానము బట్టి సంజ్ఞలు |
|---|---|---|---|---|---|---|
| కవర్గము | క | ఖ | గ | ఘ | ఙ | కంఠ్యములు |
| చవర్గము | చ | ఛ | జ | ఝ | ఞ | తాలవ్యములు |
| టవర్గము | ట | ఠ | డ | ఢ | ణ | మూర్ధన్యములు |
| తవర్గము | త | థ | ద | ధ | న | దంత్యములు |
| పవర్గము | ప | ఫ | బ | భ | మ | ఓష్ఠ్యములు |

క-ఖ-గ-ఘ-ఙ—కవర్గము
చ-ఛ-జ-ఝ-ఞ—చవర్గము
ట-ఠ-డ-ఢ-ణ—టవర్గము
త-థ-ద-ధ-న—తవర్గము
ప-ఫ-బ-భ-మ—పవర్గము

క-చ-ట-త-ప=పరుషములు.
గ-జ-డ-ద-బ=సరళములు.
ఙ-ఞ-ణ-న-మ=అనునాసికములు.
ఖ-ఛ-ఠ-థ-ఫ=వర్గయుక్కులు.
ఘ-ఝ-ఢ-ధ-భ=వర్గయుక్కులు.

[య, ర, ల, వ = 'అంతస్థములు' నాలుకచివరఁ బలుకబడునవి. శ, ష, స, హ ఊష్మములు (నోటిగాలిచేఁ బలుకఁబడునవి)]

| అక్షరములు | శ్వాసము / నాదము | ఘోషము / అఘోషము | వివారము / సంవారము | అల్పప్రాణము / మహాప్రాణము | అక్షరములు | శ్వాసము / నాదము | ఘోషము / అఘోషము | వివారము / సంవారము | అల్పప్రాణము / మహాప్రాణము |
|---|---|---|---|---|---|---|---|---|---|
| క | శ్వా | అ | వి | అల్ప | ద | నా | ఘో | సం | అల్ప |
| ఖ | శ్వా | అ | వి | మహా | ధ | నా | ఘో | సం | మహా |
| గ | నా | ఘో | సం | అల్ప | న | నా | ఘో | సం | అల్ప |
| ఘ | నా | ఘో | సం | మహా | ప | శ్వా | అ | వి | అల్ప |
| ఙ | నా | ఘో | సం | అల్ప | ఫ | శ్వా | అ | వి | మహా |
| చ | శ్వా | అ | వి | అల్ప | బ | నా | ఘో | సం | అల్ప |
| ఛ | శ్వా | అ | వి | మహా | భ | నా | ఘో | సం | మహా |
| జ | నా | ఘో | సం | అల్ప | మ | నా | ఘో | సం | అల్ప |
| ఝ | నా | ఘో | సం | మహా | య | నా | ఘో | సం | అల్ప |
| ఞ | నా | ఘో | సం | అల్ప | ర | నా | ఘో | సం | అల్ప |
| ట | శ్వా | అ | వి | అల్ప | ల | నా | ఘో | సం | అల్ప |
| ఠ | శ్వా | అ | వి | మహా | వ | నా | ఘో | సం | అల్ప |
| డ | నా | ఘో | సం | అల్ప | శ | శ్వా | అ | వి | మహా |
| ఢ | నా | ఘో | సం | మహా | ష | శ్వా | అ | వి | మహా |
| ణ | నా | ఘో | సం | అల్ప | స | శ్వా | అ | వి | మహా |
| త | శ్వా | అ | వి | అల్ప | హ | నా | ఘో | సం | మహా |
| థ | శ్వా | అ | వి | మహా | | | | .. | |

## హల్లుల ఉచ్చారణ.

హల్లుల సక్రమోచ్చారణమునకు క ఉదాహరణముగా చెప్పబడును.

క్, ఇది జిహ్వామూలమునబుట్టి దవడలు మృదు తాలువు లుకరణముగా వెలువడును. క్ నోరుమూసికొని ఉచ్చరించుటకు వీలులేదు. క్ ఉచ్చరించున పుడు ఘోషములేదు, గావున అఘోషము, దవడలు, మృదుతాలువులకు దృఢముగా తాకుటచేత శ్వాసము, ధ్వనికంఠమందు తగిలి ఆలస్యముగా వెలుపలికి వచ్చుటచేత మహాప్రాణమని వైయాకరణులు సిద్ధాంతము చేసియున్నారు.

క్ + అ=క్ + ‍ = క.

## అచ్చుల ఉచ్చారణము.

అచ్చులు 1 అను నాసికము 2 అనను నాసికములు అని రెండు విధములు. ఈ రెండువిధములైన అచ్చులు, 1 హ్రస్వములు 2 దీర్ఘములు 3 ప్లుతములని మూడువిధములు, ఈబహువిధములైన భేదములు యథాశాస్త్రీయముగా పాటింపబడుచున్నవి.

## ఉచ్చారణ సూత్రములు.

1. భూతార్థక క్రియాపదములయందును తద్ధర్మార్థక క్రియాపదములయందు నుండు యకార మెత్వముగలది,

ఉదా— భూ. కనియెన్ వినియెన్

త. కనియెదున్, వినయెదున్

N. B. కనియన్ అని ఉచ్చరించరాదు,

2. ఉయ్యెల, పయ్యెద, తాయెతు అను పదములలోని మధ్యయకార మెత్వము గలది.

N. B. పయ్యాద శబ్దములోని యకార మత్వముగా కవికర్ణ రసాయనాదులందు ప్రయోగము.

3. ఆంధ్రభాషయందు పదాది ఙకార, యకార, శకారములును, ఉ ఊ, ఒ, ఓ లంగూడిన (వు, వూ, వొ, వో) వకారంబును లేవు.

ఉదా— యెవడు. తప్పు = ఎవడు అనవలెను

వూరు తప్పు — ఊరు అనవలెను

శ్లావు వోపిక, తప్పు = లావు ఓపిక. ఒప్పు.

య, ర. ల వ లకువలెనే శ, ష, స, హ ల ఉచ్చారణముగూడ మిక్కిలి జాగ్రత్తతో నేర్చుకోవలయును. అట్లు నేర్చుకొననిచో నర్థభేదము గలుగును.

ఉదా— శరము (బాణము) సరము (దండ)

షణ్ముఖుడు - కుమారస్వామి,

సన్ముఖుడు = మంచిమొగముగలవాడు,

హంస - అంస

## ఆంధ్రభాషా ప్రత్యేకత.

ఆంధ్రభాషా ప్రత్యేకతను దెల్పు శబ్దజాలమునకు ఎ, ఒ, చ, జ, ఱ, ఁ అను అక్షరసంజ్ఞ లేర్పరుపబడి యున్నవి. ఈ అక్షరములు సంస్కృత వర్ణమాలిక ననుసరించియే యేర్పడుటవలన, తాటాకులోని అ, ఇ, లకు మధ్యగల అవంటి వర్ణమొకటి కల్పింప బడకుండుటచేత జనశ్రుతిలో నుండియు, లిపిలేని పోతువను గ్రంథస్థముగాక అనేక శబ్దములు నిలిచియున్నవి. మేక, ఇదా, అదా, తాటాకు వెుదలయిన వందలకొలది శబ్దములు.

తెలుగు క్రియలయొక్క అనద్యతన భూతరూపము నిత్యవాడుకలో నుండియు, గ్రంథస్థము కాకుండుటగూడ ఆంధ్రభాషకు గొప్పలోపము.

క. అచ్చమ్మా నీ పెనిమిటి
తెచ్చాడా కూరలేవి తానేలేదా

అను సహజ మార్దవమగు తెనుగు నుడికారము గ్రంథస్థము కాకపోవుట ఆంధ్రుల దురదృష్టము.

వర్ణములు.

1. సంస్కృతమందుండి తెలుఁగునలేని వర్ణములు 19.

ఋ ౠ ఌ ౡ ః ' ఖ ఛ ఠ ధ ఫ ఝ ఢ ధ భ ఙ ఞ శ ష.

2. తెలుఁగునందు మాత్రముగల వర్ణములు 6.

ఎ ఒ ఁ చ జ ఱ ॥

3. తెలుఁగునకును సంస్కృతమునకును సామాన్య వర్ణములు 31.

అ ఆ ఇ ఈ ఉ, ఊ ఏ ఒ ఓ ఔ ం । క గ చ జ ట డ ణ త ద న ప బ మ య ర ల వ స హ ళ.

4. మిశ్రమపుఁ దెలుఁగున వర్ణము 'లేఁబదియాఱు' 56.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ ం ః ఁ

క ఖ గ ఘ ఙ చ చ ఛ జ జ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ఱ ల వ శ ష స హ ళ.

# CHAPTER IV.

## సంస్కృతాంధ్రశబ్ద పరిజ్ఞానము.

"వాఁడు + కంసారి=వాఁడుకంసారి" ఇచ్చటఁ బ్రథమాంత మయ్యున్న తెలుఁగుశబ్దముపైఁ గసడదవలు రావుగావునఁ బైపదము సంస్కృతమో తెనుఁగో తెలిసికొనవలసియున్నది.

సమాసము చేయునపుడు సంస్కృతాంధ్ర పదములు కొన్నియెడలం దక్క సమసించఁగూడదు, గావున సంస్కృతాంధ్ర పదములను దెలిసికొనుట యావశ్యకము.

ఉదా—అల్ప దండు.

ఇచ్చట దండు యనునది తెలుఁగు. అల్ప అనునది సంస్కృతము. కావున నిట్లుండఁగూడదు. "అల్పసేన" రెండును సంస్కృతములే కావున నిట్లుండ వచ్చును.

ఏ శబ్దము సంస్కృతమో యే శబ్దము తెలుఁగో తెలియుటకై కొన్ని గురుతులు చెప్పఁబడు చున్నవి.

1. వర్ణములవలనఁ గనుగొనుట—అ, ఆ, ఇ, ఈ, ఉ ఊ, ఏ, ఐ, ఓ, ఔ, ం, క, గ, చ, జ, ట, డ, ణ, త. ద, న, ప, బ, మ, య, ర, ల, వ, స, హ, ళ, ఈ అక్షరములు సంస్కృతాంధ్రముల రెంటియందు నుండును.

ఋ, ౠ, ఌ, ః ఖ, ఘ, ఙ, ఛ, ఝ, ఞ, ఠ, ఢ, థ, ధ, ఫ. భ, శ, ష, ఈ యక్షరములు సంస్కృతమున మాత్రమేయున్నవి.

ఎ, ఒ, ఁ, చే, జ, ఱ, ఁడు, ఇవి తెనుఁగులో మాత్రమేవచ్చును.

సంస్కృతాక్షరములు గలవి సంస్కృతశబ్దములని తెలుఁగక్షరములు గలవి తెలుఁగు శబ్దములనియు స్పష్టమే కదా.

## Exceptions.

అందు తావు, రవర, ఘాక, రవణించు, ఐఱభి, ఇత్యాదులు సంస్కృతాక్షరములు, గలిగియుఁగొన్ని తెలుఁగుశబ్దములై యున్నవి.

ఇ, ఈ, ఎ, ఏ లతోఁగూడని వయ్యుఁ దాలవ్యములైన చజలు గలవి సంస్కృతశబ్దములు.

ఉదా—చంద్రుఁడు, చోరుఁడు, విచారము, జయము, జాయ, రజోగుణము.

ఇంక రెండుభాషలకు సమానములగు నక్షరములు మాత్రమేగల శబ్దములు తెలియుటకు సాధనములేవన:—

స్థిరవర్ణమునకుఁ బూర్వము, అనుస్వారము కలదియు, యకారమాదియందుఁ గలదియు, సంస్కృత శబ్దము. ఇట్లు వర్ణములచేఁ దెలియవలయును.

ఉదా—సంసారము, సింహము, సంయమి, యతి యోగము.

2. ఇతరములవలనఁ గనుగొనుట—దీర్ఘసమాసము కలవి సంస్కృత శబ్దములు.

ఉదా—నీరాకరసుతాసమేతుఁడు.

ఒకచో సంస్కృతమని తెలిసిన శబ్దముతో సమసించిన సందేహశబ్దము మఱియొకచోఁ గాన్పించినప్పు డది సంస్కృతమే యని గుర్తించుకొనవలెను.

ఉదా—క్రోధ సమేతుఁడు.

ఇచ్చట సమేతశబ్దము వర్ణములవలనఁ దెలియకున్నను ధకారముగల క్రోధ శబ్దముతో సమసించి యుండుటచే సంస్కృతమని తెలిసికొనవలెను.

ప్రేరణ లేకుండ ధాతువు నుచ్చరించు నవుడే, ఇంచుగాగమము కలది సంస్కృతము.

ఉదా—హరించు, పూరించు, జయించు, భోగించు.

ప్రేరణలేకుండ ధాతువు నుచ్చరించుటయని చెప్పుట యేలయనఁగా ప్రేరణార్థమందలి యించుగాగమము గలవి తెలుఁగు శబ్దములగును.

ఉదా—వండించు, తిట్టించు.

అంగలాదుల యందలి యించు గాగమముగలవి తెలుఁగు శబ్దములు.

ఉదా—అంగల + ఇంచు=అంగలించు, ఇట్లే, అడకించు, ఆరగించు, ఆవులించు, ఉంకించు, ఉగ్గడించు, ఓరించు, కారించు, గాలించు, జాడించు, తిలకించు, తులకించు, పంకించు, పరికించు, పలవించు, అప్పించు, ఒప్పించు, ఆలించు" ఇత్యాదు లంగ లాదులు.

ఉపసర్గలుగల శబ్దములు సంస్కృత శబ్దములు.

ఉదా—ప్రకారము.

ఇచట "ప్ర" ఉపసర్గము కావున నిది సంస్కృతము.

"ప్ర, పరా, అప, అవ, సం, అను, నిర్, దుర్, అ, అధి, అపి, వి, ని, అతి, సు, అభి, ఉప, పరి, ప్రతి, ఉత్" ఇవి ప్రాదులు. (ఉపసర్గలు)

N. B. అ, ఈ, ఏ, తా, నా, నీ మొదలగు సర్వనామశబ్దములును, వీనివలన బుట్టిన, అక్కడ, అట్లు మొదలయిన శబ్దములును, నాలుగయిదు మొదలగు సంఖ్యావాచక శబ్దములు తెలుఁగులు.

తద్భవశబ్దము లన్నియుఁ దెలుఁగులే—ఉదా—పక్క (పక్షశబ్దతద్భవము.)

## తెనుఁగుభాషాప్రణాళిక.

(సంస్కృత పదములు రెండు విధములుగాఁ దెనుఁగునం బ్రవేశించుచున్నవి. (1) అందుఁ గొన్ని ప్రాకృత భాషలోఁ జొచ్చి ప్రాకృతపదంబులై, అచ్చటినుండి (through that medium) తెలుఁగునఁ జేరుచున్నవి. (2) మఱికొన్ని సంస్కృత శబ్దంబులు ప్రాకృతభాషయందు జేరక సరిగాఁ (directly) దెలుఁగునం బ్రవేశించుచున్నవి. ఈ సంస్కృత ప్రాకృత శబ్దములు తెలుఁగున జేరునపుడు చివరమాత్రము స్వల్పములగు మార్పులు చెందినం జెందుఁగాని యితరభేదముల నొందవు. ఈ ద్వివిధ పదంబులే

"తత్సమంబులు" (Sanskrit and Prakrita words naturalised in Telugu) అని వ్యవహరింపఁబడును. ఇట్లు తెలుఁగు లోనికి వచ్చిన సంస్కృతపదములు "సంస్కృతసమము" లనియుఁ ఇట్లే వచ్చిన ప్రాకృతపదములు ప్రాకృతసమము లనియుఁ దెలియఁ బడుచున్నవి. ఇట్టి పదములుగాక. సంస్కృత ప్రాకృత శబ్దంబులముఁగొన్ని చివరమార్పుతేగాక, పదములలోని వర్ణములు పోయిగాని వర్ణములు మాఱిగాని క్రొత్తవర్ణములు చేఱికాని మాఱు రూపంబులనొంది తెనుఁగునఁజేరెడు కొన్ని సంస్కృత ప్రాకృతశబ్దములు "తద్భవంబులు" (disguised words) అని చెప్పఁ బడును. ఇట్లు సంస్కృతమునుండి పుట్టిన పదములు "సంస్కృత భవములు" ప్రాకృతమున నుండి పుట్టినవి. "ప్రాకృతభవములు" సంస్కృతసమ, ప్రాకృతసమ, సంస్కృత భవ, ప్రాకృతభవములే కాక, "దేశ్యములు" అనెడి పదంబులును దెలుఁగునం గలవు. సంస్కృత సమంబులుగాక తక్కిన నాల్గువిధములైన యాంధ్రపదంబులు "అచ్ఛికములనియు. అచ్చ తెనుఁగు" లనియుఁ దెలియఁబడును. "త్రిలింగలక్షణము."

శుద్ధాంధ్రములు.

ఉదా—

"నిలిచినజాబిగొల్ల దొరనిండినబత్తిని గేలుమోడ్చి య
బ్బలియుఁడొసంగుదీవనలఁ బల్మఱుఁ గైకొనినొప్పతమ్మి కెం
పులు గదియించినట్టి జిగిపుత్తడి ముక్కలిపీటమీఁద ని
నిచ్చలముగనుంచి పూజలిడి వయ్యన నాతని తోడనిట్లనున్."

(నీలాసుందరి పరిణయం.)

"అనినన్నీళులు తేరఁగానవిచి యొయ్యన్నెన్నొసల్ తానె లో
నెనరారందన చేతులంగడిగి చిన్నెంగాంచిరా కన్నియల్
కని యెంతో యరుదందఁ గౌఁగిటను జక్కంజేర్చియా తొయ్యలిం
దినయోరంజెయిసాఁచిరాఁదిగిచి కన్నీరొల్కగా నిట్లనున్"

("శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచన నైషధః")

మిశ్రములు.

"అటజనికాంచె భూమిసురుఁడంబర చుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠ దభంగతరంగమృదంగనిస్వన
స్ఫుటనటనానురూప పరిఫుల్లకలాప కలాపిజాలముం
గటక చరత్కరేణుకర కంపితసాలము శీతశైలమున్"

(మనుచరిత్రము)

"ఏనుహితంబుఁజెప్ప నిటు లేచి దురాచారణంబు లిమ్మెయిన్
మానవు, రోగిచేదయిన మందుదనుం దెవులంటఁ దాకినం
గానియెఱుంగడప్డు ప్రతికారముగల్గునె యట్లువోలెనీ
డైన నికృష్టవృత్తి ఫలమంది తలంచెదుగాక పిమ్మటన్"

(నిర్వచనోత్తర రామాయణం)

☞ నీతి చంద్రికలోని ఈక్రిందిభాగమును గైకొని, యిందలి సంస్కృత సంస్కృతేతరపదములు సకారణముగాఁ జూపెదము.

'అని వీణాకర్ణుఁడు చెప్పఁగా విని చూడాకర్ణుఁడు తడవులఁబట్టి యీ యెలుక యిక్కడ నొక లాఁగ తావుచేసికొని విడువక వాసము చేయుచున్నది. ఇట్లు వసించుటకు నిమిత్తము తెలిసినదికాదు. త్రవ్విచూచెదఁ గాక యని చెప్పి యొక గుద్దలితో నేను వసించు వివరము త్రవ్వి చిరకాలార్జితమయిన నా ధనము సర్వము గ్రహించెను. తరువాత సత్త్వోత్సాహములు లేక నానాఁడాహారము సయితము సంపాదించుకొనఁజాలక దిగులు పడి కృశించి మెల్లమెల్లఁగా సంచరించుచుండఁగాఁ జూచి చూడాకర్ణుఁ డిట్లనియె. ధనముగలవాఁడె బలవంతుఁడు, ధనముగలవాఁడె పండితుఁడు, ధనము సర్వశ్రేయములకు నిదానము, ధనము లేనివాని జీవనమేల? ఈ మూషికము తన ధనము కోలుపోయికదా తొంటి జవసత్త్వములుడిగి స్వజాతిసామ్యమును బొందెను! (నీతిచంద్రిక మిత్రలాభము.)

(1) అని = అను ధాతువు. ధాతువుతో నించుగాగమము లేదు గావు నం దెనుఁగు. 2 వీడాకర్ణుఁడు = ఇది సంజ్ఞ. ఇదియే భాష యనుకొన్నను దోషము లేదు. కాని దీని యవయవములగు వీణాశబ్దము, కర్ణశబ్దమును సంస్కృతములే. 3 చెప్పన్, కాన్, విని = ఇవి చెప్పు, అగు, విను అను ధాతువులు. ఇంచుగాగమము లేదుగావునఁ దెలుఁగు. 4 చూడాకర్ణుఁడు = వీణాకర్ణునివలెనే 5. తడవులంబట్టి = తడవులు, తెలుఁగు. ఇది గుణము లేనిది. పట్టి = పట్టుధాతువు. 6. ఈ యెలుక = ఈ = సర్వనామము కావునఁ దెలుఁగు. ఎలుక=హ్రస్వ ఎకారమున్నది.గావున దెనుగుఁ 7 ఇక్కడ ఈ + కడ = ఇక్కడ, ఈశబ్దముతో సమసించినది గావునఁ దెనుఁగు. 8 ఒక = హ్రస్వ ఒకారమున్నది గావునఁ దెలుఁగు 9 లాఁగ = అరసున్న యున్నది గావునఁ దెనుఁగు 10 తావు = తెనుఁగు. గుణము లేదు. 11 చేసికొని = చేయుధాతువు, కొనుధాతువు తెలుఁగు. 12 విడువక = విడుచు ధాతువు తెనుఁగు. 13 వాసము = సంస్కృతము గుణము లేదు. 14 చేయుచున్నది = చేయుధాతువు తెనుఁగు. 15 ఇట్లు = యీశబ్దములోనుండి పుట్టిన అవ్యయము తెలుఁగు. 16 వసించుటకు = వసించుధాతువు ఇంచుగాగమమున్నది గావున సంస్కృతము, 17 నిమిత్తము = ని = ఉపసర్గ యున్నది గావున సంస్కృతము. 18 తెలిసినది = హ్రస్వ ఎకారమున్నదికావునను, మఱియుఁ దెలియుఁ ధాతువు గావునను దెనుఁగు. 19 కాదు = అగుధాతువు తెలుఁగు. 20 త్రిప్పి, చూచెదన్, కాక, అని చెప్పి = తెలుఁగు ధాతువులు. 21 ఒక హ్రస్వ ఒకారమున్నది గావునఁ దెలుఁగు. 22 గుద్దలితో = గుద్దాలశబ్ద తద్భవముగాన తెనుఁగు. 23 నేను = సర్వనామము గావునఁ దెనుఁగు. 24 వసించు = ధాతువు. సంస్కృతము. 25 వినరము = 'వి' ఉపసర్గ సంస్కృతము. 26 త్రవ్వి = త్రవ్వు ధాతువు. తెలుఁగు. 27 చిరకాలోపార్జితము = దీర్ఘసమాసము. సంస్కృతము. ఇందులోని చిరకాల దశ మొదలగు శబ్దములు మఱియొకచోట వచ్చినను సంస్కృతములే యని తెలియునగును. 28

ఆయన = అగు ధాతువు తెలుఁగు. 23 నా = సర్వనామము తెలుఁగు. 39 ధనము = ధ, వత్తున్నదిగావున సంస్కృతము. 31 సర్వము = గురుతులేదు. సంస్కృతము. 32 గ్రహించెను = గ్రహించు ధాతువు సంస్కృతము. 33 తరువాత = గుఱుతులేదు తెలుఁగు. 34 సత్సోత్సాహములు = ఉత్సాహ శబ్దములో, ఉత్. ఉపసర్గముగావున సమాసమంతయు సంస్కృతమే. 35 లేక = కలుగుధాతువు తెలుఁగు 36 ఆనాఁడు = ఆసర్వనామమగుటచేతను నాఁడులో అరసున్న యుండుటచేతను, తెలుఁగు, 37 ఆహారము = ఉపసర్గ. సంస్కృతము. 38 సయితము = సహితశబ్దతద్భవము తెలుఁగు. 39 సంపాదించు సం = ఉపసర్గ, మఱియు, ఇంచుగాగమము గల ధాతువు కావున సంస్కృతము. 40 కొఱకున్ = హ్రస్వ ఒకారము తెలుఁగు 41 చాలక = చాలు ధాతువు తెలుఁగు. 42 దిగులు = గుఱుతు లేదు. తెలుఁగు 43 పడి = పడుధాతువు తెలుఁగు. 44 కృశించి = ఋకార శవర్ణ ఇంచుగాగమములు గలది కావున సంస్కృతము. 46 మెల్ల మెల్లగా = హ్రస్వ ఎకారముగావున తెలుఁగు. 46 కాన్ = అగుధాతువు తెలుఁగు. 47 సంచరించుచు = సంచరించు = సం ఉపసర్గ, ఇంచుగాగమధాతువుకాఁబట్టి సంస్కృతము. 48 ఉండఁగాన్ = ఉండు, ఆగుధాతువులు తెలుఁగు. 49 చూచి = చూచుధాతువు తెలుఁగు. 50 చూడాకర్ణుఁడు = ఇది సంజ్ఞ వెనుకటివలెనే 51 ఇట్లు ఈశబ్దములోనుండి పుట్టిన అవ్యయము తెలుఁగు. 52 అనియె = అనుధాతువు తెలుఁగు. 53 ధనము = 'ధ' వత్తుగావున సంస్కృతము 54 కలవాఁడే = కల. కలుగుధాతువు. తె. వాఁడు = ఆ = సర్వనామశబ్దము. తె. ఎ = హ్రస్వ ఎకారము తెలుఁగు. 55 బలవంతుఁడు = సంస్కృతముగుఱుతు లేదు. 56 ధనము = పూర్వమువలెనే. 57 కలవాఁడె = పూర్వము వలెనే. 58 పండితుఁడు = గురుతు లేదు సంస్కృతము. 59 ధనము = పూర్వమువలెనే. 60 సర్వ శ్రేయములకున్ = శవర్ణముగల శ్రేయశ్శబ్దముతో సమాసముగావున నంతయు సంస్కృతము. 61 నిదానము = 'ని' ఉపసర్గకావున

సంస్కృతము. 62 ధనము = పూర్వమువలెనే 63 లేనివాఁడు = లేని = కలుగుధాతువు తెలుఁగు. వాఁడు = తొల్లింటి వలెనే. 64 జీవనము = గురుతు లేదు, సంస్కృతము. 65 ఏల = ఏ శబ్దములోనుండి పుట్టినది కావునఁ దెనుఁగు. 66 ఈ = ఈశబ్దము తెలుఁగు. 67 మూషికము = షకారమున్నది కావున సంస్కృతము. 58 తన = తాశబ్దము తెనుఁగు. 69 ధనము = పూర్వమువలెనె. 70 తోలుపోయి = నిత్యసమాసము పోవుధాతువు తెనుఁగు. 71 కదా = గురుతు లేదు, తెలుఁగు. 72 తొంటి = హ్రస్వ ఒకారమున్నది గావున తెలుఁగు. 73 జవసత్త్వములు = జవ = జకారము, అకారముతోఁ గూడుకొనియుండుటవలన నీసమాస మంతయు సంస్కృతమే. 74 ఉడిగి = ఉడుగుధాతువు తెలుఁగు 65 స్వజాతిసామ్యమును = "జా" ఆకారముతోఁ గూడుకొనియుండుట వలనచే సమాసమంతయు సంస్కృతమే. 76 పొందెను = హ్రస్వ ఒకారము. పొందుధాతువు, ఉన్నది కావునఁ దెలుఁగు.

---

## Exercises.

### I

"పింగళకుం డొల్లి సేవించుచుండి కాటకపాటకంబులను రెండు జంబుకంబులు కృతాపరాధంబులగుటంజేసి నిష్కాసితంబులయ్యె. అయ్యవి వెండియు నేని యనుగ్రహంబు సంపాదింపగోరి సంజీవకు ననుసరించుచున్నయవి. ఇదియు మదీయోద్యోగంబున కనుకూలంబయి కానంబడుచున్నయది. సెలవిమ్ము పోయివచ్చెద." (నీతిచంద్రిక-మిత్రలాభము)

☞ ఇందలి సంస్కృతశబ్దములను దెలుఁగుశబ్దములను విడఁదీయుఁడు.

### II

"ఒక్క జలాశయంబునం దనాగతవిధాతయుఁ బ్రత్యుత్పన్నమతియు యద్భవిష్యంబునని మూఁడు మత్స్యంబులు వసించుచుండు. ఒక్కనాఁ డనాగత

విధాతపరిత్యక్తపన్న మతి యద్భవిష్యంబులం గాంచి యీయేఁడింతనఱకు వాన లేబరంబయ్యె" (నీతిచంద్రిక—మిత్రభేదము)

☞ ఇందలి సంస్కృతశబ్దములను దెనుఁగుశబ్దములను విడఁదీయుఁడు.

III

"బదరికా వనంబునందు సాహోదంబను కాసారంబుగలదు. అక్కడి కొక్క ముసలి కొక్కెరవచ్చి నయనంబులు నిమీలించి యాహారంబు మాని దుష్కరంబయిన తపంబు చేయువానివలె నొంటికాలితో నిలువంబడి యుండెను. (నీతిచంద్రిక-మిత్రభేదము)

☞ ఇందలి సంస్కృతశబ్దములను దెలుఁగుశబ్దములను విడఁదీయుఁడు.

IV

"అనినఁ గరటకుండు నీకుఁ గార్యసిద్ధిఁ గావుత. అదె తేఁడును, మగలి తన యిరవునకుఁ జనుచున్నవాఁడు. ఆతఁడిరవుఁ జేరునంతకుఁ నీవుం బోయి చాకొనవచ్చుఁబొమ్ము." (నీతిచంద్రిక-మిత్రభేదము)

☞ ఇందలిసంస్కృతశబ్దములను దెలుఁగుశబ్దములను విడఁదీయుఁడు.

---

# CHAPTER V.

## HINTS ON SANSCRIT SANDHI.

### సంస్కృతసంధి.

సంస్కృతభాష స్వర ప్రధానమైనభాష. అందలి సంధులన్నియు తెలుగుభాషలోని సంధులవలె కృతకములుగాక, ధ్వనిశాస్త్ర సంప్రదాయవర్ధకములుగా నుండును. సక్రమ శబ్దోచ్చారణమున నాసంధులు సూత్రములతో నిమిత్తములేకుండ యధారూపముగానే యలవడును.

ఉదా. రామ + అనుజః = రామానుజః.

### సంధి.

అచ్సంధి, హల్సంధి, విసర్గసంధి, ప్రకృతిభావసంధి, స్వాదిసంధి— అని సంధు లయిదు విధంబులు.

### అచ్సంధి.

1 సవర్ణ దీర్ఘసంధి— హ్రస్వదీర్ఘంబులయిన అ, ఇ, ఉ, ఋ, ౡ, వర్ణకంబులకు (సవర్ణములు) అనగా మరల నవియే పరమగునపుడు పూర్వ పర బనంబులకు దీర్ఘంబగు. సవర్ణ మనగా ఏకస్థానమున బుట్టినది.

అఆ + అఆ=ఆ, ఉదా: నిరూఢ + ఆత్ముండు=నిరూఢాత్ముండు,

ఇఈ + ఈఈ=ఈ ఉదా-ఋషి + ఈశ్వర=ఋషీశ్వర.

ఉఊ + ఉఊ=ఊ- ఉ పృథు + ఊరువు=పృథూరువు.

ఋౠ + ఋౠ—ౠ. ఉదా, పితృ, ఋణము=పితౄణము.

2 గుణసంధి—అకారమునకు హ్రస్వదీర్ఘంబులైన-ఇ = ఉ-ఋ-ౡ- వర్ణకంబులు పరంబు లగునపుడు వరుసగా ఏ - ఓ - అర్ - వర్ణకంబులా దేశంబులగు. ఏ, ఓ లకు గుణ మని పేరు.

అఆ ఇఈ=ఏ-ఉదా, నర, ఈశ్వరుడు=నరేశ్వరుడు

అఆ + ఉఊ=ఓ. ఉదా, నృప, ఉత్తముడు=నృపోత్తముడు

అఆ + ఋౠ=అర్, ఉదా, సప్త + ఋషి=సప్తర్షి

అఆ + ఌౡ=అల్-ఉదా, తవ, ఌకారః=తవల్కారః

3 వృద్ధిసంధి— అకారమునకు-ఏఐ-ఓఔ-లు పరములగు నపుడు క్రమముగా ఐ-ఔ లాదేశంబులగు. ఐ, ఔ లకు వృద్ధియని పేరు.

అఆ + ఏఐ=ఐ. ఉదా. దళిత. ఏన=దళితైన

అఆ + ఓఔ=ఔ-ఉదా=దివ, ఓకసులు=దివౌకసులు.

4 యణాదేశసంధి— ఇఉ ఋ-ఌ వర్ణకంబులకు సవర్ణము లుకాని వర్ణకములు పరములగునపుడు యర-ల వర్ణకంబులాదేశంబులగు. య, ర, ల, వ లకు "యణ్"అని పేరు.

ఉదా—ప్రతి, అర్థి=ప్రత్యర్థి, విష్ణు, అంశము = విష్ణ్వంశము, ధాతృ అంశము=ధాత్రంశము-ఌ, ఆకృతి=లాకృతి.

---

## అచ్సంధివివరణము.

## అ. ఆ.

అ + అ=ఆ

ఉదా— రామ + అనుజః = రామానుజః.

అ+ఆ=ఆ

స్వరూప+ఆనంద = స్వరూపానంద.

ఆ+అ=ఆ

అంగనా+అనుషంగ = అంగనానుషంగ

అ+ఇ=ఏ

ఉప+ఇంద్ర = ఉపేంద్ర

అ+ఈ

దేవ+ఈశ = దేవేశ

ఆ+ఇ = ఏ

గంగా + ఇష్ట = గేంగష్ట, రమా + ఈశః = రమేశః

అ+ఉ = ఓ

గంగ + ఉదకం = గంగోదకం

అ + ఊ = ఓ

వామ + ఊరు = వామోరు

ఆ + ఉ, ఊ

రమా + ఉదయ = రమోదయ, నాగవాసా + ఊరు = నాగవాసోరు

అ + ఋ=ఎ

కృష్ణ + ఋద్ధి = కృష్ణర్ధి

అ + ౠ = ౡ

మమ + ౠకారేణ = మమర్కారేణ

అ, ఆ + ఋ, ౠ

రమా + ఋకారేణ = రమర్కారేణ

రమా + ౠకారేణ = రమర్కారేణ

అ + ఌ = ల్

తవ + ఌకార = తవల్కార

అ + ౡ =

ఇహా + ౡకారేణ = ఇహాల్కారేణ.

అ + ఏ = ఐ

తవ + ఏషా = తవైషా. కృష్ణ + ఏకత్వం = కృష్ణైకత్వం

అ + ఐ = ఐ

దేవ + ఐశ్వర్యం = దేవైశ్వర్యం;

## ఆ

ఆ + ఏ = ఐ

సా + ఏవ = సైషా; సా + ఐంద్రీ = సైంద్రీ.

అ + ఓ = ఔ

సోమ + ఓషధి = సోమౌషధి;

అ + ఔ = ఔ

పరమ + ఔషధం = పరమౌషధం;

ఆ, ఓ; ఔ = ఔ

గంగా + ఓఘ = గంగౌఘ, శాఖా + ఔన్నత్యం = శాఖౌన్నత్యం.

## ఇ, ఈ

ఇ + అ, ఆ = య

దధి + ఆత్రి = దధ్యాత్రి; కృషి + ఆరంభ = కృష్యారంభ.

ఈ + అ, ఆ = య

గౌరీ + అంక = గౌర్యంక; కుమారీ + ఆలాప = కుమార్యాలాప

ఇ, ఇ, ఈ + ఈ

కరి + ఇంద్ర = కరీంద్ర; గిరి + ఈశ = గిరీశ

ఈ + ఇ, ఈ = ఈ

మహీ + ఇయం = మహీయం, క్షోణీ + ఈశ్వరః = క్షోణీశ్వరః

ఇ + ఉ, ఊ = య

యది + ఉత్తిష్ఠసి = యద్యుత్తిష్ఠసి;

అతి + ఊషర = అత్యూషర

ఈ + ఉ, ఊ = య

నదీ + ఉద్ఘోషః = నద్యుద్ఘోషః వేణీ + ఊనా = వేణ్యూనా

ఇ + ఋ, ౠ, ఌ, ౡ = య

మతి + ఋక్షః = మత్యృక్షః
కతి + ౠకారాః = కత్యౄకారాః

ఇ + ఌ ౡ

గతి + ఌ కారేణ = గత్యౢకారేణ
ఇతి + ౡ దంతా = ఇత్యౣదంతా

ఈ ౡ

ఈ + ఋ, ౠ, ఌ, ౡ = య

నదీ + ఋచ్ఛతి = నద్యృచ్ఛతి

ఇ + ఏ, ఐ, ఓ, ఔ = య

ఇతి + ఏవం = ఇత్యేవం
అతి + ఐశ్వర్యం = అత్యైశ్వర్యం
గిరి + ఓషధయః = గిర్యోషధయః
కవి + ఔపాసనం = కవ్యౌపాసనం

ఈ + ఏ, ఐ, ఓ, ఔ = య

వాణీ + ఏకా = వాణ్యేకా
దేవీ + ఐక్యం = దేవ్యైక్యం
కుమారీ + ఓష్ఠః = కుమార్యోష్ఠః
వేణీ + ఔపమ్యం = వేణ్యౌపమ్యం

## ఉ, ఊ.

ఉ + అ, ఆ, ఇ, ఈ = వ.

మధు + అరిః = మధ్వరిః.
ప్రభు + ఆశ్రయః = ప్రభ్వాశ్రయః.
మధు + ఇష్టః = మధ్విష్టః.

లఘు + ఈక్షణం = లఘ్వీక్షణం.

ఊ అ, + ఆ, ఇ ఈ = వ.

స్వయంభూ + అర్చనం = స్వయంభ్వర్చనం.

వధూ + ఆననం - వధ్వాననం.

తనూ + ఇవవః = తన్విచవః

దృంభూ + ఈక్షణం = దృంభ్వీక్షణం

ఉ + ఉ ఊ = ఊ

విష్ణు + ఉదయః = విష్ణూదయః

తరు + ఊఢః = తరూఢః

ఊ + ఉ ఊ = ఊ

తనూ + ఉచితా = తనూచితా

ఉ + ఋ, ౠ, ఌ, ౡ, ఎఐ, ఓ, ఔ = వ

తను + ఋణం = తన్వృణం

బహు + ఎన = బహ్వెన

ధేను + ఐశ్వర్యం = ధేన్వైశ్వర్యం

మంజు + ఓష్ఠః = మంజ్వోష్ఠః;

చారు + ఔషధం = చార్వౌషధం

ఊ + ఋ, ౠ. ఌ, ౡ. ఎ, ఐ, ఓ, ఔ = వ

## ఋ, ౠ.

ఋ + అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ = రేఫ (ర)

ధాతృ + అంశః = ధాత్రంశః

జామాతృ + ఆగమః = జామాత్రాగమః

భర్తృ + ఇచ్ఛా = భర్త్రిచ్ఛా

పితృ + ఈప్సితం = పిత్రీప్సితం

మాతృ + ఉత్పన్నః = మాత్రుత్పన్నః

పితృ + ఊర్ధ్వం = పిత్రూర్ధ్వం

N. B. ఋూకారములకు, అ ఆ, ఇ ఈ, ఉ ఊ. అపరమైనపు ముల్లేయగును.

ఋ + ఋ = ఋ, ఋూ

హోతృ + ఋకారః = హోతౄకార, హోతృకారః

జ్ఞాతృ + ఋణం = జ్ఞాతౄణం, జ్ఞాతృణం

పితృ + ఋణం = పితౄణం

ఋ + ఋ = ఋూ

కృ + ఋూకారేణ = కౄకారేణ

ఋఌ = ఋూ (లేక) ఌూ

హోతృ + ఌకార = హోతౄకార

ఌ

ఋ + ఎ, ఐ, ఓ, ఔ = రేఫ

పితృ + ఎకః = పిత్రేకః

ధాతృ + ఐక్యం = ధాత్రైక్యం

భ్రాతృ + ఓదనః = భ్రాత్రోదనః

పితృ + ఔర్ధ్వదేహికం = పిత్రౌర్ధ్వదేహికం

N. B. ఋూ + ఎ, ఐ, ఓ, అవులు నిట్లేయగును.

ఌ

ఌ + అ = ల

ఌ + అయం = లయం

ఎ

ఎ + అ = ఎ

హారే + అవ = హారేవ

ఎ + అ = అయ్

హారే + అః = హారయః

ఏ + ఆ = అయ్, ఇది వికల్పము

గృహే + ఆగతః = గృహయాగత, గృహాఆగత

హారే + ఇహా = హారయిహా, హారఇహా

అరే + ఈశః = అరయీశః, అరఈశః
హారే + ఈదృశీ = హారయీదృశీ, హారఈదృశీ
గృహే + ఉత్సవః = గృహయుత్సవః. గృహఉత్సవః
స్థలే + ఊషరః = స్థలయూషర, స్థలఊషర
స్వర్గే + ఋభవః = స్వర్గయృభవః స్వర్గఋభవః
ఏతే + ౠవర్ణాః = ఏతయౄవర్ణాః ఏతౠవర్ణాః
ఇమే + ఌకారాః = ఇమయ్లకారాః, ఇమఌకారాః
ౡ
హారే + ఏహ = హారయేహ, హారఏహ
జనే + ఐకమత్యం = జనఐకమత్యం
జలే + ఓదనః = జలయోదనః జలఓదనః
ముఖే + ఔత్సుక్యం = ముఖయౌత్సుక్యం, ముఖఔత్సుక్యం

## ఐ

ఐ + అ, ఆ. ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఏఐ, ఓఔ = ఆయ్ వికల్పము.

తస్మై + అఖిలం = తస్మాయఖిలం, తస్మాఅఖిలం
తస్మై + ఆసనం = తస్మాయాసనం, తస్మాఆసనం
యస్మై + ఇదం = యస్మాయిదం, యస్మాఇదం
కస్మై + ఇష్టం = కస్మాయిష్టం. కస్మాఇష్టం
తస్యై + ఇతి = తస్యాయితి, తస్యాఇతి
ధృత్యై + ఈహతే = ధృత్యాయీహతే, ధృత్యాఈహతే
శ్రియై + ఉద్యతః = శ్రియాయుద్యతః శ్రియాఉద్యతః
శ్రియై + ఊర్మికా = శ్రియాయూర్మికా, శ్రియాఊర్మికా
స్థిత్యై + ఊతం = స్థిత్యాయూతం, స్థిత్యాఊతం
హాస్యై + ఋణం = హాస్యాయృణం, హాస్యాఋణం.
శ్రియై + ఏవః = శ్రియాయేవః, శ్రియాఏవః
పుష్ట్యై + ఇంద్రిం = పుష్ట్యాయైంద్రిం, పుష్ట్యాఐంద్రిం
తస్మై + ఐచ్ఛికం = తస్మాయైచ్ఛికం, తస్మాఐచ్ఛికం
పుష్ట్యై + ఓదనః = పుష్ట్యాయోదనః పుష్ట్యాఓదనః

రజ్నివృత్త్యై + ఔషధం = రజ్నివృత్త్యాయౌషధం
రజ్నివృత్త్యాఅవుషధం

శుచ్యై + ఔపాసనం = శుచ్యాయౌపాసనం
శుచ్యాఔపాసనం

## ఓ

ఓ + అ=ఓ

N. B. పదాంతముల విషయమున మఱికొన్నిచోట్ల అవ్ ఆనే ఆదేశము వచ్చును.

గురో + అభివాదయె = గురోభివాదయె

గురో + అః = గురవః

వైష్ణో + అం - వైష్ణవం

ఓ + అ.........ఐ=అవ్, అవ్‌లోని వ వికల్పముగా లోపించును.

గురో + ఆనమామి = గురవానమామి. గురఆనమామి

విష్ణో + ఇహ = విష్ణవిహ, విష్ణఇహ

కృశానో + ఇంధనం = కృశానవింధనం, కృశానఇంధనం

శంభో + ఈషత్ = శంభవీషత్, శంభయీషత్

విష్ణో + ఉత్సారయ = విష్ణ వుత్సారయ, విష్ణఉత్సారయ

గురో + ఊర్మయ = గురవూర్మయ, గురఊర్మయ

వటో + ఋక్షః = వటవృక్షః, వటఋక్షః

గురో + ఋణం = గురవృణం, గురఋణం

విష్ణో + ఎహి = విష్ణవేహి, విష్ణఎహి

గో + ఐశ్వర్యం = గవైశ్వర్యం, గఐశ్వర్యం

విష్ణో + ఓదనః = విష్ణవోదనః, విష్ణఓదనః

సూనో + ఔషధం = సునవౌషధం, సూనఅవుషధం

## ఔ

ఔ + అ.........ఐ = అవ్, ఆదేశ వకారమునకు లోపమువికల్పము.

బుద్ధౌ + అమితః = బుద్ధావమితః, బుద్ధాఅమితః

తౌ + ఆక్రాంతౌ = తావాక్రాంతౌ, తాఆక్రాంతౌ

అసౌ + ఇంద్రః = అసావింద్రః, అసాఇంద్రః

కరౌ + ఈదృశౌ = కరావీదృశౌ, కరాఈదృశౌ

హరౌ + ఉద్యత = హరావుద్యత, హరాఉద్యత

కుచౌ + ఊర్ధ్వగౌ = కుచావూర్ధ్వగౌ, కుచాఊర్ధ్వగౌ

కృతౌ + ఋకారః = కృతావృకారః కృతాఋకారః

పఙ్క్తౌ + ౠకారౌ = పఙ్క్తావౄకారౌ, పఙ్క్తాౠకారౌ

క్లృప్తౌ + ఌకారః = క్లృప్తావ్లృకారః, క్లృప్తాఌకారః

నరౌ + ఏతౌ = నరావేతౌ, నరాఏతౌ

గజౌ + ఐంద్రౌ = గజావైంద్రౌ, గజాఐంద్రౌ

భూమౌ + ఓషధిః = భూమావోషధిః భూమాఓషధిః

రిపౌ + ఔద్ధత్యం = రిపావౌద్ధత్యం, రిపాఔద్ధత్యం.

## Exceptions.

### నిపాతలు.

సార + అంగః = సారంగః (పశువు, పక్షి) సారాంగము (అన్యము)

సీమ + అంతః = సీమంతః (కొప్పు) సీమాంత (అన్యము)

శక + అంధుః = శకంధుః

కుల + అటా = కులటా

పటత్ + ఇతి = పటితి

పటత్ + పటత్ + ఇతి = పటత్పటేతి

హాల + ఈషా = హాలీషా

స్వ + ఈరం = స్వైరం

ప్ర + ఊఢః = ప్రౌఢః

ప్రష్ఠ + ఊహః = ప్రష్ఠౌహః

ప్ర + ఋణం = ప్రార్ణం

దశ + ఋణః = దశార్ణః

శివ + ఏహి = శివేహి

బింబ + ఓష్ఠః = బింబోష్ఠః, బింబౌష్ఠః

గో + అక్షః = గవాక్షః

గో + ఇంద్రః = గవేంద్రః

అహో, అహో. ఉతాహో, హోహో, హాహో, అహో, భో, నో, ఇవి ఓకారాంత నిపాతలు.

నిపాతలనగా, ధాతుప్రత్యయ వివేచనలేని శబ్దములు.

## ప్రకృతి భావ సంధి.

ప్రకృతి భావమనగా, పూర్వాపర వర్ణములు అచ్చులుగా నున్నప్పటికిని సంధిని బొందక యున్న రూపములున్నట్లే యుండుట.

ఓకారాంత నిపాతలు. అ, ఆ, ఇ, ఉ, యా, ఏకాక్షర నిపాతలు. ఇవియన్నియు స్వరములు పరముకాగా ప్రకృతి భావమును పొందును. ఔకారమును బొందని ద్వివచనాంతములు అచ్చుపరముకాగా ప్రకృతి భావమును బొందును.

## ప్రకృతిభావము వికల్పము.

మణీ + ఇవ = మణీవ, మణీఇవ

దంపతీ + ఇవ = దంపతీవ, దంపతీఇవ

జంపతీ + ఇవ = జంపతీవ, జంపతీఇవ

అముకే + అత్రతిష్ఠతః = అముకేత్రతిష్ఠతః
ప్లుతములకు అచ్చులు పరముకాగా ప్రకృతిభావము వచ్చును.

## హల్సంధి.

సకారమునకును శవర్ణమునకును శకారమును చవర్గమును బరంబులగునపుడు వానికిం గ్రమముగా శవర్గ చవర్గము లాదేశములగు ఉ — తపస్ + శక్తి= తపశ్శక్తి, శిరస్ + ఛేదము=శిరశ్ఛేదము. సుహృత్ + జనుఁడు=సుహృజ్జనుఁడు.

2 సకార-తవర్గములకు షకార - టవర్గములు పరంబులగునపుడు వానికి గ్రమముగా షకార టవర్గము లాదేశములగు. ఉ—మనస్ + షట్పదము= మనష్షట్పదము, ధనుస్ + టంకారము= ధనుష్టంకారము, తత్ + టీక=తట్టీక.

3 తవర్గమునకు లకారము పరమగునపుడు లకారంబాదేశంబగు.
ఉ॥ విద్యుత్ + లత=విద్యుల్లత.

4 వర్గములయందు మొదటి నాల్గక్షరములలో దేనికయిననొక అనునాసికవర్ణము పరంబగునపుడు ఆ (పూర్వ) వర్ణంబున కావర్ణముండునట్టి వర్గముయొక్క అనునాసికము వైకల్పికముగా నాదేశంబగు.

ఉ॥ వాక్ + మయము=వాఙ్మయము, వక్ష్యమాణవిధిచే వాగ్మయము.

5 పరుషములకు అచ్చులుగాని, అనునాసికములుగాని గఘ జఝ డఢ దధ బభ హ యవలర వర్ణములు గాని, పరము లగునపుడు సరళములాదేశంబులగు ఉ॥ షడ్ + మాసము=షణ్మాసము, భవిష్యత్ + భారతము =భవిష్యద్భారతము.

6 హ్రస్వముకంటెఁ బరంబయిన ఛకారమునకుముందు చకారాగమంబగు, ఉ॥ తను + ఛాయ=తనుచ్ఛాయ.

7 పదాంతంబగు దీర్ఘముకంటెఁ బరంబగు ఛకారమునకు ముందు

చకారాగమము వైకల్పికము - ఉ—మాయా + ఛలము=మాయాఛలము, మాయాచ్ఛలము.

8 అను నాసికవర్ణములు కాబట్టి స్పర్శాక్షరములకంటె పరమయిన శవర్ణమునకు అచ్చులుగాని, హ-య-వ-ర-ల-వర్ణములుగాని, పరములగు నపుడు ఛకారము వికల్పముగా నాదేశమగు ఉ॥ దిక్ + శబ్దము=దిక్ఛబ్దము-దిక్శబ్దము.

## హా ల్స ం ధి వి వ ర ము .

ఇందులో అచ్ సంధిలో అకారము మొదలుకొని, అన్ని అచ్చులకు వ్రాసినట్లు వ్రాయుటకు వీలులేదు.

కాబట్టి యే అక్షరములు సంధివల్ల ప్రయోగములయందు సంధివల్ల బుట్టిన వికారమును బొందుచున్నవో అవి మాత్రమే ఉదాహరింప బడుచున్నవి.

(1) వాక్ + అత్ర = వాగత్ర
వాక్ + జయతి = వాగ్జయతి
అచ్ + అత్ర = అజత్ర
అచ్ + గచ్ఛతి = అజ్గచ్ఛతి
షట్ + అత్ర = షడత్ర
తత్ + అత్ర = తదత్ర
తత్ + గచ్ఛతి = తద్గచ్ఛతి
కకుప్ + ఆస్తె = కకుబాస్తె
కకుప్ + జయతి = కకుబ్జయతి

## వి క ల్ప స ం ధు లు .

(2) వాక్ + మతిః = వాగ్మతిః, వాఙ్మతిః
అచ్ + మాత్రా = అజ్మాత్రా, అఞ్మాత్రా
షట్ + ముఖాని = షడ్ముఖాని, షణ్ముఖాని

తత్ + నయనం = తద్న్నయనం, తన్నయనం

విద్యుత్ + మాలా = విద్యుద్మాలా. విద్యున్మాలా

త్రిష్టుప్ + మినోతి = త్రిష్టుబ్మినోతి, త్రిష్టుమ్మినోతి

(3) వాక్ + శూరః = వాక్ఛూరః, వాక్శూరః

అచ్ + శేషః = అచ్ఛేషః, అచ్శేషః

షట్ + శ్యామాః = షట్ఛ్యామాః, షట్శ్యామాః

(4) తత్ + శ్వేతం = తచ్ఛ్వేతం, తచ్శ్వేతం

తత్ + శ్లక్ష్ణం = తచ్ఛ్లక్ష్ణం. తచ్శ్లక్ష్ణం

తత్ + శ్మశ్రు = తచ్ఛ్మశ్రు, తచ్శ్మశ్రు

(5) వాక్ + హరిః = వాగ్ఘరిః వాగ్హరిః

అచ్ + హలౌ = అజ్ఝలౌ, అజ్హలౌ

షట్ + హలాని = షడ్ఢలాని, షడ్హలాని

తత్ + హితం = తద్ధితం, తద్హితం

కకుప్ + హాసః = కకుబ్భాసః, కకుబ్హాసః

(6) తత్ + లునాతి = తల్లునాతి

తత్ + చరతి = తచ్చరతి

తత్ + ఛాదయతి = తచ్ఛాదయతి

తత్ + జయతి = తజ్జయతి

తత్ + ఝాషయతి = తజ్ఝాషయతి

తత్ + ఞకారేణ = తఞ్ఞకారేణ

తత్ + టీకసే = తట్టీకసే

తత్ + ఠకారేణ = తట్ఠకారేణ

తత్ + డీనం = తడ్డీనం

తత్ + ఢౌకతే = తడ్ఢౌకతే

తత్ + ణకారేణ = తణ్ణకారేణ

(7) కఙ్ + ఆస్తే = కఙ్ఙాస్తే

సుగణ్ + అత్ర = సుగణ్ణత్ర

పచన్ + ఇహ = పచన్నిహ
కృషన్ + ఆస్తే = కృషన్నాస్తే
(8) భవాన్ + చరతి = భవాంశ్చరతి
భవాన్ + చంద్రః = భవాంశ్చంద్రః
భవాన్ + ఛాదయతి = భవాంశ్ఛాదయతి
(9) సన్ + సః = సన్త్సః, సన్సః
భవాన్ + సత్వరం = భవాన్త్సత్వరం, భవాన్సత్వరం
(10) భవాన్ + టీకతే = భవాంష్టీకతే
భవాన్ + ఠకారేణ = భవాంష్ఠకారేణ
(11) భగవన్ + తనోషి = భగవంస్తనోషి
భవాన్ + థుటతి = భవాంస్థుటతి
(12) భవాన్ + లిఖతి = భవాల్లిఖతి
భవాన్ + లునాతి = భవాల్లునాతి
(13) భవాన్ + జయతి = భవాఞ్జయతి
భవాన్ + ఝూషయతి = భవాఞ్ఝూషయతి
భవాన్ + ఞకారేణ = భవాఞ్ఞకారేణ
భవాన్ + శేతే = భవాఞ్శేతే
కుర్వన్ + శూరః = కుర్వఞ్ఛ్ఛూరః, కుర్వఞ్శూరః
(14) భవాన్ + డీనః = భవాణ్డీనః
భవాన్ + ఢౌకతే = భవాణ్ఢౌకతే
భవాన్ + ణకారేణ = భవాణ్ణకారేణ
(15) త్వమ్ + శంసని = త్వంశంసని
త్వమ్ + సమర్థః = త్వంసమర్థః
త్వమ్ + రమసె = త్వంరమసె

N. B. పదాంతమందుండు మకారము వికల్పముగా అనుస్వారమును బొందును.

(16) దేవమ్ = దేవం, దేవమ్

పురుషాణాం = పురుషాణాం, పురుషాణాం

(17) త్వమ్ + కరోషి = త్వఙ్కరోషి, త్వంకరోషి

త్వమ్ + చరసి = త్వఞ్చరసి, త్వంచరసి

త్వమ్ + టీకసే = త్వణ్టీకసె, త్వంటీకసె

త్వమ్ + తరసి = త్వన్తరసి, త్వంతరసి

త్వమ్ + పచసి = త్వమ్పచసి, త్వంపచసి

త్వమ్ + పఠసి = త్వమ్పఠసి, త్వంపఠసి

(18) సమ్ + యంతా = సంయంతా, సయ్యంతా

యమ్ + లోకం = యంలోకం, యల్లోకం

సమ్ + వత్సరః = సంవత్సరః, సంవ్వత్సరః

(19) షట్ + సంతః = షత్త్సాంతః, షట్సాంతః

(20) షట్ + సంతః = షత్త్సాంతః, షట్సాంతః

దేవేట్ + సదృశః = దేవేట్సదృశః

(21) ఉత్ + స్థానం = ఉత్థానం

ఉత్ + స్తంభనం = ఉత్తంభనం.

---

## విసర్గసంధి.

1 విసర్గంబునకు-చ-ఛ-ట-ఠ-త-థ-శ-ష-స-లు పరంబు లగునపుడు షకారంబా దేశంబగు. ఉ— తేజః + తిమిరము=తేజస్తిమిరము.

2 విసర్గమునకు కఖలు - పఫలు- పరంబులగునపుడు జిహ్వామూలీయము, ఉపధ్మానీయ అనువర్ణములాదేశంబులగు.

ఉ॥ మనః + కాఠిన్యము= మనః కాఠిన్యము శ్రేయః, ప్రాప్తి = శ్రేయః ప్రాప్తి.

---

## విసర్గసంధివివరణము.

(1) కః + చరతి = కశ్చరతి
కః + చంద్రః = కశ్చంద్రః
కః + ఛాదయతి = కశ్ఛాదయతి
భవతః + ఛాగః = భవతశ్ఛాగః

(2) కః + టీకతే = కష్టీకతే
కః + టత్వేన = కష్టత్వేన
కః + ఠకారేణ = కష్ఠకారేణ

(3) కః + తరతి = కస్తరతి
కః + తృప్తః = కస్తృప్తః
కః + థుడతి = కస్థుడతి
కః + థకారః = కస్థకారః

(4) కః + కరోతి = కᳵకరోతి, కఃకరోతి
కః + కంతుక=కᳵకంతుక, కఃకంతుకః
కః + ఖనతి = కᳵఖనతి, కఃఖనతి
కః + ఖల్వాటః = కᳵఖల్వాటః కఃఖల్వాటః

(5) కః + పచతి = కᳶపచతి' కఃపచతి
కః + పఠతి = కᳶపఠతి, కఃపఠతి
కః + ఫలతి = కᳶఫలతి, కఃఫలతి

(6) భవతః + శయనం = భవతశ్శయనం, భవతఃశయనం
కః + షండః = కష్షండః, కఃషండః
కః + సాధుః = కస్సాధుః, కఃసాధుః

(7) కః + అత్రి = కోఽత్రి
కః + అర్థః = కోఽర్థః
కః + అయం = కోఽయం

(8) కః + గచ్ఛతి = కోగచ్ఛతి

రామః + గుణవాన్ = రామోగుణవాన్

కః + ఘనః = కోఘనః

కః + ధావతి = కోధావతి

కః + జకారః = కోజకారః

కః + యక్షః = కోయక్షః

నీలః + దామః = నీలోదామః

శూరః + లక్ష్మణః = శూరోలక్ష్మణః

శిష్యః + వందతే = శిష్యోవందతే

శీఘ్రః + హయః = శీఘ్రోహయః

(9) కః + ఆగచ్ఛతి = కఆగచ్ఛతి, కయాగచ్ఛతి

కః + ఇహ = కఇహ, కయిహ

కః + ఈదృశః = కఈదృశః, కయీదృశః

కః + ఉపరి = కఉపరి, కయుపరి

(10) పునః + రాత్రిః = పునారాత్రిః

హరిః + రమ్యః = హరీరమ్యః

శంభుః + రాజతే = శంభూరాజతే

గురుః + రక్షకః = గురూరక్షకః

హరే + రక్షణం = హరేరక్షణం

(11) కః + కః = కస్కః

సర్పిః + కుండికా = సర్పికుండికా

ధనుః + కపాలః = ధనుష్కపాలః

(12) నమః + కరోతి = నమస్కరోతి

పురః + కరోతి = పురస్కరోతి

అయః + కారః = అయస్కారః

అయః + కామః = అయస్కామః
అయః + కంసః = అయస్కంసః

ఇట్లే—అయస్కుంభః, అయస్పాత్రిం, అయస్కాశః
అయస్కర్ణిః, అధస్పదం, శిరస్పదం

(13) నిః + ప్రత్యూహం = నిష్ప్రత్యూహం
ఆవిః + కృతం = ఆవిష్కృతం
దుః + కృతః = దుష్కృతః

(14) ద్విః + కరోతి = ద్విష్కరోతి, ద్విఃకరోతి
ద్విఃకరోతి
త్రిః + కరోతి = త్రిష్కరోతి, త్రిఃకరోతి
త్రిఃకరోతి

(15) కః + త్సరుః = కఃత్సరుః
ఘనః + త్సుభ్యతి = ఘనఃత్సుభ్యతి

---

ద్విత్వసంధి.

(1) వట + ఛాయా = వటచ్ఛాయా
కవి + ఛందః = కవిచ్ఛందః
తను + ఛవిః + తనుచ్ఛవిః = తనుచ్ఛవిః

(2) వేలా + ఛాదయతి = వేలాచ్ఛాదయతి,
వేలాఛాదయతి
క్రీడా + ఛాగః = క్రీడాచ్ఛాగః

(3) ఆ + ఛాదయతి = ఆచ్ఛాదయతి
మా + ఛిదత = మాచ్ఛిదత

(4) దధి + అత్ర = దధ్యత్ర
సుధీ + ఉపాస్యః = సుధ్యుపాస్యః

(5) హరి = అనుభవః = హర్యనుభవః
హర్య్యనుభవః

## స్వాదిసంధి.

శివః + అర్చ్యః = శివోర్చ్యః

మనః + రథః = మనోరథః

విసర్గసంధిలో సకారము (తేజః + తిమిరము = తేజస్తిమిరము) వచ్చునది విసర్గసంధి యనబడును.

శబ్దాంతమందుగల విసర్గకు రుత్వమువచ్చి అది ఓత్వముగా మారునది స్వాదిసంధి యనబడును.

ఉదా॥ శివసు + అర్చ్యః = శివ + రు + అర్చ్యః = శివ + ఓ + అర్చ్యః = శివోర్చ్యః.

---

## Exercise.

### సాధకము.

### I

ఈ క్రిందివానికి సంధులు సేయుఁడు.

నిరాఘ + ఆత్ముండు, ఋషి + ఈశ్వర, పృథు + ఊరువు, పితృ + ఋణము, నర + ఈశ్వరుఁడు, నృప + ఉత్తముఁడు, సప్త + ఋషి, తవ + ఌకారః, దళిత + ఏన, దిన + ఓకసులు, ప్రీతి + అర్థి, విష్ణు + అంశము, పితృ + అంశము, ఌ + ఆకృతి, తపస్ + శక్తి, శిరస్ + ఛేదము, సుహృత్ + జనుఁడు, మనస్ + పట్టదము, ధనుస్ + టంకారము, తత్ + టీక, విద్యుత్ + లత, వాక్ + మయము, సత్ + అమలము, భవిష్యత్ + భారతము, తను + ఛాయ, మాయా + ఛలము, దిక్ + శబ్దము, తేజః + తిమిరము, మనః + కాఠిన్యము, శ్రేయః + ప్రాప్తి, తపః + వృత్తి, మనః + ఇంద్రియము.

### II

ఈ క్రిందివానికి సంధిచేయుఁడు.

విలసత్ + గాండీవ, చాలన + ఉద్ధతి

విద్యుత్ + లత, సముద్యత్ + గర్జ
జలద + ఆకారత, పర్జన్య + ఆకల్ప, దోస్ + బల
తీవ్ర + అరి, దుష్ + విషహ, నిస్ + మూర్తి
తురంగమ + ఉత్కారము, సంగ్రామ + అర్హా
మనస్ + రథము, దోస్ + గర్వము

## Exercise.

### సాధకము.

### II

ఈ క్రిందిపదములలో సంధులను విడదీయుము.

పాదపాబ్ధి, సరస్సరస్వతి, దుస్సహ, దుష్క్రాంతకుఁడు, ఉజ్జ్వలము ఉద్ధత, దనుజేంద్రానీక, శుంభద్భుజ, గర్వోన్మత్త, కల్పచ్ఛిద, నిర్వృత్త, ఉర్వీభృద్ఘన, అంతర్న్యస్త, భాగ్యక్షుర, స్తోమాపాకరణ, సభాగారాంత, జగత్ప్రసిద్ధ, దుగ్ధార్ణోరాశి.

## Exercise.

### సాధకము.

### III

☞ ఇందలి సంధులను గనుగొని విడదీయుఁడు.

మ. రణభేరీప్రకటాంకభాంకరణ సంరావంబు త్రైలోక్య భీ
షణమై మ్రోయ భుజాసహస్రసముదంచచ్చాత హేతిచ్ఛటా
ఘృణిశోభిల్లసనర్ఘరత్నఖచిత ప్రేంఖచ్ఛతాంగాధిరో
హణుఁడై సంగరకేళికిన్ వెడలె నుద్యద్వాహినీయుక్తుఁడై.

మ. కృతనానావిధసాధనశ్రమ సమిత్క్రీడా చమత్కార ని
ర్జితబేతాళు లవక్రవిక్రమగుణ శ్రీతుల్యకంఠీరవుల్
శతకోటి ప్రతిమానవిగ్రహు లుదంచ ద్ధైర్యజాంబూనద
క్షితిభృత్తుల్యులు భటసంఘము ల్నడచె నక్షీణప్రతాపోన్నతిన్.

శా. లోకస్తుత్యవిభూతి నన్యపృతనాలుంటాకబాహాబల
శ్రీకల్మిన్ రథదంతిఘోటక భటశ్రేణీసముద్ధాంత సే
నాకల్ప ధ్వజవిభ్రమంబున సుహృద్వ్యగ్రోద్యముండై శతా
నీకుండుద్ధతి నేఁగుదెంచె నఖిలానీకంబు లుప్పొంగఁగన్.

శా. భీష్మద్రోణకృపాదిధన్వినికరాభీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్యపటుప్రతాప విసరాకర్ణంబు శస్త్రాస్త్ర జా
లోష్మస్ఫారచతుర్విధోజ్జ్వల జలాత్యుగ్రంబుదగ్రధ్వజా
ర్చిష్మత్త్వాకలితంబు సైన్యమదియేఁ జేరంగశక్తుండనే.

మ. అచలాధీశ్వరధీరు రేకపలిదుర్గాధ్యక్షు విద్వేషిరా
ట్ప్రచయోద్వేలబలావలేప తిమిర ప్రద్యోతనున్ విక్రమా
ర్కచరిత్రోత్తమ కావ్యనాయకుని వేడ్కంబ్రస్తుతింపందగన్
సుచరిత్రాఢ్యుని వత్సవాయ తెలుఁగున్ క్షోణీశ చూడామణిన్.

## IV

ఇందలి సంధులు కనుగొని విడదీయుఁడు.

శా. గంధేభేంద్రసమానయాన ! తెలియంగాఁ జూడు వీనిం జతు
స్సింధు పరివృత మేదినీవలయ విశ్రాంతప్రతాపాబ్జినీ
బంధున్ యుద్ధకృతి ప్రసిద్ధబల వత్ప్రత్యర్థిరాజన్య ని
ర్బంధున్ సాంబశివార్చనా సుగుణసంబంధున్ జరాసంధునిన్.

మ. ఘనమై నీపృథుబాహు లాంగల ముఖాఘాతంబుతోడన్ జనా
ర్దనశార్ఙ్గచ్యుత సాయకావలియుఁ గందర్పప్రజాలంబు నీ
యనిరుద్ధోగ్రశిలీముఖాలియు మదీయాస్త్రౌఘమున్ ధార్తరా
ష్ట్రనికాయోద్ధత కాయఖండనపటిష్ఠంబయ్యెడిం బోరిలోన్.

# CHAPTER V.

## అర్ధానుస్వార పరిజ్ఞానము.

తెనుఁగునందుఁ జిరకాలములనుండి పదమధ్యములయందును, రెండు శబ్దముల సంధియందును, అర్ధానుస్వారమొకటి కానంబడుచున్నది. ఇది లోపించిన యొక హల్లును సూచించుచుండును. ఈ యర్ధానుస్వారమునకుఁ బ్రస్తుతమునఁ బ్రత్యేకోచ్చారణ తరుచుగ లేకున్నను బూర్వము, అర్ధానుస్వారమునకుఁ బూర్వమందుండు అచ్చును, అను నాసికముగా నుచ్చరించుచుండెడివారు.

ఇప్పుడు దీని ప్రయోజన మంతగాఁ గాన్పించకపోయినను "శబ్దముల యొక్క వ్యుత్పత్తులను, భిన్నస్వరూపములైన పదములయొక్క పరస్పర సంబంధములను దెలిసికొనుట కనుకూలమై యున్నది." మఱియు భిన్నార్థముం దెలియఁ చేయుటకుఁ గూడ నుపయోగించును.

ఈ విషయమై విపులముగా వ్యాకరణములయందు వ్రాయఁబడక పోవుటచేత విద్యార్థులకు బండితులకుఁ గూడ దుర్జ్ఞేయముగా నున్నది.

బిందువు, పూర్ణము, ఖండము అని రెండువిధములు.

పూర్ణబిందువు—(ం) పూర్ణానుస్వారమనియు నిండు సున్న యనియు, నెఱి సున్న యనియు వ్యవహరింపఁబడును.

ఖండబిందువు—(ఁ) అర్ధానుస్వారమనియు, అర్ధబిందువనియు, అరసున్న యనియు, వ్యవహరింపఁబడును.

బిందువు మరల— సిద్ధబిందువనియు, సాధ్యబిందువనియు, వ్యవహరింపఁబడును.

సిద్ధమనఁగా— శబ్దములతోఁ గూడనే యుండునది.

సాధ్యమనఁగా— వ్యాకరణముచే సాధింపఁబడునది.

ఉదా:— కఁత = సిద్ధఖండము.

కొండ = సిద్ధపూర్ణము.

చదివెఁబోత్తము = సాధ్యఖండము.

చెంగలువ = సాధ్యపూర్ణ్ణము.

N. B:— ఇట్లు బిందువు—సిద్ధపూర్ణ్ణము, సిద్ధఖండము.

సాధ్యపూర్ణ్ణము, సాధ్యఖండము.

అని నాల్గు దెఱఁగుల నుండును.

ఆఁటు, ఇఁక, చుఁడు, తోఁచు, లేఁత, కలఁగు, చెలఁగు, మీఁద, ఇత్యాదులయందలి బిందువు సిద్ధఖండము.

అందము, వంకర, కుంద, గంప, ఇత్యాదులయందలి బిందువు సిద్ధపూర్ణ్ణము.

(1) రాముఁడు, కృష్ణుఁడు, చేయఁడు, చేయూఁడు, చేయనువ్వాఁడు, ఇత్యాదులయందలి డు వర్ణకమునకుఁ బూర్వము వచ్చునదియును,

(2) చేయఁగలను, చేయింపఁగలను, చేయింపఁబడును, అని యిట్లు, కల, పడు అనునవి పరమగునపుడు వచ్చునవియును,

(3) ఇందుండఁ జూచితిని, ఇంటిలోఁ జదువుము, తాఁజదివె, సింగపుఁ గొదమ, యిట్లు పరుషములు సరళములుగా మారునపుడు పూర్వమందున్న నకారము బిందువుగా మారునవియు, మఱికొన్ని సంధి ప్రకరణమునందుఁ జూపఁబడినవియు సాధ్యఖండములు.

చెప్పంబడియె, తెలుంగు, రాముండు, ఇత్యాదులయందలి బిందువు సాధ్యపూర్ణ్ణము.

(1) హ్రస్వము మీఁది యరసున్న వికల్పముగా నిండుసున్న యగును.

ఉదా:— చూడఁబడెను.

చూడంబడెను.

నెలఁత.

నెలంత.

కృష్ణుఁడు.

కృష్ణుండు. } మొదలయినవి.

(2) దీర్ఘముమీఁది యరసున్నకు నిండుసున్న రాదు.

ఉదా—వీఁడు
వ్రాయుచున్నాఁడు.
తోఁబుట్టువు.
నేఁజూచితిని.
తోఁట.
} మొదలయినవి.

(3) ఇఁక, అఁట చుఁడు శబ్దములు దప్ప మాటల మొదటి హ్రస్వముపై నర్ధబిందువు లేదు.

(4) అచ్చతెనుఁగు శబ్దములయందు బిందువు పరుషసరళములకు ముందే యుండును గాని, స్థిరములకు ముందుగా నుండదు.

N. B. పరుషములకు ముందు తప్పక యుండవలెనని కాదు, ఉన్నచో నక్కడనే యుండవలెనని తాత్పర్యము.

ఉదా—పొంకము. కలఁక, కడంక,
కంచము, తలఁచుట, కలంచి,
} పరుషములు,

ఉదా— మెలఁగెన్, అడంగెన్, పెంగరవు,
చూచెఁగొండ, పట్టెఁగొమ్మ, కడఁజుఁ
నంజు, కురుంజు కెంజిగురు,
వచ్చెఁజాన.
} సరళములు.

సిద్ధానుస్వారమును గనఁగొనుట మిక్కిలి శ్రమమైనను గొన్ని సంకేతములను బాలావబోధార్థము వివరించుచున్నాము.

అర్ధానుస్వారము సాధారణముగా లోపించిన యక్షరముయొక్కఁ గాని అక్షరములయొక్క గాని స్థానమందు వచ్చును.

ఈక్రిందివానిలో యువర్ణాంత ధాతువులయొక్క యు వర్ణమునకు బదులుగా నరసున్న వచ్చును.

ఉదా— మేయు + మేఁత.

ఇట్లే— వ్రేఁత, వ్రాఁత, కూఁత, నేఁత, మోఁత, మ్రోఁత, లాఁత, చేఁత, పోఁత, గీఁత, పూఁత, కోఁత, నవఁత, అలఁత, రోఁత,

ఏకరూపముగల కొన్నిశబ్దములు అరసున్నను గలిగియుండుట, లేకుండుట వలన నర్థభేదమును బొందుచు సిద్ధానుస్వారముల యావశ్యకతను వెల్లడించుచున్నవి.

ఉదా—

1 అట = అక్కడ; అఁట = ఆశ్చర్యార్థకము
2 ఆకరము = ఉనికిపట్టు; ఆఁకరము = కోపము
3 ఈగు = ఇగ్గు; ఈఁగు = చొచ్చు
4 ఊక = ఉముక; ఊఁక = ఊఁగులాట
5 ఊచు = జబ్బుచే వెండ్రుకలురాలు; ఊఁచు = ఊఁగఁజేయు
6 ఊతము = కుట్టఁబడినది; ఊఁతము = పట్టు
7 ఊదర = గడ్డిలోని భేదము; ఊఁదర = ధూమము
8 కాచు = రక్షించు; కాఁచు = కాఁగఁజేయు
9 కాడు = శ్మశానము; కాఁడు = నాటుట
10 కాపు = కాయగాచు; కాఁపు = కాపురము
11 కాపు = కావలి; కాఁపు = శూద్రుఁడు
12 గాడి = బండి; గాఁడి = వంటకొఱకుఁద్రవ్వినది
13 చాగుట = నడుచుట; చాఁగుట = పొడవగుట
14 చూడుము = కనుము; చూఁడుము = కాల్చుము
15 చేత = విభక్తిప్రత్యయము; చేఁత = చేయుధాతువు
16 జిలుగు = చిక్కు; జిలుఁగు = మందము
17 డాగు = మచ్చ: డాఁగు = దాఁగు
18 తలుగు = ఖండించు; తలుఁగు = నశించు
19 తాకు = తగులు; తాఁకు = మూర్కొను
20 తాచు = ఖచితముచేయు; తాఁచు = తన్ను
21 తాపు = చెక్కు; తాఁపు = తన్ను

22 తీగ = చెరువుముందరి స్థలము; తీఁగ = లత
23 తొలకు = ఉపరంధ్రము; తొలఁకు = చలించు
24 తోడు = ఆన; తోఁడు = కెళ్ళగించు
25 దాక = వెడలుపు మూతిగలకుండ; దాఁక = వఱకు
26 దాపరించు = ప్రాప్తించు; దాఁపరించు, దొంగిలించు
27 దాపు = చేరువ; దాఁపు = దాఁచుకొను
28 దాపు = వాయింపు; దాఁపు = ఖచితముచేయు
29 నాడు = దేశము; నాఁడు = దినము
30 నూక = తంబూకము; నూఁక = వృక్షభేదము
31 నూగు = నూవుమొక్క; నూఁగు = చిన్నముండ్లు
32 నేత = ప్రభువు; నేఁత = నేయుధాతువు
33 పలుగు = దుష్టుఁడు; పలుఁగు = స్ఫటికము
34 పాడి = న్యాయము; పాఁడి = క్షీరము
35 పాత = కాచువాఁడు; పాఁత = బట్ట
36 పొఱుడు = ప్రవాహము; పొఱుఁడు = బ్రాహ్మణుఁడు
37 పూచు=పుష్పించు; పూఁచు = పూను
38 పూట=జామీను; పూఁట=దినములోనొకభాగము
39 పూత=వికసించు; పూఁత = చర్చ
40 పొలకు = ఫలవిశేషము; పొలఁకు = గడ్డికుప్ప
41 పోక = నడత; పోఁక = పోఁకకాయ
42 పోకు = నడవడి; పోఁకు = మంచుగలగడ్డి
43 పోగు = కుప్ప; పోఁగు = దారము
44 ప్రాచి = వృక్షవిశేషము; ప్రాఁచి = పాఁచి
45 పోక = సముదాయము; ప్రోఁక = పోఁకచెట్టు
46 ప్రోగు = పోక; ప్రోఁగు = పోఁగు

47 ఖాజు = కాంతి; ఖాఁజు = శునకవిశేషము
48 బెడద = భత్యవిశేషము; బెడఁద = బాధ
49 మలక = తురక; మలఁక = చిక్కు
50 మలపు = త్రిప్పు; మలఁపు = నర్తనము
51 మాటు = మఱుఁగుచేయు, మాఁటు = తగులముగొనుట
52 మాడు = వతిక్షించు; మాఁడు = మాడిపోవు
53 మిడుగు = గట్టిరాయి; మిడుఁగు = మిడుఁగురు పురువు
54 మూక = మూఁగవాఁడు; మూఁక = సముదాయము
55 మూకుఁడు = ఒక రాక్షసుఁడు; మూఁకుడు = మట్టిమూఁ[illegible]
56 మేడి = అత్తిచెట్టు; మేఁడి = నాఁగటివెనుకకొయ్య
57 మోద = తమలపాకుల మోద; మోఁద = నెత్తురుగడ్డ
58 రాజు = ప్రభువు; రాఁజు = నిప్పుఁటుకొను
59 రేపు = ఉదయము; రేఁపు = రేచుట
60 లాగు = విధము; లాఁగు = వస్త్రవిశేషము
61 లేక = గుంపు; లేఁక = భటుఁడు
62 లోడు = దిండు; లోఁడు = తోఁడు
63 వలతి = చోటు; వలఁతి = స్త్రీ
64 వాడు = ఉపయోగించు; వాఁడు = అతఁడు
65 వెలుఁగు = కంచె; వెలుఁగు = కాంతి
66 సాకు = మిష; సాఁకు = కాపాడు
67 సాతు = వర్తకజనసమూహము; సాఁతు = ఒకానొకజాతి
68 సురటి = రాగవిశేషము; సురఁటి = వట్రువిసనకఱ్ఱ

అకారాదిగా కొన్ని ముఖ్యములయిన శబ్దములను సిద్ధానుస్వారము గలవాఁ క్రింద నుదహరించుచున్నారము.

అఁటు అడఁగు అనఁటి అలఁత

| | | | |
|---|---|---|---|
| ఆఁడు | ఆఁదోఁక | అఁబోఁతు | ఇఁక |
| ఈఁక | ఈఁగఁ | ఈఁగలు | ఈఁత |
| ఈఁదర | ఈఁదు | ఊఁకు | ఊఁట |
| ఊఁత | ఊఁదు | ఏఁకారు | ఏఁకు |
| ఏఁచు | ఏఁడు | ఏనుఁగు | ఏనుఁగులు |
| ఏఁబది | ఒడఁబడు | ఒఱుఁగు | ఒసఁగు |
| కడఁగు | కణఁజము | కలఁకు | కలఁకులు |
| కలఁగు | కలఁత | కాఁక | కాఁగు |
| కాఁచు | కాఁడ | కాఁడు | కాఁపడము |
| కాఁపు | కాఁపుడు | కూఁక | కూఁత |
| కొలఁకు | కొలఁకులు | కొలఁది | కోఁచ |
| కోఁత | కోఁతి | కౌఁగిలి | కౌఁజు |
| క్రోఁతి | గరిఁటె | గవఁకు | గవఁకులు |
| గీఁత | గూఁడు | గేఁదగి | గోఁగు |
| గోఁగులు | గోఁటు | గోరఁటు | చాఁదు |
| చీఁదు | చుఁడు | చూఁడు | చెలఁది |
| చేఁత | చేఁదు | జోఁణఁగి | టేఁకు |
| తరఁగ | తేఁకు | తేఁటి | తేఁటులు |
| తొడఁగు | తోఁక | తోఁగు | తోఁచు |
| తోఁడ | తోఁడు | తోఁపు | దాఁగ |
| దాఁగు | దాఁటు | నడుఁకు | నవఁత |
| నాఁగెలు | నాఁడు | నాఁడెము | నీఁగు |
| నూఁక | నూఁకలు | నెఱఁకు | నెఱఁకులు |
| నేఁడు | నేఁత | పనఁటి | పయెఁట |
| పయ్యెఁట | పలుఁగు | పసిఁడి | పాఁచి |

| | | | |
|---|---|---|---|
| పాఁత | పాఁప | పీఁచము | పీఁట |
| పులుఁగు | పూఁట | పూఁడు | పూఁత |
| పూఁవు | పూబోఁడి | పెనఁగు | పైఁట |
| పైఁడి | పోఁక | ప్రేఁప | బాఁపి |
| బాఁపండు | బీఁట | బోఁటి | మడఁగు |
| మడఁత | మడుఁగు | మడుఁగులు | మణుఁగు |
| మాఁగు | మీఁదు | మునుఁగు | ముసిఁడి |
| మూఁగ | మూఁగు | మూఁడు | మూఁపు |
| మెసఁగు | మేఁక | మేఁత | మోఁకాలు |
| మోఁచేయి | మోఁత | మోఁదు | మ్రాఁకు |
| మ్రాఁకులు | మ్రోఁత | రాఁత | రేఁగు |
| రేఁగులు | రోఁకలి | రోఁత | లాఁగు |
| లాఁత | లేఁగంటి | లేఁడు | లేఁత |
| లోఁగు | వలఁతు | వాఁడు | వాఁపు |
| వీఁగు | వీఁడు | వీఁపు | వెలఁగ |
| వెలఁగలు | వెలుఁగు | వేఁగి | వేఁగు |
| వేఁడి | వేఁడు | వేఁప | వేఁపమ్రాను |
| వేసఁగి | వ్రాఁత | వ్రేఁత | సంపఁగి |
| సంపఁగె | సంపెఁగ | సవ్వఁగి | మఱుఁగు |
| సైఁచు. | | | |

## Exercises.

## సాధకములు.

### I

చెలఁతలారా ! మన మాడుకొందుమా ? ఇక నొక పని మనకు సౌఖ్య
మీఁగలుగునా ? ప్రాఁత బంతి బారఁదుపుడు, గేదగిరేకు కొప్పున జెట్టుక

బైటిలో నెట్టితివమ్మా? పులుఁగులు గల మడుఁగునకు బోదము. అందు దెమ్మెరలు వీచునట. కావున మన యలత దీరుఁజుడీ. ఆహా! ఆ పూగొమ్మలే నెట్టుం గౌగిలిఁచిండి. మోదుఁగుమ్రాఁకుపై మూఁగియున్న తేటికొదమల మోతసైచుట కష్టము. పులుఁగుల యెలుఁగులు చెవులు వీటవార వినఁబడు చున్నవి. గోఁగుచెట్టున బూతపసిడి గిఁడియలవలె గన్నులకు బెక్కుగ నింపు గలిగిఁచు చున్నది. ఈ విరులం బోకమ్రాఁకుల క్రిఁదికి బోయి యా పూఁబోడిం గూడి దఁడలు గుచ్చుకొఁదమా! సంపఁగిపూవులు నాడెమై గంపలకొలఁది బూసి యవి కోఁతకు నలవిగాక చెట్టుమీఁదఁగ గాన్పిఁచు చున్నవి.

☞ ఇందలి సిద్ధ సాధ్యపూర్ణ ఖఁడబిందువులను వ్రాయుఁడు.

## II

"కాబట్టి క్రొత్తగా వచ్చిన వానిని నమ్మరాదని చెప్పితిని. అనఁగా విని నక్క కాకిని మిక్కిలి కోపించి చూచి యిట్లనియె. ప్రథమ దర్శన దినమందు మృగమునకు నీవుసహితము క్రొత్తవాఁడవే. అదియెట్లు నీతో మృగ మునకు స్నేహము రాఁగారాఁగా వర్ధిల్లుచున్నది."

(నీతిచంద్రిక-మిత్రలాభము.)

☞ ఇందు అర్ధానుస్వారములను పూర్తిసేయుఁడు,

## III

"వారణాసియందు ధావకమల్లుఁడను చాకివాఁడు గలఁడు. ఒకనాఁడు మిగుల బట్టలుగుఁజిన బడలికచేత మయిమఱచి గుఱుపెట్టి నిద్రబోవుచుండెను. ఆ నడికిరేయి వాని యిల్లొక దొఁగ చొచ్చెను. అప్పుడు వాని యింటివాకిట గాలిబందముతో గాడిదె నిలుచుండెను."

(నీతిచంద్రిక-మిత్రభేదము)

☞ ఇఁదలి అర్ధానుస్వార పదములను విడఁదీయుఁడు).

## IV

"అనిన దమనకుఁ డిట్లనియె. ఇప్పుడు త్వరయేల! మెల్లగాబోయి భక్షింతము. ఎల్లజంతువుల కాహారనిద్రాభయములు సహజ ధర్మములు. కుక్షింభరిత్వముచే గౌరవము రాబోదు. మిత్రామిత్రుల కుపకారాపకారములు చేయవేడి బుద్ధిమంతులు రాజాశ్రయము గోరుదురు. స్వోదరమాత్రము భరింపనేరు లేడు! ఏవాఁడు జీవింప ననేకులు జీవింతురు వాని మనుగడయే సఫలము. వాఁడొకఁడు జీవించువాఁడు."

(నీతిచంద్రిక-మిత్రభేదము.)

☞ ఇందలి యర్ధానుస్వార పదములను విడఁదీయుఁడు.

## V

"అనిన గరటకుఁ డిట్లనియె. రాజుల గొలువు గోరువారు మెలకువఁగలిగి ప్రవర్తింపవలెను. వారి చిత్తవృత్తి యెఱిఁగి మెలఁగుట కఠిని. అది స్వచ్ఛంద వృత్తివంటిది కాదు. నావుడు దమనకుఁ డిట్లనియె. ఉద్యోగికి దూరభూమియును విద్వాంసునకు బరదేశమును బ్రియవాదికి శత్రువును లేని యట్లు బుద్ధిమంతున కసాధ్య మొకటిలేదు, సద్వర్తనముఁగలిగి నిచ్చలు దమ్ముఁ గొలుచువారిని రాజు లాదరింతురు. భృత్యుఁడు ఱేనికోప ప్రసాదముల యంఁగ మచ్చము లెఱిఁగి మెలఁగనేని దదనుగ్రహమునకు బాత్రుఁడవును.

నీతిచంద్రిక-మిత్రభేదము)

☞ ఇందలి యర్ధానుస్వార పదములను విడఁదీసి వ్రాయుఁడు.

## IV

☞ అంత గణ్వుం డరణ్యంబునుండి యేగుదెంచి. యెప్పటి యట్లు తనకెదురురాక బెదరుఁదరి సిగ్గున మూలమూలల దాగెడు శకుంతలను జూచి లోనిచూపున దత్కారణం బెఱింగి దానికిట్లనియె. తల్లీ! నీకులగోత్ర సౌందర్యంబులకు దగిన వల్లభుండు లభియించె. గాంధర్వంబు క్షత్రియులకు విధిచోదితంబు. నీగర్భంబున సర్వసర్వంసహా ధురంధరుండగు నందనుండున్నవాడు అని

పలికి దానికి గర్భరక్షణంబు సేయుచున్నంత సంవత్సరత్రయంబునకు జక్రవర్తి లక్షణ లక్షితుండు సింహసంహననుండు నగు భరతుండను సుతుండుదయించె."

(సుమనోమనోజ్ఞము)

 అందలి యర్ధానుస్వార పదములను విడఁదీసి వ్రాయుఁడు.

# CHAPTER VI.

---

## Gender & Number.

స్త్రీప్రత్యయజ్ఞానముయొక్క యావశ్యకత—ఈ స్త్రీప్రత్యయములు తెలియనియెడల సమాసములయందు, అకారాంతములు, ఈకారాంతములు, అకారాంతములుగాను, కొన్నియెడల నకారాంతములుగాను, ఇట్లు వివిధముగాఁ బ్రయోగములు జరుగుచుండును.

మఱియు నొకజాతిలో స్త్రీని వివక్షించునపుడు స్త్రీప్రత్యయము తెలియదేని "బ్రాహ్మణస్త్రీ' చక్రవాకస్త్రీ, బ్రాహ్మణునిభార్య, చక్రవాకముభార్య" ఇత్యాదులు విశేషణములు వేసి చెప్పవలసి వచ్చును.

అది యొకానొకచో వేయక తప్పవలసివచ్చినను నెల్లెడల సమంజసములుగాను, సంగ్రహముగాను ఉండవు, "బ్రాహ్మణి, చక్రవాకి"అని చెప్పిన సమంజసముగ, సంగ్రహముగ నుండును.

ఇందులకై పాణినీయ వ్యాకరణమందు స్త్రీ ప్రత్యయ ప్రకరణమని కొంత యేర్పడియున్నది. ఈ ప్రత్యయములు తెలుఁగునందుఁ దక్కువ "పాఱుఁడు, పాఱుత ఇత్యాదులు కొన్ని గలవు.

తత్సమభాషయే ప్రస్తుతాంధ్రభాషయం దెక్కువ వాడుకగా నుండుటచేఁ దరుచు తెలుఁగులోనికి వాడుకగావచ్చు స్త్రీ ప్రత్యయాంతశబ్దములను జాలమట్టుకుఁ బరిశీలించి వ్రాసితిమి.

1. తెలుఁగులో లింగములేదు, సంస్కృతమునందు, లింగమును దెలుపు ప్రత్యయములు గలవు.

అప్రత్యయములు సంస్కృతములో, "ఆ, ఈ" అని రెండుగలవు.

ఉదా—సీతా, లతా. ఆ

నదీ, గౌరీ. ఈ

తెలుఁగులో "కత్తె, ఎత, త" మొదలగునవి అమహదర్థకములు.

ఉదా—చెలికత్తె, అందకత్తె, కత్తె.
పాఱుత, వ్రేత. త.
మాలెత—ఎత.

సంస్కృతమున లింగభేదము శబ్దములకుఁగాని, అర్థములకు గాదు.

ఉదా—జాయా=స్త్రీలింగము
కళత్రం=నపుంసకము
దారాః=పుల్లింగము
} ఈ మూఁడింటికి భార్యయర్థము.

ఒక్కశబ్దమునకే, ఒకయర్థమందే రెండు లింగములు, మూఁడులింగములుఁగూడఁ గలవు.

ఉదా—బింబం=పుంలింగము
బింబం=నపుంసకము
} అర్థము, శబ్దము ఒక్కటియె.

మండలం=నపుంసకం
మండలీ=స్త్రీలింగం
మండలః=పుంలింగము
} ఒక యర్థమందేమూఁడు లింగములు.

తెలుఁగునందు అర్థము ననుసరించియే లింగమేర్పడుచున్నది. అది మూఁడు విధములుగా నున్నది.

ఉదా—అబ్బ, అమ్మ=పదభేదము.
సాలె, సాలెత=ప్రత్యయభేదము.
మగబిడ్డ, ఆడుబిడ్డ=పూర్వమొకపదముఁ జేర్చుటవలన.

పదభేదము—

| | | | |
|---|---|---|---|
| మహాత్తు | మహాతి | మహాత్తు | మహాతి |
| పిత | మాత | తాత | అవ్వ |
| భ్రాత | స్వస | దున్న | గేదె |
| పురుషుఁడు | స్త్రీ | పుంజు | పెట్ట |
| భర్త | భార్య | పోతు | పెంటి |

| | | | |
|---|---|---|---|
| మహత్తు | మహతి | మహాత్తు | మహాతి |
| వరుఁడు | వధువు | బావ | వదినె |
| వృషభము | ధేనువు | స్నుష | జామాత |
| అన్న | అప్ప | భావుకుఁడు | ప్రజావతీ |
| అయ్య | అమ్మ | మగవాఁడు | ఆడుది |
| అల్లుఁడు | కోఁడలు | మగఁడు | పెండ్లము |
| ఎద్దు | ఆవు | మామ | అత్త |
| కొడుకు | కూఁతురు | రాజు | రాణి |
| తండ్రి | తల్లి | వాఁడు | అది |
| తమ్ముఁడు | చెల్లెలు | అశ్వము | బడబ |

2. ప్రత్యయ భేదము వలన.

| | | | |
|---|---|---|---|
| పుత్రుఁడు | పుత్త్రి | మృడుఁడు | మృడాణి |
| సుతుఁడు | సుత | దీర్ఘనయనుఁడు | దీర్ఘనయన |
| అనుజుఁడు | అనుజ | విమలాంగుఁడు | విమలాంగి |
| శ్వశురుఁడు | శ్వశురువు | వామనుఁడు | వామని |
| ఇంద్రుఁడు | ఇంద్రాణి | పీవ | పీవరి |
| వరుణుఁడు | వరుణాని | పద్మనేత్రుఁడు | పద్మనేత్రి |
| భవుఁడు | భవాని | చంద్రముఖుఁడు | చంద్రముఖి |
| శర్వుఁడు | శర్వాణి | మాతులుఁడు | మాతులాని |
| రుద్రుఁడు | రుద్రాణి | ఆచార్యుఁడు | ఆచార్యాణి |
| బ్రాహ్మణుఁడు | బ్రాహ్మణి | రాక్షసుఁడు | రాక్షసి |
| పతి | పత్ని | దేవుఁడు | దేవి |
| వృద్ధుఁడు | వృద్ధ | గంధర్వుఁడు | గంధర్వి |
| జరత్తు | జరతి | ఖగము | ఖగి |
| కనిష్ఠుఁడు | కనిష్ఠ | పతత్రి | పతత్రిణి |

| | | | |
|---|---|---|---|
| మహాత్మ | మహాతి | మహాత్తు | మహాతి |
| జ్యేష్ఠుఁడు | జ్యేష్ఠ | పతగము | పతగి |
| కనీయాంశుఁడు | కనీయసి | అండజము | అండజ |
| భగవంతుడు | భగవతి | మశకము | మశకి |
| నరుఁడు | నారి | ఉష్ట్రము | ఉష్ట్రి |
| కామి | కామిని | క్రమేళకము | క్రమేళకి |
| యోగ్యుఁడు | యోగ్య | క్షత్రియుఁడు | క్షత్రియ, |
| కరి | కరిణి | | క్షత్రియాణి |
| గజము | గజి | శూద్రుఁడు | శూద్రి (భార్య) |
| | | | శూద్ర (కులము) |
| అశ్వము | అశ్వ | అభీరుఁడు | అభీరి |
| అజము | అజ | వల్లవుఁడు | వల్లవి |
| చటకము | చటక | ఏడకము | ఏడక |
| కాకము | కాకి | నాయకుఁడు | నాయిక |
| చక్రవాకము | చక్రవాకి | గాయకుఁడు | గాయకి |
| బకము | బకి | నర్తకుఁడు | నర్తకి |
| వాయసము | వాయసి | కలభాషి | కలభాషిణి |
| కుక్కుటము | కుక్కుటి | పారావతము | పారావతి |
| గర్దభము | గర్దభి | శుకము | శుకి |
| నాగము | నాగి | కోకిలము | కోకిల |
| కలవింకము | కలవింకి | కలరవము | కలరవ |
| పక్షి | పక్షిణి | కపోతము | కపోతి |
| యక్షుడు | యక్షి | శ్యేనము | శ్యేని |
| ఉలూకము | ఉలూకి | పంచాస్యము | పంచాస్యా |
| సఖుఁడు | సఖి | హర్యక్షము | హర్యక్ష |

| | | | |
|---|---|---|---|
| మహత్తు | మహతి | మహత్తు | మహతి |
| మృగము | మృగి | కేసరి | కేసరిణి |
| ఏణము | ఏణి | పుండరీకము | పుండరీకి |
| చమరము | చమరి | మూషకము | మూషిక |
| సృమరము | సృమరి | సైరభము | సైరభి |
| శశము | శశి | చక్రాంగుఁడు | చక్రాంగి |
| యువ | యువతి | సారసము | సారసి |
| మత్స్యము | మత్సి | మరాళము | మరాళి |
| ఝషము | ఝషి | దౌహిత్రుఁడు | దౌహిత్రి |
| పన్నగము | పన్నగి | పౌత్రుఁడు | పౌత్రి |
| ఉరగము | ఉరగి | మాతామహుఁడు | మాతామహి |
| బస్తము | బస్తి | పితామహుఁడు | పితామహి |
| హంస | హంసి | బాలుఁడు | బాల, బాలిక |
| చకోరము | చకోరి | వత్సుఁడు | వత్స |
| కాసరము | కాసరి | నారాయణుఁడు | నారాయణి |
| మహిషము | మహిషి | ద్రౌపదుఁడు | ద్రౌపది |
| లులాయము | లులాయ | గుణి | గుణిని |
| గవయము | గవయ | బుద్ధిమంతుఁడు | బుద్ధిమతి |
| శరభము | శరభి | సాధువు | సాధ్వి |
| శంబరము | శంబరి | తనువు | తన్వి |
| పృషతము | పృషతి | గురువు | గుర్వి |
| గంధర్వము | గంధర్వి | ద్విరేఫము | ద్విరేఫ |
| కిన్నరుఁడు | కిన్నరి | పృథువు | పృథ్వి |
| విద్యాధరుఁడు | విద్యాధరి | భ్రమరము | భ్రమరి |
| సుర | సురి | లఘువు | లఘ్వి |
| వ్యాఘ్రము | వ్యాఘ్రి | నకులము | నకులి |

| | | | |
|---|---|---|---|
| మహాత్తు | మహాతి | మహాత్తు | మహాతి |
| బహువు | బహ్వీ | పద్మి | పద్మిని |
| భృంగము | భృంగి | ద్విరదము | ద్విరద |
| ప్రభువు | ప్రభ్వీ | శునకము | శుని |
| షట్పదము | షట్పది | మార్జాలము | మార్జాలి |
| పటువు | పట్వీ | బిడాలము | బిడాలి |
| శుక్లము | శుక్ల | వానరము | వానరి |
| నీలము | నీల | భల్లూకము | భల్లూకి |
| శ్వేతము | శ్వేత | మర్కటము | మర్కటి |
| శుభ్రము | శుభ్రి | కీశము | కీశి |
| పాండురము | పాండుర | బలీముఖము | బలీముఖి |
| కుముద్వంతము | కుముద్వతి | భషకము | భషకి |
| హరితము | హరిత | కుర్కురము | కుర్కురి |
| ధూమ్రము | ధూమ్ర | వృషదంశకము | వృషదంశకి |
| లోహితము | లోహిత | చరణాయుధము | చరణాయుధ |
| రక్తము | రక్త | శోభావంతుఁడు | శోభావతి |
| పీతము | పీత | మతిమంతుఁడు | మతిమతి |
| పాటలము | పాటల | మయూరము | మయూరి |
| మండూకము | మండూకి | మేధావి | మేధావిని |
| దర్దురము | దర్దురి | స్రగ్వీ | స్రగ్విణి |
| మాతంగము | మాతంగి | మధుకరము | మధుకరి |
| మాతంగుఁడు | మాతంగి | మాయావి | మాయావిని |
| ఇభము | ఇభి | యశస్వి | యశస్విని |
| హస్తి | హస్తిని | వర్చస్వి | వర్చస్విని |
| చండాలుఁడు | చండాలి | విశాలాక్షుఁడు | విశాలాక్షి |
| ఘోటము | ఘోటి | అనడ్వాహము | అనడుహి |

| | | | |
|---|---|---|---|
| మహాత్తు | మహతి | మహాత్తు | మహతి |
| తురగము | తురగి | విద్వాంసుఁడు | విదుషి |
| స్తంబేరము | స్తంబేరమ | ధీమంతుఁడు | ధీమతి |
| లక్ష్మీవంతుఁడు | లక్ష్మీవతి | మిండఁడు | మిండకత్తె |
| సోమయాజి | సోమపీథిని | వేఱిఁడు | వేఱిఁత |
| కచ్ఛపము | కచ్ఛపి | గొల్లడు | గొల్లత |
| కూర్మము | కూర్మి | కాపు | కాపుది |
| వరాహము | వరాహి | పోతు | పెంటి |
| సూకరము | సూకరి | చాత్తి | చాకిత |
| కోలము | కోలి | చెంచు | చెంచెత |
| పోత్రి | పోత్రిణి | జనయిత్రి | జనయిత |
| క్రోష్టువు | క్రోష్టి | 3. పూర్వమొక పదము చేర్చుటచేత | |
| జంబుకము | జంబుకి | వచ్చునవి. | |
| వృకము | వృకి | మగపులి | ఆఁడుపులి |
| జనకుఁడు | జనని | పురుషశిశువు | స్త్రీశిశువు |
| దాత | దాత్రి | మగబిడ్డ | ఆడుఁబిడ్డ |
| పాఱుఁడు | పాఱుత | కోడెదూడ | పెయ్యదూడ |
| వగలాఁడు | వగలాఁడి | పురుషసంతతి | స్త్రీసంతతి |
| చెలికాఁడు | చెలికత్తె | పురుషజనము | స్త్రీజనము |
| మనమఁడు | మనుమరాలు | మగపిల్ల | ఆఁడుపిల్ల |
| చెలువుఁడు | చెలువ | మగశిశువు | ఆఁడుశిశువు |

## Pronouns.

| పుం. | స్త్రీ. | న. |
|---|---|---|
| అది | ఆమె | అది |
| ఎవఁడు | ఎవతె | ఏది |
| ఒకఁడు | ఒకతె | ఒకటి |
| ఇద్దఱు | ఇద్దఱు | రెండు |

ఆ, ఈ, ఏ, శబ్దముల స్త్రీలింగ రూపములు, ఏకవచనమందు, అమహత్తునకు వలెను, బహువచనమునందు మహత్తునకు వలెను అగును. ఇట్లువర్తమాన భవిష్యత్క్రియలందును నగును.

# NUMBER.

## ఏకవచన బహువచన రూపములు.

ఏక. బహు.

రాముఁడు=రాములు

గురుఁడు, గురువు=గురువులు, గురువులు

మగఁడు=మగలు

ఱేఁడు = ఱేఁడులు, ఱేఁడ్లు

త్రాఁడు=త్రాఁడులు, త్రాళులు, త్రాళ్ళు

హరి=హరులు

కత్తి=కత్తులు

వాహిని=వాహినులు

కలికి = కలుకులు

జిగి = జిగులు

పందిరి = పందిరులు, పందిళ్లు

పిడికిలి = పిడికిళులు, పిడికిళ్ళు

రాపిడి = రాపిడులు, రాపిళులు, రాపిళ్ళు

మ్రాను = మ్రాఁకులు

కొలఁకు, కొలను = కొలఁకులు

కలను = కలఁకులు

కెలను = కెలఁకులు

కొఱను = కొఱఁకులు

గవను = గవఁకులు

నెఱను = నెఱఁకులు

వఱను = వఱఁకులు

ఏక. బహు.

రేను, రేఁగు = రేఁగులు

గోను, గోఁగు=గోఁగులు

చేను=చేలు

పేను=పేలు

మీను=మీలు

రేయి=రేలు

ఱాయి=ఱాలు

వ్రాయి=వ్రాలు

వేయి = వేలు

ఆవు = ఆవులు, ఆలు

జాము = జాములు, జాలు

చుట్టము = చుట్టలు, చుట్టములు
చుట్టాలు

మీసము = మీసములు, మీసలు,
[మీసాలు

బాలుఁడు = బాలురు

పగతుఁడు = పగతురు

అల్లుఁడు = అల్లురు

మనువు = మనువులు

వధువు = వధువులు

తరువు = తరువులు, తరులు

గుండు = గుండులు, గుండ్లు

ఏక. బహు.

వలను = వలఁకులు

గొంతు = గొంతులు, గొంట్లు

గోరు = గోరులు, గోర్లు, గోళ్ళు

విలుకాఁడు = విలుకాండ్రు, విలుకాళ్లు

వేఁటకాఁడు = వేఁటకాండ్రు, వేఁటకాళ్లు

చెయువు = చెయువులు, చెయువుళ్లు

చీటి = చీటులు, చీట్లు

అనఁటి = అనఁటులు, అనంట్లు

తూఁడు = తూఁడులు, తూండ్లు

వజ్రము = వజ్రములు, వజ్రాలు

పగడము = పగడములు, పగడాలు

పేరు = పేరులు, పేళులు, పేళ్లు

కొడవలి = కొడవండులు, కొడవండ్లు

మొగిలి = మొగిళులు, మొగిలులు, మొగిళ్ళు

ఊరు = ఊరులు, ఊళులు, ఊళ్లు

ఏఱు = ఏఱులు, ఏళులు, ఏళ్ళు

విల్లు = విల్లులు, విండులు, విండ్లు

జెట్టి = జెట్టులు, జెట్లు

తడి = తడులు, తళ్ళు

ఆలు = ఆండ్రు

చెల్లెలు = చెల్లెండ్రు

కోడలు = కోడండ్రు

ఏక. బహు.

కాలు = కాళ్ళు, కాలులు

కూఁతురు = కూఁతులు

పెండ్లి = పెండ్లిండ్లు

మఱదఁలు = మఱదండ్రు

చెలియలు = చెలియండ్రు

జవరాలు = జవరాండ్రు

దయాళుఁడు = దయాళురు

దయాళువు = దయాళువులు

రాహువు = రాహువులు

రాహు = రాహులు

పుట్టువు = పుట్టువులు

పుట్టు = పుట్టులు

ధేనువు = ధేనువులు

సవితృఁడు = సవితృలు

సవిత = సవితలు

విధాతృఁడు = విధాతలు

విధాత = విధాతలు

నేతృఁడు = నేతృలు

నేత = నేతలు

శంతుఁడు = శంతులు

శంత = శంతులు

అసురుఁడు = అసురులు

అసుర = అసురలు

దూతుఁడు = దూతులు

| ఏక. | బహు. |
|---|---|
| ముద్దరాలు | ముద్దరాండ్రు |
| గండఁడు | గండండ్రు |
| మిండఁడు | మిండండ్రు |
| గొల్లండు / గొల్ల | గొల్లలు |
| జాణఁడు / జాణ | జాణలు |
| వృద్ధుఁడు / వృద్ధ | వృద్ధులు |
| గృహస్థుఁడు / గృహస్తు | గృహస్థులు |
| చరిత | చరితలు |
| అభిలాష | అభిలాషలు |
| అభిలాషము | అభిలాషములు |
| భ్రమ | భ్రమలు |
| భ్రమము | భ్రమములు |
| వధ | వధలు |
| వధము | వధములు |
| కంధరము | కంధరములు |
| కంధర | కంధరలు |
| నాసికము | నాసికములు |
| నాసిక | నాసికలు |
| మిత్రుఁడు | మిత్రులు |
| ప్రధానుఁడు | ప్రధానులు |
| పాత్రుఁడు | పాత్రులు |
| దూత | దూతలు |
| బిడ్డఁడు / బిడ్డ | బిడ్డలు |
| కర్మవు | కర్మవులు |
| వణిక్కు | వణిక్కులు |
| వణిజుఁడు | వణిజులు |
| ఋత్విక్కు | ఋత్విక్కులు |
| ఋత్విజుఁడు | ఋత్విజులు |
| భగవంతుఁడు | భగవంతులు |
| భగవానుఁడు | భగవానులు |
| హనుమంతుఁడు | హనుమానులు |
| హనుమానుఁడు | హనుమానులు |
| వయస్సు | వయసులు |
| వయసు | వయసులు |
| అంగిరుఁడు | అంగిరులు |
| అంగిరసుఁడు | అంగిరసులు |
| ప్రచేతసుఁడు | ప్రచేతసులు |
| ప్రచేతుఁడు | ప్రచేతులు |
| స్రక్కు | స్రక్కులు |
| స్రజము | స్రజములు |
| గరిమ | గరిమలు |
| గరిమము | గరిమములు |
| మహిమ | మహిమలు |
| మహిమము | మహిమములు |
| ఆత్మ | ఆత్మలు |

| ఏక. | బహు. | ఏక. | బహు. |
| --- | --- | --- | --- |
| పాత్రము = | పాత్రములు | ఆత్మ్మడు = | ఆత్మ్మలు |
| హంస = | హంసలు | ఆత్మము = | ఆత్మములు |
| హంసము = | హంసములు | మనసు = | మనసులు |
| ధర్మము = | ధర్మములు | మనము = | మనములు |
| ధర్మువు = | ధర్మువులు | పల్లకీ = | పల్లకీలు |
| కర్మము = | కర్మములు | పల్లకి = | పల్లకులు |

వస్తు స్వభావమునుబట్టి కొన్ని శబ్దములకు బహువచనము లేదు.

ఉదా— పైఁడి, వెండి, కేలు, మొన్న, నిన్న, రేపు, మాపు.

ఈలాగుననే మఱికొన్ని శబ్దముల కేక వచనములేదు.

ఉదా— ఇరులు, కురులు, వడ్లు, పెసలు

---

## Exercises.

### సాధకము.

### I

సఖీ! యీ యారామంబున వికసిత లతాకుసుమ మంజరీ పుంజములు నదీతట ప్రాంతంబునందు మధుకరీ ఝుంకారములచే నింపుగొలుపుచుఁ గోకిలా రావములు కపోతీఘూంకారములు, శుకాలాపములుఁ గలిగి యున్నవి. అత్యాపగా మధ్యంబున హంస సంచారములును, చక్రవాకీ విహారంబులు గలిగి పద్మినులు నర్తకీ విలాసంబుంజూపి వానియందు జల వాయసంబులును, నీరకుక్కుటీ పఙ్క్తియు నంత యింపు గాకుండినను వానితోఁ గలసి శోభించు చుండెను. కాఱుటడవికిఁ బోయిన నారీజనులకు భీతుగలుగక మానదు. ఏమనిన— వనగజవ్యాఘ్రీ, కాసరీ, కేసరిణీ ప్రముఖంబులగు మృగంబులును, నురగీ సంచయంబును మనమునకు బెగడు పుట్టిం

-చును, ఏణీ, చమరీ, శశ, గవయాదులు కొన్ని మాత్రము సాధు జంతువులుండును. గ్రామీణంబులగు శునకములు, మార్జారీ సముదయంబులు, మేషగణంబులు నంతగా నింపుగొలుపవు. మయూరంబు లిందు దమ పెట్టలంగూడి యాడుచున్నవి. వర్షర్తువు సమీపించె నేమో? ప్రొద్దుపోయినది. యింకనైన యిండ్లకుఁ బోదము. అత్తగారలు కోపించుచుందురు. భర్తల కుపచారము సేయఁబడవైనని, మృడానీదేవిం బూజసేయువేళ తప్పినది. మాయమ్మజరతి గావున క్షుధార్తయై యుండును. మాతమ్ముఁడు నన్ను బిలువ వచ్చెను. అత్తింటి కోడండ్రమైయుండి యిట్లు తోఁటలవెంట, దొడ్లవెంటఁ దిరుగుట ధర్మము గాదు. గౌరీ పోదము రా! మహాలక్ష్మీ! ఆలస్యమేల! సీతమ్మ! యింటికేఁ బోవలెనని తోఁచదాయని చెప్పుకొనుచు నిండ్లకుఁ బోయిరి.

☞ ఇందలి స్త్రీలింగ శబ్దములను వాని పుంలింగరూపములను వ్రాయుఁడు.

## II

విద్వాంసుఁడు, జనకుఁడు, పౌత్రి, అశ్వము, దాత, ఆచార్యుఁడు జ్యేష్ఠుఁడు, భగవంతుఁడు, ఎద్దు, పుంజు, నరుఁడు, అండజము, మత్స్యము కోకిలము.

☞ ఈ శబ్దములకు స్త్రీలింగ శబ్దములను వ్రాయుఁడు.

## III

క్రోష్ట్రి, పతత్రిణి, శరభి, చటక, కాకి, బలీముఖి, లఘ్వి, ధీమతి, సోమపీథిని, మరాళి, శుని, స్రగ్విణి, ఇభి, మతి మతి, మాయావిని, మధుకరి, మయూరి, నకులి,

☞ ఈ శబ్దములకు పుంలింగరూపములను వ్రాయుఁడు.

## IV

అండజము, నర్తకుఁడు, సఖుఁడు, ఆభీరి, ఏడకము, చకోరి, గర్దభము మహిషి, గవయము, నారాయణుఁడు, సాధువు, శ్వేతము, మేధావి, స్తంబేరము, ద్విరదము, సైరభి, చక్రాంగి, హారితము, ఘోటి, పద్మిని, కకుద్మతి.

☞ ఇందలి స్త్రీలింగ ప్రత్యయ రూపముల విడఁదీయుఁడు.

# CHAPTER VIII.

## శబ్దములయొక్క వివిధరూప పరిజ్ఞానము.

## Different forms of the same word.

వాక్యరచనయందు రూపభేదములు తెలియకున్నఁ గొన్ని యెడల నప్రసిద్ధ రూపములు దొరలవచ్చును. మఱికొన్నియెడల వాక్యము సరళముగా యమకముగా నడపుటకు నొక్కటియే రూపము తెలిసిన యెడల నాయుద్యమము నెరవేరదు. రూపాంతరములే లేకున్నఁ గొన్నిచోట్ల పద్యము నడువదు.

ఉదా:— అమ్మక్కా! యొక్క పనికై యిక్కడకు మక్కువతో వచ్చితివి.

అమ్మక్కా, ఒక్క, ఇక్కడకు. ఈ శబ్దములు, అమ్మక, ఒక, ఈకడకు అని మాత్రమే తెలిసియున్నయెడల యమకము కుదరదు.

" రమ్మ రయంబె కుండిన పురమ్మునకు న్సచివాప్త బంధు జా
తమ్ములఁగూడి నవితథమ్ముగ నిచ్చుట రుక్మిణీకి వివా
హమ్మొనరింతు రాజనివహమ్ములు మెచ్చఁగ నంచు జాళువా
కమ్మలిఖించి పంచెఁ గుతుకమ్మలరన్ శిశుపాలు పాలికిన్."

ఇచ్చట "రమ్మ" "కమ్మ" ఈ శబ్దములయందు రూపాంతరములు లేవు. వీనితో "వివాహమ్ము" "జాతమ్ము" "అవితథమ్ము" "నివహమ్ము" "కుతుకమ్ము" ఈ శబ్దములకు నీ రూపమున్నదని తెలియక యొంటి మకారము గల రూపములు మాత్రమే తెలిసిన యెడల నీపద్యము యమకముగ నడువదు. ప్రాసలుఁగూడ సంఘటింపవు.

కావున ముఖ్యములైన శబ్దముల రూపభేదముల నీక్రింద నుదాహరించుచుంటిమి.

N. B. అరసున్న నిండుసున్నయగు రూపాంతరముల నిందు జేర్పలేదు.

మిత్రుఁడు, మిత్రము
శరణుఁడు. శరణము
పాత్రుఁడు, పాత్రము
భాజనము, భాజనుఁడు
వృక్షము, వృక్షమ్ము, వృక్షంబు
మిత్రము, మిత్రమ్ము, మిత్రంబు
మిత్రములు, మిత్రమ్ములు, మిత్రంబులు

ఇట్లు అమహదర్థక అకారాంత శబ్దములన్నియు నెఱుంగునది.

గురువు, గురుఁడు
వృద్ధుఁడు, వృద్ధ
మూర్ఖుఁడు, మూర్ఖ
విష్ణుఁడు, విష్ణువు
శంభుఁడు, శంభువు
వసుఁడు, వసువు
విధాత, విధాతృఁడు
ధాత, ధాతృఁడు
సవిత, సవితృఁడు
నేత, నేతృఁడు
నీచు, నీచుఁడు
గృహస్థు, గృహస్థుఁడు
చార్వాకు, చార్వాకుఁడు
చరిత్రి, చరిత్రము, చరిత, చరితము
అలక, అలకము
అభిలాషము, అభిలాష

భ్రమము, భ్రమ
విజృంభణము, విజృంభణ
వధము, వధ
వేగము, వేగ
స్ఫురణము, స్ఫురణ
హంసము, హంస
దూత, దూతుఁడు
యోధ, యోధుఁడు
ఘంట, ఘంటుఁడు
కంధరము, కంధర
నాసిక, నాసికము
భిక్షు, భిక్షుము
దంష్ట్ర, దంష్ట్రము
గ్రీవ, గ్రీవము
పాదుకము, పాదుక
ఉల్కము, ఉల్క
ఋత్విజుఁడు, ఋత్విక్కు
నీవృతము, నీవృక్కు
హనుమానుఁడు, హనుమంతుఁడు
హనుమ
భగవానుఁడు, భగవంతుఁడు
వణిక్కు, వణిజుఁడు
పుష్పముక్కు, పుష్పముచుఁడు
వేదవిత్తు, వేదవిదుఁడు
పాలితకకుప్పు, పాలితకకుభుఁడు

అక్షతము, అక్షత
తరంగము, తరగ
అమృతలిట్టు, అమృతలిభుఁడు
త్వక్కు, త్వచము
తటిత్తు, తటిత్తము
జలముక్కు, జలముచము
మధులిట్టు, మధులిహము
కకుప్పు, కకుభము
ప్రావృట్టు, ప్రావృషము
ఆపత్తు, ఆపద
తృట్టు, తృష
సంపత్తు, సంపద
ముత్తు, ముదము
క్షుత్తు. క్షుధ
దృక్కు, దృశ
దిక్కు' దిశ
రుట్టు, రుష
త్విట్టు, త్విష
బ్రహ్మ, బ్రహ్మము (తత్త్వతపోవేద
యోగవాచకము)
బ్రహ్మ, (విధాతృవాచకము)
ఆత్మ, ఆత్మము, ఆత్ముఁడు
మహిమ, మహిమము
అణిమ, అణిమము
గరిమ, గరిమము

ఘృతస్పృక్కు, ఘృతస్పృశుఁడు
సురద్విట్టు, సురద్విషుఁడు
పీతిమ, పీతిమము
నీలిమ, నీలిమము
రక్తిమ, రక్తిమము
పటిమ. పటిమము
శోణిమ, శోణిమము
శ్వేతిమ, శ్వేతిమము
ధవళిమ, ధవళిమము
విశదిమ, విశదిమము
పాండిమ, పాండిమము
క్రసిమ, క్రసిమము
ద్రఢిమ, ద్రఢిమము
మ్రదిమ, మ్రదిమము
స్థేమ, స్థేమము
ప్రేమ, ప్రేమము
స్ఫేమ, స్ఫేమము
వరిమ, వరిమము
ద్రాఘిమ, ద్రాఘిమము
బృందిమ, బృందిమము
జగము, జగత్తు
ఇంద్రజి, ఇంద్రజిత్తు, ఇంద్రజిత్తుఁడు
రాహువు, రాహు
బాహువు, బాహు, బాహ
ఉరము, ఉరస్సు, ఉరసు

# ప్రకరణము 8.

లఘిమ, లఘిమము
ప్రథిమ, ప్రథిమము
బంహిమ, బంహిమము
కాళిమ, కాళిమము
తపము, తపస్సు, తపసు
శిరము, శిరస్సు, శిరసు
సదసు, సదస్సు, సదము
యశము, యశస్సు, యశసు
అర్చి, అర్చిస్సు
ధనువు, ధనుస్సు
రోచి, రోచిస్సు
ఆయువు, ఆయుస్సు
అంగిరుఁడు, అంగిరసుఁడు
ఉగ్రశ్రవుఁడు, ఉగ్రశ్రవసుఁడు
ప్రచేతుఁడు, ప్రచేతసుఁడు
ఊర్ధ్వరేతుఁడు ఊర్ధ్వరేతసుఁడు
పురోధ, పురోధసుఁడు
బల్లిదుఁడు, బల్లిదము
అక్కజుఁడు, అక్కజము
కావలుఁడు, కావలము
బెట్టిదుఁడు, బెట్టిదము
బెడిదుఁడు, బెడిదము
మిసిమింతుఁడు, మిసిమింతము
మొక్కలము, మొక్కలుఁడు
కలను, కలఁకు
కెలను, కెలఁకు
కొలను, కొలఁకు

తేజము, తేజస్సు, తేజసు
వక్షము, వక్షస్సు
మనము, మనస్సు, మనసు
తమము, తమస్సు, తమసు
వఱను, వఱఁకు
వలను, వలఁకు
రేను, రేఁగు
గోను, గోఁగు
కన్నియ, కన్నె
జన్నియ, జన్నె
వన్నియ, వన్నె
కొంచియము, కొంచెము
కొండియము, కొండెము
ముత్తియము, ముత్తెము, ముత్యము
విడెము, విడియము, విడ్యము
వీడియము
బత్తెము, బత్యము, బత్తియము
కడెము, కడియము, కడ్యము
అందఱు, అందోఱు
పెక్కండ్రు, పెక్కురు
పలుగురు, పలుగుండ్రు
వారు, వారలు, వాండ్రు
అది అద్ది, ఆయది, అయ్యది
అవి, అవ్వి, ఆయవి, అయ్యవి
ఇది, ఇద్ది, ఈయది, ఇయ్యది
ఏఁడు. ఏవాఁడు, ఎవ్వాఁడు,
ఎవ్వఁడు

కొఱను, కొఱఁకు
గవను, గవఁకు
నెఱలు, నెఱఁకు
మాఱిను, మాఱిఁకు
ఎది, ఏది, ఎద్ది, ఏయది, ఎయ్యది
ఎవి, ఏవి, ఎవ్వి, ఏయవి, ఎయ్యవి
ఎవ్వరిత, ఎవర్త, ఎవ్వత, ఎవరిత,
ఎవర్త, ఎవత, ఎవ్వరితి,
ఎవ్వర్తి, ఎవ్వతి, ఎవరితి,
ఎవర్తి, ఎవతి, ఎవ్వరితె,
ఎవ్వర్తె, ఎవ్వరు, ఎవరితె,
ఎవర్తె, ఎవతె, ఎవ్వర్తుక,
ఎవ్వతుక, ఎవర్తుక, ఎవ
తుక
అతఁడు, ఆతఁడు
ఇతఁడు, ఈతఁడు
ఎతఁడు, ఏతఁడు
ఆమె, ఆపె, ఆకె,
ఈమె, ఈపె, ఈకె,
ఏమె, ఏపె, ఏకె
నీవు, ఈవు
మీరలు, మీరు, ఈరు, ఈరలు.
నేను, ఏను
మేము, నేము, ఏము
తాము, తారు, తమరు

ఏరు, ఏవారు, ఏఁవారలు, ఏవాండ్రు
ఎవ్వారు, ఎవ్వారలు, ఎవ్వాఁడ్రు,
ఎవ్వరు, ఎవ్వఁడ్రు, ఎవరు,
ఎవండ్రు
ఒక్కరువుఁడు, ఒక్కొరు
వుఁడు, ఒరుఁడు, ఒరు
వుఁడు, ఒండు, ఒడ్లు
ఒకటి, ఒకొటి, ఒక్కటి, ఒక్కొటి,
ఎక్కటి, ఒకఁడు,
ఒకొండు, ఒక్కఁడు,
ఒక్కొఁడు, ఒండు
ఒకరిత, ఒకర్త, ఒకర్తు, ఒకర్తుక,
ఒకత, ఒకతుక, ఒకరిత,
ఒకొర్త, ఒకొర్తు,
ఒకొర్తుక, ఒకొత, ఒకొ
తుక, ఒక్కరిత,
ఒక్కర్త, ఒక్కరు,
ఒక్కర్తుక, ఒక్కత,
ఒక్కతుక, ఒక్కొరిత,
ఒక్కొర్త, ఒక్కొరు,
ఒక్కొర్తుక, ఒక్కత
ఒక్కొతుక, ఒకరితి,
ఒకర్తి, ఒకతి, ఒకొరితి,
ఒకొర్తి, ఒకొతి, ఒక్క
రితి, ఒక్కర్తి, ఒక్కతి

ఒక్కొరితి, ఒక్కొర్తి
ఒక్కొతి, ఒకరితె, ఒ
కర్తె, ఒకతె, ఒకొరితె,
ఒకొర్తె, ఒకొతె, ఒక్క,
రితె, ఒక్కర్తె, ఒక్క
తె, ఒక్కొరితె, ఒక్కొర్తె,
ఒక్కొతె, ఓర్త, ఓర్తి,
ఓర్తు, ఓర్తుక,
ఇద్దఱు, ఇరువురు, ఇరుగురు, ఇరు,
ఇర్గురు
ముగ్గురు, మూఁగురు, ముగురు, మూ
వురు, మువురు, మువ్వు
రు
నల్గురు, నలుగురు, నలువురు, నల్వురు
ఐదుగురు, అయిదుగురు
ఆఱుగురు, ఆర్గురు, ఆఱువురు, ఆర్వురు
ఏఁడుగురు, ఏడ్గురు, ఏడువురు,
ఏడ్వురు
పదుగురు, పదుగురు, పదుగుండ్రు,
పదుండ్రు, పదువురు
పలుగురు, పలువురు
వేగురు, వేవురు
తొఁగ, తొవ
పగలు, పవలు
పొఁగ, తీవ
తీఁగ, పొవ

ఒకఁడు, ఒకొఁడు, ఒక్కఁడు, ఒ
క్కొఁడు, ఒకరుఁడు,
ఒకొరుఁడు, ఒక్కరుఁడు,
ఒక్కొరుఁడు, ఒకరువుఁడు,
ఒకొరువుఁడు,

ఎగురు, ఎవురు
ఇగురు, ఇవురు
పొగరు, పొవరు
తొగరు, తొవరు
సగము, సాము, సవము
దప్పి, డప్పి
దాఁగు, డాఁగు
దెప్పరము, డెప్పరము
దిగు, డిగు
భుజించు, భుజియించు
గుణించు, గుణియించు
రచించు, రచియించు
నగించు, నగియించు
పడియెను, పడెను
చెడియెను, చెడెను
అనియెను, అనెను
కనియెను, కనెను
కొనియెను, కొనెను
తినియెను, తినెను
వినియెను, వినెను

వేఁగు, వేవు
ప్రోఁగు, ప్రోవు
ఇవము, ఇగము
నగు, నవు, నవ్వు
అగును, అవును, ఔను
మిఁగులు, మివులు
తగులు, తవులు
ఉండుదురు, ఉందురు, ఉండురు
అంటివి, అనితివి
కొమ్ము, కొనుము, కొండు, కొనుఁడు
కొందుఱు, కొందురు, కొండుఱు, కొండురు
రంజిలు, రంజిల్లు
భాసిలు, భాసిల్లు
వర్ధిలు, వర్ధిల్లు
విలసిలు, విలసిల్లు
రాజిలు, రాజిల్లు
సంధిలు, సంధిల్లు
భేదిలు, భేదిల్లు
కంపిలు, కంపిల్లు
చాక, చావక
నోక, నోవక
కమ్ము, అగుము, అవుము, ఔము
కండు, అగుఁడు, అవుఁడు, ఔడు
కాఁడు అనఁడు, అనండు

చనియెను, చనెను
మనియెను, మనెను
ఇడియెను, ఇడెను
పడ్డ, పడిన
చెడ్డ, చెడిన
ఇడ్డ, ఇడిన
అనుదురు, అందురు, అండురు
చెప్పుము, చెపుము
చెప్పుడు, చెపుడు
అపుడు, అప్పుడు, అప్డు
ఎపుడు, ఎప్పుడు, ఎప్డు
ఇపుడు, ఇప్పుడు, ఇప్డు
కావుతను, కాతను, కాక
అగుట, కావుట
అగుదును, కావుదును
కానను, కావునను
అనుఁడున్, అనవుడున్, నావుడున్
ఔడు, అవుడు
చెప్పఁగన్, చెప్పగాన్
గవుసెన, గౌసెన
పూవు, పూ, పువ్వు, పువు
తెగులు, తెవులు
తిగియు, తివియు
అరుదెంచు, అరుగుదెంచు
ఏతెంచు, ఏగుదెంచు

కానఁడు, కనఁడు, కనండు
నేచెను, నేరిచెను, నేర్చెను
నేరఁడు, నేరవఁడు, నేర్వఁడు
పోదురు, పోవుదురు
పోఁడు, పోవఁడు
పాదము, పదము, పొమ్ము
పిలఁడు, పిలువఁడు
పిలుము, పిలువుము
రెమ్ము, రెండు
కుందేలు, కుందెలు
తోఁడేలు, తోఁడెలు
నాఁగేలు, నాఁగెలు
నేరేడు, నేరెడు
మారేడు, మారెడు
పూరేడు, పూరెడు
తంగేడు, తంగెడు
ఊయేల, ఊయెల, ఊయ్యేల, ఉయాల, ఊయల, ఊయ్యాల, ఉయ్యేల, ఉయ్యేల, ఉయ్యాల, ఉయ్యల
అఱ్ఱు, అఱు
గొఱ్ఱియ, గొఱియ
నన్ను, నను
మమ్ము, మము
కల్లు, కలు

పంపు, పనుపు, పన్పు, పనుచు, పంచు,
పన్పు, అనుపు, అన్పు,
అనుచు, అన్చు, అంచు
పుచ్చు, పుత్తెంచు
నల్లేరు, నల్లెరు
పల్లేరు, పల్లెరు
పెన్నేరు, పెన్నెరు
మానేరు, మానెరు
ఆడేలు, ఆడెలు
అయ్యారె, అయారె
అవ్వారి, అవారి
ఇట్టిక, ఇటిక
ఉప్పవడము, ఉపవడము
ఉమ్మి, ఉమి
ఎక్కసక్కియము, ఎకసక్కియము, ఎకసెక్కియము,
ఎక్కిరింత, ఎకిరింత
ఎడ్డ, ఎడ
ఎన్నిక, ఎనిక
ఎమ్ముక, ఎముక
కజ్జాయము, కజాయము
కట్టిక, కటిక
కప్పురము, కపురము
కమ్మటము, కమటము
కమ్మతము, కమతము

ఇల్లు, ఇలు
పల్లు, పలు
ముల్లు, ములు
విల్లు, విలు
పిల్లు, పిలు
అక్కటు, అకటు, కట్టు, కటా, కటు, కట్టా
అట్టిక, అటిక
అట్టుక, అటుక
అట్టె, ఆటె
అయ్యో, అయో
చెమ్మట, చెమట
చెల్లియలు, చెలియలు
జవ్వాజి, జవాజి
జాబిల్లి, జాబిలి
తమ్మటము, తమటము
తమ్ములము, తములము
తల్లి, తలి
తుమ్మికి, తుమికి
తువ్వర, తువర
తెల్ల, తెల
దవ్వు, దవు
దివ్వియ, దివియ
నిద్దుర, నిదుర
నివ్వరి, నివరి
నివ్వాళి, నివాళి,
కువ్వాడము, కువాడము
కొట్టిక, కొటిక
కొమ్మ, కొమ
కొయ్యగూర, కొయగూర
గయ్యాళము, గయాళము
గిజ్జగాఁడు, గిజగాఁడు
గుజ్జరాతి, గుజరాతి,
చిట్టి, చిటి
చిన్న, చిన
చిమ్మటు, చిమటు
చెన్నఁటి, చెనఁటి
బొమ్మికము, బొమికము
బొమ్మిడికము, బొమిడికము
బొమ్మిడికము, బొమిడీకము
మజ్జ, మజ
మత్తాబు, మతాబు
మల్లారము, మలారము
ముక్కు, ముకు
ముద్దియ, ముదియ
మెట్టిక, మెటిక
మొక్కరము, మొకరము
మొగ్గరము, మొంగరము
మొల్లాము, మొలాము
రడ్డి, రడి
లొట్టిపిట్ట, లొటిపిట
వట్టి, వటి

నువ్వు, నువు
నేట్టిక, నెటిక
నెమ్మలి, నెమలి
పవ్వళించు, పవళించు
పిన్న, పిన
పుల్లియ, పులియ
పెద్ద, పెద
పొట్టి, పొటి
ప్రొకెన్న, ప్రొకెన
ప్రెగ్గడ, ప్రెగడ
బెగ్గడు, బెగడు
బొమ్మ, బొమ
అమ్మ, అమ
అక్క, అక
అవ్వ, అవ
అయ్య, అయ
అప్ప, అప
అచ్చటు, అచటు
ఇచ్చోటు, ఇచోటు
అచ్చటు, అచటు
ఇచ్చటు, ఇచటు
ఎచ్చోటు, ఎచోటు
ఎచ్చటు, ఎచటు
ఆడపము, అడపము
ఆరిదళము, అరిదళము
ఆలది, అలది
వయ్యాళి, వయాళి
సన్నియ, సనియ
సవ్వడి, సవడి
సివ్వంగి, సివంగి
అట్టు, అటు
ఇట్టు, ఇటు
ఎట్టు, ఏటు
అన్ని, అని
ఇన్ని, ఇని
కొన్ని, కొని
మిమ్ము, మిము
తమ్ము, తము
పెండారము, పెండరము, పెండేరము
పెండెరము
బంగారము, బంగరము, బంగరు,
బంగరువు
బేహారము, బేహరము, బెహారము
వీటతాటము, వీటతటము, విటతటము
సంతోసము, సంతొసము, సంతసము
ఓయారము, ఒయారము
కోలె, కొలె
కడఁగు, కడంగు
గూడారము, గుడారము
గోరువంక, గోరువంక
జోహారు, జోహారు
నీలుగు, నిలుగు

నీలుగు, ఈలుగు
నెగయు, ఎగయు
పొందు, ఒందు
పొసరు, ఒసరు
వూను, ఊను
పొదవు, ఒదవు
ఆరాటము, ఆరటము
కక్కూరుతి, కక్కురితి
కేళాకూళి, కేళకూళి, కేళాకుళి
కొమారుఁడు, కొమరుఁడు
కొమారిత, కొమరిత
గంబూరము, గంబురము, గంబూర,
గంబురా
దాకలి, డాకలి
దిగు, డిగు
దూయు, డూయు
దెందము, డెందము
దెప్పా, డెప్పా
దొంగ, డొంగ
దొప్ప, డొప్ప
ఏతము, ఏతాము,
కళ్ళము, కళ్ళాము
గాలము, గాలాము
గుడ్డము, గుడ్డాము
గోణము, గోణాము
గోతము, గోతాము

మారు, మరు
మూలుగు, ములుగు
మోఱకు, మొఱకు
అడఁగు, అణంగు
చిల్లాడము, చిల్లాణము
తడగము, తణగము
నాడెము, నాణెము
పోఁడిమి, పోణిమి
మిడుఁగు, మిణుఁగు
వడఁగు, వణఁగు
మిడుఁగుఱు, మిణుఁగుఱు
దక్కు, డక్కు
దగ్గఱు, డగ్గఱు
కినుక, కిన్క
కానుక, కాన్క
చిలుక, చిల్క
కాలువ, కాల్వ
అడుగు, అడ్గు
కడుపు, కడ్పు
పెరుగు, పెర్గు
కూరుకు, కూర్కు
కలికి, కల్కి
ములికి, ముల్కి
బుడిపి, బుడ్పి
పొలతి, పొల్తి
అబ్బురము, అబ్రము

జాజము, జాజాము
ఝంజము, ఝంజాము
జోతము, జోతాము
తణగము, తణగాము
బొండ్లము, బొండ్లాము
మండము, మండాము
లాతము, లాతాము
వీణము, వీణాము
మ్రాన్పడె, మ్రానుపడె
మినుకడె, మిన్కడె
పత్తురువారు, పత్తుర్వారు
కారుకొనియె, కార్కొనియె
రాములు, రాముల్
వనములు, వనముల్
అదే, అదుగో, అదిగో
అడగో, వాఁడుగో
ఇదగో, వీఁడుగో
కద, కదా
కినుక, కిన్క, కింక
గుడ్డి, గ్రుడ్డి
టక్కు, తక్కు
నిక్కువము, నిక్కము
ప్రక్క, పక్క
కప్పురము, కప్రము
నెత్తురు, నెత్రు
అదురుచు, అద్రుచు
ఎదురుచు, ఎద్రుచు
పదురుచు, పద్రుచు
జూదము, జూజము
ఆవుదు, ఆవుజు
జవాది, జవాజి
జాది, జాజి
జాదు, జాజు
విరవాది, విరవాజి
అల్ల, అల, ఆ
ఆవల, అవ్వల, అవతల, ఆతల, ఆవల
ఇదే, ఇదుగో, ఇదిగో
మొగము, మొకము
ముందు, మున్, మునుపు, మున్ను
మొక్క, మోక, మోసు
మొగిలు, మొయిలు
లొంగు, లోగు
రొక్కము, రొకము
సుమీ, సుమ్మీ, సుమ్మా, సుమి
సువ్వే, సూ, సువె
హెచ్చు, ఎచ్చు

## Diminutives.

### అల్పార్థములు.

వృక్షము, వృక్షకము
బాలుఁడు, బాలకుఁడు
స్వము, స్వకము
పుత్రుఁడు, పుత్రకుఁడు

సింహము, సింహకము
శరభము, శరభకము
రాసభము, రాసభకము
అశ్వము, అశ్వకము
సర్వము, సర్వకము
చిఱుత, చిఱుతుక
నెలఁత, నెలఁతుక
పొలఁతి, పొలఁతుక
ఏడము, ఏడకము

## Exercise.

### సాధకము.

### I

శిష్టచరితులైన బుద్ధిమంతులెల్లం బౌరుషంబుఁ గొనియాడుదురు. స్వశక్తిచేఁ గార్యంబుల నెఱవేర్చికొననేరని క్లీబు లదృష్టంబు గొనియాడుదురు. సకల కార్యంబులు దైవపౌరుషంబులయందు సుప్రతిష్ఠితంబులై యుండు. కర్మంబు పూర్వకృతంబు నైహికంబనియు నిరుదెఱఁగులయి యుండు. ఇందెయ్యది బలవత్తరంబది తక్కటి దానికిఁ బ్రతికారియగు. తద్బలాబల పరిజ్ఞానంబు ధనంబున ననుమేయింపదగు ఫలాఫలబ్ధికి బ్రత్యక్షంబైన హేతువు లేకున్నదది పూర్వకర్మజన్యంబని యెన్నందగు. మానిసి జతనం బల్పంబయ్యు నొక్కతఱి నెక్కుడుగ ఫలించెనా యదియు ముందటి కర్మంబున నయ్యెనని యందురు. (శుక్రనీతిసారము)

☞ ఇందేశబ్దములకు రూపభేదము కలదో కనుఁగొని వానిరూపాంతరములను వ్రాయుఁడు.

### II

పరీక్షకులు మార్దవంబున గౌరవంబున వర్ణంబున సువర్ణంబున సువర్ణంబు గరఁగి పరీక్షించునట్లు రాజు భృత్యునిఁ గర్మంబున సహవాసంబున గుణంబున శీలంబునఁ గులంబునఁ బరీక్షించి విశ్వాస్యుని విశ్వసింపవలయు. కర్మశీల గుణంబులు పూజ్యంబులగునట్లు కేవల జాతిగుణంబు లేనాఁడును బూజ్యంబులు గావు. జాతికులంబుల వలన శ్రైష్ఠ్యంబురామి వివాహంబుల భోజనంబులందక్క నుద్యోగంబులఁ గులజాతి పరీక్షణం బనావశ్యకంబు. సత్య

హాదులు నభిజనవంతులు ధనికులు సద్వంశ్యులు సుశీలురు సత్కార్య నిరతులు స్వకార్యంబు నందలి యత్నంబు కంటె రాజ కార్యంబునఁ బెక్కు మడుఁగులు యత్నాధిక్యము గలవారు భృతిచేతన సంతసించు వారును బరోపకారనిరతులు రాజున కపరాధంబు గావించు పుత్త్రునేని రాజున కర్పించు వారునను సత్కార్యంబున నచిరక్రియులు ననలసులు నసత్కార్యంబునఁ జిరక్రియులు ప్రభువన్యాయగామియైన దానుపట్టివారుగాక ప్రబోధించువారు రాజునందు రాణివాసంబునందు రాజపుత్త్రునందు మిత్రులందుదోషంబులు దడవనివారు వారిని శ్లాఘింపనివారు నిందింపని వారు రాజదత్తంబైన వస్త్రమాల్యాదులు నతని యెదుట ధరించువారు నాయంబునకుం దగిన వ్యయంబు గలవారు దయాళురు శూరులు రాజు నకార్యంబు రహస్యంబున బోధించువారునగు భృత్యులు ప్రశస్యులు. (శుక్రనీతిసారము)

ఇందే శబ్దములకు రూపభేదముకలదో గనుఁగొని వాని రూపాంతరములను వ్రాయుఁడు.

## III

భటులు భృతిచే ధనమాత్రంబు గొందురు. రాజును యువరాజును నమాత్యులచే మిగుల మాన్యులును వారి కంటె నమాత్యులు న్యాయులునగుదురు. ఆమాత్యులకంటెఁ దక్కిన యధికారి గణంబు న్యూనంబు. ఆయుతికుండు మంత్రితుల్యుండు; రాజుతో సమంబుగ నమాత్యులు క్రీడింపందగదు; క్రీడించిన రాజును విశేషింపఁ జేయవలయు. మంత్రులచే రాజు నవబోధనంబును, బంధులును, మిత్రులును, మిగులఁ బూజనీయులు. సేవకుఁడు రాజుచే నాహూతుండగుడుఁ గార్యశతంబేని త్యజియించి సత్వరంబుగఁ బోవుచు వారిచే సుమంత్రితంబయిన కార్యంబు మిత్రునకే నెఱిఁగింపక భృతింద క్కనదత్తంబయిన రాజద్రవ్యంబు నభిలషింపక రాజు నానతినొందక కావ్యమాధ్యస్థిక భృతినపేక్షింపక యాపత్కాలంబునఁ బుత్త్రధనప్రాణాదుల నేని రాజురక్షించుమ నుత్కోచరు

బెన్నండేని గ్రహియింపక, దృశ్యలోభంబున సత్కార్యంబుఁ జెఱుపక రాజునకు దుర్బోధంబు సేయక శాస్త్ర వ్యతిరేకంబుగను దీక్షణంబుగను దండించు భూపుని రాజ్యగుప్తికై యేకాంతంబున నిగ్రహించి బోధించు చుండవలయు. (శుక్రనీతిసారము)

☞ ఇందేశబ్దములకు రూపభేదము కలదో కనుఁగొని వాని రూపాంతరములను వ్రాయుఁడు.

IV

బ్రహ్మచారి గురుకులంబున వసించుచు దాంతుఁడై గురువునకు హిత మాచరించుచు నతనియందు దృఢసౌహార్ద్రంబు పెట్టి దాసునిరీతి నీచుఁడై సాయంప్రాతర్వేళల గుర్వగ్న్యాదిత్యసురోత్తముల నుపాసించుచు గాయిత్రిని జపించుచు సంధ్యాత్రయము నుపాసింపవలయు. సాయంప్రాత స్సంధ్యలందు మౌనముఁ బూనవలయును. గురువు పిలిచెనేని వినయముతో డాసి యారంభావసానంబుల నాచార్యచరణములు శిరస్సుసోఁక సాష్టాంగప్రణామంబు సేసి వేదములఁ జదువవలయును. తమతమ సూత్రోక్త ప్రకారంబున మేఖలయు నజినము వస్త్రము దండముఁ గమండలు వుపవీతము దర్భపవిత్రము ధరింపవలయు. (శ్రీమదాంధ్ర వచన భాగవతము)

☞ ఇందేశబ్దములకు రూపభేదము కలదో కనుఁగొని వాని రూపాంతరములను వ్రాయుఁడు.

V

అంత నుపవసించి కృతస్నానులై యనాహతములఁ గట్టి యగ్నిహోత్రము నిర్వర్తించి గోవిప్రభూతముల కుచితగ్రాసాదు లొసంగి బ్రాహ్మణుల స్వస్తివాచనంబు వడసి సురభిధూపము లాజ్యదీపములుఁ జేసార నొప్పు శాలాభ్యంతరంబునం బ్రాఙ్ముఖ కుశాసనంబులందు సురాసురు లాసీనులైరి. అట్టియెడ దుకూలము గట్టిన శ్రోణీతటంబు భారమునం జేసి చిన్నవినడతోఁ గనకనూపురరవంబు చెలువార మదవిహ్వలంబైన చూడ్కి

సారించుచు నమ్మాత్రమాకుంభ స్తలి యుద్వృతకుంభయుఁగొని యాశాలయోనికిఁ జనుదెంచుటయుఁ గనకకుండల మండిత కర్ణయుగళ నాసికా కపోలచారువదన విలసితయై విగళిత స్తనావరణయై పరదేవతాఖ్య నొప్పు నా శ్రీసతిం జూచి యసురులుద్గత భయవీక్షితంబులతో మోహా మెనసిరి.

(శ్రీమదాంధ్రవచన భాగవతము.)

☞ ఇందే శబ్దములకు రూపభేదము కలదో కనుఁగొని వాని రూపాంతరములను వ్రాయుఁడు.

## VI

☞ ఈ క్రింది శబ్దములకు రూపాంతరముల నిండు.

దూతుఁడు, తటి, ధనువు, కీర్తనము, పడిన, పీఱుంగు, పరశ్వాతారు, పరువు, ఘోటుక, విహంగమము, పేద, గుర్వు, రవము, దిగ్గు, మస్తము, వక్షస్థలి, మెఱుపు, పోయెడు, సౌరువు, ఒనర్తువు, సాధులు, జనులు, పాలనము, పుట్టుగు, సములు, ఏను, మును, సోదరీయులు, తనయ.

## VII

వరియింపుము, విను, నీవు, నాన్, ఎద్ది, పోమన్, ఎవ్వరు, పంపు, అంకూరము, బోధము, నగవు, ఇట్లు చరిత్ర, గాడ్పు అచ్చోటు, అపుడు, తన్ను, ఎడఁద, చట్టురాయి, ఊర్ధ్వబాహువు, ఏఁడులు, తునిమి, హుతాశుఁడు, ఆబ్రము, అంటివి, ఎవ్వి, అవధరింపుము, పెక్కురు, చుమి, నేరుపు, ఒకఁడు, వారు, పెండిలి, కర్మము పురువు, అవుడు.

## VIII

అట్టులు, సృజించెన్, నాలుగు, నడువడి, అనుటు, దుమ్ము, ఒసంచు, చిగురు, కై, అందురు, ఆడంగు వగపు, రాతిరి, కానన్, మృగుల, నడవు, మానుషుఁడు, పృథ్వి, పోరాటు, మడువు, భుజంగము, భల్లుకము, వేడ్క, చెరలాడు, ఈయక, అరుగుదెంచు, గోరులు, సుధాంధసులు, గెల్వన్, పారాయణ, శరణు, ఒనర్తున్, భజింతున్, తనూజుఁడు.

## IX

నివురు, తీఁగె, తేఁటులు, చిలుక, మెయి, సంపత్తు, నిమేషము, పుణుకు, మనము, దావము, హనుమంతుఁడు, అనుచు, చేయి, నమ్మిక, అవలోకించి, భుజగి, నలువురు.

## X

చెపుమా, హాలాహలము, విడువుము, పరిరంభణ, బంధువు, కోరిక, చెలిమి, వినిచెదన్, నన్ను, వధించె, ఆత్మ, ఓయుఁరము, పంపు, అడ్డంపెట్టు, దాయుఁ, దిగు, తోడితెచ్చి, తపము, ఉన్నవాఁడు, అగుచున్, అరవము, వేరక, వలవదు.

# CHAPTER IX.

## Orthography.

### శబ్దముల వర్ణక్రమనిర్ణయము.

---

ఆంధ్రభాషయందుఁ జాలమంది చిరకాలమునుండి యనేక శబ్దముల యొక్క వర్ణ విన్యాసమును, యథావిధిగా వ్రాయక యెవరికిఁ దోఁచినట్లు వారనేక విధములుగా వ్రాయుచున్నారు.

ఈ విషయమై ప్రాచీనాధునాతన వ్యాకరణములయందు విపులముగాఁ జెప్పఁబడి యుండలేదు. అనేకములైన అముద్రిత ప్రతులయందును, తండోపతండములుగా నున్న ముద్రిత ప్రతులయందును నీవిషయమైన తప్పులెక్కువగాఁ గాన్పించు చున్నవి.

అచ్చుపోత్తమన్నంత మాత్రముచేత శుద్ధప్రతియను భ్రమతో నా యా గ్రంథములను జదువుచుండు బాలురకు వాని వలన ననిష్టము గలుగుచున్నది.

ప్రారంభదశలో ముద్రణము, సంస్కారులు కానివారును విదేశీయులు నైనవారి చేతులలోఁ బడుటచే భాష యనేక ప్రమాదములకు లోనైనది.

యథాశక్తిని, అట్టి వర్ణక్రమ దోషమును, వాని సాధురూపముల నీ క్రిందఁ జూపుచుంటిమి.

#### బిందువు.

ఈ క్రింది శబ్దములలో బిందువు నిత్యము. ఈ బిందువు, ర, శ, ష, స, హ, ఇవి పరమైనయపుడు నిత్యముగా వచ్చును.

ఉదా:— సంసారము, సంహారము, సంశయము, సంరక్షణము. వికల్పముగా బిందువుగాని "కఖ గఘ" లు పరమైనపుడు, ఙ, 'చఛ జఝ' లు పరమయినపుడు, 'ఞ', 'టఠ డఢ' లు పరమవునపుడు 'ణ', 'తథ దధ,' లు పరమైనపుడు 'న', 'పఫ బభ' లు పరమయినపుడు 'మ' 'యలవలు' పరమయిన యప్రుడు యలవలే వచ్చును. వానికిఁ దెలుఁగున బిందువులను వాడుచున్నారు.

ఉదా—అహంకారము, సంగతి, సంఘాతము, సంచయము, కంజాతము, అహంత, సందర్భము, సంధానము, సంనాహము, సంపద, సంబంధము అహంభావము, సంమతి, సంయమి, సంలక్షితము, సంవత్సరము.

| సంస్కృతము. | | | తెలుఁగు. |
|---|---|---|---|
| ఉదా—పఙ్క్తి | ... | ... | పంక్తి |
| అఙ్కము | ... | ... | అంకము |
| పుఙ్ఖితము | ... | ... | పుంఖితము |
| గఙ్గ | ... | ... | గంగ |
| జఙ్ఘ | ... | ... | జంఘ |
| అఞ్చితము | ... | ... | అంచితము |
| రిఞ్ఛోళి | ... | ... | రింఛోళి |
| అఞ్జనము | ... | ... | అంజనము |
| కణ్టకము | ... | ... | కంటకము |
| కణ్ఠము | ... | ... | కంఠము |
| అణ్డము | ... | ... | అండము |
| తన్తువు | ... | ... | తంతువు |
| మన్థము | ... | ... | మంథము |
| మన్దరము | ... | ... | మందరము |
| బన్ధము | ... | ... | బంధము |

| సంస్కృతము. | | | తెలుఁగు. |
|---|---|---|---|
| అన్నము | ... | ... | అన్నము |
| కమ్పము | ... | ... | కంపము |
| లమ్బము | ... | ... | లంబము |
| బమ్భరము | ... | ... | బంభరము |

మొదలయినవిగలవు.

N. B. తెలుఁగున బిందుపూర్వకశబ్దములకు సరియైన సంస్కృత రూపములు చూపఁబడినవి.

కాని తెలుఁగులో వీనిని అనుస్వారరూపముగానే వ్రాయుచు వ్రాసలుఁగూడ ననుస్వారముతోడనే వేయుచున్నారు.

ఇవి, ఆంధ్రభాషయందుఁ జిరకాలమునుండి వాడఁబడుచు వచ్చుటచేతఁ బ్రయోగార్హములుగా గ్రహింపఁబడుచున్నవి.

"అంకముఁజేరి శైలతనయా స్తనదుగ్ధములాను వేళ బా
ల్యాంకవిచేష్టఁ దొండమున నవ్వలిచన్గబళింపఁ బోయి యా
వంకఁగుచంబుఁ గానకహివల్లభ హారముఁగాంచి వేమ్రుణా
ళాంకుర శంకనంటెడు గజాస్యునిఁగొల్తు నభీష్ట సిద్ధికిన్"

ఈ పద్యమందు అంక, అంక, అంకుర ఇవి సంస్కృత శబ్దములు కావున జకారమాదియందుఁ గల కకారముగలవి "వంక" శబ్దము తెలుఁగు గావున అనుస్వారము ముందుగల కకారముగలది. దీనికిని వానికిని అలసాని పెద్దన్నగారు ప్రాసవేసిరి. ఆయనయే—

"ప్రాంచద్భూషణబాహుమూలరుచితోఁ బాలిండ్లు పొంగారఁగా
యంచుల్మోయఁగఁ గౌఁగిలించి యధరంబానింపహా శ్రీహరీ
యంచున్ బ్రాహ్మణుఁడోరమోమిడితదీయాంసద్వయంబంటి పో
మ్మంచుందోసెఁగలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్."

అని ప్రాసలు వేసినారు.

ఈ పద్యమందు; "ప్రాంచత్" అనునది జకారముతోఁ గూడిన చకారము ఇది సంస్కృతము. తక్కిన మూఁడు ప్రాసములును దెలుఁగులు కావున అనుస్వార పూర్వక చకారములు.

తెలుఁగుశబ్దములలో.

బిందువుయొక్క యుచ్చారణ, "న, ణ, మ" లకుఁగూడ గలుగుచున్నది.

ఉదా—వంటు, వణ్టు—కొండ, కొణ్డ— పంతము, పన్తము— అందము, అన్దము—గంప, గమ్ప—కంబము, కమ్బము—ఇట్లున్నవి.

కావుననే యిట్టి స్థలములయందు "నణమ"లతో యతి వేయుచున్నారు.

ఈ శబ్దములు బిందువులతోడనే వ్రాయవలెను గాని రెండవ రూపముగా వ్రాయఁగూడదు.

సిద్ధసాధ్యాది బిందుభేదము లిదివరకే చెప్పఁబడినవి.

వ్రాఁతల యందుఁ ద్విరవర్ణమునకుఁ బూర్వమందు బిందువును వ్రాయుట తప్పు.

"పరగను ధాబ్ధియం దమృత పానముమాటికిఁ జేయుచుం బయో
ధరుఁ డుడు రూపముల్ స్ఫటికధారుణిపై వడగండ్లు రాల్చినన్
బొరసెడు నంతపాటి పదమున్ క్షణమాత్రి కశోరభావముల్
నిరతసుధోద్గిరంబులు మనీషుల ప్రాతిభసూక్తులొప్పగాన్

ఇది బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిగారి యాంధ్రప్రసన్న రాఘువ విమర్శనములోని పద్యము.

ఈపద్య తృతీయ చరణమునందువలె పొల్లేగాని అనుస్వారము మాత్రము వ్రాయఁగూడదు.

టు, గలశబ్దములు.

మశిష్టకము, స్పష్టము (అడగఁబడినది.) ఉత్కృష్టము దృష్టి: అష్టము, కష్టము, సృష్టి, అనిష్టము, ఇష్టము, చేష్ట, అభీష్టము, స్పష్టము,

పరివేష్టనము, దుష్టుఁడు, దృష్టుఁడు, (చూడఁబడినవాఁడు) దృష్టుఁడు (దురుసువాఁడు) నికృష్టము, అవకృష్టము, అష్టమి, అష్టకము; అష్టమము; దృష్టాంతము, దృష్టి, త్వష్ట; క్రోష్టువు, ద్విష్టము, ఆదిష్టము, ఆదేష్ట. అరిష్టము, ఉపవిష్టుఁడు, నష్టము, వేష్టితము, మష్టము, ముష్టి, ఘృష్టము, దష్టము, పుష్టము, భ్రష్టుఁడు, ఉద్దిష్టము, దిష్టి, ఇష్టి, ఇష్టము, విష్టరము, విష్టపము, పిష్టము, భ్రాష్ట్రము, క్లిష్టము, శిష్టుఁడు, తుష్టము, ఆవిష్టము, రుష్టము, పేష్ట, నేష్ట, పుష్టి, సృష్టి, స్పష్టము, స్పృష్టము, హృష్టము, జుష్టము.

ఠ గల శబ్దములు.

వరిష్ఠము, బలిష్ఠము (వర + ఇష్ఠ = ఈవిధముగా ఇష్ఠ ప్రత్యయములు వచ్చు శబ్దములన్నియు నొత్తు 'ఠ' గలవి.)

శ్రేష్ఠము, భూయిష్ఠము, బంహిష్ఠము, గరిష్ఠము, లఘిష్ఠము, అల్పిష్ఠము, వరిష్ఠము; ప్రేష్ఠము, ద్రాఘిష్ఠము, పటిష్ఠము, మహిష్ఠము, అణిష్ఠము, హ్రసిష్ఠము, ప్రసిష్ఠము, జ్యేష్ఠుఁడు, కనిష్ఠుఁడు మొదలయినవి.

ప్రతిష్ఠ, నిష్ఠ, అంగుష్ఠము, కుష్ఠము, బహిష్ఠ, అంబష్ఠుఁడు, అధిష్ఠాత, అధిష్ఠానము, అధిష్ఠితము, కనిష్ఠుఁడు, నిష్ఠురము, అనుష్ఠానము, పృష్ఠము (వీపు) అష్ఠీవత్తు, అప్రతిష్ఠ, యుధిష్ఠిరుఁడు, వసిష్ఠుఁడు, షష్ఠి, (తిథి) గోష్ఠము, సజ్యేష్ఠుఁడు, ద్విష్ఠుఁడు, త్రిష్ఠుఁడు, మంజిష్ఠము, అపష్ఠము, పుంజిష్ఠము, భూమిష్ఠము, పరమేష్ఠి, అగ్నిష్ఠుఁడు, కాష్ఠము, కాష్ఠ, నిష్ఠ, నైష్ఠుర్యము, నిష్ఠురము, ప్రష్ఠవాహము, ప్రష్ఠౌహి, ప్రష్ఠుఁడు, సుష్ఠు, ధృష్ఠు, ప్రకోష్ఠము, హఠాత్తు.

థ—ధ.

వీని యుచ్చారణమందును, వ్రాఁతయందును, 'థ ధ' లకు భేదమంతగాఁ గాన్పించకుండుటచేత శబ్దజ్ఞానము లేనివారి విషయములో విస్తారము తప్పులు చేయుచున్నవారు. కావున నీ భేదములుగల కొన్ని ముఖ్యములయిన శబ్దముల నీ క్రింద జూపుచుంటిమి.

1 "స" అను అక్షరము క్రింద "థ" అనునది గాని "ధ" యెన్నఁడును నుండదు.

ఉదా—స్థానము, స్థితము, ప్రస్థము, స్థిరపడుట, వ్యవస్థ, స్థూలము, అస్థిరము, ఆస్థి, మొదలయినవి.

2 శబ్దాది యందున్న యక్షరములు "ధ" లుగాని "థ" లుగావు.

ఉదా—ధనము, ధాన్యము, ధార, ధట, ధీరుఁడు, ధీర, ధాత, ధృతి, ధర, ధ్వని, ధ్యానము, మొదలయినవి.

3 సజాతీయ ద్విత్వములలో "అశ్వత్థ" అశ్వత్థామ, ఉత్థానము, ఉత్థితము," తప్పఁదక్కినవి "ధ" లుగాని "థ" లుకావు.

ఉదా—బద్ధము, రుద్ధము, యుద్ధము, సన్నద్ధము, అనిరుద్ధుఁడు, బుద్ధి, విద్ధము, ఉద్ధూతము, మొదలయినవి.

థ. గల శబ్దములు.

కథ, ప్రథమము, ప్రథ, చతుర్థము, చతుర్థి, తిథి, పథము, మంథము, గ్రంథము, ఉద్గీథము, సోమపీథి, వ్యథ, వృథ, యథా, తథా, పృథివి, పార్థుఁడు, పృథువు, పృథ, రథము, కథంచితు, అథ, నాథుఁడు, శిథిలము, శ్లథము, శైథిల్యము' మథుర, (కృష్ణుని మధుర) రథ్య, భగీరథుఁడు, భాగీరథి, దాశరథి, దశరథుఁడు, పరిపంథి, గ్రథితము, అర్థము. (ధనము, వస్తువు, ప్రయోజనము, శబ్దార్థము) వ్యర్థము, మిథునము, మైథునము, ప్రథము, ప్రధనము, (యుద్ధము) మిథ్య, మింథము, మిథిల, మైథిల, సారథి, పథ్యము, అశ్వత్థ, అశ్వత్థామ, తీర్థము, ప్రమథుఁడు, మన్మథుఁడు, పార్థివుఁడు; అర్థి, రుక్థము, రిక్థము (ధనము)

ధ గల శబ్దములు.

అంధుఁడు, బధిరము, వధ, సుధ, బుధుఁడు, క్రోధము, వ్యాధి, బాధ, నాధుఁడు, ప్రధానము, విధి, బోధ శోధనము, మేధ, రాధ, సాధనము, సిద్ధుఁడు, వృద్ధుఁడు, ఆధారము, అధరము, మధువు, విధవ, క్రోధనము,

క్రోధము, క్రోధి, క్రుధ, విరోధము, విరోధి, సంధానము, పిధానము, విధాత, ఆధానము, మధుర. (మీనాక్షీమధుర) మధురము, గంధము, కంధి, వార్ధి, అంబుధి, లుబ్ధుడు, అర్ధము (సగము, కొంతముక్క) గృధ్రము, నిధనము, నైధనము.

N. B. ఋ (ృ) రు ( ) గల శబ్దములు.

"ఋ" వర్ణమును "రు" వర్ణముగాను, "వట్రువసుడి" ని "కొమ్ముక్రావడి" గాను వ్రాయుటతప్పు.

ఋక్కు, ఋగ్ధము, ఋక్షగంధ, ఋక్షగంధిక, ఋక్షము, ఋజీషము, ఋజువు, ఋణము, ఋషి, ఋతము, ఋతి, ఋతీయ, ఋతుమతి, ఋతువు, ఋతుధ్వజుఁడు, ఋత్విజుఁడు, ఋద్ధము, ఋద్ధి, ఋభుక్షుఁడు, ఋభువు, ఋశ్యకేతువు, ఋశ్యప్రోక్త, ఋశ్యము, ఋశ్యమూకము, ఋశ్యశృంగము, ఋషభి, ఋషభము, ఋషము, ఋషి, ఋష్యప్రోక్త, ఋగ్వేదము.

రు—గల శబ్దములు.

రుంజ, రుండము, రుందము, రుక్కు, రుక్మకారకుఁడు, రుక్మము, రుచకము, రుచి, రుచిరము, రుజ, రుటము, రుట్టు, రుతము, రుతి, రుత్త, రుత్తు, రుదితము, రుదురక్క, రుద్దు, రుద్రజట, రుద్రభూమి, రుద్రాక్షము, రుద్రాణి, రుద్రాక్షి, రుధిరము, రుధిరోద్గారి, రుద్ధము, రుబ్బు, రుబ్బుగుండు, రుమ, రుమాలు, రురువు, రువాణము, రువారము, రువ్వ, రువ్వము, రువ్వు, రుశతి, రుష, రుసి, రుహ.

సంస్కృత శబ్దములలో శబ్దాదిని ఉండుహల్లులపై నీక్రింద నుదహరించిన శబ్దములఁదప్ప, ఋకారము (ృ) లేని, రేఫ ఉకారము (కొమ్ముక్రావడి) లుండవు.

తెలుఁగునందు, ఋకారమును ఋకారచిహ్నమగు (ృ) వట్రువసుడి లేదు.

ఉదాహరణము.

క్రుద్ధుఁడు

| | |
|---|---|
| క్రుష్టు | క్రూరుఁడు |
| క్రుష్టము (మొఱ్ఱపెట్టఁబడినది.) | గ్రుక్క |
| క్రుధ | త్రుటి |
| త్రుటనము | బ్రువాణము |
| త్రుట్యము | బ్రువత్ |
| త్రుటితము | భ్రుకుంసుఁడు |
| ద్రుపదము | భ్రూకుంసుఁడు |
| ద్రుమము | భ్రుకుటి |
| ద్రుహిణుఁడు | భ్రూలత |
| ద్రుహి | భ్రూణము |
| ద్రువు | శ్రుతి |
| ద్రుతము | శ్రుతము |
| ద్రుపదుఁడు | స్రుక్కు |
| ద్రుణము | స్రువము |
| ద్రుఘణము | స్రుతి, (కాఱుట) |
| ద్రువయము | స్రువావృక్షము |
| ద్రూణము | ముక్కుడి |
| ధ్రువుఁడు | త్రుంచెను |
| ధ్రువము | గ్రుడ్డి |

శబ్దాదిని హల్లులపై ఋకారము వచ్చు (ృ) కొన్ని శబ్దముల నుదాహరించుచున్నాము.

ఉదాహరణము.

| | |
|---|---|
| కృష్ణుఁడు | జృంభణము |
| కృప | జృంభ |

కృషి
గృహీతము
ఘృతము
ఘృణ
ధృతము
ధృష్టుఁడు
నృపుఁడు
నృత్యము
పృథివి
పృషతము
బృహస్పతి
బృంద
భృతము
భృత్యుఁడు
మృగము

తృణము
తృష్ణ
దృష్టి
దృప్తము
మృదువు
మృత్యువు
వృకము
వృత్తి
శృంఖలము
శృంగము
సృగాలము
సృతి (త్రోవ)
హృదయము
హృతము
హృషీకేశుఁడు

శబ్ద మధ్యాంతరములయందువచ్చు ఋకార రేఫ ఉకారముల వివరణము.

శిగ్రు
విశ్రుత
శుశ్రూష
నిస్రుతి
భభ్రు
కద్రువ
పౌరద్రు
విద్రుమ
శత్రువు

అక్రూరుఁడు
ఉగ్రుఁడు
శతద్రువు
పితృ
మాతృ
భాతృ
సంస్కృతము
అమృతము
వికృతి

| | | |
|---|---|---|
| వటుృవ | | ఉజ్జృంభణము |
| అదఃృచెన్ | ఇవి వ్రాక్కి | నివృకృతి |
| విదుృచెన్ | పలుకరాదు. | అవివృకృతి |
| చిదుృపలు | | పరిష్కృతి |

రేఫ అకారము లంతమందుఁ గల శబ్దములు మహాదర్థకమం దుకారమును పొందును. అట్టిచోట్ల రేఫ ఉకారములు వ్రాయవలయుననుట గురుతుగా నుంచుకొనవలెను.

ఉదాహరణము—ఇందుృఁడు, చఁదుృని, విపుృనిచేతన్, మితుృనికొఱకున్, పతృమువలనన్, నముృనియందున్, దీపుృనకున్.

N. B. ఋకారము, రేఫ ఉకారములు సంకరమయిన యెడల శబ్దస్వస్థమునకు లోపమే కాక యతిప్రాసములయందు విరోధము గూడఁ గలుగును కావున వీనిని దెలియుట యావశ్యకము.

# CHAPTER X.

## Common Mistakes.

### సాధారణపు తప్పులు.

---

ఇప్పటి యాంధ్రవిద్యార్థులు తెలుఁగు భాషను తగినంత శ్రద్ధతో నభ్యాసము చేసికొనక పోవుటచే హాస్యాస్పదములగు తప్పు లనేకములు వ్రాయుచున్నారు. సంభాషణ శైలికిని గ్రాంథిక శైలికినిఁ గల వ్యత్యాసమును సంపూర్ణముగ గ్రహించినఁగాని యీ స్వల్పదోషములు పోవు.

శబ్దస్వామ్యము తెలియక చేయు దోషములు నిఘంటు సాహాయ్యమున దిద్దుకొనవచ్చును.

సంధి దోషములు కొలఁది సంధి సూత్రముల వలన నివారింపఁబడఁదగిన వయ్యును నా సూత్రములను జిలుకపలుకులవలె పఠించి వాని యుపయోగమును వ్యాసరచనయందుఁ జూపలేక యున్నారు. ఇది శ్రద్ధలేమిని గలుగుచున్నది.

కళాదుత్రిత ప్రకృతిక శబ్దపరిజ్ఞానము మిక్కిలి కొఱఁతగా-నున్నది. సమాస సంఘటనమున విస్తారము, తప్పులు దొరలుచున్నవి, విభక్తిదోషములు పెక్కులు గానవచ్చుచున్నవి. శబ్దార్థ పరిజ్ఞానము లేమినిఁ గలుగు తప్పులు పాండితినిం బట్టియుండినను దక్కిన తప్పులు కొంచెము పరిశ్రమతో నివారించుకొనఁదగినవైయున్నవి.

ఆంగ్లేయభాషలో దారిలేని శబ్దముల వర్ణక్రమము నేర్చుకొనుటకై పడుశ్రమములో సహస్రాంశము శ్రమగూడ నక్కఱలేకయే యీ క్రింద నుదహరించు తెలుఁగుభాషలోని తప్పులను మరల్చుకొనవచ్చును.

| అసాధువు. | సాధువు. |
|---|---|
| తత్వము | తత్త్వము |
| సత్వగుణము | సత్త్వగుణము |
| పత్రము | పత్త్రము |
| క్షత్రియుఁడు | క్షత్త్రియుఁడు |
| మహత్వము | మహత్త్వము (మహిమ) |
| మాహత్యము | మాహాత్మ్యము |
| జాగ్రత | జాగ్రత్త |
| సన్యాసి | సన్న్యాసి |
| శాస్త్రులు | శాస్త్రిలు |
| కండ్లు | కన్నులు |
| యవ్వనము | యౌవనము |
| తక్షణము, (వెంటనే) | తత్క్షణము |
| క్షృషి | కృషి |
| బ్రంహ్మ | బ్రహ్మ |
| వాకృచ్చు | వాక్రుచ్చు |
| శిశ్రూష | శుశ్రూష |
| నాయకి | నాయిక |
| ప్రాముఖ్యత | ప్రాముఖ్యము |
| మదియ్యము | మదీయము |
| స్వియ్యము | స్వీయము |
| దార్డ్యము | దార్ఢ్యము |
| నాగరికత | నాగరకత |
| నాగరీకము | నాగరకత |
| కాలీనులు | కాలికులు |

| అసాధువు. | సాధువు. |
| --- | --- |
| కూఁతురితోడన్ | కూఁతుతోడన్ |
| చేతు | చేయుదురు |
| వాదన | వాదము |
| రజితము | రజతము |
| ధయిర్యము | ధైర్యము |
| త్మరు | తమరు |
| వ్రాశి | వ్రాసి |
| అభ్యశించు | అభ్యసించు |
| చేశిచాయుంగల | చేసిచేయంగల |
| రాయుఁడు | రాయఁడు |
| కృష్ణదేవరాయులు | కృష్ణదేవరాయలు |
| శేవకుడు | సేవకుఁడు |
| క్రౌంచము | క్రౌంచెము |
| ద్వారా, గుండా | వలన |
| యడల | యెడల |
| అంమ | అమ్మ |
| చెంద్రుఁడు | చంద్రుఁడు |
| ఏనుగ | ఏనుఁగు |
| వారసత్వము రీత్యా | వారసత్వపు రీతిచేత |
| బొబ్బట్లు | ఒబ్బట్లు |
| వణ్ణము | అన్నము |
| ముఖతా | ముఖమునుండి |
| బేధము | భేదము |

| అసాధువు. | సాధువు. |
|---|---|
| శనేర్చరుఁడు | శనైశ్చరుఁడు |
| పల్లవాధరి | పల్లవాధర |
| బహుళా } | బహుళముగా |
| బహుళః } | అనేకవిధముల |
| సభికుఁడు (సభార్హుఁడు) | సభ్యుఁడు |
| పాటకుఁడు | గాయకుఁడు |
| పద్మనేత్రి | పద్మనేత్రి |
| గుణవంతుఁడు | గుణవంతుఁడు |
| శితము (తెలుపు) | సితము |
| సితము (వాడియైనది) | శితము |
| అనుకూలము | ఆనుకూల్యము |
| అనుగుణ్యము | ఆనుగుణ్యము |
| సీతము | శీతము |
| చలివెందల | చలిపందిలి |
| శీత | సీత |
| వసిష్టుఁడు | వసిష్ఠుఁడు |
| దేముఁడు | దేవుఁడు |
| బాలులు | బాలురు |
| అద్వాన్నము | అధ్వానము |
| సామర్థులు | సమర్థులు |
| అభ్యంగనము | అభ్యంగము, ఆభ్యంజనము |
| సామితె | సామెత |
| రొండు | రెండు |
| దృఢ | దృఢ |

| అసాధువు. | సాధువు. |
| --- | --- |
| పదకొండు | పదునొకండు |
| పన్నెండు | పండ్రెండు |
| పదమూడు | పదుమూఁడు |
| పధ్నాలుగు | పదునాలుగు |
| పదిహేను | పదునేను |
| పదహారు | పదునారు |
| పదిహేడు | పదునేడు |
| పద్ధెనిమిది | పదునెనిమిది |
| పంథొమ్మిది | పదితొమ్మిది |
| ఇరవై | ఇరువది |
| ముప్పై | ముప్పది |
| సాయంత్రము | సాయంతనము, సాయంకాలము |
| యోచించి | యోజించి |
| చతురశ్రమము | చతురశ్రము |
| అస్తమానము | అస్తమయము |
| తోటి | తోడి |
| నిండా | నిండ |
| మాత్రి | మాత్ర |
| అల్లాగా | ఆలాగునవా |
| వాండ్లు | వాండ్రు |
| సింహ్మము | సింహము |
| కంసాలి | కమసాలి |
| అక్షింతలు | అక్షతలు |
| పౌర్ణమి | పూర్ణిమ |

| అసాధువు. | సాధువు. |
|---|---|
| సౌహార్ద్రిము | సౌహార్దము |
| వయిద్యము | వైద్యము |
|ద్రౌపతి | ద్రౌపది |
| దణ్ణెము | దండెము |
| దణ్ణము | దండము |
| భావ | భావ |
| ఆనందభాష్పములు | ఆనందబాష్పములు. |
| వ్రయము | వ్యయము |
| నిఘంటు | నిఘంటువు |
| బాలింత | బాలెంత |
| ఇవ్వఁగా | ఇయ్యఁగా |
| చేశిరి | చేసిరి |
| నివశించిరి | నివసించిరి |
| అగుపడు | అగపడు |
| ఒడయుండు | ఒడయండు |
| శాశ్వితము | శాశ్వతము |
| తలముళ్ళు | తలముండ్లు |
| పుస్తుకము | పుస్తకము |
| దుఖము, దుక్కము | దుఃఖము |
| తతిమ్మా | తక్కిన |
| శరుణ | శరణు |
| వరహావతారము | వరాహావతారము |
| చెముడు | చెవుడు |
| చెఱుచు | చెఱుచు |

| అసాధువు | అసాధువు. |
|---|---|
| తతాలున | తటాలున |
| ఎగర | ఎగుర |
| ప్రాముఖ్యుఁడు | ప్రముఖుఁడు |
| దురాదృష్టము | దురదృష్టము |
| అబ్దము | అబద్ధము |
| మరిగింపక | మరగింపక |
| తెలసి | తెలిసి |
| రాయభారము | రాయబారము |
| ఎలిక | ఎలుక |
| వెలపలికి | వెలుపలికి |
| ఫలహారము | ఫలాహారము |
| పరియవసానము | పర్యవసానము |
| ఖట్టి | దట్టి |
| తునకలు | తునుకలు |
| తఱగని | తఱుగని |
| గండగొడ్డలి | గండ్రగొడ్డలి |
| సిరము | శిరము |
| ఉద్ధవిడి | ఉద్దవిడి |
| కుమ్మరిపురుగు | కుమ్మరపురుగు |
| రాయడి | రాయిడి |
| పూజ్యితుఁడు | పూజితుఁడు |
| కురువింద | గురువెంద |
| భ్రమయించు | భ్రమియించు |
| లెఖ్ఖ | లెక్క |

| అసాధువు. | సాధువు. |
|---|---|
| అవలంభించు | అవలంబించు |
| దరిద్రము | దారిద్ర్యము |
| భుస్సున | బుస్సున |
| కృంకు | క్రుంకు |
| వెంట్రుకలు | వెండ్రుకలు |
| ఆయిష్టము | అనిష్టము |
| మధ్యాన్నము | మధ్యాహ్నము |
| చూడ్కి | చూడ్కి |
| వేట్క | వేడ్క |
| మాట్కి | మాడ్కి |
| సూర్యరస్మి | సూర్యరశ్మి |
| మచ్చకంటి | మచ్చెకంటి |
| పశిడి | పసిఁడి |
| కృష్ణాజనము | కృష్ణాజినము |
| భాద | బాధ |
| చెదలేఱు | చేదలేఱు |
| చమరించుట | చెమరించుట |
| కుష్టువ్యాధి | కుష్ఠవ్యాధి |
| అర్ధరాత్రి | అర్ధరాత్రము |
| మహార్నవమి | మహానవమి |
| మహార్దశ | మహాదశ |
| ఝుమ్మఝుమ్మ | జుమ్మజుమ్మ |
| ఝళిపించు | జళిపించు |
| పూర్వీకులు | పూర్వులు |

| అసాధువు. | సాధువు. |
|---|---|
| దృష్టాంతరము | దృష్టాంతము |
| అధిక్యత | ఆధిక్యము |
| నిముషము | నిమిషము |
| ఛత్రిము | ఛత్త్రిము |
| తదోృ్యత | తద్ద్యోత |
| సముజ్వాల | సముజ్జ్వాల |
| తద్రవ్యముల్ | తద్ద్రవ్యముల్ |
| క్రమేణ | క్రమముగా |
| ప్రకాసించు | ప్రకాశించు |
| అకస్మాత్తుగ | ఆకస్మికముగ |
| సూర్జితా | స్ఫూర్జితా |
| సాిఁచిన్మక్తి | సాంచన్మక్తి |
| వర్ణాశ్రమ | వర్ణాశ్రమ |
| ఘూర్ణిల్ల | ఘూర్ణిల్ల |
| వర్ణింప | వర్ణింప |
| జగత్పూర్ణ | జగత్పూర్ణ |
| ఫల్గుణుఁడు | ఫల్గునుఁడు |
| నిర్ణిద్రిత | నిర్నిద్రిత |
| త్రిణయనునకు | త్రినయనునకు |
| మధురాయమానంబగు | మధురాయమాణంబగు |
| దుస్వప్నము | దుఃస్వప్నము, దుస్స్వప్నము |
| చతుష్పాదజంతువులు | చతుష్పాజ్జంతువులు |
| అంబోధి | అంభోధి |
| ఉచ్ఛాటన | ఉచ్చాటన |

| అసాధువు. | సాధువు. |
|---|---|
| భేతాళుఁడు | బేతాళుఁడు |
| సద్రిశులు | సదృశులు |
| ధృవ | ధ్రివ |
| చాలా | చాల |
| కూడా | కూడ |
| వ్రాసేది | వ్రాయునది |
| చెప్పేది | చెప్పునది |
| మళ్ళా | మఱలన్ |
| తిరుగా | తిరుగన్ |
| రావాలి | రావలెను |
| స్వంతము | సొంతము |
| కాచుక | కాచుకొని |
| పంచుక | పంచుకొని |
| తన్నుక | తన్నుకొని |
| చించుక | చించుకొని |
| కట్టుకపోవునా | కట్టుకొనిపోవునా |
| పెట్టుక | పెట్టుకొని |
| కూడుక | కూడుకొని |
| పిల్చుక | పిల్చుకొని |
| కప్పుక | కప్పుకొని |
| విదుల్చుక | విదుల్చుకొని |
| పుచ్చుక | పుచ్చుకొని |
| తోడుకపొమ్ము | తోడుకొనిపొమ్ము |

N. B. పట్టుక ఇత్యాది ఆముక్తమాల్యద ప్రయోగములు సాధువులుగావు.

| అసాధువు. | సాధువు. |
| --- | --- |
| ప్రకటింపుచు | ప్రకటించుచు |
| ప్రార్థింపుచున్ | ప్రార్థించుచున్ |
| ఘోషింపుచున్ | ఘోషించుచున్ |
| దర్శింపుచున్ | దర్శించుచున్ |
| చెల్లింపుచున్ | చెల్లించుచున్ |
| అపనయింపుచున్ | అపనయించుచున్ |
| అంకురింపుచు | అంకురించుచు |
| పాటింపుచు | పాటించుచు |
| ప్రతిష్ఠింపుచున్ | ప్రతిష్ఠించుచున్ |
| వితర్కింపుచున్ | వితర్కించుచు |
| సేవింపుచు | సేవించుచు |
| భజింపుచు | భజించుచు |
| వసింపుచు | వసించుచు |
| విలోకింపుచు | విలోకించుచు |
| ఆవహింపుచు | ఆవహించుచు |
| క్రీడింపుచు | క్రీడించుచు |
| చింతింపుచు | చింతించుచు |
| సందడింపుచు | సందడించుచు |
| పఠియింపుచున్ | పఠియించుచున్ |
| తేవడము | తెచ్చుట |
| రావడము | వచ్చుట |
| చెయ్యడం | చేయుట |
| వకటి | ఒకటి |
| యెవ్వరు | ఎవ్వరు |

| అసాధువు. | సాధువు. |
|---|---|
| వద్ద | ఒద్ద. కొందఱు వద్దయనిగూడఁ బ్రయోగించుచున్నారు. |
| వుప్పు | ఉప్పు |
| వూరు | ఊరు |

N. B:— తెలుఁగున వు, వూ, వొ, వోలును యకారముతోఁగూడిన మొదటి యక్షరములుగల శబ్దములును లేవుగాన ఆయాస్థలములలో అచ్చులే వ్రాయవలెను.

| | |
|---|---|
| ఏలనన | ఏలయన |
| వాడున్నూ | వాఁడును |
| దానినిన్నీ, నిన్నున్నూ | దానిని, నిన్నును |
| అభీష్టం | అభీష్టము |
| క్షేమం | క్షేమము |
| దండకం | దండకము |
| శలవు | సెలవు |
| నా దెగ్గర | నాదగ్గర |
| వీటిని | వీనిని |
| కోర్కెలు | కోర్కులు |
| వాడిచదువు | వానిచదువు |
| అందుకు | అందునకు |
| ఇందుకు | ఇందునకు |
| ఎందుకు | ఎందునకు |
| నుంచి | నుండి |
| వస్తువకు | వస్తువునకు |
| కొందరికి | కొందఱకు |
| వాడుకు | వాడునకు |

| అసాధువు | సాధువు |
| --- | --- |
| రాజుకు | రాజునకు |
| నడుముకు | నడుమునకు |
| అతను | అతఁడు |
| ఇతను | ఇతఁడు |
| ఎతను | ఎతఁడు |
| దాన్ని | దానిని |
| దానయుద్గ్రంథములు | దానసుద్గ్రంథములు |
| కానయిహాపర | కాననిహాపర |
| శబ్దాదినియుండవలయును | శబ్దాదినుండవలయును. |
| ఇప్పటికినియున్నారు | ఇప్పటికినున్నారు. |
| మేసెడు యెద్దు | మేసెడు నెద్దు |
| ఉండు ఇంటి బిడ్డలు | ఉండు నింటిబిడ్డల |
| వచ్చు యేనుఁగు | వచ్చు నేనుఁగు |
| ఉగ్రుఁడను గొడుకు | ఉగ్రుఁడను కొడుకు |
| అనుగొండొక | అనుకొండొక |
| చెంచెతల్బలుకు | చెంచెతల్వలుకు |
| చంపి జచ్చుటకు | చంపి చచ్చుటకు |
| చావక జంప | చావక చంప |
| బంచేంద్రియములు | పంచేంద్రియములు |
| పెక్కుచందముల పిన్నక | పెక్కుచందములఁ జిన్నక |
| మునుపుఁ బెట్టిన | మునుపు పెట్టిన |
| కడుచిన్న | కడుఁజిన్న |
| దురితపు పగ్గములు | దురితపుఁ బగ్గములు |

| అసాధువు. | సాధువు. |
|---|---|
| కానతత్పరత | కానదత్పరత |
| పోవన్ కృపా | పోవఙ్గృపా |
| వానింభద్రపఱచు | వానిన్ భద్రపఱచు |
| తోడంజెప్పల | తోడఙ్జెప్పల |
| ఘటించితిది | ఘటించితినిది |
| ఒనరించితీశ | ఒనరించితినీశ |
| జాఱొప్పన | జాఱునొప్పున |
| ఈఁదీది | ఈఁదియీది |
| అద్రిరాజల్లుని | అద్రిరాజు నల్లుని |
| పత్త్రిడి | పత్త్రియిడి |
| తిమ్మిరత్తక | తిమిరియొత్తక |
| దాసోహంబని | దాసోహమ్మని, దాసోహమని |
| అనఁకఁదపసి | అనకతపసి |
| కూర్చొని | కూర్చుండి |
| వద్దు | వలదు |
| కద్దు | కలదు |
| బాగా | బాగుగ |
| తెలుసును | తెలియును |
| అంశములు | విషయములు |
| మ్లేచ్ఛపాటలు | మ్లేచ్ఛులపాటలు |
| అనేకమంది | పెక్కుమంది |
| శాంకరీ నెలవంక | శాంకరి నెలవంక |
| పేటికా పుటమారేడాకులు | పేటికాపుటిమారేడాకులు |
| యావన్మంది | యావజ్జనము |

| అసాధువు, | సాధువు, |
|---|---|
| ప్రసన్నతామదిన్ | ప్రసన్నతామతిన్ |
| పరివారసురలన్ | పరివారసురులన్ |
| అధిక గారాబము | మిక్కిలి గారాబము |
| పలుమనుష్యులు | పలువురు మనుష్యులు |
| అతులంబుఁ గలిగించితివి | అతులత్వముఁ గలిగించితివి |
| బహుకొద్ది | మిక్కిలి కొలఁది |
| బహుగొప్ప | మిక్కిలిగొప్ప |
| పుత్రుడు | పుత్త్రుడు |
| అనుకూలవతులు | అనుకూల్యవతులు |
| స్వతంత్రంబు చేకూరె | స్వాతంత్ర్యంబు చేకూరె |
| దోదూయమానసుండు | దోదూయ మానమానసుండు |
| ప్రశామము | ప్రశమకము |
| మాతాపితరులు | మాతాపితలు |
| ఇవ్వర | ఈయరా |
| అవశ్యకంబు | ఆవశ్యకంబు |
| దుర్నడత | దుష్టమైన నడత |
| గారాపుస్సుత | గారాపుసుత |
| మృత్తువునైతి | మృత్యువనైతి |
| నూతన యేర్పాటులు | నూతనమైన యేర్పాటులు |
| సంశయించక | సంశయింపక |
| రిత్త సేతులు | రిత్త చేతులు |
| బెదరింపుచు | బెదరించుచు |
| కులభూషణ | కులభూషణము |
| పాటలాధరి | పాటలాధర |

| అసాధువు. | సాధువు. |
| --- | --- |
| విద్రుమాధరి | విద్రూమాధర |
| దాహాంబు | దప్పి |
| ఎలనే | ఏలే |
| అనే కమ్మ | అనుకమ్మ |
| షిఖ | శిఖ |
| శింధూర | సిందూర |
| షద్వృశులు | సద్వృశులు |
| బావ్వాంఘ్రిలు | బావ్వాంఘ్రిలు |
| చిత్తేధమానజడిమ | చిత్తైధమానజడిమ |
| దంపతీపుంజము | దంపతిపుంజము |
| ఉద్ధత నేతెంచి | ఉద్ధతి నేతెంచి |

N. B. ౄ, ౢ, ధ, థ, శ, స, ణ, న, ఈ యక్షరములు వ్రాయునపుడు సందియము గలిగినేని నిఘంటువును జూడనగును.

## Exercise.

### I

మాట్లాడెను, మధ్యమనిశియందిందుముఖి, వీధినాటకము, వృథాశపియించెను. వానిమహాత్వము, శబ్దతత్వము, సౌఖ్యముల్ అబ్బదే. సేవించిలన్. కుబేరు చెమ్మదలి. దినదిన సంవర్ధ్యమాన తేజోనిధికిన్. ఆత్మందలిర్చిన.

☞ ఇందలి తప్పులను గనుకొని సాధురూపముల వ్రాయుండు.

### II

కడవుచు పంచమధ్వనుల. "అనవుడు కనుంగొనల నగుర్వొడవంగ ప్రిమోద......ముందట పిరుందన్, అందు చలవృక్షములన్. అమరపతంగ

చేవుఁడు, చెలువొందె, తండె, అంత, పువుఁబోడికి. కడుచోద్యమునన్, అతిశ యిల్ల, పొత్తామర.

☞ వీని సాధురూపములను వ్రాయుఁడు.

III

డెందఁపు కెంఁడమ్మి, గుజ్జుఁపు పొజు, దయ్యంపు తొయ్యలులు, తర్కొక్కుత్తులకున్, కంఠశోషఁబు, బాధన్ పడలేక, నాదమునకున్ తోయజ కడున్ పచ్చని, ఉతాంగిఁ బోటులకు, శృంగారంపుఁ గొప్పు, ఆటవికునిఁ బ్రాహ్మణ, చిందమృతంపు బిందువులు, వేటలాడెఁబుకు.

☞ వీని సాధురూపములను వ్రాయుఁడు.

VI

శేయేసిచ్చును, చెయిఁచ్చి, చెయ్యున్, ఈశ్వరోహంబని, సోహంబని, కేలుఁదోయి, తిన్ననిగని, వెంకటార్యాని బిలిపించి, కోపంబున బాయుట, నే శెయ్యఁగ, నూర్వురుజచ్చినన్, చేతులజేర్చి, తొరుఁగగ, తన్ను జెనకఁడో, త్రుంచి, నూతన యేర్పాటులు, అనుచుగొనియె, ఎడబాసి, వారిలోపలదోఁగి, తొఁడానగ్రోలిన. కరిజఁపి, ఒనగూర్చె, ఫాలపట్టికల జిగురు, చాల ద్రావిన, చూపుఁబట్టించు, సినుగోల్వ, పువుదేనియ, పూదిఁగ, కన్నగవ, ఊరు గాయలు, చక్కదనఁబు, ఈయ్యవనంబు, ఉండఁగన్,

☞ వీని సాధురూపములను వ్రాయుఁడు.

V

ప్రతిబింబంబన చంద్రికాంత ... కడున్ పచ్చని, ఒనరించితిరి, ఈఁదిఁది, విడిదిఁడ్లు, తలఁచ, గొజిగించ, అతిశయించ; పఱచ, వస్తువుకు, చిలుకుకు, ఇందుకు, ఒనరించినాను. చేరినాము, వచ్చాడు, రామునితో యిఁదుమతి ప్రయాణముచేసెను. ఏలననగా, యెవరక్కడ, పూరికిబొమ్మ, పుమ్మెత్తలు జిల్లెళ్ళు మొలచెను. యెదిరించి నిలువలేవు. వొదినా వొప్పుల కుప్పలాడుదమా. వకమాటవిను. యెంత ప్రార్థించినా వినవు, యేమిచెయ్య,

నయ్యా, చూతాముపద. ఆడుదామురా, వస్తున్నా, వెంకటాౘియుండు, పెడ తాడా, యెన్ని చెప్పివా వినకుండా యువ్నాడు, యేంచెయ్యను, వచ్చీరాని మాటలు, చూచీచూడని చూపులు, పూచీపూయని పూమొగ్గలు.

☞ వీని సాధురూపములను వ్రాయుఁడు.

## VI

నేటికి, ఎన్నడు, తలపు, మునిగి, కలగంగ, దాపున, మీద, కొలదులు తలపన్, తీగెలు, కావరే, నేడు, తలచు, అలదు, ఆకొన్న, బెణకెదు, అణగు కరగింప, పోడుముల్, తోఁడుకొంచు, కాఁచు, పూర్వఁపు, వేవేఁగ, పోఁతు.

☞ ఇందెక్కడ అర్ధానుస్వారము లుండవలెనో కనుఁగొని వ్రాయుఁడు.

## VII.

వినీలిమచ్ఛటా, మౌక్తికచత్ర, వర్ణాశ్రమ, ఘూర్ణిల్ల, వక్తింప, ప్రాణ నాయకి, అచ్చటి స్త్రీలు భక్తిపారవశ్యలు, వారెల్లరు హితులు, వారినిపల్లవ భోగ్య లనరాదు.

☞ ఇందలి శబ్ద సాధుత్వమును విచారించి తప్పులను సవరించి వ్రాయుఁడు,

## VIII

కండ్లకు పొరలు గ్రమ్మినవి, పుస్తకము తీసికొనిరా, దీన్నైతే ఎంత కయినా కొంటాను. పొట్టివాడికి పుట్టెడుబుద్ధులు, తల్లిప్రక్కనుండి దూపిం చెను. వెదకుటకై బంపియుండెను. చాలా దూరాభారం నడిచాను, కామిని ఏలనే కాలమున్నోవునే. క్రమమైన యవుమధము పుచ్చుకుంటే వ్యాధి నిమ్మళిస్తుంది లే.

☞ ఇందలి తప్పులను సవరించి వ్రాయుఁడు.

## IX

సరసానన పద్మ సంపదశరదాయె, న్యాయతీర్పులు, మళ్లావస్తే మాటు దక్కదు. ప్రస్తాప గ్రంథకాలము, ప్రస్తాపించెను. సిఖా యజ్ఞోపవీతాలు తెంచివేసినాడు. కుష్టువ్యాధి బహుచెడ్డది.

☞ ఇందలి తప్పులను సవరించి వ్రాయుడు.

# CHAPTER XI.

## రేఫ శకట రేఫల నిర్ణయము.

రేఫ శకట రేఫలంగూర్చి యాదినుండియు భిన్నాభిప్రాయములు గలవు. ఎప్పుడో యొకప్పుడు శకటరేఫము, అలఘూచ్చారణము కలిగియుండి యుండును. కాని అది సర్వత్ర పాటింపబడుటలేదు, ఐనను వర్ణసముదాయ మందిది యొక ప్రత్యేకాక్షరముగా జెప్పబడుటయు, సంస్కృతము నందిది లేకుండుటయుం బట్టి యిది కేలాంధ్రభాషయందు మిక్కిలి పరిపాటిగా జూడబడుచున్నట్లు తోచెడిని.

మహాప్రాతికవంతు తత్సమ శబ్దమయమైయున్న యాంధ్రభాషలో ర, ఱల భేదము గనుగొనుట కష్టమయిన పనిగానే యున్నది, కాని ప్రాజ్ఞులగు పండితులెల్లర నేదోయొక విధముగ దీనిని గనుగొని తమ గ్రంథముల యందు వేఱు వేఱుగా వ్రాయుచున్నారు.

ఇతర ప్రయోజనము లటుండ సంస్కృతాంగ్ల శబ్దముల భేదము గనుగొనుటకైన నిది యెక్కువ లాభకారిగా నుండును.

ప్రతిభాషయందును ఇట్టి కష్టసాధ్యములగు విషయములు కలవు. వాని నా యా భాషజ్ఞులు పరిగణించుచునే యున్నారు.

బహుగ్రంథ పరిశోధనమువలన జిరకాలానుభవముంజేసి గ్రహించిన విధులు కొన్ని యీ క్రిందజూపుచున్నారము.

N. B :—భారత కవిత్రయమువారి శిష్టాచారము ననుసరించు తలంపుగల విద్యార్థులు దీనిని బాటింపవచ్చును. ఇది పాటింపబడకపోయినను ప్రతిబంధము లేదు.

శకటరేఫలంగూర్చి వ్రాయుచుంటిమి గావున దక్కినవి సాధురేఫ లని గ్రహింపవలెను.

1. ద్విత్వముతో గూడుకొనిన వన్నియు వాని రూపాంతరములును శకటరేఫములే.

## ఉదాహరణము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| మిట్టు | — | మిఱుత | చుట్టు | — | చుఱుచుఱు |
| కొట్టు | — | కొఱుత | కట్టు | — | కఱుకోల |
| వట్టు | — | వఱుత | ముట్టు | — | ముఱుగు |
| మొట్టు | — | మొఱు | కుట్టి | — | కుఱువెండ్రు |
| అట్టు | — | అఱుత | పట్టి | — | పఱుకటు [కలు |
| చిట్టు | — | చిఱుచిఱు | ఎట్టి | — | ఎఱుంపు |
| తొట్టి | — | తొఱుటు | గుట్టు | — | గుఱుక |
| బొట్టి | — | బొఱియ | చొట్టి | — | చొఱుచు |
| పట్టె | — | పఱియ | చిట్టికూర | — | చిఱుతలబొడ్డు |
| మొట్టి | — | మొఱుఱు | అట్టు | — | అఱుగు [తీగ |
| జట్టు | — | జఱుజఱు | వట్టె | — | వఱియ |
| పట్టు | — | బఱుపఱు | గిట్టు | — | గిఱుగిఱు |
| బిట్టు | — | బిఱుబిఱు | కట్టు | — | కఱుకఱు |
| జట్టు | — | జిఱుజిఱు | గట్టు | — | గఱుగఱు |
| గొట్టు | — | గొఱుగొఱు | ఎట్టు | — | ఎఱుఎఱు |
| గుట్టు | — | గుఱుగుఱు | తుట్టు | — | తుఱుతుఱు |
| జిట్టు | — | జిఱుజిఱు | తట్టు | — | తఱుతఱు |
| పుట్టె | — | పుఱియ | బట్టు | — | బఱుబఱు |
| గొట్టె | — | గొఱియ | బుట్టు | — | బుఱుబుఱు |
| కట్టి | — | కఱియ | కిట్టు | — | కిఱుకిఱు |

| | |
|---|---|
| మట్టి | చిట్టునఁజీరి |
| ఇట్టి | నిట్టునీలిగి |
| జెట్టి | ఉట్టింక |
| బట్టె | పుట్టి |

| | |
|---|---|
| జొఱ్ఱ | కుఱ్ఱ |
| వెఱ్ఱి | కఱ్ఱ |
| పఱ్ఱ | బుఱ్ఱి |
| గుఱ్ఱలు | బొఱ్ఱ |
| తొఱ్ఱపళ్లు | తిఱ్ఱి |
| విఱ్ఱవీగి | తొఱ్ఱి |
| జఱ్ఱనజారి | ఉఱ్ఱూటలు |
| పఱ్ఱనఁబారి | |

2. ఏవి అన్యవర్ణములతో సంయుక్తములై యుండునో యవి రేఫములుగాని శకట రేఫములు కావు.

ఉదా—తనర్చి, పొనర్చి ఒనర్చి.

3. శకటములు సంయుక్తములు గావు.

☞ ఈ క్రింది శబ్దజాలమంతయు భారతప్రయోగముం బట్టి చూపఁబడినది.

| | |
|---|---|
| అఱచె | ధాన్యము తఱగ |
| తఱిమి | తఱిమె |
| అన్నమఱిగె | తెఱచె |
| క్రిక్కిఱిసె | దుఃఖముతోఱగె |
| ఉఱికె | నఱకె |
| ఉఱిమె | నుఱపె |
| ఎఱిగె | పఱచె |
| ఎఱగె | తెప్పిఱె |
| ఒఱగె | పెఱికె |
| ఒఱలె | |
| ఒఱసె | క్రిమ్మఱె |
| ఒఱపె | ఏమఱె |

| | |
|---|---|
| కఱచె | మఱచె |
| కిఱిపె | క్రుమ్మఱె |
| కొఱలె | నీళ్ళుమఱిగె |
| కొఱికె | రుచిమఱిగె |
| గొఱిగె | మెఱసె |
| చఱచె | కన్మొఱఁగె |
| చిఱిగె | కుక్కమొఱిగె |
| చెఱచె | వఱలె |
| జఱిగె | విఱిచె |
| సముద్రము తఱిచె | వెఱచె |

4. అడు, ఉము, ఉపు, అంతమందుఁగల శబ్దములు. శకటరేఫలు.

| | |
|---|---|
| కొఱకు | కఱుపు |
| కఱడు | చఱుపు |
| పెఱడు | వఱుపు |
| బెఱడు | మఱుపు |
| ఒఱడు | ఒఱుపు |
| వఱడు | చెఱుపు |
| మొఱడు | పఱుపు |
| నఱుము | మఱుపు |
| నుఱుము | విఱుపు |
| ఉఱుము | వెఱుపు |
| మెఱుము | అఱుపు |

---

| | | |
|---|---|---|
| పలువ్రేఱు | పఱచె | అఱ |
| మఱు | పాఱువాఁడు | అఱగొఱ |
| శ్రమంజఱి | ఒఱగె | అఱచు |

| | | |
|---|---|---|
| మేకయఱచె | ఎఱగె | ఆఱజాతి |
| అఱువది | కొఱడు | ఆఱడా |
| అఱగొఱలు | తొఱడు | ఆఱడు |
| కొఱగామి | తొఱము | అఱపు |
| మొఱకులు | మఱిడి | అఱమర |
| కనుకిఱికె | వఱకము | అఱమరిక |
| పండ్లతోఁగొఱికె | పిఱుదు | ఆఱవడు |
| పఱతెంచె | పిఱుగున | అఱవము |
| కొఱలె | క్రిచ్చఱ | అఱవరలు |
| చిఱు | క్రిమ్మఱ | అఱకలు |
| ఘుముద్రింబుతఱిపె | అఱక | అఱిమఱి |
| నుఱిపె | అఱకడ | ఆఱిసియ |
| అఱిసె | ఒఱగడ్డము | చెఱమ |
| అఱు | ఒఱగొడ్డెము | చెఱి |
| అఱుకువ | ఒఱవఁబడు | చెఱుము |
| అఱకము | ఒఱుబీజము | ఊఱవు |
| అఱుక్రిమ్ము | కఱకుట్లు | ఊఱిది |
| అఱుళు | తఱపియావు | పఱియ |
| అఱుత | తఱియఁబడు | ఉఱియుం |
| అఱుపు | తాఱుమాఱు | ఊఱు |
| అఱుము | తెఱఁగువడు | చెఱువు |
| అఱుగు | కుఱ్ఱుమట్టము | ఊఱుత |
| అఱడి | కుఱుమాడు | ఊఱుపు |
| అఱగొండెతనము | దూఱుదుంకెన | ఊఱుము |
| అఱగొడ్డెము | ఆఱు | ఉఱువు |

| | | |
|---|---|---|
| అఱవఱ సేయు | అఱ్ఱుము | చేఱు |
| అఱిమెనకుండలు | ఆఱు వాళ్ళు | ఊఱట |
| ఇఱుకటు | అఱుస | ఊఱు |
| ఇఱు కాటము | ఇఱికి | చఱచు |
| ఈఱతారలు | ఇఱియు | పఱచు |
| చెఱకడము | ఇఱుకు | చఱి |
| చెఱపనచేట | ఇఱుము | ఎఱ |
| ఉఱు వ్రాళ్ళు | చీఱు | ఎఱ్ఱుకత |
| కఱుకోల | చెఱ | ఎఱుకువ |
| చేఱుబొందు | ఈఱమి | ఎఱుపు |
| చేఱులకోల | ఈఱము | ఏఱుజాజి |
| ఒఱకటము | చెఱఁగు | ఏఱుపుచ్చు |
| ఒఱ కాటము | ఉక్కఱు | చొఱిగాఁడు |
| ఒఱఁగబడు | చెఱకు | ఒఱవ |
| ఒఱకము | ఒఱ | తెఱచు |
| ఒఱవు | ఒఱటు | కుఱు |
| ఒఱపిడి | ఒఱపరి | సఱుకుపరువడి |
| జఱభి | ఒఱవ | సఱుకుబియ్యము |
| కఱకటి | ఒఱవు | గుఱగుఱ్ఱు. |
| కఱకఱ | తఱక | గోఱజము |
| కఱచు | తఱచు | నుఱిచియాఁడు |
| కఱద | కఱ | నుఱిపి |
| తఱిమెన | తఱటు | నుఱుచు |
| తఱివడు | కఱకు | నుఱుపు |
| కఱవాడు | తఱు | చిఱచిఱ |
| తెఱుఁగు | కఱటి | నఱుమాఁడు |

| | | |
|---|---|---|
| కఱకుట్లు | కఱత | నఱుము |
| తఱుసలి | తఱి | నెఱవు |
| కాఱియ | కఱవు | ఓఱఓఱ |
| తీఱిక | కఱి | ఓఱాన |
| తీఱుపు | కఱుపు | బిఱీన |
| తుఱఁగలి | కఱక్కు | బిఱీలున |
| తెఱఁగు | కఱుదు | బిఱుబిఱ్ఱు |
| తెఱకువ | తాఱు | బిఱుసు |
| కుఱినవ్వు | కాఱు | నెఱవేఱు |
| చాఱ | తిఱికి | బీఱ |
| ఏఱు | తీఱు | బీఱు |
| ఏఱువ | కిఱకిఱ | నెఱసఱి |
| చూఱ | కిఱుదు | నెఱ |
| చోఱ | తెఱ | నెఱి |
| కొఱుకు | కుఱకుఱ | నేఱా |
| తెఱలు | మఱు | పఱవ |
| కుఱుగడ | నఱుకులాడు | తొఱుద్రొక్కు |
| తెఱువ | గిఱికొను | కొఱకచ్చు |
| కుఱుచ | గుఱికొండి | దొఱయు |
| కుఱుపు | గుఱువులు | కొఱపు |
| ఉఱువు | బుఱటకొమ్మ | కొఱముట్టు |
| తేఱి | నెఱిక | కొఱసంది |
| తేఱు | నెఱిపడు | కొఱడము |
| తేఱుగడ | నెఱియ | క్రచ్చఱ |
| తొఱఁగు | బొఱియ | నఱకుఁడు |
| | పఱఁగు | నఱుమాడు |

తోఱ
కోఱు
నఱుకు
నఱుక్కు
నఱుజు
నఱుము
గఱగఱ
గెఱి
గిఱుకు
గిఱుపు
గీఱ
గీఱు
గుఱిచి
గుఱుకోను
గుఱుతు
నీఱు
కోఱ
కోఱఁత
కోఱకు
వఱకు
మీఱు
పాఱుఁడు
దూఱు
కోఱడు
కోఱను

పఱగడ
పఱచు
పఱత
పఱతి
పఱతెంచు
పఱద
పఱపఱ
పఱపు
మఱది
మఱక
మఱకువ
మఱచు
మఱలు
మఱి
మఱిగ
మఱుగు
గోఱుగు
పఱి
మఱువ
పఱిక
పఱిగ
పఱిగపిట్ట
మఱుగు
మఱుగుంజ
పఱిగోను

కఱగ
గీఱునామము
గోఱిపము
గోఱై
చిఱి
చిఱు
చిఱుము
నెఱ
నెఱఁకు
నెఱక
నెఱకాఁడు
నెఱను
నెఱపు
నెఱయు
నెఱవాది
బఱటు
ముఱుగుడు
పాఱవేయు
పాఱాడు
పాఱు
మెఱచు
మెఱము
మెఱమెచ్చు
మెఱవడి
మెఱికలు

కోఱలు
కోఱవ
కోఱవి
కోఱ
నఱకు
నఱుము
గఱగోఱ
గఱి
గఱుకు
గఱుగు
గఱువ
గిఱక
గిఱుక్కు
నివ్వెఱ
గుఱి
గుఱించు
గోఱకు
గోఱియ
మెఱుగు
మెఱుగుడు
మొఱువు
పిఱికి
మోఱకము
మోఱకు
పిఱుతివియు
పిఱుఁదు

మాఱకము
మాఱటు
పఱిపఱి
మాఱు
పఱియ
పఱివోవు
పఱుచు
పఱుపు
మిఱు
మీఱుడు
పాఱ
పాఱఁదోలు
ముఱకటము
ముఱకము
ముఱి
ముఱికి
ముఱియు
ముఱు
ఱాగతుంగ
ఱాచు
ఱాయి
ఱాపు
ఱాపువ్వు
ఱింగు
ఱికము
ఱిక్క

మెఱయ
మెఱయుడు
మెఱుఁగు
మెఱుకు
మెఱు
పాఱుటాకులు
పాఱుడు
పాఱుతెంచు
పాఱువేట
మొఱ
మొఱఁగు
మొఱక
మొఱకు
మొఱమొఱ
మొఱవ
మొఱగడము
మొఱి
మొఱికి
ఱొడ్డ
ఱొడ్డు
ఱొమ్ము
ఱోలు
వెఱ
వెఱగాయ
వెఱమగఁడు
వఱ

పిఱుదుకోను
రూపఱు
పిఱుము
పుఱియ
ఱంకు
ఱంకె
ఱంతిల్లు
ఱంతు
ఱంపము
ఱంపిల్లు
ఱంపు
ఱంపె
ఱక్కు
ఱట్టు
ఱప్ప
ఱవఱవ
ఱవిక
ఱవ్వ
ఱాఁగ
పొఱడు
వెఱ
వెఱగు
పొఱయు
వెఱక
వెఱచఱచు

ఱిక్కించు
ఱిచ్చ
ఱిప్ప
ఱిమ్మ
ఱివ్వ
ఱుప్ప
ఱువ్వ
ఱూవు
ఱెక్క
ఱెప్ప
ఱెల్లు
ఱేఁచు
ఱేఁడు
ఱేకు
ఱేపు
ఱేయు
ఱేల
ఱైక
ఱొచ్చు
వెఱపు
వెఱపిడి
వెఱబొమ్మ
పొఱిపుచ్చు
వెఱవెఱపాటు
వేఱడము

వఱగొడ్డు
వఱడు
వఱద
పెఱిక
వఱపు
వఱల
వఱలు
వఱువట్లు
వఱువాత
పెఱికాటము
పెఱుకు
పెఱుగు
జాఱు
వాఱెన
సైజాఱు
విఱివి
విఱిచికట్టు
విఱివి
వఱుగు
వేఱిమి
వేఱు
పోఱఁడు
పోఱి

శకటరేఫములుగల కొన్ని ముఖ్యములయిన శబ్దముల నర్థముతో విద్యార్థుల యుపయోగార్థమై యీ క్రింద వివరించుచున్నారము.

అఱగొట్టైము=సాహసకృత్యము
అఱగొఱ = మర్మన్యూనత
అఱచుట = బొబ్బలు పెట్టుట
ఆఱువది = సంఖ్యాశబ్దము
అఱముట = అభిక్రమము
అఱవలు = కఠినులు, నిర్దయులు ద్రావిడులు
ఆఱగు = వేదిక
అఱువుళ్ళు = రంధ్రములు
అఱుగుట = జీర్ణమగుట
అఱతు = స్త్రీ మెడను గట్టుకొను పూస
అఱఁటిచెట్టు = మోచావృక్షము
అఱపొఱతు = వామనుఁడు
ఆఱడి = వ్యర్థము
అఱుపులు = బొబ్బలు
ఆఱు = రోమావళి, షట్సంఖ్య
ఉఱక = యుగపవర్ధకము, శీఘ్రము
ఉఱియుట = కుఱియుట
ఊఱట = విశ్రాంతి
ఊఱుట = స్రవించుట
ఊఱకుడు = చాలించుట
ఎఱబఱికము = అసమ్మతము

ఇఱకటము=సంకటస్థలము
ఇఱికికొనుట = అవకాశములేని తావునఁ బ్రవేశించుట
ఇఱుకు = వైశాల్యము లేకయుంట
ఇఱుసు = రథావయవము
ఇఱియుట = కదియుంట
ఇఱుముకొనుట = దట్టమగుట
ఉఱుకుట = వేగనడచుట, పఱుట్టు వెడలుట
ఉఱుత = చిక్రోడము
ఉఱవు = గొప్ప, విస్తారము
ఉఱిది = బిగి
ఉఱదు = లక్ష్యము. నేయడు
ఉఱుములు = గర్జితములు
ఉఱిరోసము = ఉడుగనికోపము
ఉఱ = ఇష్టముగొప్ప
ఉఱియ = దిట్ట
కఱటి = మూర్ఖుఁడు
కఱవు = దుర్భిక్షము
కఱతఱ = అనుకరణవిశేషము
కాఱడవి = సాంద్రాటవి
కాఱులు = నిష్ఠురోక్తులు
కాఱియ = కష్టము

ఎఱుక = జ్ఞానము

ఎఱుఁగుట = తెలియుట

ఎఱుకువ = జ్ఞానము

ఎఱగుట = వ్రాలుట, మ్రొక్కుట

ఎఱకలు = పక్షములు

ఎఱుకు = కిరాతుఁడు

ఎఱచి = మాంసము

ఎఱమంటలు = దీప్తజ్వాలలు

ఏఱువ = సీమ

ఏఱు = నది

ఒఱపు = సొగసు, విలాసము

ఒఱ = ఖడ్గకోశము

ఒఱకటము = నిమ్నోన్నతము

ఒఱలుట = ధ్వనితోఁబొరలుట

ఒఱవ = వక్రము

ఓఱు = ధ్వని

కఱకంఠుఁడు = శివుఁడు

కఱకటి = బలాత్కారము

కఱచుట = నేర్చుట, దంతపీడనము

కఱతలు = పోకిళ్లు

కఱసులు = వంచనలు, మోసములు

గఱి = పక్షము

గఱగొఱ = లోపము, న్యూనత

గఱిసె = కొల్తభేదము

గఱిటె = దర్వి

కాఱుపోతులు = కఠినమహిషము

కిఱుమిట్లు = ఉపానహములు, పాంకోళ్లు

కిఱుపుట = కదల్చుట

కుఱుదులు = రాసులు

కుఱుకుఱు = స్వల్పము

కుఱుమాపు = కొంచెపుమాపు

కుఱఁగట = సమీపము

కుఱుచలు = నృత్యములు, హ్రస్వములు

కుఱుపు = వ్రణము

కొఱలుట = నిండుట, ప్రకాశించుట

కొఱకొఱలాడుట = కోపవికారము

కొఱకుట = దంతపీడనము

కొఱను = బీడు

కొఱఁత = తక్కువ, కొఱు

కొఱవి = అలాతము, కురువకవృక్షము

కొఱ = మనోజ్ఞము, పని, తక్కువ

సస్యవిశేషము, మత్స్యవిశేషము

కోఱ = దంష్ట్రి

కోఱడము = క్రూరత్వము

గఱిక = తృణము

చాఱపప్పు = ఒకజాతిబీజములు

చిఱుత = బాలుఁడు, చిన్నదారు ఖండము, మృగవిశేషము

చిఱుకొట్టుట = వ్యసనపడుట

గిఱ్ఱాలు = గుండ్రనిగీఁటులు

గిఱికలు = చిక్కులు

గిఱిగొనుట = నాటుకొనుట, కొనుట

గీఱ్ఱుట = నాటుట, దంతపీడము ఆకర్షించుట

గుఱుకొనుట = ఉద్యోగించుట, యత్నముచేయుట

గుఱుకట్టించుట గుఱుపెట్టుట

గుఱుతు = అభిజ్ఞానము, ఆనవాలు

గుఱిచి, ద్వితీయావిభక్తి ప్రత్యయము

గుఱించి = ద్వితీయావిభక్తి ప్రత్యయము

గుఱుకొండి = మర్మము, రహస్యము

గుఱుములు = బీజములు

గెఱ = గుండ్రనిగీఁటు

గొఱగొఱ = అనుకరణధ్వని విశేషము

గొఱుగుట = క్షౌరముచేయుట

గోఱజము = మదము, కస్తూరి జంతుభేదమని కొందఱు

చఱచుట=కొట్టుట, సాఁగగొట్టుట

చఱులు=సానువులు

చఱియుట = ప్రవేశించుట, చూచుట

చిఱు = చిన్న

చిఱునుట=చిమ్ముట, చిమునుటయని కొందరు

చుఱుకు = వాఁడి, కాఁక

చుఱుపుచ్చుట = కాల్చుట

చుఱచుఱ = అనుకరణవిశేషము

చెఱములు = నానాపాత్రములు

చెఱిసగము = సమభాగము

చెఱకు = ఇక్షువు

చెఱలాడుట = భ్రమించుట

చెఱువు = తటాకము, సత్రము

చెఱముట = రాచుట

చెఱచుట = పాడుసేయుట

చెఱ = కారాగృహము, స్త్రీల బలాత్కారముగాఁ బట్టుట

చెఱ = అంజలిలో సగము

చేఱు = పేట

చొఱ = మత్స్యవిశేషము

చోఱ = మత్స్యవిశేషము

తఱగటి = బేహారి

తఱుగుట = కోయుట, తక్కువయగుట

తఱిగొనుట = ఉద్యోగించుట

నీఱు = భస్మము

నీఱుపాఱుట=శరీరదృఢతపోవుట

తఱి = సమయము

తఱిపి = ముదురు

తఱుముట = పాఱఁగొట్టుట

తాఱుట = పరుగెత్తుట

తీఱు=విధము

తుఱఁగలి=విఱుగుడుపాటు

తుఱుసంటితనము=ఔద్ధత్యము

తుఱఁగలించుట=భ్రమించుట, ప్రకాశించుట

తుఱుముట = అలంకరించుట

తూఱుపు = ప్రాగ్దిశ

తూఱుట = చొచ్చుట

తెఱువ = తెలివి

తెఱపి = బయలు

తెఱఁగు = విధము, సందర్భము, క్రమము

తెఱవ = స్త్రీ, బయలు

తెఱచుట = వివృతముగావించుట

తెఱగొల్పుట = బయలుపరచుట

తెఱలుట = బయలుదేరుట

నఱుకుట = తునకముగావించుట, ఖండించుట

నఱుము సేయుట=చూర్ణము సేయుట

నఱుజు = సూక్ష్మము

నిఱుపేద = అతిదరిద్రుఁడు

నుఱుపుట = మర్దించుట

నుఱుము = చూర్ణము

నూఱు = శతసంఖ్య

నెఱులు = కేశములు

నెఱిక=కచ్చభేదము, గాగరా

నెఱకులు = శల్యములు

నెఱసరి = సింహభేదము

నెఱవు = విశాలము, దీర్ఘము

నెఱి=సిగ్గు, కుటిలము

నెఱతనము = శ్రేష్ఠత్వము, పూర్ణత్వము, చతురత్వము

పఱియలు = శకలములు

పఱపు = శయ్య

పఱతెంచుట = మీఁదికి వచ్చుట

పఱివోవుట = చెడిపోవుట

పఱిగొనుట= ఆక్రమించుట, చెడఁజేయుట

పఱపఱియలు, పఱపఱ = చిందఱవందఱ

పఱుగు = శీఘ్రగమనము

పఱకెలు = పక్షివిశేషము

పఱిగలు = ధాన్యాదులనునూర్చుతావు

పఱటి = కుంభము

పఱచుట = చేయుట, ధావనము సేయుట

పాఱుట = ప్రవహించుట, వ్యాపించుట
పిఱుఁద = వెనుకను
పిఱుఁదు = నితంబము
పిఱువోవుట = వెనుకకుఁబోవుట
పెఱికలు = గోనెలు
పెఱుకుట = పెల్లగించుట
పోఱఁడు = చిన్నవాఁడు
బఱుకుట = నెత్తురువచ్చునట్లుగోకుట
బఱబఱ = అనుకరణధ్వని
బిఱబిఱ = శీఘ్రము
బిఱుసులు = బాణసంచు
బీఱువోవుట = వ్యర్థమగుట
బుఱుజులు = కోటమీఁదనాలుగు వైపులను గట్టునిండ్లు
మఱకువ = } విస్మృతి
మఱపు
మఱఁది = పెనిమిటితమ్ముఁడు, అప్పపెనిమిటి
మఱవ = కుండ
మఱఁదలు = భార్యచెల్లెలు, తమ్మునిభార్య
మఱుఁగుట = తపించుట
మఱుసటిదినము = పరదినము
మఱుపడుట = మాఱుపడుట
మఱి = పునరర్థకము

మాఱుకొనుట = తాఁకుట
మాఱట = రెండవది
మాఱుచుట = చంపుట
మఱుఁగు = చాటు
మఱునాఁడు = పరదినము
మిఱుమిట్లు = కన్నులచీఁకట్లు గ్రమ్ముట
మిఱుచూపు = ఊర్ధ్వదృష్టి
మీఱుట = అతిక్రమించుట
ముఱిముఱి = కొంచెము
మెఱుపులు = మించులు, కాంతులు
మెఱయుట = ప్రకాశించుట
మెఱుఁగు = తటిత్తు, తళుకు, దీప్తి.
మెఱము = లంఘనవిశేషము
మొఱక = వెలితి
మొఱవోవుట = కుంఠితమగుట
మొఱఁగుట = వంచించుట
మొఱుఁగుట = శునకధ్వని చేయుట
మొఱమొఱ = చూర్ణాదుల పరుసదనము
ఱంతు = దర్పవికారము
ఱంపము = క్రకచము
ఱంపిల్లుట = ధ్వనిచేయుట
ఱంకు = వ్యభిచారము
ఱంకె = వృషభధ్వని
ఱట్టు = పరీవాదము
ఱవిక = కంచుకము
ఱసఱవ = కోపవికారము

మాఱు = ప్రతి
ఱవలు = వజ్రశకలములు
ఱాచు = రుద్దు
ఱాఁగ = ధూర్త
ఱివ్వన = ధ్వనివిశేషము
ఱింగున = అనుకరణము
ఱిక్కలు = లొట్టలు
ఱువ్వుట=విసరివేయుట
ఱెప్ప = పక్ష్మము
ఱెమ్మ = ఱేకు
ఱెక్కలు = పక్షములు
ఱెల్లు = తృణవిశేషము
ఱేసుట = హెచ్చుట
ఱేఁచు = మృగవిశేషము
ఱేఁచుట = పురికొల్పుట
ఱేలచెట్టు = వృక్షవిశేషము

ఱవ్వ = అపవాదము
ఱేఁడు = రాజు
ఱొమ్ము = వక్షము
ఱోయుట = వెదకుట
వఱుత, వఱద } ప్రవాహము
వఱడు = ముసలినక్క
వఱలుట = ప్రకాశించుట
విఱివోటు = ద్వేషము
విఱిగాలి = ఈఁదరగాలి
విఱుగుట = చెదఱుట
వీఱిడి = వెఱ్ఱి
వెఱపు = భీతి
వెఱబొమ్మ = దృష్టిప్రతిమ
సొన్నాఱి = కంసాలి

ఉపన్యాసరచనయందు రేఫ శకటరేఫముల నంతగాఁ బాటింపకున్నను దోషములేదని కొందరు చెప్పుచున్నారు.

# CHAPTER XII.

## శబ్దవృత్తులు.

ప్రతిభాషయందును ఎక్కువ మాటలతోఁ జెప్పు నభిప్రాయమును సంగ్రహించి చెప్పుట భాషాప్రౌఢిమను, ఆభాషను వాడిన జనులు నాగరకతా మహాదశను వెల్లడించును.

ప్రతిభాషకును ధాతువులు (క్రియలు) ముఖ్యములు వాని నుండి నామవాచకములు, విశేషణములు, అవ్యయములుఁ బుట్టి భాషావ్యాపారమును నడుపుచుండును.

1 ఉదా—నడచు = ధాతువు

నడచుచున్నాడు = క్రియ

నడక = నామవాచకము (ఇదియే కృదంతము)

నడచు = విశేషణము ఉదా—నడచు బాలుఁడు,

నడచి = అవ్యయము

ఇట్లొక్క ధాతువుమీఁద ననేక శబ్దము పుట్టి యనేక వ్యాపారములను దెలుపుడి చేయుచున్నవి.

ఇట్లు శబ్దములయొక్క వృత్తులను దెలిసికొనినచో ధాతువుయొక్క కృదంతాదిరూపములను గుర్తెఱిగి వ్యాసరచన సులువుగా సంగ్రహముగా ప్రౌఢముగాఁ జేయవచ్చును. అట్లు తెలియనిపక్షమున సంగ్రహరూపములఁ దెలియక యనేక పదములను గూర్చవలసి వచ్చును.

2. "చిత్రానక్షత్రయుక్తమయిన పౌర్ణమాసి" ఈ విషయమును దెలుపుడిచేయుట కొక్క శబ్దమున్న పక్షమున భాషకు సంగ్రహమును దానిని వాడుకొను వారికి సౌఖ్యమును గలుగును. అట్టిమాట 'చైత్రి',

ఆంగ్లేయ భాషయందుగూడ నిట్టి సంగ్రహశబ్దములు గలవు.

Occurring once in five years=quinquinial.
That cannot be wounded=invulnerable.

చైత్రి = ఇది చిత్రా (Noun) పైని బుట్టిన తద్ధితాంతము.

3. 'వృక్షముయొక్క మూలము, దీని సంగ్రహరూపముగాఁ జెప్ప వలయునని 'వృక్షమూలము, అని చెప్పవలెను.

ఇట్లు చేయుటవలన వృక్షమూలము ఒక సమాసమయినది. ఇదియే సమాసవృత్తి

ఉదా— వృక్షము వృక్షము = వృక్షములు, రాముఁడు, రాముఁడు రాములు, ఇల్లు, ఇల్లు = ఇండ్లు, బండి, బండి = బండ్లు

ఇట్లెన్ని శబ్దములున్నను, ఒక్కశబ్దమే కాన్పించుటవలన భాషా సంగ్రహము కలుగును వంద చెట్లను దెలుపునపుడు వందసారులు చెప్పక "చెట్లు" అని యొక్క శబ్దముతోఁ జెప్పుట యేక శేషవృత్తి.

సంస్కృతములోఁ గొన్ని భిన్నరూపములుగల శబ్దములకుఁగూడ నేకశేష వృత్తికలదు.

ఉదా—మాతా + పితా = పితలు

మయూరి + మయూరము = మయూరములు
స్వస + భ్రాత = భ్రాతలు
దుహిత + పుత్త్రుడు = పుత్త్రులు

5 " చూడవలయునను నిచ్ఛ" దీనికేకపదము "దిదృక్ష"

ఇచ్చట "దృశ్" అనునది ధాతువు "సన్" ప్రత్యయము.

ఆప్రత్యయము పరమైన యపుడు ధాతువునకుం బునరుక్తివచ్చి "దృశ్, దృశ్" అయినది. అందు మొదటిరూపమునకుఁ జివరహల్లు లోపించుట, ఋకారమునకు, అకారమువచ్చుట, దానికి ఇకారమువచ్చుట కలుగఁగా "దిదృశ్" అయినది. ఆశవర్ణమునకు షకారమువచ్చి యది క్షకారమయినది. ఆకకారములో సకారముగలసి షకారమై "దిదృక్ష" అయినది. దిదృక్ష ఇది సనాద్యంత ధాతువృత్తి.

ఇట్టి వృత్తులవలన శబ్దసంగ్రహము స్థాపింపఁబడుచున్నది.

"Succinctness - Brevity of diction" is recognised to be one of the Six main qualities of composition.

## (1) కృద్వృత్తి—Verbal Nouns.

తెలుఁగునందుఁ గృత్ప్రత్యయములు పలుధాతువులపైఁ బలు తెఱఁగులఁ గానవచ్చుచున్నవి కావున వానిని శబ్దస్వరూపములవలనఁ దెలిసికొనవలయును.

| ధాతువు | కృదంతము | ధాతువు | కృదంతము |
|---|---|---|---|
| వ్రియ్యు | వ్రింత | కొనుట | కోలు |
| కోయు | కోఁత | కలయు | కలయిక |
| పోవు | పంపు | తేరు | తేట |
| చూచు | చూపు | ఎఱుఁగు | ఎఱుక |
| పెంచు | పెంపు | ఏలు | ఎలుబడి |
| అడఁగు | అడకువ | ఏలు | ఏలిక |
| వ్రాయు | వ్రాత, వ్రాయి | తీరు | తీర్పు |
| పూను | పూనిక | ఒప్పు | ఒప్పుదల, ఒప్పు |
| అమ్ము | అమ్మకము | నొచ్చు | నొప్పి |
| చేయు | చేయి, చేఁత | ఓర్చు | ఓరిమి |
| పన్ను | పన్నిక | చూచు | చూపు, చూడ్కి |
| ఉండు | ఉనికి | | చూపఱు |
| పూయు | పూఁత | తీరు | తీర్పు |
| వచ్చు | రాక | కడఁగు | కడఁక |
| ఆడు | ఆట | తలంచు | తలఁపు |
| పుట్టు | పుట్టు, పుట్టువు | తనియు | తనివి |

| ధాతువు. | కృదంతము. | ధాతువు, | కృదంతము. |
| --- | --- | --- | --- |
| ఇచ్చు | ఈగి, ఈవి | విను | వీను, వినుకలి,<br>వినికి, వినికిడి. |
| పడు | పాటు | | |
| నమ్ము | నమ్మిక | విడు | విడుపు |
| పోలు | పోలిక | కరచు | కాటు |
| ఈను, ఈఁదు | ఈత | తనియు | తనివి |
| నేర్చు | నేరమి, నేర్పు | కినియు | కినుక |
| ఊరు | ఊట | చేయు | చేత |
| తలపోయు | తలపోత | చచ్చు | చావు |
| నడచు | నడక, నడత, నడవడి | చెండు | చెండు |
| ఎండు | ఎండ | సైచు | సైరణ |
| పోవు | పోక | తెఱచు | తెరపి, తెరవ,<br>తెరప |
| మరచు | మరపు | | |
| వంగు | వంకి, వంకర, | కాలు | కాఁక |
| | వంపు | నలుసు | నలుసు |
| నిలుక | నిలకడ | క్రొవ్వు | క్రొవ్వు |
| పోరు | పోరు, పోరితము, | చెడు | చేటు, చెట్ట |
| | పోరాటము | ఓడు | ఓటమి |
| మారు | మార్పు | కను | కన్ను, కానుక,<br>కాన్పు |
| పలుకు | పలుకు | | |
| తేలు | తేలిక | తెలియు | తెలివి |
| కొలుచు | కొలుపు, కొలువు, | ముడుచు | ముడుపు |
| | కొలత | తిరియు | తిరిపము |
| తునియు | తునక | తిను | తిండి |
| అదరు | అదరు | తడియు | తడుపు |

| ధాతువు. | కృదంతము. | ధాతువు. | కృదంతము. |
|---|---|---|---|
| ఆవులించు | ఆవులింత | కన్ను | కాన్పు |
| వీఁగు | వీక | మునుఁగు | మున్క |
| వ్రేయు | వ్రేటు | కలుగు | కలిమి |
| పొడుచు | పోటు | తాలు | తాలిమి |
| వీచు | వీవన | కాచు | కాపు |
| చేరు | చేరిక, చేరువ, చేరు | చొచ్చు | చొరవ |
| | బడి, చేరువల, | కోరు | కోరిక, కోరిక |
| | చేరుగొండి | గీయు | గీత |
| డయ్యు | డప్పి | పొందు | పొందిక |
| అలుగు | అలక | వచ్చు | రాక |
| కడఁగు | కడఁక | రోయు | రోత |
| పారు | పారుదల | వేగు | వేకువ |
| వండు | వంట, వంటకము | పాయు | పాయ, పాపు |
| పట్టు | పట్టుదల | అలుకు | అలుగు |
| మురియు | మురువు, మురిపెము | పరపు | పరవు |
| తరలు | తరలిక, | మురుగు | మురుగుడు |
| తడయు | తడవు | నిలుచు | నిలువరము, నిలువ |
| కూర్చు | కూర్మి | | నిలుపు |
| వచ్చు | వచ్చుబడి, రాఁబడి, | కినియు | కినక |
| ఆడు | ఆట | గెల్చు | గెలుపు |
| ఎసఁగు | ఎసకము | ఎక్కు | ఎక్కిరింత, ఎక్కుడు |
| తక్కు | తక్కువ | పడు | పాటు |
| తగు | తగవు | పాడు | పాట |
| చొచ్చు | చొరవ, చొప్పు | పిలుచు | పిలుపు |

| ధాతువు. | కృదంతము, | ధాతువు. | కృదంతము. |
|---|---|---|---|
| ఏయు | ఏటు | ముదియు | ముదిమి |
| వైచు | వాటు | విడియు | విడిది |
| ఏచు | ఏపు | తగులు | తగులము, తగులాటము |
| వ్రేయు | వ్రేత, వ్రేటు | ఉబ్బు | ఉబ్బు |
| వ్రయ్యు | వ్రయ్య, వ్రక్క | మాయు | మాపు |
| మోను | మోను | | |

N. B:—ధాతువుపై "ట" చేర్చినయెడలనది భావార్థకము=ధాత్వర్థకము నిష్పన్నమగును. అదియు నొక కృదంతము,

ఉదా—చేయు = చేయుట, పూయు = పూయుట.

2. తద్ధితవృత్తి.

నామములపై మఱియొక యర్థమునిచ్చు ప్రత్యయముచేసి ప్రాతిపదికములగు శబ్దములు తద్ధితాంతములగును.

ఉదా—చుట్టు.

దీనిపై 'ఱిక' ప్రత్యయము చేరఁగా—చుట్టఱిక-అయినది. ఇది ప్రాతిపదికరూపము.

అమహదర్థక రూపమగుటచే దీనికి 'ము' చేరఁగా—'చుట్టఱికము అయినది.

'చుట్టు' యనఁగా బంధువుఁడు 'చుట్టఱిక' మనగా 'బంధుత్వము' బంధువుఁడగుట.

ఉదా—కులములో వన్నెతక్కువ యయ్యోనే గాధి పట్టికి మేనక చుట్టఱికము. (మనుచరిత్ర)

అకారాంతములపైనివచ్చు "మతుప్" ప్రత్యయ మకారమునకు వకారము వచ్చును.

ఉదా—గుణ + మత్ = గుణవత్

గుణశబ్దము, అకారాంతము గావున దానిపై "మతుప్" ప్రత్యయ మకారమునకు వకారాదేశము గాలేదు.

ఇట్లు మి, మీ, మూ, అంతమందుఁగల శబ్దములపై "మతుప్" ప్రత్యయ మకారమునకును వకారమువచ్చును.

ఉదా—భూమివంతుఁడు, లక్ష్మీవంతుఁడు, చమూవంతుఁడు;

తద్ధితాంతముల కుదాహరణము

ఐక్ష్వాకువంశంబున దశరథుండను రాజుగలఁడు, అద్దాశరథంబగు నైశ్వర్యముఁజెప్ప బార్హస్పత్యంబగు నాలుకయుఁజాలదు. వానిగజతావిశేషంబులును, ఆశ్రితశౌర్యంబులును, ధానుష్క పార్శ్వధిక శాక్తీక, ప్రాసిక, కౌంతిక ప్రముఖవీరుల సాహసంబులును, నాయోధ్యక జనులు పెక్కు తెరఁగులఁ బొగడుచుందరు. పార్థివుఁడన నాతండేయగు. అయ్యాజినగరంబునంగల నాగరులు కౌసుంభాది వస్త్రములచేతను, సౌవర్ణభూషణములచేతను, కౌసుమమాల్యంబులచేతను, నలంకరించఁబడి కుసుమితంబులగు నారామంబులు రామణీయకంబుఁ దాల్తురు. ఆతనికిఁ బ్రాజాపత్యంబగు సాయసము మాహాత్మ్యంబున నవమితిథియందుఁ బుత్త్రచతుష్టయంబుగలిగె నందుఁ గౌసలేయుండగు రాముండాదిత్య నక్షత్రంబున జనించె. కైకేయీ సుతుండగు భరతుండు బార్హస్పత్యంబగు నక్షత్రంబున నుదయించె. సౌమిత్రులగు లక్ష్మణ శత్రుఘ్నులు సార్పంబున నుద్భవిల్లిరి.

వారు బాల్యంబున గుణులును, మేధావులును విద్యావంతులును ధీమంతులునునయి యన్యోన్య సహాయ్యకంబున నాటలం బాటలం బెఱుగుచు నుందురు.

ఆక్షత్రియపుత్త్రులు ద్వైపంబగు రథంబుపై రథ్యలవెంబడి నరుగుచుండ జూచువారిదే యైంద్రియ కాలికత్వము. అట్లుండ స్థాండిల శేఖరుండగు గాధేయుండొకనాఁడు సదస్యులతో నౌత్తరకోసలుండగు దశరథుండుండ దౌవారికునిచేఁ దన రాక నెఱింగించి యాతం డర్ఘ్యపాద్యాదులచేఁ గౌర

కంబు సలుప హైమపీఠి నలంకరించి తన తార్కికత్వ వైయాకరణత్వాది నైపుణ్యం బేర్పడ నిట్లనియె.

ఓ రాజన్యవరా ! నీచే నిర్దేశంబు రాజన్వంతంబయ్యె. మానవులు సౌఖ్యంబున మనుచుండిరి. పథికులు సైతము నాత్మీయ దేశమునంబలె నీరాజ్యంబున సుఖితులగుచుండిరి. అతిరిత్త్యాలం జెప్పనేల ? రాజపానులు, మరుత్వత్కల్పుండవును కుబేరదేశీయుండవును, వరుణదేశ్యుండవును నగు నీకుం దుల్యులగుదురా ?

---

ఆంధ్రభాషయందొక్క శబ్దమున్న పక్షమున దానియనేక సంబంధములను బట్టి తదర్థబోధకములగు పలు శబ్దములు పుట్టును.

ఒక శబ్దము యొక్క ప్రతిరూపమును నూతన శబ్దమనుకొనుట భాషాసాగర మీఁదఁ దలంచువానికిఁ గ్లేశతరముగా నుండును. భాష యట్లేప్పడిసదియుఁగాదు.

ఉదా:— తత్ = ఆ అనుశబ్దము
తదీయము = వాని సంబంధమయినది.
తతః = వానివలన
తత్ర = వానియందు
తథా = ఆప్రకారము
తదా = అప్పుడు
తావత్ = అంత

ఉదా:— "రథ" శబ్దము
రథికుఁడు = రథాధిపతి
రథ్య = రథములకు యోగ్యమైనది.

ఉదా:— "యుష్మత్" నీవు
యుష్మదీయము = }
యౌష్మాకము = } మీసంబంధమైనది.
యౌష్మాకీణము = }

మదీయము =
మామకము =
మామకీనము = } నాసంబంధమైనది.

ఇట్లే యొక్క శబ్దములోనుండి అర్థభేదము ననుసరించి అనేక ప్రత్యయములం బొంది బహుశబ్దములు పుట్టుచున్నవి.

అట్టి ముఖ్యమైన కొన్ని శబ్దముల నీ క్రిందఁ దెలియఁజేయుచుంటిమి.

## తద్ధితాంతములు.

అపత్యార్థకములు.
తద్ధితములు.
రాఘువుఁడు - రఘువు
జానకి - జనక
దాశరథి - దశరథ
కౌంతేయుఁడు - కుంతి
పార్వతి - పర్వత
ద్రౌపది - ద్రుపద
ద్రౌణి - ద్రోణ
మారుతి = మారుత
పాకశాసని - పాకశాసన
ఐంద్రి - ఇంద్ర
రావణి - రావణ
వాసిష్ఠుడు - వసిష్ఠ
శౌనకుఁడు - శునక
గార్గ్యుఁడు - గర్గ
బాదరాయణి - బాదరాయణ
పారాశరుఁడు - పరాశర
దైత్యుఁడు - దితి
ఆదిత్యుఁడు = అదితి
వైనతేయుఁడు - వినత
గాంగేయుఁడు - గంగ

సంబంధార్థకము.

భవదీయము - భవత్
పౌష్పము - పుష్ప
మాధుకరము - మధుకర
భ్రామరము—భ్రమర
కౌసుమము—కుసుమ
సారసత్వము—సరస్వతి
వార్క్షము—వృక్ష
దాండము—దండ
వాస్త్రము—వస్త్ర
పౌస్తకము—పుస్తక
పాత్రము—పత్ర
వానము—వన
గాంగము—గంగ

సమూహార్థకములు.

ఆర్షభము—ఋషభసమూహము

సారసము—సరస్

మాయూరము—మయూర

శౌకము—శుక

ఖాకము—ఉక

ఘూకము—ఘూక

పైకము—పిక

వైణము—వీణ

పౌంస్నము—పుంస్

బాణము—బాణ

హారము—హార

వాత్యా—వాత

ధూమ్యా—ధూమ

పాశ్యా—పాశ

స్త్రైణము—స్త్రీ

భావార్థకములు,

యోగ్యత—యోగ్య

మనుష్యత్వము—మనుష్య

సౌకుమార్యము—సుకుమార

గరిమ—గురు

బ్రాహ్మణ్యము—బ్రాహ్మణ

రమణీయకము—రమణీయ

మానోజ్ఞకము—మనోజ్ఞ

పాటవము—పటు

ప్రోక్తార్థకము,

కారకము—కరునిచేఁ జెప్పఁబడినది.

అదిదీనియందుగలదు అను నర్థకములు.

సైకతము—సికతా

శార్కరము—శర్కరా

వేతస్వంతము—వేతసా

నడ్వంతము—నడ

అదివీనికిఁగలదను నర్థకములు.

యోగ—యోగ

విద్యావంతుఁడు—విద్యా

ధనవంతుఁడు, ధని—ధన

ఇతరతద్ధితలు

ఈశ్వరుఁడు—ఐశ్వర్యము

ముని—మౌనము

దుహిత—దౌహిత్రుఁడు

పురము—పౌరులు

చుట్టము—చుట్టరికము

ఉద్ధతి—ఔద్ధత్యము

ఉచితము—ఔచిత్యము

సంగతి—సాంగత్యము

వీరము—వైరము

నిజము—నైజము

శృంగము—శార్ఙ్గము

బంధువు—బాంధవము

లబ్ధము—లబ్ధి

అగ్గలము—అగ్గలికము
రజతము—రాజతము
గిరి—గైరిక
నగరము—నాగర, నాగరక
విభవము—వైభవము
శిల—శైలము
గరుడ—గారుడము
గంధర్వులు—గాంధర్వము
కరుణ—కారుణ్యము
దీనము—దైన్యము
దుష్టము—దౌష్ట్యము
శంకరుఁడు—శాంకరము
సభ—సభ్యము
బలము—బలిమి
పటు—పాటవము
రుద్రుఁడు—రౌద్రము
అసురుఁడు—అసురము
దితి—దైత్యులు
భృతి—భృత్యుఁడు, భర్త
ప్రకటము—ప్రాకటము
స్థిరము—స్థైర్యము
వృత్తము—వార్త
అగ్ని—ఆగ్నేయము
లఘువు—లాఘవము
శ్రీవము—శ్రీవ్యము, శ్రావ్యము
గంభీరము—గాంభీర్యము

మధురము—మధురిమ, మాధుర్యము
ప్రౌఢ—ప్రౌఢి, ప్రౌఢిమ
ధృఢము—దార్ఢ్యము
సదృశము—సాదృశము
ప్రవీణము—ప్రావీణ్యము
విభుఁడు—విభుఁడు, వైభవము
వృత్తి—వార్తికము
రథము—రథికుఁడు
రథ్యము
రథ్య
సారథి
విరళము—వైరళ్యము
శిల—శైలము
రుద్రుఁడు—రౌద్రము
పర్వతము—పార్వతి
విమానము—వైమానికము
సుహృత్తు—సౌహృదము
శత్రువు—శాత్రవుఁడు
పూర్ణిమ—పౌర్ణిమ
కవి—కావ్యము
మిత్రము—మైత్రి
ప్రణీతము—ప్రణేత
శరత్తు—శారదము
ధీరుఁడు = ధైర్యము
రమణ—రమణి, రమణుఁడు
రామణీయము

అతిథి - ఆతిథ్యము
తపస్సు - తాపసము, తాపసి,తపస్వి
జ్వలనము - జ్వాల
నాతి - నాతుక
కుతుకము - కౌతుకము
సమానము - సామాన్యము
కుశలము - కౌశలము
మనువు - మానవులు
చక్రము - చక్రి
శూలి - శూలి
సుఖము - సుఖి, సౌఖ్యము
ధురంధరుఁడు , ధౌరంధర్యము
దనువు - దానవులు
వృత్తి - వర్తనము, వార్త్తికము
మృత్యువు - మర్త్యుఁడు
చెలి - చెలిమి
సమము - సామ్యము
దంతము - దంతి
క్రూరుఁడు - క్రౌర్యము

తమస్సు - తామసము
సన్నిధి - సాన్నిధ్యము
హృదయము - హృద్యము, హార్దము
భృగు - భార్గవుఁడు
భోజనము - భోజ్యము, భోక్త
మహత్తు - మహిమ
మహేశ్వరుఁడు - మాహేశ్వరము
శత్రువు - శాత్రవము
దివి - దివ్యము
పటువు - పాటవము
పఠనము - పాఠము, పాఠకుఁడు
మిత్రుఁడు - మైత్రి
సుందరము - సౌందర్యము
సుభగము - సౌభాగ్యము
ద్రోహి - ద్రోహము
సహాయము - సాహాయ్యకము
ఉదారత - ఔదార్యము
యశస్వి - యశస్
అర్చిష్మంతుఁడు - అర్చిస్,

సంస్కృతశబ్దములపై "త్వ" "తా" చేర్చుటవలన భావార్థక మేర్పడును.

తెలుఁగు శబ్దములపై "తన" చేర్చుటవలన భావార్థ మేర్పడును. ఇవి సర్వశబ్దముల పైవచ్చు ప్రత్యయములు.

ఇవిగాక కొన్నిశబ్దములపైఁ గొన్ని ప్రత్యయములు వచ్చును. సంస్కృతశబ్దోదాహరణము లిదివరకే యిచ్చియుంటిమి.

తెనుఁగునకు—కన్నెఱికము, చుట్టఱికము, రాచఱికము, మేనఱికము, ఇల్లఱికము. పేదఱికము.

'కాఁడు, కత్తె' యను ప్రత్యయములు స్త్రీలింగ పుంలింగముల యందు వరుసగా 'మత్' (కలదు) అను నర్థమందువచ్చును.

ఉదా—వన్నెకాఁడు, వన్నెకత్తె, చెలికాఁడు, చెలికత్తె, మిండ కాఁడు, మిండకత్తె, పనివాఁడు, పనికత్తె, బోనకాఁడు, బోనకత్తె, అందకాఁడు అందకత్తె.

కొన్ని యితరార్థములయందుఁ గొన్ని యితరప్రత్యయములు వచ్చును.

ఉదా—చదువరి, ముక్కిడి, చిన్నతనము, పేరిమి, తూమెడు.

మఱికొన్ని తెలుఁగు తద్ధితాంతములు.

ఆఁకొన్నతనము— (పెల్లాఁకొన్నతనాన. భీమ. 2 అ.) ఆఁకొన్న వానితనము, ఆఁకొన్న దానితనము. ఓర్వలేనితనము, ఓర్వలేని దానితనము, ఓర్వలేనివానితనము.

పూజారి, పూజరి, సొన్నారి, చెంచిత, చెడుగఁడు, దుడుకఁడు, నిడుపఁడు, వేఁడిమి, వెల్లడి, తెలివిడి, విరివిడి, వినికిడి, లేమిడి, రాపిడి, ఇంపితము, బిగితము, పోరితము, ఒప్పిదము, తప్పిదము, పెల్లిదము, క్రొవ్విదము, బెట్టిదము, వాపిరి, నాయికరము, చెలికారము, నయగారము, నడికారము, కొలగారము, చలిమిరి, ఒంటి, తనమయము.

# CHAPTER XIII.

## స మా స ము లు .

——(0)——

## Phrases.

పదము లొక యభిప్రాయమును బోధించుటకుఁ బదముల కూడిక యావశ్యకము. ఆపదములను గూర్చునప్పుడు వాని వానికిఁ గల సంబంధము దెలియఁజేయుటకు మధ్య విభక్తులను జేర్చుచుండవలెను. ఎట్లనఁగా—

ఉదా—రాముఁడు, పుస్తకములు.

ఇచ్చట నీరెండు శబ్దములవలనఁ దెలిసికొనఁదగిన విషయ మేమియును లేదు. అయితే, పుస్తకములు రామునివని తెలియజేయఁవలసి వచ్చినచో "రామునియొక్క పుస్తకములు" అనవలెను. ఇవి భిన్నపదములు. ఇచ్చట భిన్నపదములకు "యొక్క" యను విభక్తి ప్రత్యయముచేత సంబంధము సూచింపఁబడినది. సంగ్రహార్థమై యొక్క యనునది తీసివేసి, "రామునిపుస్తకములు" అనిన పక్షమున నిది సమాసమగును. ఇది తత్పురుష సమాసము.

విభక్తి లోపింపకుండ "నీచేతిపోరు' అని చెప్పిన పక్షమున నిది యలుక్సమాస మనఁబడును. "అలుక్" అనఁగా విభక్తి లోపింపనిది.

(2) "రాముని పుస్తకములు" ఇచ్చట రాముని, పుస్తకములు అను రెండు శబ్దములును దత్సమములు (సంస్కృతములు) వీని సమాసము సాధ్యము. అనఁగా;—శబ్దములు తత్సమరూపములను బొందినయైన సమాసము.

రాజభృత్యుఁడు = రాజుయొక్క భృత్యుఁడు, ఇచ్చట రెండుశబ్దములును సంస్కృతములు. ఇచ్చటఁగూడ యొక్క అను నర్థముగల "ఙస్" అను విభక్తి సంస్కృత వ్యాకరణముచే లోపించినది. ఇది సిద్ధసమాసము.

(3) "చెఱువు నుదకము = తటాకోదకము." ఇచ్చట చెఱువు తెలుఁగు, ఉదకము సంస్కృతము. కాఁబట్టి మిశ్రసమాసము.

(4) నలుఁగడలు = నాలుగు దిక్కులు. ఇచ్చట రెండు శబ్దములును తెలుఁగులే యగుటచేత, ఆచ్ఛికసమాసము.

ఇట్లు రెండుపదములే కాక సిద్ధములయిన సంస్కృత సమాసముల యందు నెన్నిపదములయిన నుండును.

ఉదా—"అంబర చుంబిశిరస్సర ఝ్ఝరీపటల ముహుర్ముహుర్లుఠదభంగ తరంగమృదంగ నిస్వనస్ఫుటనటనానురూప పరిఫుల్లకలాపికలాపజాలము" సమాసవివరణము.

తత్పురుషసమాసము——ద్వితీయ మొదలుకొని, సప్తమిపర్యంతము గల విభక్తులతో నొక్కపదము సమసించునప్పుడా యా తత్పురుష మగును.

ఉదా—నెలతాల్పు = చంద్రుని ధరించినవాఁడు (ద్వితీ)

నెలతక్కువవాడు – మాసముచేత చిన్నవాడు (తృతీ)

దేవరమేలు = దేవరకుమేలు (చతు)

దొంగభయము = దొంగవలనభయము (పంచ)

రామునిబాణము = రామునియొక్క బాణము (షష్ఠి)

మాటనేర్పరి = మాటయందు నేర్పరి (సప్త)

ఇవిగాక సంస్కృతమున "నఞ్" తత్పురుషమని యొకటికలదు.

ఉదా—అబ్రాహ్మణుఁడు

ఇచట, 'అ' అనునది 'న' (నఞ్)అను దానియొక్క వాల్లు లోపింపఁగా మిగిలినది. కావున నిది నఞ్ తత్పురుషమనఁబడును. 'న' అనఁగా కాదను నర్థము.

ద్వంద్వసమాసము—ఇది రెండింటికిఁ దక్కువగాకుండఁ గొన్నిపదము లేక విభక్తియందు సముచ్చయముగా వచ్చి సమసించును.

ఉదా—రామలక్ష్మణులు, కాకకూర్మమృగమూషికములు, శీతోష్ణము, రథగజతురగపదాతి.

కర్మధారయసమాసము—ఇందు రెండుపదములలో నొకటి విశేషణము, ఒకటి విశేష్యమునై యుండును.

ఉదా—నల్లగలువ, కృష్ణసర్పము, మయూరవ్యంసకము,

(a) ఉపమాన పూర్వ పదకర్మ ధారయము—ఇందు మొదటిపదము ఉపమానమై యుండును.

ఉదా—శంఖపాండువు = శంఖమువలెఁ దెల్లనైనది.

(b) ఉపమానోత్తర పదకర్మధారయము—ఇందు రెండవపదము ఉపమానమై యుండును.

ఉదా—పురుషవ్యాఘ్రము = పులివంటి మనుష్యుఁడు.

(c) అవధారణ పూర్వపదకర్మ ధారయము—ఇదియే రూపకసమాసము. దీనియందు మొదటిపదము "ఏవ" అను పదముయొక్క యర్థముతోఁ గలసి యుండవలెను. ఏవ = అనెడు.

ఉదా—యశోధనము = కీర్తియనెడు ధనము.

బహువ్రీహిసమాసము—ఇందు రెండవ పదము "కల" అనుమాటతోఁ గలసిన యర్థముకలదై యుండవలెను.

ఉదా—పీతాంబరుఁడు = పచ్చని బట్టగలవాఁడు.

ఇది రెండుపదములేగాక ననేకపదములు గలిగియుండవచ్చును.

ఉదా—రక్తవిశాల నేత్రుఁడు = ఎఱ్ఱనైనట్టియు, విశాలములైనట్టియు: గన్నులుగలవాఁడు.

ఇట్లు "నఞ్" బహువ్రీహియని యొకటికలదు. దానికి నుత్తరపదము "లేని" యుండవలెను. నకారములోపము తత్పురుషము వలెనే వచ్చును.

ఉదా—అగుణుఁడు = గుణములేనివాఁడు.

సహపూర్వపద బహువ్రీహి సమాసము—ఇందు మొదటిపదము "సహ"అనునది వికల్పముగా లోపించును. ఈ సమాసమందు "కూడిన" అను నర్థము రావలెను.

ఉదా—సలక్ష్మణుఁడు = లక్ష్మణునితోఁ గూడినవాఁడు.

ఇందు సహ శబ్దముయొక్క "హ" లోపించినది. సహలక్ష్మణుఁ డనియుఁ, నుండవచ్చును.

ఉదా—సహగుణుఁడు = గుణములతోఁ గూడినవాఁడు.

ఇందు "సహ" శబ్దముయొక్క "హ" కారము లోపించలేదు. "సగుణుఁ" డనియు నుండవచ్చును.

## ముఖ్యాంశములు.

సమాసములు చేసినఁ జేయవచ్చును. మానిన మానవచ్చు,

ఉదా—సీతారాములు = ఇది ద్వంద్వసమాసము.

ఈ సమాసము మాని "సీతయును, రాముఁడును" అనియుఁ జెప్ప వచ్చును. ఇట్లు తక్కిన సమాసములును.

తెలుఁగుశబ్దము సంస్కృత శబ్దముతోఁగాని, సంస్కృత శబ్దము తెలుఁగుశబ్దముతోఁగాని తెలుఁగు శబ్దము తెలుఁగు శబ్దముతోఁగాని తమ తమ విభక్తివికారములను బొంది తత్పురుషకర్మధారయసమాసములు చేయఁ బడవచ్చును. విభక్తివికార మనఁగా—విభక్తి పరమైనయప్పుడు శబ్దమునకు వచ్చుమార్పు.

ఉ॥ దేవునిపేరు.

ఇచ్చట దేవశబ్దము షష్ఠీవిభక్తి కావున షష్ఠీవిభక్తి ప్రత్యయమగు యొక్క పరమై యుండునప్పుడు "దేవునియొక్క" యని యుండునుగదా కావున "దేవుని" అనునది విభక్తివికారమయినది. అట్టి వికారము పొంది "పేరు" శబ్దముతో సమసించి "దేవునిపేరు" అయినది.

ఇది సంస్కృత శబ్దము తెనుఁగు శబ్దముతో సమసించుట.

ఉదా.—వేడికిరణము.

ఇది సంస్కృతముతోఁ దెలుగు సమసించినది.

ఉదా.—మేటివేల్పు.

ఇది తెలుఁగు తెలుఁగుతో సమసించుట.

'మేటివేలుపు, వేడికిరణము' అనుచోట విభక్తి పరముగునప్పుడు మార్పురాదు గావున నట్లుగానే సమసంచినవి.

---

## Exercises.
## సాధకములు.
### I

"మార్గమందు రాకుమారుల కశ్రమంబుగ ముచ్చటలం జెప్పుచు మౌనిచంద్రుండు తండ్రికంటె నెక్కువ మక్కువతో వేళ కన్నపావాదు లారసి వన ప్రయాణంబు విహారంబుగతిఁ గనుపింపఁ జిత్రకథా ప్రశంసల నింటిమీఁది భ్రమఁబుట్టనీక నైపుణ్యంబుఁ జూచి తోకొని కొంతయేగి యొక్కసర స్తటంబునంజేరి సంధ్యాసమయంబగుడుఁ గాల్యకృత్యంబు లొనర్చి వారలచే నిర్వర్తింపించి క్షుత్తృష్ణా నివారణంబులు, మనశ్శరీరపుష్టి కారణంబులు, తేజఃప్రసారణంబులునగు బలాతి బలలను విద్యలు బ్రాహ్మాస్త్రాదివ్యస్త్ర శస్త్రంబులును బ్రయోగోప సంహారంబులతో సవిస్తరంబుగ నుపదేశింప రాఘవులు మహాప్రసాదమని స్వీకరించిరి." (శృంగారకవి సర్వారాయని శ్రీరామజననము.)

☞ ఇందలి సమాసములను విడఁదీయుఁడు.

### II

"ఆ శాబరదేశమున నేమి కారణముననో గాని తరుచుగా, శీతలకాలమున భయంకరములైన గాలి వానలు గలుగుచుండును. నీలవర్ణమైన యాకాశము నిర్మలముగా నుండ, నంతలో నల్లని మేఘపఙ్క్తులు బలసి దిశలఁగప్పి

విజృంభింప చక చక మని మెఱుపులు మెఱయసాగును. పెట పెటమని యుఱుము లుఱుమఁజొచ్చును. వానికిఁ దోడ్పడి ఝంఝానిలము ఝూం ఝూమ్మని గవాముఖంబుల ఘోష బెట్ట నారంభించును. అంతట ఫెళ ఫెళ లాడుచు విరిగిన శాఖలతో వృక్షములు నేలకుఁ ద్రెళ్ళుచుండును.''

(బయ్యపునేడి వేంకటజోగయ్య కళావతీ విజయము.)

☞ ఇందలి సమాసములను విడఁదీయుఁడు.

## III

" అప్పుడు పుండరీకాక్షుండును, జనుదెంచుడు, గ్రామపాలుండు స్వాములకుం బ్రణామంబు సమర్పింపుము వీరలిచ్చటఁ జాతుర్మాస్యంబు సలుప నిశ్చయించిరి. మనభవనంబునం దునిచి సుభద్రను బరిచర్య సేయఁ బనుపుము. నావుఁడు నేకతంబున నతండిట్లనియె. అన్నా! యీ సన్న్యాసి తారుణ్యంబు గలిగి రూపంబునఁ బౌరందరి చందంబున నున్న వాఁడు, జవ్వనియగు మన కన్నెను బరిచర్యకుఁ బనుపనగునే? ఏకాంత కాంతా దర్శనం బెంతవారి నయినఁ గంతువారిని ద్రోయఁగలదు. అనవుఁడుఁ దమ్మునిం జూచి నేనిమ్మాట విచారింపక పనిచినాఁడనే? సన్న్యాసులకుఁ గన్నియలే శుశ్రూషను జేయువారు. వీరియం దపోహపడుట మనకు దోషము.

(వడ్డాది సుబ్బారాయకవి సుమనోమనోజ్ఞము.)

☞ ఇందలి సమాసములను విడఁదీయుఁడు.

## IV

చంద్రశర్మయు రాజానుమతంబున వివిధశిల్పకలాకుశలులగు శిల్పుల రావించి రాజమందిరాంగణంబున విద్రుమ స్తంభ సంభృతంబును, నీలోపల దారు సంఘటితంబును, నానావిధ రత్నఖచిత కవాటద్వార బంధ బంధురంబును, ముక్తాస్యూతనీలపట్టపటు వితాన సుందరంబును, మరకత తోరణావరణ విరాజితంబును, క్రముక కదళీ సంస్థాపిత ద్వారదేశ సంశోభితంబు

నుంగా వివాహ మండపంబు రచియింపం జేసి తన్మధ్యంబున వివాహవేదికయు సంతరింపించి, దానిచుట్టును, మృగమదమిళిత పన్నీరంబున పలికించి ముత్తియంపు రంగవల్లులు హత్తుకొల్పించి, రాజున కెఱింగించెను. అంత నాభూవల్లభుండు ముహూర్తంబెల్లి యెల్లవారి దెల్లవారు జామున లేచి కన్యావరులకు మంగళ స్నానంబులు నిర్వర్తింపను పరిణయోచితాలంకారంబులు నెఱపను బనుపుమని చంద్రశర్మకుం జెప్ప నాకర్మకుండు వరుని వారలకును వధువు వారలకును, రాజు నాజ్ఞం దెలిపి నిజకృత్యంబునం దప్రమత్తుండై వర్తించుచుండెను. (శ్రీమాన్ కొమాండూరి అనంతాచార్య సోమశర్మాభ్యుదయము)

☞ ఇందలి సమాసములను విడఁదీయుఁడు.

V

«ఆహా! దైవమా! నరప్రచార శూన్యమై మిన్నులు పడ్డచో నన్నిట్లు పాఱవైవనేమి యపరాధంబొనరించితి? ఇంకెవ్వరితో నాగోడువం దెల్పుకొందు! ఇంకేది దిక్కు? అని యవ్విధంబున బహు ప్రకారంబులం బలవించుచు వన్యఫలాసవంబులచే క్షుత్పిపాసా నివృత్తి సల్పుకొనుచు గహనంబులం దిరిగి తిరిగి యొక్కెడ నొక యశ్వత్థంబు క్రిందగూర్చుని శ్రీమన్నారాయణుని పాదపంకజంబులం దలంచుచుండె.

(మాడభూషి వేంకటాచార్యుల వారి మదన మోహన చరిత్ర.)

☞ ఇందలి సమాసములను విడఁదీయుఁడు.

---

VI

అనేకపుర్చీలు, అనేకసారులు, అనేకమాట్లు, అనేకమాటులు, సతత విహారణదంపతీ చారుదేహ, శకదంపతీరతి ప్రకటనములు. శ్రీభువనీ ధనుర్విద్యా పరీక్షకుండు, కడుచిన్న, ఇది సకాలంబున కారంభించితిమి, బుద్ధి జాడ్యుండు, సుతుని భూరివియోగ విచారతాపము, అనతిచ్ఛినలక్షణా

కారులు, దీవరక్షణుండను, బిరుదక్షురుండు, బలుచెన్నుఁడు.

☞ ఈ సమాసములయందలి తప్పులను సవరించి వ్రాయుఁడు

## VII.

రామశాస్త్రి ఎఱ్ఱాప్రెగ్గడ, నన్నయభట్టు, నన్నపార్యుడు. కృష్ణమ రాజు, క్రొంబులకల్ జనించెసభకున్. (ఉ. రా. 6.) క్రొన్నారాచములు, మూఁడుకొని నుదురేయన్. (రా. అర. కాం. 1) నెమ్మనము, పెన్నగము ముంగోపము, సగరాజ్యము, కడుంబెద్దదప్పుపోయినయట్టి. (భార. అది. 1) ఎట్టిడునానిజేశుఁడు. (రా. సుం.) ముయ్యేడుమాటల్. (భార, ఆది 1) ముయ్యాబుమార్గణములు. (రా. యు. కాం) ఆయున్న పోష్యపాలికిఁబోయి [భార. ఆ. 1] సగగన నిప్పులు (స్వా ఆ. 4) తళతళని తరణిమెఱుఁగులు, నిగనిగని కుందనంపుఁదగడు, కమ్మఁదేనె, (నైష ఆ. 2) ఒడలుతెల్లని తురగోత్తము వాలంబు. (భార. ఆది. 2) తనువు మీనోవ్వలకచ్చు. (భార. ఆది. ఆ. 3)

☞ ఇందలి సమాసములను గనుగొని చిత్రములను గూర్చి యోజించుఁడు.

## VIII

తమ్ముఁగుఱ్ఱలు నీవుఁదగవిపినంబున కరిగితిరి. (భార. అర. 7) మోదము వెలిఁజిలుకఁ జిలుక మొకరింపలికెన్. (శుక అ 2) ఆయీదేశం బననేల. (సా. ఆ. 1.) ఎత్తిపెంచినవారి, కలిగిన యొప్పనిదోషములు. కొట్టినతిట్టిన యాతఁడు, చలితెలిమంచుతుంపరలు, తొంగలితఱచు ఱెప్పల (భార. విరా. ఆ. 2) తొలిప్రాఁతకుప్పసంబు, నిడువాలికకన్నులు, విన్న కన్నయర్థము, తెలినునుసోగవెన్నెలలు. (రా. ఆ. 2) ఈ కన్నులు.

☞ ఇందలి సమాసములను గనుగొని చిత్రములఁగూర్చి యోజించుఁడు.

## IX

చిగురుంబోఁడి, పూవుంబోఁడులు, ముల్లోకములు, ఒక్కతడవ, ఒకతూరి, ఒక తేప, ఒకమాటు, రెండుతడవలను. పదునొకండు, తొంబండ్రు, పదియునొక్కండును రథములబాఱునిడిచె. [కాశీ. ఆ 7.] కఱకంఠుఁడు, అన్నాదమ్ములు (ఉ. హరి. ఆ 4.) అక్కాచెల్లెండ్రును నిర్వ ఆ 3.) తల్లి దండ్రులు (భల్లా ఆ 4) అందచందములు, వెచ్చసచ్చములు, కూరగుడ్డ, కూరగాయ, దరిదాపు, రేవగలు, తాఁకుఁదగులు, ఓఁగామలు, చెల్లాచెల్లములు, వచ్చురాములు, విని వినములు, తొవదమ్మి విందు, విన్నకన్నది, అవసరమక్కరలు, రాహుకంఠము దెగి దేహము ధరణిఁబడియె. [భార. ఆది. ఆ 2] బహువేద ఘోషములఁజేసి నిరస్తసమస్త కిల్బిషోత్కరు లగుచున్న ఋష్యులు. (భార. అర. ఆ 1.) వారి యస్మవీయోరు చమూసమూహములు, (ఉ. హరి. ఆ 2) అం దొకటిచే జనితాధరపీడయై (కళా. ఆ 5.)

☞ ఇందలి సమాసములను గనుఁగొని చిత్రములనుగూర్చి యోజింపుఁడు.

## X

అందాఁక, అచ్చతెల్పు, ఆఁదోఁక, ఎడవంక, ఎగుదల, దిగుదల, కప్పురవీడెము, గందవొడి, గొబ్బండును, చిత్తరుబొమ్మ. చిమ్మచీఁకటి, చిఱుచప్పుడు, చప్పరమంచము, నడురేయి, నాన్నాళ్లు, నిక్కలు, నిడుమోము, పసిపట్టు, పెత్తనము, పొంగట్టు, బెబ్బులి, బెల్లమండెఁగ, బోనపుట్టిక, మిండతపసి, ముంగల, ముయ్యేడు, మోసల, వలిపవెన్నెల, వాతెఱ, వాలురమ్మ.

☞ వీని పదచ్ఛేదముచేసి సమాసము లగునప్పుడు గలుగుమార్పులను తెలిసికొనుఁడు.

---

## Common Phrases.

'ఆమందానంద కందళిత హృదయారవిందులై,

ఈ సమాసము పలువురిచే నిట్లే ప్రయోగింపఁ బడుచున్నది. బాణో చ్ఛిష్టమిదంజగఁ త్తనునట్లుగా శబ్దములన్నియు పలువురు వాడియే యుందురు. ఒకరువాడిన ప్రక్రియ మఱియొకరు వాడమని ప్రతిజ్ఞ చేయుట దుష్కరము. కాఁబట్టి విద్యార్థులీక్రింది సమాసములను తమరు వ్రాయునప్పు డుచితరీతి నుపయోగించుకొనవచ్చును.

అమంద = విస్తారమయిన, ఆనంద = సంతోషముచేత, కందళిత = మొలకయెత్తిన, హృదయారవిందులై = పద్మము వంటి హృదయము కల వారయి అని యర్థము, దీని నిట్లు మార్చవచ్చును.

1. అతిశుతుకాంకురిత మనఃపద్ములై,
2. అమందానందావిష్ట చిత్తాబ్జులై.
3. అమందానంద సందోహబంధుర హృదయారవిందులై

ఆనందముల యొక్క సందోహ = సమూహము.

2. నిజాప్త ద్విజనికర పరివేష్టితుండై.

నిజ = తన సంబంధమయిన, ఆప్త = ఇష్టులయిన, ద్విజ = బ్రాహ్మణుల యొక్క, నికర = సమూహముచేత, పరివేష్టితుఁడై = ఆవరింపఁబడినవాఁడై.

దీని మార్పు — ఇచట ఆప్త, ద్విజులుగాక మఱి యెవ్వరినైనను సుందరోచితముగాఁ జెప్పవచ్చును.

1. నిజపుత్త్రమిత్ర కళత్రాది పరివేష్టితుండై

ఇట్లే మార్పులను శబ్దముల లింగాది పరిజ్ఞానము కలిగి చేయ వచ్చును.

2. నేత్రముల కపూర్వపర్వంబు లొనరించె.

నేత్రములకున్ = కన్నులకు, అపూర్వ = క్రొత్తయైన

పర్వంబులు = పండుగలు, ఒనరించెన్ = కలిగించెను.

ఈతను ద్యుతియే తెల్పును, (నీతిచంద్రిక విగ్రహము.)

తనుద్యుతి = శరీరకాంతి,

నీకుం దోంచెదనో కాని తనుద్యుతిం బాసితింజుమీ, (ప్రభావతి ప్ర.)

ఇట్లే తనుద్యుతి యనేకులచే వాడంబడినది.

ఆమూలాగ్రముగ = మొదటి నుండి చివరదాంక.

ఆతిథేయ సత్కారము లాచరించి = అతిథుల, విషయమై యోగ్యమైన

సత్కారములు = గౌరవములు, అచరించి = చేసి,

కుశలప్రశ్న పూర్వకంబుగా<br>క్షేమానుయోగపురస్సరముగా } = క్షేమము నడుగుట ముందు కలుగు నట్లుగా.

ఆబాలప్రసిద్ధంబులు = పిల్లలు మొదలుకొని ప్రసిద్ధమైనవి.

శ్రుతపూర్వుండు = పూర్వమందు వినంబడినవాండు.

ఇష్టకథాగోష్ఠి = ఇష్టమైన కథలయొక్క ప్రసంగము.

ప్రహృష్టాంతరంగంబులై = సంతోషించుచున్న మనస్సులు గలవియై

హస్తిమశకాంతరము = ఏనుగకు, దోమకుగల హెచ్చు తగ్గు (వాసి)

కన్నులమిడుంగురులురాల<br>నేత్రముల విస్ఫులింగములు జాఱ } = కన్నులనుండి అగ్ని కణములు రాలినట్లు.

కుటిల భ్రుకుటీర్యై=వంకరయైన బొమముడిగలవాండై (ఇదికోపానుభావము)

కృతాంతనిశాంతంబున కతిథిం జేసి = యముని యింటికిం బంపి.

సుస్మితాస్యుండై<br>హాసన్ముఖుండై } = చిఱునవ్వుతోం గూడిన ముఖము గలవాండై.

డెందంబు డోలాందోళనంబు నొంద = మనస్సు నుయ్యెలవలెనూగ.

దోదూయమానమానసుండు = కదులుచున్న మనస్సుగలవాండు

దోధూయమాన మానసుండు<br>చింతాడోలాయమాన మానసుండు } దుఃఖించుచున్న మనస్సుగలవాండు.

పులినోరి కండబారి పడ్డట్లు = (నీతిచంద్రిక, విగ్ర.)

" పులినోరికండ విడిపడ్డగతిందలపట్టి చూచుచుం, (ప్రభా. ప్రద్యు.)

అధిజ్యశరాసనుండై = ఎక్కుపెట్టఁబడిన నారిగల ధనస్సుగలవాఁడై

దరహాసచంద్రికా సుందర వదనేందుఁడై = మందహాసమనెడు, వెన్నెలచేత సుందర = సొగసైన, ముఖమనెడు, చంద్రుఁడు గలవాఁడు

వీరశాంతాదిగుణంబుల సురఘాసమాశ్రిత మధుకోశంబు చందంబున = వీరము శాంతము మొదలయిన గుణములచేత, తేనెటీఁగలచేత, ఆశ్రయించబడిన తేనెపెరవలె.

ప్రజాపాలన దక్షుండై = ప్రజలయొక్క పాలించుటయందు సమర్థుఁడై

ఫలచ్ఛాయాసమన్వితంబగు మహావృక్షంబు = పండ్లతోడను, నీడతోను కూడుకొనిన పెద్దచెట్టు.

హీనమానవపదాశ్రయుఁడు = నీచుఁడైన మానవునియొక్క పాదము ఆశ్రయముగా గలవాఁడు.

దుఃఖభాజనము = దుఃఖమునకు పాత్రమైనది.

ఆధారాధేయభావము = } ఆధార = ఒకదానినిధరించునది, ఆధేయ =
ఆశ్రయాశ్రయధర్మము = } ఒకదానిని ధరించబడునది, (వీనియొక్క) భావము = ధర్మము.

అవగ్రహనిగ్రహంబు = అనావృష్టిచేతనైనబాధ

మనఃపరితాపము = హృదయ సంతాపము, చిత్తఖేదము

కార్యభారమగ్నుండై = కార్యములయొక్క బరువునందు మునిగినవాఁడై

మధుర శంబరపూరితంబగు సరోవరంబు = తియ్యనైన నీళ్ళచేత నిండిన తటాకము.

హర్షోత్కర్షంబు = సంతోషముయొక్క అతిశయము

నామమాత్రావశేషంబై = పేరుమాత్రముచేత, మిగిలినదై

శోకవిస్మయపరీతస్వాంతులై = దుఃఖముచేతను, ఆశ్చర్యముచేతను, వ్యాప్తమైన చిత్తముగలవాఁరై

అన్యోన్య ముఖావలోకనంబులు = పరస్పరము యొక్క, మోములయొక్క-
చూచుటలు

ఆదరవినయ సంభ్రమంబులు = గౌరవము, నమ్రతతో్టు్రపాటులు

అంగీకారపిశునమందహాస కందళసుందరంబగు మొగంబు=ఒప్పుదలను సూచన
చేయునట్టి చిఱునగవుయొక్క మొలకలచేత సొగసైనముఖము

అనిరోధ క్రోధము = అడ్డులేనిక్రోధము

మద్భావానురోధము = నాయభిప్రాయము ననుసరించుట

రోషాతిభీషణుండు = కోపముచేత మిక్కిలి భయంకరుఁడైనవాఁడు.

సంవర్తసమయభీషణ హుతాశనకీలిపోలికన్ = ప్రళయకాలమందైన, భయం
కరమైన అగ్నియొక్క జ్వాలవలె,

పరమకృపానిరతుండు = ఉత్కృష్టమైన దయయందు, అసక్తుఁడు.

దయాసుధానిధి = దయయనుసముద్రుఁడు.

శరణాగతభరణైకబిరుదాంకుండు = రక్షణమును గూర్చివచ్చువారి యొక్క
భరించుటయందు ముఖ్యమైన బిరుదమే చిహ్నగలవాఁడు.

బహుతరప్రయాస గమ్యంబు=మిక్కిలి విస్తారమైన కష్టములతోఁ బొందఁ
దగినది.

ప్రకంపమానాంగుండై = వడఁకుచున్న దేహముకలవాఁడై.

అమోఘసంకల్పుఁడు = వ్యర్థముకాని ఉద్దేశముగలవాఁడు.

నిజప్రతాపదీపాంకుర నిరస్తసమస్తవైరి వీరదుర్వారగర్వాంధకారుండు =
తన సంబంధమైన, ప్రతాపమనెడి దీపముయొక్క మొలకచేత,
పోఁగొట్టఁబడిన సమస్తమైన, శత్రువులైన, వీరులయొక్క, నివా-
రించశక్యముగాని, గర్వమనెడు, చీఁకట్లుకలవాఁడు.

కంఠగతప్రాణులు = కంఠమును, బొందిన ప్రాణములు కలవారు.

భయానకమానసుండై = భయమందు, స్వాధీనమైన, మనస్సుగలవాఁడు.

కరుణాతరంగితాపాంగుండై = దయచేత, పుట్టిన అలలుగల, గ్రీగంటిచూపు గలవాఁడై.

అభ్యస్తసమస్తవ్యవహారుండు = నేర్చుకొనఁబడిన, సమస్తమైన, వ్యవహారము గలవాఁడు.

వికాసహాసభాసురాననుండై = వికసించుటచేతను, నవ్వుచేతను ప్రకాశించుచున్న ముఖముగలవాఁడై.

ప్రాప్తలాభముదితహృదయుండై = పొందఁబడిన, లాభముచేత, సంతోషించుచున్న మనస్సుగలవాఁడై.

దుర్ధాంత రిపుస్ఫురణహరణ పరిణతుండు = హరించ శక్యముగాని, శత్రువుల యొక్క, ప్రకాశము యొక్క, హరించుట యందు పరిపక్వతను బొందినవాఁడు.

విస్మయపరీతచేతస్కులు = ఆశ్చర్యముచేత, వ్యాప్తమైన, చిత్తముగలవారు.

కార్పణ్యదోషోపహత స్వభావము = దీనత్వము యొక్క దోషముచేత, కొట్టఁబడిన స్వభావము.

నిరంతర పరిఫుల్లవనమల్లికా మతల్లికావేల్లిత నికుంజపుంజరంజితంబై = ఎడతెఆపి లేనట్లుగా, వికసించిన అడవి మొల్లలయొక్క, శ్రేష్ఠములైన తీగెలచేత, ఆవరించఁబడిన పొదల యొక్క, సమూహము చేత ప్రకాశింపఁజేయఁబడినదియై.

కుసుమవిసర పరిమళ మిళిత గళిత మకరందబిందు సందోహాస్వాదనాగతమిళిందబృంద సుందరంబై = పువ్వుల యొక్క, సమూహము యొక్క వాసనతోడ, కూడుకొని, జాఱుచున్న, పూఁదేనెయొక్క, బిందువులయొక్క, సమూహము యొక్క, ఆస్వాదించుట విషయమయి, వచ్చిన, తుమ్మెదలయొక్క, సమూహముచేత, సొగసయినదయి.

నికట విటపి విటపచ్ఛటా రటచ్ఛకుంత సంతానాశ్రాంత తత రవాక్రాంత దిగంతరాళంబై = సమీపమందయిన, చెట్లయొక్క, పెద్ద కొమ్మల

యొక్క సమూహమందు, ధ్వనిచేయుచున్న, పక్షులయొక్క సమూహముయొక్క, ఎల్లప్పుడయిన, విస్తరించిన ధ్వనిచేత, ఆక్రమించఁబడిన, దిక్కులయొక్క మధ్యప్రదేశముగలది.

బహుజన్మకృత, సుకృతఫల స్వరూపంబు = విస్తారమయిన, పుట్టువులయందు, చేయఁబడిన, పుణ్యముయొక్క, ఫలరూపమయినది.

కృపాకటాక్ష వీక్షణంబులు = దయ ప్రధానముగల క్రిగంటిచూపులు.

హితకార్యధూర్వహుండు=ఇష్టమైన, కార్యముయొక్క, భారమును వహించిన వాఁడు,

కర్ణరసాయనము } చెవులకు మధురద్రవ్యము.
శ్రోత్రపీయూషము } చెవులకు అమృతము.

చర్వితచర్వణంబు = నమలఁబడినదియే నమలుట.

అనితరసాధనోత్థాప్యంబులగు = వేఱుసాధనములచేత లేవదీయశక్యము కానివి,

సరస వచన రచనా చాతుర్యము=రసముతోఁగూడిన వాక్యములయొక్క కూర్పునందు నేర్పు.

ఆదరశీతలేక్షణంబులు = గౌరవముచేత చల్లనైన చూపులు.

మందహాసవిద్యోతవదనుండు = చిఱునవ్వుచేత ప్రకాశించుచున్న ముఖము గలవాఁడు.

N. B. సమాసగత శబ్దముల కర్థము చెప్పునప్పు డేయే విభక్తుల తోఁ జెప్పవలయునో చూపుటకై కొలఁది సమాసముల కర్థములు వ్రాయఁబడినవి. ఇట్లే ప్రౌఢకవిగ్రంథ సమాసముల నర్థముతో నేర్చుకొనుటవలన భాషాభివృద్ధియగును.

---

# CHAPTER XIV.

## ఉపసర్గలు.

**N. B.** తెలుగు శబ్దముల కుపసర్గలు లేవు.

తత్సమశబ్దముగా నున్న యాంధ్రభాష నభ్యసించు విద్యార్థులు కొంత కలికైన సంస్కృతభాష నభ్యసించరేని కావ్యరచనకుఁ జాల కష్టములు వాటిల్లును. ఏనను వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్యయములచే సంస్కృత శబ్దములు, ఆంధ్రభాషం బ్రవేశించి యున్నవని యిదివఱకే చెప్పఁబడియెను.

సంస్కృతాంధ్రశబ్దపరిజ్ఞాన ప్రకరణమునఁ గొన్ని సంకేతములు తెలుపఁబడినవి, ఇట్టి సంకేతములవలనఁ గొంతవఱకుఁ దత్సమశబ్దములకు కలయునంత సంస్కృత భాషామర్మములను దెలిసికొనవచ్చును.

అనేక సంస్కృత శబ్దము లుపసర్గములతోఁ గూడియున్నవి. వానిని విభజించినచో శబ్దముల యథారూపములు తెలిసికొనుట కవకాశము గలుగును.

ఉపసర్గములు సంస్కృత శబ్దములకుఁ దరుచుగా ననుసంధింపఁబడుట చేత వాని యుపయోగము స్పష్టముగా వివరించుచుంటిమి.

సంస్కృతమునందు ధాతువులకును, మఱికొన్ని శబ్దములకును బూర్వమందు బ్రయోగించఁబడుచు అధాతు శబ్దముల అర్థములకుఁ గొన్నిచోట్ల నుత్కర్షము, కొన్నిచోట్ల నపకర్షము, కొన్నిచోట్ల వానియర్థములకు వేఱర్థమును గలిగించుచు, గొన్నిచోట్ల తామే నిరర్థకమగుచు పాదపూరణమాత్ర ప్రయోజనము గలవియై నిపాతలనియు ధాతువుతోఁ గలసినప్పుడు ఉపసర్గము, గతి అని పేరులుగల ప్రాదులుగలవు. ప్రాదులు 22 ప్ర, పరా, అప, అవ, సం, అను, నిర్, నిస్, ఆ, దుర్, దుస్, అధి, అపి, వి, ని, అతి, సు, అభి, ఉప, పరి, ప్రతి, ఉత్.

ప్రవర్షణము
అతివర్షణము
సువర్షణము
సంవర్షణము
అధివర్షణము
పరివర్షణము
ఉద్వర్షణము
} ఉత్కర్ష

అవవర్షణము
అపవర్షణము
వివర్షణము
నిర్వర్షణము
నివర్షణము
} అపకర్ష

పరావర్షణము = ఎదురువాన
అనువర్షణము = అనుసరించి వర్షించుట.
ఆవర్షణము = అంతట వర్షించుట లేక, కొంచెము వర్షించుట.
దుర్వర్షణము = దుష్టముగా (వర్షించుట.)
అవివర్షణము = నిరర్థకము.
ఉపవర్షణము = సమీపమందు వర్షించుట.

N. P:—ఇవి యీ యర్థముల యందు సామాన్యముగాఁ బ్రవర్తించుచుండును.

## ఉపసర్గములతోఁ జేరిన శబ్దములు.

### ప్ర.

1. ప్రకంపనుఁడు = ఎక్కువగాఁ గదల్చువాఁడు.
2. ప్రకటనము = ప్ర + కట = ఇచట ధాత్వర్థమును మార్చి ప్రసిద్ధమను నర్థము దెచ్చినది.

3. ప్రకరణము = ఇచట 'ప్ర' అనునది ధాత్వర్థమును మార్చి ప్రస్తుతమను నర్థమును దెచ్చినది.
4. ప్రకరము = ఇచట సమూహమను నర్థము దెచ్చినది.
5. ప్రకర్షము = ఇచట అతిశయమను నర్థము నిచ్చుచున్నది.
6. ప్రకాండము = ఇచట 'ప్ర' అనుదానికి కాండ శబ్దముతో సమాసము.
7. ప్రకామము = ఇదియున్నట్లే.
8. ప్రకారము = ఇచట ధాత్వర్థమును మార్చి పోలిక అను నర్థము నిచ్చినది.
9. ప్రకాశము = ఇచట ధాత్వర్థమున కుత్కర్షము నిచ్చినది.
10. ప్రకీర్ణము = ఇచట కీర్ణ శబ్దముతో సమసించి వ్యాప్యమయిన దను నర్థము దెచ్చినది.
11. ప్రకృతము = చక్కగాఁ జేయఁబడినది యను నర్థమందు ధాత్వర్థమున కుత్కర్షమును ప్రస్తుతము అనునర్థమందు ధాతువున కర్థాంతరము నిచ్చినది.
12. ప్రకృతి = ఇచటఁ బ్రత్యయమున కాదియందుండు శబ్దస్వరూపమును దెల్పుచున్నది.
13. ప్రకృష్టము = ధాత్వర్థమును అతిశయమయిన దను నర్థమునకు మార్చినది.
14 ప్రకోపము = ధాత్వర్థమున కుత్కర్షము తెచ్చినది.

పరా.

1 పరాక్రమము = ఇచట 'పరా' అనునది ధాత్వర్థమును వీర్యమను నర్థమునకు మార్చినది.
2 పరాజయము=ఇచట ధాత్వర్థమును వ్యతిరేకార్థమునుగా మార్చినది.

3 పరాభవము = ఇచట ధాత్వర్థమును అవమాన మను నర్థముగా మార్చినది.

4 పరాయణము = ఇచట ధాత్వర్థమును ఆశ్రియ మను నర్థముగా మార్చినది.

5 పరానువు = ఇక్కడ అణుశబ్దముతోఁ గలసి తాను కొట్టఁబడిన అనునర్థము కలది యయినది.

అప.

1 అపకర్షము = ఇచట 'అప' అనునది ధాత్వర్థమును తక్కువయను నర్థమునకు మార్చినది.

2 అపకారము = ఇచట ధాత్వర్థమును కీడు అను నర్థమునకు మార్చినది.

3 అపకీర్తి = ఇచటకీర్తిశబ్దముతో సమసించి, అభావార్థమును జెప్పుచున్నది.

4 అపకృష్టము = ఇచట ధాత్వర్థమును, అధమము అను నర్థమునకు మార్చినది.

5 అపగతము = ఇచట నిరర్థకమైనది.

అవ

1 అవచ్ఛిన్నము = ఇచట 'అవ' అనునది నిరర్థకమైనది.

1 అవజ్ఞ = ఇచట ధాత్వర్థమును అవమానమను నర్థమునకుమార్చినది.

3 అవతంసము = ఇచట ధాత్వర్థమును కర్ణభూషణమును నర్థమునకు మార్చినది.

4 అవతమసము = ఇచట తమశ్శబ్దముతో సమసించి గాఢమను నర్థము కలదైయైనది.

5 అవతరణము = ఇచట ధాతువును దిగుటఅను నర్థమునకు మార్చినది.

సం

1 సంకటము = ఇచట 'సం'అనునది ధాత్వర్థమును ఇరుకు అను నర్థము నకు మార్చినది.

2 సంకరము = ఇచట ధాత్వర్థమును గలిసిపోయినది యను నర్థమునకు మార్చినది.

3 సంకలనము = ఇచట నిరర్థకమైనది.

4 సంకల్పము = ఇచట ధాత్వర్థమును మనో వ్యాపారముగా మార్చినది.

అను

1 అనుకంప = ఇచట 'అను' అనునది ధాత్వర్థమును కనికరమను నర్థములోనికి మార్చినది.

2 అనుకూలము = ఇచట కూలశబ్దముతో సమసించి, అనుకూల్యమను నర్థము నిచ్చుచున్నది.

3 అనుక్షణము=ఇచట క్షణశబ్దముతో సమసించి ప్రతిఅను నర్థము కలదియైనది.

4 అనుగమనము = ఇచట గమ్‌ధాతువుతో సమసించి, అనుసరించు అను నర్థము కలదియైనది.

5 అనుగ్రహము = ఇచట ధాత్వర్థమును ఏలుకొను అను నర్థముగా మార్చినది.

నిర్

1 నిర్గమము = ఇచట 'నిర్' అనునది నిరర్థకము.

2 నిర్ణీతము = ఇచట ధాత్వర్థమును నిశ్చయము అను నర్థమునకు మార్చినది.

3 నిర్దయుఁడు = ఇచట దయాశబ్దముతో సమసించి అభావార్థము కలదియైనది.

4 నిర్గళితము = ఇచట నిరర్థక మైనది.

5 నిర్దేశము = ఇచట ధాత్వర్థమును నిర్ణయమను నర్థమునకు మార్చి
నది.

## నిస్

ఇది 'నిర్' యొక్క రూపమునే పొందును.

## ఆ

1 ఆక్రమణము = ఇచట 'ఆ' అనునది ధాత్వర్థమును, ఆవరించు
అను నర్థమునకు మార్చినది.

2 ఆక్రోశము = ఇచట ధాత్వర్థమును తిట్టు అను నర్థమునకు మార్చి
నది.

3 ఆగతము = ఇచట ధాత్వర్థమును దలక్రిందులుచేసి వచ్చు అను
నర్థమునకు మార్చినది,

4 అఘాతము = ఇచట నిరర్థకమయినది.

5 అఘోషము = ఇచట, నిరర్థకమయినది.

## దుర్.

1 దుర్బలుఁడు = ఇచట, 'దుర్' అనునది బల శబ్దముతో సమసించి
అభావార్థమును జెప్పుచున్నది. ఇది తఱుచు ఈ యర్థమందే
యుండును.

2 దుర్మార్గుఁడు = ఇచట మార్గశబ్దముతో సమసించి దుష్టమను
నర్థముకలదియైనది.

3 దుర్వాహము = ఇచట అశక్యము అను నర్థముకలదియైనది.

4 దుర్దినము = ఇచట దుష్టము అను నర్థముకలదియైనది.

5 దుర్ఘటము = ఇచట ధాత్వర్థము సంఘటన కానిది యను నర్థము
నకు మార్చినది.

## దున్.

ఇది 'దుర్' యొక్క రూపమునే పొందును.

## అధి.

1 అధికరణము = ఇచట 'అధి' అనునది ధాత్వర్థమును, అధారమను నర్థమును మార్చినది.

2 అధికము = ఇచట అధి అనునది ప్రాతిపదికమై 'క' అను తద్ధిత ప్రత్యయమును బొందినది.

4 అధ్యయనము = ఇచట నిరర్థకమైనది,

4 అధిక్షేపము = ఇచట ధాత్వర్థమును ఆక్షేపించు అను నర్థమునకు మార్చినది.

5 అధిగమము = ఇచట వ్యర్థమైనది.

## అపి.

1 అపిధానము = ఇచట 'అపి' అనునది ధాత్వర్థమును కప్పు అను నర్థమునకు మార్చినది.

3 అపినద్ధము = ఇచట వ్యర్థమైనది.

## వి

1 వికచము = ఇచట 'వి' అనునది ధాత్వర్థమును వికసించు అను నర్థమునకు మార్చినది.

2 విశాలము<br>విశంకటము } = ఈరెండుచోటుల 'వి' అనునది శాల, శంకట అను తద్ధిత ప్రత్యయములతోఁ గూడినది.

3 వికత్థనము = ఇచట నిర్థకము.

4 వికారము = ఇచట ధాత్వర్థమును వికృతి అను నర్థమునకు మార్చినది.

5 వికిరము = ఇచట ధాత్వర్థమును గజకుంభాద్యర్థము కలదిగా మార్చినది.

## ని.

1 నికర్షణము = ఇచట 'ని' అనునది మిక్కిలి అను నర్థము కలది.

2 నికషము = ఇచట నిరర్థకము.

3 నికారము = ఇచట ధాత్వర్థమును వంచన యను నర్థమునకు మార్చినది.

4 నికాశము = ఇచట ధాత్వర్థమును తుల్యము అను నర్థముగలదిగా మార్చినది.

5 నికృంతనము = ఇచట వ్యర్థము.

## అతి.

1 అతిక్రమము = ఇచట 'అతి' యనునది ధాత్వర్థమును దాటిపోవు అనునర్థముగా మార్చినది.

2 అతివృష్టి = ఇచట వృష్టిశబ్దముతో సమసించి మిక్కిలి యను నర్థము నిచ్చినది.

3 అతిరేకము = ఇచట ధాత్వర్థమును హెచ్చు అను నర్థమునకు మార్చినది.

4 అతిశయము = ఇచట ధాత్వర్థమును ఆధిక్యమను నర్థమునకు మార్చినది.

5 అతివాసితము = ఇచట మిక్కిలి యనునర్థకము కలది.

## సు

1 సుఖము = ఇచట 'సు' అనునది ఖ శబ్దముతో సమసించి సౌఖ్యార్థము నిచ్చినది.

2 సుగమము = ఇచట సుఖముగ అను నర్థము కలది.

3 సుగుణుఁడు = ఇచ్చట గుణశబ్దముతో సమసించి మేలైన యను నర్థము నిచ్చినది.

4 సులభము = ఇచటఁ దేలికయను నర్థము కలదు.
5 సులోచనము = ఇచట మంచి యను నర్థము కలదు.

అభి.

1. అభిభావము = ఇచ్చట 'అభి' అనునది ధాత్వర్థమును తిరస్కారము అను నర్థమునకు మార్చినది.
2 అభివాదము = ఇచట ధాత్వర్థమును నమస్కారము అనునర్థమునకు మార్చినది.
3 అభిషేకము = ఇచట యభి యనునది నిరర్థకము.
4 అభివృద్ధి = ఇచట యభి యనునది వ్యర్థమైనది.
5. అభియానము = ఇచట ధాత్వర్థమును యుద్ధమను నర్థమునకు మార్చినది.

ఉప.

1 ఉపగూహము = ఇచట 'ఉప' అనునది ధాత్వర్థమును ఆలింగనముగా మార్చినది.
2 ఉపయమము = ఇచట ధాత్వర్థమును వివాహార్థము కలదానినిఁగా మార్చినది.
3 ఉపమ = ఇచట ధాత్వర్థమును బోలికగా మార్చినది.
4 ఉపమాత = ఇచట మాతృశబ్దముతో సమసించి దగ్గఱ యను నర్థముకలదియైనది.
5 ఉపప్లవము = ఇచట ధాత్వర్థమును ఉపద్రవమను నర్థమునకు మార్చినది.

పరి.

1 పరిశుద్ధుఁడు = ఇచట 'పరి' అనునది నిరర్థకము.
2 పరిధానము = ఇచట అంతట అనునర్థము గలదు.

3 పరిదానము = ఇచట ధాత్వర్థమును మార్పు అను నర్థముగా మార్చినది.

4 పరిభూతము = ఇచట ధాత్వర్థమును తిరస్కరించు అనునర్థముగా మార్చినది.

5 పరిభ్రమము = ఇచట అంతట అనునర్థము కలది.

ప్రతి

1 ప్రతికారము=ఇచట 'ప్రతి' అనునది ధాత్వర్థమును బదులుచేయుట అను నర్థముగా మార్చినది.

2 ప్రతికూలము = ఇచట కూలశబ్దముతో సమసించి వ్యతిరేకమైన అనునర్థము నిచ్చుచున్నది.

3 ప్రతిఘటనము = ఇచట ధాత్వర్థమును మార్కొనుట అనునర్థమునకు మార్చినది.

4 ప్రతిజ్ఞ = ఇచట ధాత్వర్థమును 'ప్రతిన' యను నర్థముకల దానినిగా మార్చినది.

5 ప్రతిదానము = ఇచట తిరిగి అను నర్థముకలది.

ఉత్

1 ఉచ్ఛ్రయము = ఇచట 'ఉత్' అనునది ధాత్వర్థమును సమూహము అను నర్థముగా మార్చినది.

2 ఉచ్చారణము = ఇచట ధాత్వర్థమును పలుకుట అను నర్థముగా మార్చినది.

3 ఉచ్ఛిష్టము = ఇచట ధాత్వర్థమును ఎంగిలి యను నర్థమునకు మార్చినది.

4 ఉజ్జీవము = ఇచట వ్యర్థమయినది

5 ఉల్లాసము = ఇచట ధాత్వర్థమును సంతోషమను నర్థమునకు మార్చినది.

---

# CHAPTER XV.

## వాక్యపరిచ్ఛేదము.

---

"పాటలీపుత్త్రమను పట్టణమును సుదర్శనుఁడను రాజు చక్కఁగాఁ బాలించుచుండును."

రాజు పట్టణమును బాలించు చుండును = ఇది ప్రధానవాక్యము.

ఇందు రాజు = కర్త.

పట్టణము = కర్మ.

పాలించుచుండును = క్రియ.

పాటలీ పుత్త్రమను = పట్టణమునకు విశేషణము.

సుదర్శనుఁడను = రాజునకు విశేషణము.

చక్కఁగా = క్రియావిశేషణము.

ఒక యభిప్రాయమును వెల్లడిచేయవలెనన్న నందులకుఁ దగినశబ్దముల నేరికొనుట, అట్టి శబ్దముల నా యభిప్రాయాను గుణముగాఁ జెప్పుట. ఈ రెండంశములు ముఖ్యములు. పై వాక్యమందు రాజు అనునది ఒక శబ్దము, పట్టణమనునది మఱియొకటి. పాలించు చుండును. అనునది మూఁడ నది. ఈ మూఁడును శబ్దములే అయినను, ఇందొకటి చేయు పని మఱియొకటి చేయదు. రాజు, నామవాచకము కర్త, పట్టణము, నామవాచకము, కర్మ. పాలించుచుండును, క్రియావాచకము. అవ్యయము. ఈ విధముగా శబ్దజాల మంతయు, (1) నామములు. (2) విశేషణములు. (3) క్రియలు, (4) అవ్యయములు, అని నాలుగు భాగములుగా నున్నవి. వీని పరిజ్ఞానము వాక్యకల్పన కావశ్యకము.

### నామవాచకములు— Nouns.

1 వస్తువయొక్క పేరు విశేష్య మనంబడును.

ఉదా— రాముఁడు, చెట్టు, పుస్తకము.

2 జాతి, గుణ, క్రియా, సంజ్ఞలచే విశేష్యంబులు నాలుగువిధములు. అందు జాతివాచకము సమానధర్మముగల వస్తు సముదాయమును దెలుపును.

ఉదా— మనుష్యుఁడు, గోవు.

3 గుణవాచకము— అనఁగా వస్తువుల గుణములను జెప్పునది.

ఉదా:— చిన్నతనము, చక్కఁదనము.

తద్ధిత ప్రకరణమునందుఁ దెల్పఁబడిన, ఇమి తనము, తికము, న మొదలగు ప్రత్యయములతోఁ గూడిన పదములన్నియు గుణవాచకములే.

4 క్రియావాచకములు—వ్యాపార నామములం దెలుపును.

ఉదా—నడక, వండుట మొదలయినవి.

క్రియావాచకములు—క్రియలనుండి పుట్టును గావునఁ గృదంతములగుచున్నవి.

5 సంజ్ఞావాచకములు—ఒక్కనామమే తెల్పుచు జాతిని బోధింపనివి.

ఉదా—రాముఁడు, గోదావరి మొదలయినవి.

## Adjectives.

## విశేషణములు.

1 విశేష్యముల ధర్మములను దెలుపు పదములు విశేషణములనఁబడును.

2 గుణవాచకములు, సంఖ్యా వాచకములు, క్రియావాచకములు నని విశేషణములు మూఁడు విధములు.

3 విశేష్యముల గుణములను దెల్పునవి గుణవిశేషణములు.

ఉదా— తెల్ల మంచి మొదలగునవి.

4 ప్రాయికముగాఁ దెనుఁగు విశేషణములు స్త్రీలింగ సమము లయియుండునుగాన నవి లింగవచనాది భేదములు లేక యెల్ల విశేష్యములకు ముందు ప్రయోగింపఁబడును.

ఉదా—పెద్దమనుష్యుఁడు, మంచిపడఁతి.

5 సంఖ్యను దెల్పునవి సంఖ్యావాచక విశేషణములు.

ఉదా—రెండు, ఇద్దఱు.

6 సంఖ్యార్థకములు, సంఖ్యేయార్థకములు, పూరణార్థకములు, అని సంఖ్యావాచకములు మూఁడు విధములు.

రెండు, మూఁడు మొదలగునవి—సంఖ్యార్థకములు,

ఇద్దఱు, ముగ్గురు, మొదలగునవి—సంఖ్యేయార్థకములు.

రెండవ, మూఁడవ మొదలగునవి—పూరణార్థకములు.

7 క్రియలవలనం గలిగినవి క్రియావాచక విశేషణములు.

ఉదా—కొట్టుచున్న, కొట్టిన, కొట్టఁగల.

8 ఒకానొకచోఁ గొన్ని విశేష్యములు విశేషణములుగా వాఁడఁబడును.

ఉదా:— పసిఁడి కంచము, వెఁడిపళ్లెము.

## క్రియలు—Verbs.

1 వ్యాపారములను దెలుపు పదములు క్రియలనఁబడును.

ఉదా—పోషించు, కొట్టు, తిట్టు.

2 ధాతువుకొనయందు కారముండును,

(ప్రత్యయములతోఁ గూడక మునుపు క్రియకు ధాతువనియు నామమునకుఁ బ్రాతిపదికమనియుఁ బేరులు.)

3 క్రియలు తత్సమములు. అచ్ఛికములని రెండు విధములు. అందుఁ దత్సమక్రియల యంతమందించుగాగమము వచ్చును.

ఉదా—పోషించు.

ఈ యించుగాగమము కొన్ని దేశ్యక్రియల యంతమందుఁగూడఁ గానబడుచున్నది.

ఉదా—ఆరగించు, ఆవులించు, తిలకించు, పరికించు, పలవించు, మొదలయినవి.

4 ధాతువులు రెండువిధములు.

1 సకర్మకములు.

2 అకర్మకములు.

కర్మతోఁ గూడినవి (కర్మాపేక్షకలవి) సకర్మకములు.

కర్మలేనివి (కర్మాపేక్షలేనివి) అకర్మకములు.

ఉదా—వ్రాయుచున్నాఁడు. ఇది సకర్మకక్రియ.

దేనిని వ్రాయుచున్నాఁడు, అని యపేక్షింపఁ బడుచున్నది.

కావునఁ బుస్తకమును అని అవశ్యముగా నుండవలెను.

వచ్చెను—ఇది యకర్మకక్రియ.

ఇందు దేనినివచ్చెను. అని కర్మాపేక్ష లేదు. కావున నిది యకర్మకక్రియ.

సకర్మక క్రియ కర్తృప్రయోగము, కర్మప్రయోగము అని రెండు విధములుగాఁ బ్రయోగింపఁబడును.

కర్తను జెప్పు క్రియ—కర్తృక్రియ.

ఇది వచ్చునపుడు కర్త ప్రథమగా నుండవలెను.

కర్మ ద్వితీయగా నుండవలెను.

కర్మను జెప్పు క్రియ—కర్మక్రియ.

ఇది వచ్చునప్పుడు కర్మ ప్రథముగా నుండవలెను.

కర్త ద్వితీయగా నుండవలెను.

ఉదా:— గొల్లవాఁడు పాలను బితికెను—ఇది కర్తృప్రయోగము.

గొల్లవానిచేఁ బాలు పిదుకఁబడెను—కర్మప్రయోగము.

క్రియలు వచనము, కాలము, పురుషము మొదలగువానింబట్టి రూపభేదములం బొందుచున్నవి.

వీని భేదములును, నామములమీఁద వచ్చు విభక్తిభేదములును విభక్తిచంద్రికాదిగ్రంథములవలనఁ దెలియవలెను.

# Important points in the construction of sentences.

——(0)——

## విభక్తులు.

1 "కంటె" యనునది యొక్కటి తప్ప నన్ని విభక్తులును గ్రియతోc సంబంధించును. అనఁగాఁ గ్రియమీఁదఁ బ్రశ్నలు వేసికొనిన యెడల నన్ని విభక్తులును వచ్చును.

ఉదా:—తినెను.

| | | | |
|---|---|---|---|
| ఎవఁడు తినెను ? — కృష్ణుఁడు | | ... | తినెను. |
| దేనిని ? — అన్నమును | ... | ... | " |
| దేనిచేత ? — హస్తముచేత | ... | ... | " |
| దేనితో ? — బలరామునితో | ... | ... | " |
| దేనికొఱకు ? — తృప్తికొఱకు, తృప్తికై | | ... | " |
| దేనివలన ? — ఆఁకలివలన | ... | ... | " |
| దేనియందు ? — పళ్లెరమందు | ... | ... | " |

షష్ఠి కొన్ని యెడలఁ గర్మార్థమందును, గొన్ని యెడల సంబంధార్థమందును, గొన్ని యెడలఁ జతుర్థ్యర్థమందును, గొన్నియెడలఁ గర్త్రర్థమందును వచ్చును గాని యది క్రియతోఁ జతుర్థ్యర్థమందు మాత్రమే సంబంధించును.

ఉదా:— దేవునికి నమస్కరించుచున్నాఁడు = దేవుని కొఱకు నమస్కరించుచున్నాఁడని యర్థము.

ప్రపంచమునకుఁ గర్త = అనఁగాఁ బ్రపంచమును జేయువాఁడు, అని యర్థము. కావున షష్ఠి కర్తయను కృదంతముతో సంబంధించినది గాని చేయుచున్నాఁడను క్రియతో సంబంధించలేదు. ఇది కర్మార్థషష్ఠి.

దేవునియొక్క గుణములు మంచివియై యున్నవి=ఈ యొక్క యను షష్ఠి సంబంధార్థమందు వచ్చినది గావున గుణములతో సంబంధించినది. క్రియతో సంబంధించలేదు.

ఈ హేతువువలననే ' తినెను ' అను క్రియపై నెవరియొక్క యని గాని యెవరికని గాని ప్రశ్నము పుట్టదు. కావున సంస్కృతముఁ గూడ షష్ఠిని కారకములలోఁ జేర్ప లేదు. క్రియాసంబంధము గలవియే కారకములు.

ప్రథమకు సంస్కృతమునఁ గారకత్వము లేదుగాని క్రియాసంబంధము గలదు.

## కారకములు.

1 కర్త = క్రియయందు స్వాతంత్ర్యముకలది.

2 కర్మ = క్రియార్థముయొక్క ఫలమున కాధారమైనది.

3 కరణము = కార్యసిద్ధికి ముఖ్యముగా నుపయోగించువస్తువు.

4 సంప్రదానము = ఇచ్చుట కుద్దేశింపఁబడినది.

5 అపాదానము = రెండు వస్తువులలో నొక వస్తువు విడిరాఁగా నక్కడ స్థిరముగా నున్నది. మఱియు—భయము, జుగుప్స, పరాజయము, ప్రమాదము, గ్రహణము, భవనము, త్రాణము, విరామము, అంతర్ధి, వారణము, ఇవి దేనివలన వచ్చునో యది యపాదానమగును.

6 అధికరణము=ఆధారము.

ప్రథమ—క్రియచేతఁ జెప్పఁబడిన యర్థ మందుఁ బ్రథమ వచ్చును. ఉదా—కృష్ణుఁడు పుస్తకమును వ్రాసెను.

ఇచట వ్రాసెను అనుక్రియ కర్త్రర్థమందుఁ వచ్చినది గావునఁ గృష్ణుఁడు ప్రథమయైనది.

కృష్ణునిచేతఁబుస్తకము వ్రాయఁబడెను-ఇచ్చట క్రియకర్మార్థ మందు వచ్చినది గావునఁ గర్మప్రథమయైనది. కర్త్రర్థమునఁ దృతీయయగును.

ఉదా-రాజుచేత భృత్యుఁడు చూడఁబడెను-ఇచ్చటఁ జూచు అను క్రియ చేయుటకు స్వతంత్రుఁడు రాజు కావునఁ కర్తయనఁబడెను.

కర్మార్థమునఁ ద్వితీయ యగును.

మనుష్యుఁడు చెట్టును గొట్టెను-ఇచ్చటఁగొట్టెనుక్రియ యొక్క ఫలము నరుకఁబడుట, దానికాధారమైనది చెట్టు కావున నది కర్మ.

కరణార్థమందుఁ దృతీయయగును.

మనుష్యుఁడు గొడ్డఁటిచేఁ జెట్టును గొట్టెను-ఇక్కడఁ గొట్టుటకు ముఖ్యముగా నుపయోగించినది గొడ్డలి కావున నది కరణంబు.

సంప్రదానార్థమునఁ జతుర్థియగును.

భృత్యునికొఱకు జీతమిచ్చెను-ఇచట నిచ్చుట కుద్దేశింపఁబడిన వాఁడు భృత్యుఁడు గావున సంప్రదానము.

అపాదానార్థమునఁ బంచమియగు.

చెట్టుఫలనఁబండుపడెను-ఇచటఁబండు విడిరాఁగా నక్కడ నిలిచి యున్నది చెట్టుకావున నది యపాదానము.

శత్రునివలన భయము— ఇచట భయము శత్రువువలనఁ గలిగినది గావున శత్రువపాదానము.

సంసారము వలన జుగుప్స—(ఏవగింపు) ఇచట జుగుప్స సంసారము వలనఁ గలిగినదిగావున సంసార మపాదానము.

---

వైరివలనఁ బరాజయము—ఇచటవైరి, అపాదానము.

భక్తివలనం బ్రమాదము—ఇచట భక్తి అపాదానము.

గురువువలన విద్యనుగ్రహించెను—ఇచటగురువు అపాదానము.

హిమవత్పర్వతము వలన గంగ కలిగినది—ఇచట హిమవత్పర్వత మపాదానము.

రాముఁడు రాక్షసుల వలన యజ్ఞమును రక్షించెను—ఇచట యజ్ఞ మపాదానము.

వాఁడు చదువువలన విరమించెను—ఇచటఁ జదువు అపాదానము.

కృష్ణుఁడు తల్లి వలనఁడాగెను—ఇచటఁ దల్లి యపాదానము.

రాముఁడు దెబ్బలవలన సేనలవారించెను—ఇచట దెబ్బయపాదానము

ఈ భయాదులు వచ్చునపుడు విధించిన పంచమి హేత్వర్థమందు వచ్చునని తాత్పర్యము.

అధికరణార్థమందు సప్తమి వచ్చును.

ఉదా:—రాజు పీఠమందుండెను—ఇచట పీఠమధికరణము.

దేవునియందు భక్తి—ఇచట దేవుఁడధికరణము.

# CHAPTER XVI.

## I

వాక్యకల్పన కావశ్యకములగు కర్తృ కర్మ క్రియలు, ఇతర కారకములు, మున్నగువానిం గూర్చి క్రిందటి ప్రకరణమందు వివరించితిమి. ఆయా సంగతులను సంధించి వాక్యకల్పము చేసి చూపఁబడును.

1 పక్షులు ఎగిరెను— ఇచట నెగిరె నను క్రియ యకర్మకము అగుటచేత దేని నను ప్రశ్న పుట్టదు.

☞ ఈ వాక్యము నభివృద్ధి చేయు మార్గము.

ఎట్టిపక్షులు?— అనఁగా బక్షులను నిర్వచించు పదములుగాని వాక్యములుగాని కావలెను.

(a) నల్లనిపక్షు లెగిరెను.

(b) రెక్కలుగల పక్షులెగిరెను.

(c] రెక్కలుగల నల్లని పక్షులెగిరెను.

(d) కూయుచున్న రెక్కలుగల నల్లని పక్షులెగిరెను.

ఇచటి విశేషణములన్నియుఁ బక్షులకే యన్వయించును.

2 నల్లని పక్షులలెగిరెను.

(a) మిక్కిలి నల్లని పక్షులెగిరెను.

(b) కాటుకవలె మిక్కిలి నల్లనయిన పక్షులెగిరెను.

(c) మర్దించిన కాటుకవలె నల్లనయిన పక్షులెగిరెను.

(d) మెత్తగ మర్దించిన కాటుకవలె నల్లనయిన పక్షులెగిరెను.

ఇచట నొక విశేషణమున కింకొకటి విశేషణమయినది.

3 బోయవాడు కొట్టఁబోయిన పక్షులెగిరెను.

(a) నీవుచూచితినని చెప్పిన పక్షులెగిరెను.

(b) చెట్లపై నివసించియుండఁగా నీవు చూచితినని చెప్పిన పక్షులెగిరెను.

(e) పిల్లలకు మేఁతలిడుచుఁ జెట్లపై నివసించి యుండఁగా నీవు చూచితినని చెప్పిన పక్షులెగిరెను.

ఇచ్చటఁ బక్షులకు విశేషణముగా వేసినని శబ్దములేగాక వాక్యము లుండగలవు.

4 పక్షులెగిరెను.

(a) పక్షులు మెల్లగ నెగిరెను.

(d) పక్షులు ఱెక్కలచేత నెగిరెను.

(c) పక్షులు మేఁతకొఱ కెగిరెను.

(d) పక్షులు చెట్లవలన (నుండి) నెగిరెను.

(e) పక్షులాకసమున కెగిరెను. పక్షులుపోవుచు నెగిరెను.

(f) పక్షులు వాయువునం దెగిరెను.

5 పక్షులు మెల్లమెల్లన నెగిరెను.

(a) పక్షు లెగిరి క్రిందఁబడి మరల నెగిరెను.

(b) పక్షులు మేఁతకుఁ బోవుదమని యెగిరెను.

(c) పక్షు లడవిలో మేఁత దొరకునని యెగిరెను.

ఇట్టివాక్యములయం దెగురుట పదములతో వాక్యములతో విస్తారము చేయఁబడెను.

---

## క్రియలరూపములు

---

6 పక్షులెగిరెను (భూతార్థకము)

పక్షు లెగురుచున్నవి (వర్తమానార్థకము)

పక్షు లెగురఁగలవు (భవిష్యదర్థకము)

| | |
|---|---|
| పక్షు లెగురును<br>పక్షు లెగిరెదును<br>పక్షు లెగిరెడిని | (తద్ధర్మార్థకము) |

పక్షు లెగురవు (వ్యతిరేకార్థకము)
పక్షు లెగురుట మానెను (భావార్థకము)
పక్షు లెగిరిపోయెను (క్త్వార్థకము)
పక్షు లెగురక నిలిచెను (వ్యతిరేకక్త్వార్థకము)
పక్షు లెగుర నుద్దేశించెను (తుమున్నాద్యర్థకము)
పక్షు లెగురుచునాడెను (శత్రర్థకము)
పక్షు లెగురుడు నాకులు కదలినవి (అనంతర్యార్థకము)
పక్షులెగిరిన ఱెక్కలు కదలును (చేదాద్యర్థకము)
పక్షులెగురుచున్న సమయము (వర్తమానార్థక విశేషణము)
పక్షులెగురు (ఎగిరెడి) సమయము (తద్ధర్మాద్యర్థక (విశేషణము)
పక్షులెగురని సమయము, (వ్యతిరేకార్థక విశేషణము)
పక్షులెగురుతను. ఎగిరెడిని (ఆశీరాద్యర్థకము)

పైవాక్యములలో "ఎగురు" అను క్రియ పొందదగిన యావత్క్రియారూపములుం జెప్పఁబడినవి.

## మధ్యమపురుష.

నీవు తినుచున్నావు (వర్తమానార్థకము)

నీవు తింటివి
నీవుతింటి } (భూతార్థకము)

నీవు తినగలవు (భవిష్యదర్థకము)

నీవు తిందువు
నీవు తినెదవు
నీవు తినెదు } (తద్ధర్మార్థకము)

నీవు తినుము (ప్రార్థనార్థకము)

మనము తిందము (ఉభయకర్తృక (ప్రార్థనార్థకము)
నీవు తినవు (వ్యతిరేకార్థకము)
నీవు తినకుము (వ్యతిరేకప్రార్థనార్థకము)

## ఉత్తమపురుష.

నేను వ్రాయుచున్నాను (వర్తమానార్థకము)
నేను వ్రాసితిని (భూతార్థకము)
నేను వ్రాయగలను (భవిష్యదర్థకము)
నేను వ్రాయుదును (తద్ధర్మార్థకము)
నేను వ్రాయను (వ్యతిరేకార్థకము)

## II
## కర్త.

1. రాముఁడు రావణుని సంహరించెను—రాముఁడు కర్త. (నామవాచకము.)
2. జంతువులు మేఁత మేసెను—జంతువులు కర్త. (అమహదర్థక నామము.)
3. వాఁడు శత్రువును సంహరించెను—వాఁడు కర్త. (సర్వనామము)
4. నిన్న గడచినది—నిన్న కర్త. (అవ్యయము)
5. ఒకటి పైకి వచ్చెను—ఒకటి కర్త. (సంఖ్యావాచకము.)
6. వ్రాయుట నిలిచెను—వ్రాయుట కర్త, (భావార్థకము)
7. వ్రాయమి సంభవించెను-వ్రాయమికర్త. వ్యతిరేక భావార్థకము)
8. మంచితనము రక్షించినది — మంచితనము కర్త .(భావార్థక తద్ధితాంతము.)

9. వడ్లు పండెను—వడ్లు కర్త. (నామము - నిత్యబహువచనము)

10. రాముఁడును, లక్ష్మణుఁడును జదివిరి—రాముఁడు, లక్ష్మణుఁడు కర్తలు (ఒక క్రియకు రెండు కర్తలు)

11. మల్లు దీసి కొల్లు గొట్టె ననుమాట సత్యమైనది. మల్లుదీసి కొల్లు గొట్టెననుమాట కర్త. (వాక్యము సామెత)

N. B:—సకర్మక, అకర్మక క్రియలకుఁ గర్త్రపేక్ష లేకయుండదు. సకర్మకక్రియలకుఁ గర్మాపేక్ష లేకయుండదు. ఈ రెంటికిఁ దక్కిన కారకములు యథార్థముగా నున్నచో నుండ వచ్చు లేనిచో మానవచ్చును.

కర్తృప్రయోగమందు

కర్మ.

1 తాపసులు పండ్లను భక్షించిరి—ఇచట పండ్లనునది కర్మ. (అమహత్తు)

2 తాపసులు రామునిఁ జూచిరి—(కర్మమహత్తు)

3 తాపసులు వానినిఁ జూచిరి—(సర్వనామము)

4 తాపసులిద్దఱినిఁ బంపిరి—(సంఖ్యావాచకము)

5 తాపసులు చూచుటను మానిరి—(భావార్థకము)

6 తాపసులు తినమిని మొదలుకొనిరి—(వ్యతిరేకభావార్థకము)

7 తాపసులు గేసుదనము మానిరి—(భావార్థకతద్ధితాంతము)

8 తాపసులు వడ్లనేరికొనిరి—(నిత్యబహువచనము)

9 తాపసులు యజ్ఞముం దపస్సును జేసిరి—(రెండు కర్మలు)

10 తాపసులు తామరాకులలో నీటివలె నుండవలెననమాటను జెప్పిరి—(వాక్యము)

N. B.—(1) కర్మార్థమందువచ్చు విభక్తులు.

ఉదా—పాండవులచే వనము పొందఁ బడెను—(వనము—ప్రథమా కర్మ)

పాండవులు వనమును బొందిరి—(వనము-ద్వితీయకర్మ)

వాల్మీకి రామాయణమునకు కర్తయైయుండెను — (రామాయణమునకు-షష్ఠికర్మ)

కర్మార్థమందు వచ్చుషష్ఠి కృదంతముతోనే సంబంధించి యుండును. గాని సమాపకక్రియతో సంబంధించి యుండదు.

---

## Auxiliary Verbs.

### ఉపక్రియలు.

"ఉండు, కలుగు, పడు, కొను"

1 వర్తమానార్థమందు 'ఉండు, వచ్చును (వర్తమానార్థ మనఁగా జరుగుచున్న కాలము)

ఉదా—చేయుచున్నాఁడు. ఇచట ఉన్నాఁడు అనునది యుండుధాతువు.

2 భవిష్యదర్థమందు 'కలుగు, వచ్చును. (భవిష్యదర్థకమనఁగా రాఁబోవు కాలము)

ఉదా—చూడఁగలఁడు. ఇచటఁగలడు అనునది కలుగుధాతువు.

## Important Points.

1 కర్మార్థమందు 'పడు, వచ్చును. (కర్మార్థమనఁగా క్రియ కర్మనుచెప్పును)

ఉదా— బాలునిచేతఁ బుస్తకము చదువఁబడెను.

2 ప్రేరణయందు 'ఇంచు, వచ్చును. (ప్రేరణమనఁగాఁ బని మఱియొకనిచేఁ జేయించుట)

ఉదా—తల్లి బాలునికన్నము తినిపించుచున్నది.

3 ఆత్మనే పదార్థమందు 'కొను, వచ్చును. (పనితననిమిత్తమై చేసికొనుట)

ఉదా— వాఁడు పుస్తకమును వ్రాసికొనుచున్నాఁడు.

1 నీవు చెట్టునుగాంచితివి—(మధ్యమపురుష)

2 నేను పుస్తకమును జదివితిని—(ఉత్తమపురుష)

3 గొల్లవానిచేఁ బాలు పిదుకఁబడెను—(కర్మణిక్రియ)

4 గురువు శిష్యునిఁ జదివించుచున్నాఁడు- (ప్రేరణకర్త్రర్థకము]

5 గురువుచే శిష్యుఁడు చదివించఁబడుచున్నాఁడు- (ప్రేరణకర్మార్థకము)

6 రాతు గుఱ్ఱమును దోలెను. [ఆత్మనేపదార్థకము]

7 రాతుచే గుఱ్ఱముతోలఁబడెను- [ఆత్మనేపదకర్మార్థకము]

8 రాజుచే గుఱ్ఱము తోలించుకొనఁబడెను- (ఆత్మనేపదప్రేరణ కర్మార్థకము]

9 రాముఁడు బాణమును దీసెను, సంధించెను, వేసెను - [కర్తయుం గర్మయు నొక్కొక్కటియే, క్రియలనేకములు]

---

## Intransitive Verbs.

## అకర్మక క్రియలు.

అగు, ఉండు, వెళ్లు, పోవు, వచ్చు, చచ్చు, పారు, మరియు, పుట్టు, అణఁగు, నెఱయు, తగు, చను, అరచు, చినుగు, నిలచు, తునుగు, మునుగు, తేలు, రేగు, తిరుగు, మను, నలఁగు, బిగియు, పాయు, పదు, లేచు, చెదు, ఉదయించు, నడచు, రంజిల్లు, నవ్వు, ఏడ్చు, శోభించు, శోకించు, ఆవ్రలించు, నిద్రించు, విరుగు, తరుగు, పెరుగు, మలఁగు, మెలఁగు, ఎదుగు, మొలచు, చీలు, ప్రీలు, ప్రేలు, కూలు, తనియు, తెలియు, మడియు, అరచు, వెరచు, నొచ్చు, బ్రుంగు, వంగు, కాగు, సాఁగు, ఉడుగు, తదుగు, తొరగు, నిండు, అలుగు,

## Transitive Verbs.

### సకర్మక క్రియలు.

వండు, మట్టు, వ్రాయు, తలంచు, కరచు, గ్రుచ్చు, ఓము, పఠించు, అలుకు, తిను, పెట్టు, కోయు, పోలు, మోయు, తుడుచు. మ్రింగు, నోచు, వారించు, పలుకు, కొట్టు, చేయు, కను, కదియు, చూచు, ఎఱుఁగు చెక్కు, భుజించు, డిగ్గు, తిట్టు, పట్టు, తీయు, మాను, తెరచు, ఇచ్చు, కప్పు, చెప్పు, చిలుకు.

N. B. కొన్ని అకర్మక క్రియలు, సకర్మకములుగా మారును.

ఉదా—వానగురిసెను (అకర్మకము)

మేఘము వానగురిసెను (సకర్మకము=గురిపించెనని యర్థము)

అకర్మకధాతువులన్నియుఁ బ్రేరణమునందు సకర్మకములగును.

ఉదా—శత్రువు చచ్చెను (అకర్మకము)

రాజు శత్రువును జంపెను. (ప్రేరణ)

---

## Exercises

### I

☞ ఈ క్రింది క్రియలతోఁ జిన్న వాక్యములను చేయుఁడు.

అనునయించు, నేర్చు, పట్టు, చేయు, పుట్టు, దొరకొను, సలుపు, కొను, చెల్లు, ఎఱుగు, కోలుపడు, వచ్చు, లేచు, పలుకు, వరియించు, పొరివు, చెప్పు, అనుగ్రహించు, దయసేయు, పొడము, తెగు, అడలు, తిరుగు, కూలు, పొరలు, ఊహించు, తీర్చు, పండఁబారు, కను, చను, త్రగు, అడుగు, అగపడు, కొట్టు, చెల్లు, చూచు, కూడఁగొను, పాడుకొలుపు, తోడ్కొను, వెల్వడు, తునుము, రక్షించు, అలయు.

## II

☞ ఇంచుక్కు ఏ క్రియలకు వచ్చునో వ్రాయుడు.

## III

☞ "పోషించు, పోషింపుచున్నాఁడు" ఈ విధముగాఁ జకారమునకుఁ బకారము వచ్చు క్రియారూపములం దెల్పుఁడు.

---

# CHAPTER XVII,

## Rules of Syntax.

---

ఆంధ్రభాషయందు మధ్యమోత్తమ పురుషల యందుఁ గర్త వికల్పముగా లోపించును.

ఉదా—వచ్చితివి, నీవు వచ్చితివి, వచ్చితిని, నేను వచ్చితిని.

వాక్యకల్పనమునందుఁ గర్త కర్మ క్రియ యీ మూఁడును నవశ్యములని వ్రాసియుంటిమి. కొన్నియెడల మధ్యమోత్తమ పురుషలయందుఁ గర్తృలోపము కాన్పించుచుండును. కొన్నియెడలఁ గ్రియ లోపించును.

వాక్యాన్వయమునకు సంబంధించని యవ్యయ సంబోధనాదులు వాక్యమునం దెచ్చటనైన రావచ్చును.

ఆంగ్లేయభాషయందు వలె స్థాననిర్దేశమునుబట్టి కర్తృ కర్మ లేర్పడవు, కావున నీ భాషయందు స్థానవ్యత్యాసముంగూర్చి విచారింపవలసిన పనిలేదు.

ప్రసిద్ధములగు వచన కావ్యములనుండి పైసంగతులను దెలియఁజేయఁ గొన్ని చిన్నవాక్యము లుదహరింపఁబడెను.

1 లింగవిభక్తివచనములు విశేష్యమునకు నెవ్వియో యవియే విశేషణమునకు నగును.

ఉదా— నందతనయుండు కృష్ణుండు నాకుదిక్కు.

ఇచటఁ గృష్ణుఁడు అనునది పుంలింగ ప్రథమైకవచనము గనుక దాని విశేషణమగు నంద తనయుఁడు అనునదియుఁ బుల్లింగ ప్రథమైక వచనమేయైనది.

ఉదా— లక్ష్మణాగ్రజునకు రామునకు మ్రొక్కెద.

ఇందు రామునకు విశేష్యము. పుంలింగ షష్ఠ్యేకవచనము గావున విశేషణమగు లక్ష్మణాగ్రజునకు అనునదియుఁ బుంలింగ షష్ఠ్యేకవచనమేయైనది.

ఉదా— ఉత్తములను రామలక్ష్మణులను నుతించెను.

ఇందు రామ లక్ష్మణులను అనునది పుంలింగ ద్వితీయా బహువచనము. కావున దీని విశేషణమగు నుత్తములను అనునదియు నట్లేయైనది.

ఉదా— లోక జననికి సీతకు మ్రొక్కెద.

ఇచట సీతకు అనునది స్త్రీలింగ షష్ఠ్యేకవచనము గావున దాని విశేషణమగు లోకజననికి ననునదికూడ నట్లే యున్నది.

2 స్త్రీ సమములగు విశేషణములయందు, మువర్ణాంత విశేషణములయందు బహువచనమున కేకవచనము తరుచుగ నగును.

ఉదా— మాటలు పెక్కేల, మాటలు పెక్కులేల ?

ఇచట మాటలు అనునది బహువచనము. దాని విశేషణమగు పెక్కుశబ్దము, ఒకసారి యేకవచనము నొకపారి బహువచనము నయినది.

ఉదా— తీఁగెలు కుసుమితంబయ్యె, కుసుమితంబులయ్యె.

ఇచట తీఁగెలు అనునది బహువచనము, దానికి విశేషణమగు కుసుమిత శబ్దము వికల్పముగా నేకవచనాంత మయినది.

మాటలు పెక్కేల, కుసుమితంబులయ్యె. ఇవి రెండును స్త్రీసమంబులు.

ఉదా— రుచిరమగు పదార్థములు, రుచిరములగు పదార్థములు.

ఇచట పదార్థశబ్దము బహువచనము. దీని విశేషణమగు రుచిరశబ్దము వికల్పముగా నేకవచనమైనది. ఇది మువర్ణ కాంతమున కుదాహరణము.

3 ఒకానొకచోట నొక విభక్తికి మఱియొక విభక్తివచ్చును.

ఉదా— రాముఁడు పురమును వెడలెను— పురమునుండి వెడలెనని యర్థము.

ఉదా— వాడు వాహనము దిగెను— వాహనమునుండి దిగెనని యర్థము. ఇవి రెండును బంచమనర్థ్యమున ద్వితీయలు.

ఉదా— బంధువులు సుఖమున్నారు— సుఖముతో నున్నారని

యర్థము. ఇది తృతీయార్థమునఁ బ్రథమ.

4 జడవాచకముల తృతీయాసప్తములకు ద్వితీయ బహుళముగా వచ్చును.

ఉదా— వాలినొక్క కోలం గూలనేసెను— కోలచేతని యర్థము.
ఇది తృతీయార్థమందు ద్వితీయ.

ఉదా— దశరథుఁ డయోధ్యనుండె— అయోధ్యయందని యర్థము.
ఇది సప్తమ్యర్థమందు ద్వితీయ.

బహుళమనుటచేత నీకార్యము ఉకారాంతములకు బహువచనమం దేవచ్చును.

ఉదా— రాముఁడు రాక్షసులను బాణములను సంహరించె—
బాణములచేతనని యర్థము. ఇది తృతీయార్థమందుద్వితీయ.

ఉదా— మౌనులు వనముల వసింతురు— వనములయందని యర్థము
ఇది సప్తమ్యర్థమందు ద్వితీయ,

5 జడవాచక ద్వితీయకుఁ బ్రథమ బహుళముగానగును.

ఉదా— జోదు బాణములు వేసె, బాణములను వేసె, ఇంతిపువ్వులు
గోసె, పువ్వులనుగోసె.

6 కాలవాచకములకును మార్గవాచకములకును బ్రాయకముగాఁ బ్రకమ యగును.

ఉదా:— సంవత్సరము నదివె, నెలయుండె ఆమడనడచిరి, పది క్రోసులు పోయిరి.

7 సంఖ్యావాచక సర్వనామమునందును, దాని విశేష్యమందును, నేది
ముందుగ నుండునో దాని ద్వితీయాది విభక్తులకుఁ బ్రథమ బహుళ
ముగా నగును,

ఉదా:— అన్ని చెట్లకు, అన్నింటికి చెట్లకు, చెట్లన్నిఁటికి, చెట్ల
కన్నిఁటికి.

ఉదా:— నాలుగు చెట్లకు, నాలిగింటి చెట్లకు, చెట్లు నాలుగింటికి,
చెట్లకు నాలుగింటికి.

ఉదా:— నూఱు చెట్లకు, నూఱింటికి చెట్లకు, చెట్లు నూఱింటికి చెట్లకు నూఱింటికి, నూఱు చెట్లయందు, చెట్లునూఱింటి యందు, నూఱు చెట్లను, చెట్లు నూఱింటిని, నూఱు చెట్ల చేత, చెట్లు నూఱింటిచేత, నూఱు చెట్లకొఱకు, చెట్లు నూఱింటి కొఱకు, నూఱుచెట్లవలనన్, చెట్లు నూఱింటి వలనన్.

8 ఒకానొకచో విశేషణముల షష్ఠికిం బ్రథమయగును

ఉదా:— శాంతుఁడు మునికి రామునిచ్చె.

శాంతునికి మునికి రామునిచ్చె.

9 అగు మొదలగునవి విశేషణ విశేష్యములకు నడుమనుండెనేని యా విశేషణముల విభక్తుల కన్నిఁటికిఁ బ్రథమ వచ్చును.

ఉదా:— తపశ్శాలియగు మునినిఁజూచె

తపశ్శాలియగు మునికి నమస్కరించె

తపశ్శాలులగు మునులను గలసిరి.

10 ధాతువు వలనం బుట్టిన యవ్యయములకును, విశేషణములకును గృదంత ములకును గర్త ప్రథమయగును.

ఉదా:—నీవు చూచిన మనుష్యుఁడు వచ్చెను.

ఇచట నీవనునది చూచిన, అను విశేషణమునకు కర్త.

ఉదా:—పువ్వులు పూయుటచేఁ దోఁట ప్రకాశించును.

ఇచటఁ బువ్వులనునది పూయుట అను భావార్థక మునకుఁ గర్త.

ఉదా:— చెట్లు తడియుడును బువ్వులు పూసినవి—ఇచటఁ దడి యుడును అను నానంతర్యార్థమునకుఁ జెట్లు కర్త.

11 కర్మాది కారకములకుఁ బ్రధానత్వమును జెప్పునప్పుడు ధాతువువలన బుట్టిన విశేషణములు కర్తతో వలెనే కర్మాదులతో సమసించును.

ఉదా:— రాముఁడు రక్షించిన భృత్యుఁడు — ఇచట రక్షించిన అనునది కర్మమైన భృత్యునితో సమసించినది.

రాముఁడు వాలినేసిన బాణము—ఇచట నేసిన అనునది కరణమయిన బాణములతో సమసించినది.

రాముఁడు గోవునిచ్చిన విప్రుఁడు—ఇచట నిచ్చిన అనునది సంప్రదానమైన విప్రునితో సమసించినది.

రాముఁడు వెడలిన వనము — ఇచట వెడలిన అనునది అపాదానమైన వనముతో సమసించినది.

రాముఁడు వసించిన గృహము—ఇచట వసించిన అనునది అధికరణమగు గృహముతో సమసించినది,

N. B:—సమాసముగానిచో "రాముఁడు గృహమందు వసించెను" అని యుండవలెను. ఇట్లు తక్కినవియు నూహించునది.

12 మనుష్యేతరములు కర్తలగునపుడు భూత తద్ధర్మార్థకముల బహువచనమున నేక వచనము వచ్చును.

ఉదా:— వనములు విలసిల్లె, వనములు విలసిల్లును, వనములు విలసిల్లెడును, వనములు విలసిల్లెడిని.

ఉదా:—గోవులు వచ్చెను, గోవులు వచ్చెడును, గోవులు వచ్చును, గోవులు వచ్చెడిని.

13 పూర్వమిది పరమిది యను నియమ మపేక్షింపక వాక్యమందెల్ల పదంబులు వలచినట్లు ప్రయోగింపందగును— ఏని ప్రభృతి శబ్దంబులు కొన్ని సాపేక్షంబులై యుండు.

ఉదా—గాలి చల్లగా వీచెను, వీచెను చల్లగా గాలి, చల్లఁగా గాలివీచెను, వీచెను గాలి చల్లగా, గాలివీచెను చల్లగా, చల్లగా వీచెనుగాలి.

ఉదా—నీవు వచ్చెదవేని ఆనందము కల్గును — ఈ వాక్యమందేని శబ్దము "వచ్చెదవు" అనుదాని తరువాతనే కాని మఱి యొచ్చటను బ్రయోగింపరాదు.

దేవుని కనుగ్రహము గల్గినచోఁ సంపద గలుగును—ఇందు చో అను నది "కలిగిన" అనుదాని తరువాతనేకాని మరియొకచోఁ బ్రయోగింపరాదు.

కొందఱు ధర్మివాచకములను ధర్మవాచకముగా వాడుదురు. అది తప్పు. కావున వాని నిందు స్పష్టము చేయుచుంటిమి.

| ధర్మి. | | ధర్మము. |
|---|---|---|
| సహాయుఁడు, సహాయము | ... | సాహాయ్యము |
| మధురము | ... | మాధుర్యము |
| మృదువు | ... | మార్దవము |
| సుందరము | ... | సౌందర్యము |

## Simple Sentences,

1 మిథిలయను పట్టణం బొకటి కలదు.

2 ఆనగరమును బ్రహ్మజ్ఞానముచేత మిక్కిలి ప్రసిద్ధుఁడయిన జనకుండను రాజేలుచుండెను.

3 ఔర యిప్పుడు భూమిలో శూరుఁడే లేకపోయెను - ఇచ్చట వాక్యముతో సంబంధములేని "ఔర" యనుశబ్దము వాక్యాదియందుఁబడినది.

4 ఎవ్వనిదీగొంతు? - ఇందుక్రియ అధ్యాహారమగుచున్నది. క్రియలు లేనప్పుడు, అగుధాతువుగాని, కలుగుధాతువుగాని అధ్యాహారముచేయఁబడుచున్నది.

5 విల్లెక్కడ, మేలైన పదుచెక్కడ - క్రియ అధ్యాహారము.

6 భగవంతుఁడగు యాజ్ఞవల్క్యుని భార్య వ్రాసెను.

7 చిటికెలో వీనిం దొలఁగించెదను.

8 సరియైన కత్తితో సీతం గొనియెదను—కత్తితో సీతంగొనుట యప్రసిద్ధము. కత్తిచే శత్రువులనఱికి సీతనుబుచ్చుకొందునని తాత్పర్యము.

9 ఒక మనుష్యునకు బది తలలుండెను.

10 శూరులెల్ల సంతోషింపఁదగినదిఁగదా వందిజాతి — కర్త చివరనున్నది.

11 ఇదె వెలిఁగెడి వేయిచేతులతో నెదుటఁ గనఁబడియెడిని = ఇదె యను నది వేఱు వాక్యము.

12 ఇందఱి శూరులలో నొకఁడైన వింటిని మోపెట్టఁడాయెనా ? — ఇచటఁ బ్రశ్న క్రియతో సంబంధించినది.

13 ఒకానొక వీరావతారునిచే నారసములతోఁ గొట్టఁబడి మింటు నరుగఁ బోలు.

14 చెలికాఁడా ! నాకు సంతోషమాయెను.

15 ఈ జనకుఁడు వేదాంత విద్య నెఱిఁగినవాడు — ఇందు క్రియ అధ్యాహారము. ఎఱిఁగినవాఁడు అను విశేషణము క్రియచేయు పని చేయుచున్నది.

16 ఓరీ ! నీవు ధర్మతత్త్వము నెఱుఁగవు.

17 పరశురామ ముని గండ్రగొడ్డలి తనతో నొక మాట చెప్పుమనెను— గండ్రగొడ్డలి మాట చెప్పుట యప్రసిద్ధము. అది చేయుపనిని దానిఁ జెప్పుచు దానియం దారోపించినాఁడు.

18 అక్కటా ! నన్నుఁ జంపితివి.

19 ఏమి నాదురదృష్టము.

20 మన స్నేహతత్త్వ మెఱిఁగినది, నామనస్సొకటి (ప్రసన్న రాఘవము) కర్మార్థమందు ప్రథమ – క్రియలేదు.

21 వేంకటేశ్వరుల కిప్పుడిరువది యేఁడు సంవత్సరముల వయస్సున్నది.

22 సత్యవతి యొక్క మూఁడవ తప్పిదము శుచిగా నుండుట – ఇక్కడ శుచిగానుండుట మంచిదియైనను దప్పిదముగా వర్ణింపబడినది.

23 తర్వాతఁ బెండ్లికి వచ్చిన చుట్టము లందఱుం దమ తమ గ్రామములకు వెళ్ళిపోయిరి.

24 ఆమెకుఁ గావలసిన దానినిఁ దెచ్చుటకై సిద్ధముగా నుందురు. (సత్యవతీ చరిత్రము).

25 విజయవర్మయు, వజ్రసేనుఁడును, విక్రమబాహుఁడును మొట్టమొదట పని కుపక్రమించిరి—ఇక్కడఁ గ్రియకుఁ గర్తలు మూఁడు. (భానుమతీ కల్యాణము)

26 ధర్మకవచుఁడామె భర్త—క్రియ యధ్యాహారము, క్రియలేనిచోట విశేషణములే క్రియలుగా నన్వయించును.

27 భార్యాభర్తల నిద్దఱినొకటిగాఁ జూచుటవలనఁ బుణ్యమేకాని పాపమురాదు. (ధర్మకవచోపాఖ్యానము)

28 అమ్మా! యెవ్వఁడో యొకరాజకుమారుఁడు వచ్చుచున్నాఁడు.

29 నీవతి శీఘ్రముగ నాయితంబుగమ్ము— ఇచట నాయితమనునది మహత్తునకు విశేషణమయ్యును అమహద్రూపముగా నున్నది.

30 పెక్కుదుఃఖంబులకుఁ బక్కన నవ్వ బుద్ధియగు— సామెత, (మదన మోహన చరిత్ర)

31 అదియుక్తమే— క్రియ యధ్యాహారము.

32 నీవానొప్పకుంటివాఁడవు— ఇక్కడ ప్రశ్నార్థకము కర్తతో సంబంధించెను.

33 ఎట్లుపోయెదవో తెలియదు.

34 అయ్యిరువురకును జాలసేపు వాదమయ్యెను-(సోమశర్మాభ్యుదయము)

35 దైవమా! నీకంటికి మేమే యగపడితిమా! —ఇక్కడఁ బ్రశ్నార్థకము క్రియతో సంబంధించినది.

36 ఇప్పుడేవో దుస్తర విపత్తి గేస్తునకుఁ దటస్థించె.

37 కాళ్ళులేమో నేల నిలువక గజగజమని వడఁకుచున్నవి— ఇచట నేమో యనునది అన్వయముతో సంబంధించనిది మధ్యను బ్రయోగింపఁబడినది.

38 అతఁడు కోరిన రాజకుమారుఁ డెవఁడు?—క్రియ యధ్యాహారము.

39 అయ్యా! నీవు సధర్ముఁడవు,— క్రియ యధ్యాహారము.

40 లక్కయింటి బారికిఁ దొలఁగివచ్చిన మిమ్ము జూచి మాకన్నులు చల్లనయ్యె,

41 మీకు నేఁడాదిగా భద్రప్రాప్తియగును.

42 మే మెవ్వరమైనను తనకేమి! ఇచ్చటఁ క్రియ యధ్యాహారము.

43 ఇమ్మాటలే, మీ రాజుతోఁ జెప్పుము—ఇచటఁ గర్తవై, ఏవార్థకము.

44 మీరు భూదేవతలో, దేవతలో, మహీపతులో, యెఱుఁగనయ్యెద. క్రియ యధ్యాహారము. ఇచట ఓ అనునవి మూఁడును, అధ్యాహృత క్రియతో సంబంధించుచున్నవి.

45 రాజేంద్రా! మీరు సిద్ధసంకల్పులరు—క్రియ యధ్యాహారము. సంబోధన యేకవచనము, మీరు అనునది బహువచనము.

46 దైవానుకూల్యము లేని మానుషంబు కొఱగాదు.

47 నీ యిష్టం బెయ్యది యెఱిఁగింపుము.

48 దైవబలముగల కౌంతేయులఁ జెఱుపఁదరమే!

49 వానితోఁ గలహంబు పాడియగునే?

50 ధనంజయా! నిన్నుజూచి యెన్నాళ్ళో యయ్యెనుగదా—ఇక్కడఁ జూచి యనునది చూచుటయను నర్థమందు వచ్చినది కావున నైనదియను క్రియ కిది కర్తగా నన్వయించుచున్నది.

51 రామా వేమారామానవేంద్రుని గుఱించి గుఱించి యడుగుచున్నదానవు.

52 నీకోరిక సఫలంబుఁ జేసెద-కర్త అధ్యాహారము. (సుమనోమనోజ్ఞము).

53 నే తపోదృష్టిం జూచితిని.

54 నీ తపంబు ఫలించె.

55 తాపసోత్తమ! "అపుత్రస్య గతిర్నాస్తి" యనుస్మృతి స్మృతికివచ్చెఁ జుమీ! అనుకృతి.

56 పుడమిఱేఁడ! నీవు పలికినది నిక్కము - క్రియ యధ్యాహారము.

57 దైవంబు గడువ నేరితరము? క్రియయధ్యాహారము.

58 కడచినదానికి వగచుట గతజలసేతుబంధనము - సామెత, క్రియ శేషము.

59 బిడ్డల మచ్చికకన్నఁ దండ్రికి ముచ్చట యెచ్చటఁ గలుగును? -ఇచ్చట

యెచ్చటనను పరిశ్నార్థము వ్యతిరేకార్థమును జెప్పుచున్నది. ఎచ్చట గలుగుననగ గలుగదని యర్థము.

60 మఱియొండు విశేషంబువాఱిచ్చెద - కర్తలేదు.

61 ఎన్నాళ్ళునిహమునకె పరియత్నించినఁ బరమెటులఁగలుగు ! - ఎన్నాళ్ళు అనుట కెల్లప్పుడనియర్థము. ఎటుల ననునది వ్యతిరేకార్థమును దెలుపుడి చేయుచున్నది.

62 ఎవ్వరు నీకెగ్గు గావించిరి.

63 కలికీ ! నీ కాబుడుతపై నలుకయేలా? క్రియ యధ్యాహారము.

64 నాకు వనంబుఁ బట్టణంబు నొక్కతీర -క్రియ యధ్యాహారము.

65 భరతాభిషేకము నాయదిగా నెంచెదఁజుమీ ! - అన్వయానంతరము జుమీయనునది వాక్యపూర్తికై వారిసినది.

66 నీ సత్యపరితిజ్ఞ నిలుప్కొమ్మ ! - కర్తలేదు.

67 విచారించక యాశీర్వదించి పుచ్చుము, - కర్త అధ్యాహారము.

68 కౌసల్య మూర్ఛిల్లెను.

69 శరీరంబు జలబుద్బుదపారియంబు - క్రియలేదు.

70 ఎండ కన్నెఱుంగని సుకుమారివి, -కర్తక్రియ రెండును అధ్యాహారము.

71 "అవశ్యమను భోక్తవ్యం, కృతం కర్మ శుభాశుభ" మ్మనుట వినలేదా కర్మ పెద్దవాక్యము - అనుకరణము.

72 పులిమీఁకల నుయ్యాలలూఁగఁదలఁచితివో ! - కర్త అధ్యాహారము.

73 నిలుము - కర్తలేదు.

74 ఛీ ! రా - కర్తలేదు.

75 పేరిలుటఁ జాలింపుమీ - కర్మభావార్థకము.

76 నీ యాటలు నాయొద్ద సాగవు. (శ్రీరామజననము)

77 నేనను పరిత్యక్తుపై పరమడుగు మంటిని.

78 స్వామీ ! నీకు శుశూరిష చేయుచుందునుగాక. కర్త అధ్యాహారము. క్రియ, ఆశీరార్థక పర్యవసాయిగా నున్నది.

79 కలదుగదా...హిమవత్పర్వతము - క్రియ ముందు జెప్పఁబడినది.

80 వారిలో, నొకాయనకొడుకు, ఈయింద్రదత్తుఁడు - క్రియలేదు.

81 నేను పుట్టఁగానే మాతండ్రి కాలము చేసెను.

82 ఇంతకాలమునకు శ్రుతధరుఁడు నీకుమారుఁడు మాకునోటికిఁనాడు.

83 ఈలోపల సాతవాహన మహారాజు, అస్వస్థుఁడాయెను.

84 రాజా! ఆరులక్షలగ్రంధము, ఆరుకథలను గాల్చి వేసితిని - ఇచట భిన్నవచనములగు రెండు కర్మలు ఒకక్రియతో నన్వయించు చున్నవి.

85 రాజు ఆమెకు వాసవదత్త యని పేరు బెట్టెను.

86 నీకీబాల యేమికావలయును? - కర్త లేదు.

87 మీరు జగడమాడు చున్నారు.

88 అయ్యో! ఎంత సత్త్వహీనమైన ప్రభుత్వము వానికిది. వానికిది యనునది ప్రభుత్వమునకు విశేషణమై చివర నున్నది. క్రియ యధ్యాహారము.

89 అస్తమయము కావచ్చినది.

90 మేము విద్యలము, మీరుకళలు - క్రియలు లేవు.

91 మీ కుమారునికొఱకు వచ్చినారము - కర్త లేదు.

92 లోకప్రఖ్యాత యుజ్జయని యను పురము కలదు.

93 నీవు ప్రత్యక్షమై యెరవనో చెప్పుము.

94 మద్రదేశములో పూర్వము శాకలమని పురముండునది.

95 సూర్యప్రభుఁడు రాత్రి త్రిలోకసుందరియైన కుముదావతితో నానా భోగముల ననుభవించెను. (కథాసరిత్సాగరము)

96 అట్లేని నీచేత సత్కారంబు గొనియెద - కర్త లేదు. (అరణ్య పర్వము భారతము.)

97 అశ్వత్థామ కృపాచార్యున కిట్లనియె. (సౌప్తికపర్వము - భారతము)

98 పాండవులమీఁద నురికి పొడుతముగాక - ఇచటఁగ్రియాపైఁ గాక యనునది వాక్యపూర్తి (శల్యపర్వము - భారతము)

99 అది నీ ప్రశ్నంబుల కుత్తరంబై యుండెడు. (అశ్వమేధపర్వము — భారతము)

100 పెద్దలయనుజ్ఞఁగొని కయ్యంబుసేసిన జయం బగుట నిశ్చయంబు— క్రియలేదు. (భీష్మపర్వము–భారతము)

## Complex Sentences.

### సంశ్లిష్ట వాక్యములు.

ప్రధానవాక్యమును, దానికి హేతువును జెప్పు నప్రధాన వాక్యమునుగలది సంశ్లిష్టవాక్యమగును.

ఉదాహరణము—

1 నీవు వ్రాసితివేని నేను జదువుదును.

2 వాఁడు వండినచో వీఁడు భోజనముచేయును.

3 వర్షముగురిసినఁ బంటలు పండును.

4 ధనమున్నయెడల సౌఖ్యము గలుగును.

5 శాంతిగలిగినప్పుడు మోక్షము గలుగును.

6 రాముఁ డెక్కిడుటకు వంచునప్పుడే ఆవిల్లు పెళ్ళున విఱిగినది. (ప్రసన్నరాఘవము.)

7 అంతటియనురాగ మింతకురాఁగా నేనుదలంపించి యేమికాఁబోలును!

8 పెద్దవారితో నెవ్వరితోను జెప్పక బుద్ధిలేని పని చేసినందులకు ఫలము గలిగెను.

9 ఏపనియైనఁ బరీక్షించి చేయవలయును గాని యెదుటివారి మనస్సు తెలియక చేయరాదు.

10 స్త్రీలకు సమయమునకుఁదగిన యుక్తులు తోఁచును అనునదివాస్తవమే.

11 పుట్టిననాటినుండి కపట మెఱుఁగని వారి మాటలు ప్రమాణము గావు.

గాని పరుల మోసపుచ్చుటయే విద్యగా నేర్చుకొనువారి మాటలు ప్రమాణము.

12 శకుంతల తనకు దైవముగూడఁ బ్రతికూలమాయెను గనుక యే యుపాయమును ఫలింపదని తలఁచెను.

13 కడుపులో విషము పెట్టుకొనియున్న యీతని తేనెలొలుకు మాటలకు మోసపోయి యిట్లు స్వచ్ఛందచారిణి కావలసివచ్చెను. అని ముఖమున గుడ్డఁబెట్టుకొని యేడువసాఁగెను. (శాకుంతల నాటకమునకుఁ దెలుఁగు)

14 ఛీ మూఢుఁడా! పరశురాముని గొడ్డఁటి వాఁతఁబడిన కార్తవీర్యార్జునుఁడు, ఇప్పుడిక్కడి కెట్లువచ్చును?

15 వినుము నాతండ్రియగు బలిచక్రవర్తి పాదపద్మముల నమస్కరించుటకై పాతాళమునకుఁ బోయి భూమండలమును నాచేతుల యందుంచుకొని యెన్నిమారులో శేషునికి బరువులేకుండఁ జేసితిని.

(ప్రసన్న రాఘవము.)

16 ఇట్లు చెప్పినవారు చెప్పినను జెవియొడ్డి వినిన వారైన నవ్వకపోరు.

17 ఆమాయమాటలు చూచి యీతఁడే మో విశ్వాసపాత్రుండని భ్రాంతిపడి తప్పుచేసి యీగతి దెచ్చుకొంటిని. [నీతిచంద్రిక.]

18 జీమూతవాహనుఁడు, అక్షతదేహుఁడని యెఱిఁగి, అతని బంధువులభినందించిరి.

19 అడవినుండి వచ్చినదిగాన నీమెకు, ఆప్తులైన వారెవ్వరును లేరు.

20 వజ్రనిర్మిత దేహుఁడనగుటచేత వజ్రప్రభుఁడని నాకు సార్థకనామము.

[కథాసరిత్సాగరము]

---

## మహావాక్యములు.

---

1 అప్పుడు విక్రమసేనుఁడు తల్లినిజూచి తన ప్రయాణమునకు సెలవువేఁడఁగా, ఆమె కుమారుని బహువిధంబుల దీవించి కన్నుల నీరు కాలు

వలు కట్టి ప్రేమాస్పదుఁడైన యీచిన్నవానిని సౌజన్యనిధి కొప్పగించి "నాయనా! ఈచిన్నవాఁడీ వఱకెన్నఁడును తల్లిదండ్రులను విడిచి పరులయొద్ద నొంటిగాఁ మెలఁగినవాఁడు కాఁడు. లోకవ్యవహార మెఱుఁగని యీ బాలకుని కెట్లు బుద్ధిచెప్పి మంచి వానినిగా దిద్దు కొందురో మీదే భారము." అని చెప్పి వెళ్లుటకు సెలవిచ్చెను.

(సతీమణివిజయము)

2 ఉద్యోగికి దూరభూమియు, విద్వాంసునకుఁ బరదేశమును, ప్రియవాదికి శత్రువును లేనట్లు బుద్ధిమంతుని కసాధ్యమొకటి లేదు.

3 దేవా! తావకంబగు నపాంగావలోకంబునకుఁ బాత్రంబైన యీ వన క్షేత్రంబున జంతుసంతానంబున కావంతయేని గొఱంత కుశలంబునం గలుగ దనం దావక సేవకులగు మావంటివారి కయ్యదియచ్చెరువంబనియేమి?

(చిన్నయసూరి నీతిచంద్రిక)

4 ఇంతలోఁ బోరుగాలి యొకటి కొట్టసాఁగఁగా దానికి నిల్వలేక భానుమతి నియమమును విడిచి లేవఁగా నామె చెలి రాజుతో "ఈ గాలిలో నిలుచుట కష్టము, దేవరవారు మారిని మేడమీఁదికి దయచేసిన మేలుగా నుండును" అని మనవి చేసెను. (వేణీసంహారము)

5 నీ ప్రసాదంబున మలయానిలంబు ప్రాపును వసంతంబు సాహాయ్యంబును నిండువెన్నెల చెలిమియుఁగలుగఁ బినాక పాణియగు హరునైన జయింపం జాలుదునని తలంతుం దక్కిన వారు నాకెవ్వరు నెంత యని యుత్సాహంబునం బల్కినం బురందరుఁడు సంకల్పితార్థంబు సఫలంబయ్యెనని యంతరంగంబున సంతోషించుచుఁ గంతున కిట్లనియె.

(హారవిలాసము)

6 వైద్యునింటికిఁబోయి యున్న గౌతముఁ డాయుంగరమును జేత నెత్తికొని పోయి పాతాళ గృహము దగ్గఱ కావలియుండెడు మాధవికకుఁ జూపి "రాణిగారు మాళవికను వకుళావళి కను జెఱలో నుండి విడిచిపెట్టు నట్లుత్తరువు చేసిరి." అని చెప్పెను. (మాళవికాగ్నిమిత్రము)

7 అంతట సీతాకాంత సకాలాలంకృతయై చంచలాక్షు లంచలంబులఁగొల్చి రా నంచయానంబు మిఱి నింప మెయి మెఱుంగులు చూపరుల మోహ తమ్మమ్ములు దీర్ప జలదంబు వెలువడు తటిల్లత విధంబున నంతిపురంబు నుండి యరుదెంచి తనచేతి కమల దామంబు రామకరంబున నమర్చి లజ్జా మోహంబులు బెనఁగొన నంతలోన లోనికిం జనియె.

(శ్రీరామజననము.)

8 అంతట బ్రాహ్మణులెల్లఁ దమసంతతి క్షయించునని భయపడినవారై కలియఁబలికికొని, ఆతని నూరినుండి వెడలఁగొట్ట వలసినదని సిద్ధాంతము చేసికొనిరి. (కథాసరిత్సాగరము.)

9 తరువాత వఱువాతఁ గళావతి యందఱికన్న ముందు మేల్కొని యాతపస్వియున్న గది ద్వారము కడఁజేరి యాతడు మున్నె యాయన లేచి నిత్యకృత్యములఁ దీర్చుకొని జపము సేయుటంగని యదిముగియు వఱకుఁ గళావతి గనిపెట్టుకొని యుండి పిమ్మట నాతనికి నమస్కార మొనర్చి సమయమడిగి తన పూనిక సాంతముగా విన్నవించెను.

(కళావతీ విజయము)

10 రాజా! పూర్వము వయోవృద్ధుండును, గుప్తవ్యాధి బాధిత సర్వావయవుండును వికీర్యమాణ నఖత్వచుండును, మహాహేయ భాజనుండును నధిక కోపనుండును నగు మౌద్గల్యుండను నొక్క మహామునిగలఁడు.

(సుమనో మనోజ్ఞము)

## Synthesis.

మహావాక్యములను, సంశ్లిష్టవాక్యములను, స్వల్పవాక్యములుగా విడఁదీయుటయు స్వల్పవాక్యముల చేరికచేత సంశ్లిష్టవాక్యములను, మహావాక్యముల నేర్పరచుటయు భాషాశైలి నేర్చుకొనువారికిఁ జాల ముఖ్యమగుటచేఁ గొన్ని యుదాహరణలు చూపించుచున్నారము.

## సంశ్లిష్టవాక్యములు.

### 1

"ఇట్లుపోయి పట్టణము చేరినది మొదలు ఆయనకు నాహారము రుచింపక నిద్రరాక యూర్వశిమీఁది చింతయే పెద్దదై రాజ్య వ్యవహారము లొకటియుఁ దోఁపక యున్నందున ఆయన తన స్నేహితునితో తన విరహ బాధ నంతనుం జెప్పుకొనెను. (విక్రమోర్వశీయము)

1 ఇట్లుపోయి పట్టణముచేరెను.

2 అదిమొద లాయన కాహారము రుచింపదయ్యె.

3 నిద్ర రాదయ్యె.

4 ఊర్వశిమీఁది చింతయే పెద్దదయ్యె.

5 రాజ్యవ్యవహారము లొకటియుఁ దోఁపవయ్యెను.

6 అందువలన నాయన తన స్నేహితునితోఁ దన విరహబాధనంతనుం జెప్పు కొనెను.

### 2

"ఇక్కడ రాజును మాణవకుఁడును, ఆపట్టును నంతటను వెదకి చూచియును, అది దొరకనందున మాణవకుఁడు రాజుతలంపు నెట్లయిన వేఱు విషయమునకు మార్చవలయు ననుకొనెను." (విక్రమోర్వశీయము)

1 ఇక్కడ రాజు ఆపట్టును అంతటను వెదకిచూచెను.

2 ఇక్కడ మాణవకుఁడును ఆపట్టు నంతటను వెదకిచూచెను.

3 అది దొరకలేదు.

4 అందువలన మాణవకుఁడు రాజుతలంపు నెట్లయిన మార్చవలయునను కొనెను.

### 3

"నాతండ్రి తపముసేయ మందరగిరికిఁ జనినపుడు సుర లసురలపై దండెత్తి లోకసంతాప నుండయిన హిరణ్యకశిపుఁడు తన పాపముననే చీమలు

దినఁ జెడిపోయెనని పొంగుచు వాసవ పురస్సరులై సురమాటయు వారి కోట్టల కోహటించి యసురులు పుత్రకళత్ర మిత్ర విత్త పశు గృహాదుల విసర్జించి యాత్మత్రాణ పరాయణులై నలుదెసల విచ్చి పరచిరి,"

(భాగవతవచనము)

1 మాతండ్రి తపముసేయ మందరగిరికిఁ జనె,
2 అప్పుడు సుర లసురలపై దండెత్తిరి.
3 లోక సంతాపనుండైన, హిరణ్యకశిపుఁడు దన పాపముసే చీమలు దినఁ జెడియెనని పొంగిరి.
4 వాసవ పురస్సరులై యరిమిరి.
5 అసురులు వారికోట్టల కోహటించిరి.
6 పుత్రకళత్ర మిత్ర విత్త పశు గృహాదుల విసర్జించిరి.
7 ఆత్మత్రాణ పరాయణులైరి.
8 నలుదెసల విచ్చిరి,
9 పరచిరి.

4

పిమ్మట నావృషభము వనములో విచ్చలవిడిగాఁ దిరుగుచు నానాఁడు మంచి పచ్చికమేఁత కడుపార దొరకఁబట్టి లెస్సగా బలిసి యొకనాఁడు పర్వత గుహాలు మాఱుచెలఁగఁ గణిల్లని ఱంకెవేసెను.

(నీతిచంద్రిక)

1 పిమ్మట నావృషభము వనములో విచ్చలవిడిగాఁ దిరుగుచుండెను.
2 నానాఁడు మంచి పచ్చికమేఁత కడుపార దొరకుచుండెను.
3 కాఁబట్టి లెస్సగా బలిసెను.
4 ఒకనాఁడు పర్వతగుహాలు మాఱుచెలఁగఁ గణిల్లని ఱంకెవేసెను.

5

"హరికథా శ్రవణ ప్రసన్న హృదయుఁడైన పరీక్షిన్నరోత్తముఁడు శుకయోగిసత్తమున కిట్లనియె. (భాగవతవచనము).

1 పరీక్షిన్నరోత్తముండు హరికథాశ్రవణ ప్రవణ హృదయుండయ్యె.
2 అతఁడు శుకయోగిసత్తమున కిట్లనియె.

6

"పూర్వము భూలోక భూషణమైన వర్ధమాన నగరమందుఁ బరోప కారియను పేర శత్రునాశకుఁడైన రాజొకఁడుండెను."

(కథాసరిత్సాగరము.)

1 వర్ధమాన నగరము పూర్వము భూలోకభూషణమై యుండెను.
2 అందుఁ బరోపకారి యను పేరుగల రాజుగలఁడు.
3 అతఁడు శత్రునాశకుఁడు.

7

"మాకు విరుద్ధముగాను ధర్మమునకు బాధకముగాను మీరు ఏమి చేసినను దానివలన మీకు వినాశమే కలుగును." (కథాసరిత్సాగరము)
1 మీరేపనిచేసినను మాకు విరుద్ధమగును.
2 అట్లు మీరేపని చేసినను ధర్మమునకు బాధకమగును.
4 దానివలన మీకు వినాశమే కలుగును.

8

"కొన్ని దినము లయినతరువాత ఒకనాఁటి రాత్రి రెండుమూఁడు గడియల ప్రొద్దుపోయి సుందరమ్మకు నొప్పు లారంభమయినవి."

(సత్యవతీచరిత్రము.)

1 కొన్ని దినములైనవి.
2 ఒకనాఁటి రాత్రి రెండు మూఁడు గడియల రాత్రియైనది.
3 సుందరమ్మకు నొప్పు లారంభమయినవి.

9

" ఉసీనర మహారాజొకనాఁడు విద్వాంసు లనేకులు చుట్టును జేరి యుండఁగా సభలోఁ గూరుచుండి విద్యావ్యాసంగము చేయుచున్న సమయ

మందు పండిత మండలాగ్ర గణ్యుఁడయిన విద్యాసముద్రుఁడను బ్రాహ్మణుఁడు రాజానుమతంబున విద్యావిషయమై యీ క్రిందిరీతి నొక యుపన్యాసము చేసెను.” (చంద్రమతీ చరిత్ర)

1 విద్వాంసు లనేకులు ఉసీనర మహారాజునకుఁ జుట్టు జేరియుండిరి.
2 అట్లుండ నాతఁడు సభలోఁ గూర్చుండెను.
3 విద్యావ్యాసంగము చేయుచుండెను.
4 ఆ సమయమందు విద్యాసముద్రుండను బ్రాహ్మణుఁడు రాజానుమతంబు నొందె.
5 ఇతఁడు పండిత మండలాగ్రగణ్యుఁడు.
6 కావున విద్యావిషయమై ఒక యుపన్యాసము చేసెను.
7 అది యీ క్రిందిరీతి నుండెను.

10

“సమయమునకు కట్టుపనివాఁడు వచ్చుట మాణిక్యమున కెంతో యూరటగా నున్నది.”

1 కట్టుపనివాఁడు సమయమునకు వచ్చెను.
2 అది మాణిక్యమునకు నూరటగా నున్నది.
3 ఆ యూరట యెంతయో యైనది.

## Analysis.

I

“తొల్లి నేనీ యాశ్రమర్షులకు బహువర్షంబులు శుశ్రూషయొనర్చ హర్షించి త్రేతాయుగంబున శ్రీహరి దాశరథియై యరుదెంచు నాతని దర్శన స్పర్శనాద్యర్చనల ముక్తురాలవౌదు వంతదనుక నిరీక్షించి యుండుమని వారు బ్రహ్మలోకంబుఁ బొందఁ దత్ప్రకారంబున నేకాగ్రచిత్తనై యిట నుంటి నిప్పటికిం గడగంటినని ప్రస్తుతించి చితిఁ బేర్చి యందు దన శరీరంబుం బ్రతిష్ఠించి రామనామ స్మరణంబొనర్చుచుఁ బరమపద ప్రాప్తింజెందె.”
(శ్రీరామ జననము)

(1) ఇచట "పరమపద ప్రాప్తిఁజెందె" అనునది ప్రధాన వాక్యము. కర్త "ఆమె" అధ్యాహారము.

(2) "తొల్లి నేనీ యాశ్రమస్థులకు బహువర్షంబులు శుశ్రూష యొనర్ప" "ఇప్పటికిం గడఁగంటిన్" అను సమాపకక్రియతో "నేను" అను దానికి సంబంధము. ఇది యనుకృతివాక్యము. ఈ వాక్యములో "శ్రీహరి" యనునది "అరుదెంచున్" అనుదానితో సంబంధము.

(3) "ఓదువు" అను క్రియకు "నీవు" అనునది యధ్యాహారము "ఉండుము" అనుదానికిని నట్లె.

(4) "వారు" అనుదానికి "పొందన్" అనుదానితో సంబంధము.

(5) "ఉంటిన్" అనుదానికి "నేను" అనుదానితో సంబంధము.

(6) "అని" అనుమాట పర్యంతము నిది యనుకృతి వాక్యము.

---

## Exercises.

## సాధకములు.

---

### I

"ఫిండిగారు నాకు బహు విషయములను గూర్చి నీతులను బోధించుచు వచ్చినను చదివి చెడిపోదునేమోయను భీతిచేత నాకు ముఖ్యముగా ప్రతిదినమును తప్పక యెంతో శ్రద్ధతో పత్నీవ్రతధర్మముల నుపదేశించుచుండును" (ఆఁడుమళయాళము)

### II

"భగవంతుఁడగు నారాయణుఁడు మనుష్యరూపము ధరించి ప్రత్యక్షముగ ద్వారకా నగరమునుండి జగముల నేలుచుండఁగనే నావంటి వృద్ధులకు నింతపాటును మనుష్యుల కింతటి చేటును గలుగుచున్నదిగదా" (సౌందర్యతిలక)

## III

" అట్లా సలీముభువన మోహినింగాంచి యామె గాన కళానైపుణ్యమున కానందించిన దాదిగ నన్నపానములయందిచ్ఛలేక కన్నులకునిద్దుర యన నెట్టిదో యెఱుంగక వినోదములనొల్లక యహర్నిశములామెనె తలంచుచుఁ బరితపించుచుండెను." (భువనమోహిని)

## IV

"వంటచేయు విషయమున నిపుణతలేని బాలిక యిట్లు పలువురు సోదరులను తిండిపోతులని దూషించినను వారు మెచ్చుకొనునట్లుగఁ బనులుసేయుటకు మరల మరల మంచి ప్రయత్నములుజేయును." (ఇంగ్లీషువారి సంసార పద్ధతులు.)

## V

"అమ్మహోత్సవంబు తమ కన్నుల నిసుక చల్లినట్లయైన జాడఁ లేక దుర్యోధనాదులగు నచటి రాజులెల్లఁ గోపంబున నలిరేఁగి యీవిప్రుండు తన ధనుర్విద్యా మహత్త్వంబున యంతరింబు సేయుఁగాంచె."

(సుమనోమనోజ్ఞము.)

## VI

"కలావతి వాఁడు బండి గుదుర్చుకొని వచ్చునంతలోఁ దనమంచంబునం దాఁచియున్న మగతాల్పు పుట్టంబులుం దొడవులు గైకొని సోమశర్మతోఁ జెప్పిన చొప్పున మగవేషము వేసుకొని తానంతకుమున్ను ధరించియున్న యాఁడు దాల్పు బుట్టంబులుం దొడవులు నెంచె పదిలపఱచి పయనంబునకు నాయత్తమై వానిరాక కెదురు చూచుచుండెను."

## VII

" అని పలువిధంబుల వ్యధనొందుచు విధిని దూఱుచు నిద్రాహారంబుల మాని మానినీమణి పైవలపు నిలుప రామి వెఱ్ఱివలెం దిరుగుచు సముద్ర తీరంబున నొక రసాల వనంబున నొక యశ్వత్థ మూలంబునం

గూర్చుండి జన్మాంతర సుకృత పరిపాకవశంబునన శరణ్యుండగు శ్రీమన్నా రాయణుని సంస్మరణంబు కల్గుటయుం దదాయత్తచిత్తుండై యిట్లని యతని స్తుతింపం దొడంగె."

## VIII

"అని శుకుండు పలికిననిం బ్రిమోద హృదయులై శౌనకాదులు సూతుం గనుంగొని యయ్యనిరుద్ధుని విహారం బెవ్విధంబున నుండెనటు మీఁదటి వృత్తాంతంబుఁ దేటపఱుపు మనిరెను." (అనిరుద్ధచరిత్ర)

## IX

"అని యనేక ప్రకారంబులం బ్రార్థింప సాచిస్మితలసితంబుగా మొగంబు వాంచి యుక్కించుక భావించి యక్కాంచనగాత్రి గోత్రికళ త్రునితో నిట్లనియె." (శకుంతలా పరిణయము)

## X

"ఈ యరణ్యము మనకు మాన్య క్షేత్రమ? లాంఛిచోటికిం బోంగూడదని నియమమా? మఱి యరణ్యములేదా? అభిజన మెవ్వరికింగాని దుస్త్యజమే.

☞ ఇందలి ప్రధాన వాక్యములును, తక్కిన వాక్యములను విడదీసి యన్వయముల దెల్పుఁడు.

## XI

1 ఈ హయంబులు పవనగతిం బఱచు. (భార)

2 వాక్భూషణమే సుభూషణము. (భర్తృ)

3 వీరభోజ్యము సుమ్మ రాజ్యము. (భార అర 2)

4 బాహుకుండను వాఁ డెవ్వండో (భార. అర 2)

బాహుకుండు విశేష్యము. ఎవ్వండో సర్వనామము.

5 అవివేకి చెడుర (స్వా. 3)

6 వచ్చినవాఁడు ఫల్గునుఁడు. (భార. ఉద్యో అ. 3)

7 అక్రోధనుఁడు కరంబధికుఁడు (భార. అ. 3)
8 మూఁడవవాఁ డెవ్వండు. (భార. అర. అ 2)
9 కొందఱు పిశాచంబని పలిచిరి. (భార. అర. 2)
10 ఇది నలు రథపోషము. (భార. అర. 2)
11 ఇది అమర్త్యుల కవిషయము. (భార. అర. 2)
12 పీ రెవ్వరయ్యా. (భార. అది. 6)
13 మృగాకులోగ్రవనంబుల కరుగనేల. (భార. అర. 2)
14 ఏలావాలాయము సేయ. (స్వా. 3)
15 పీ రితరులఁ గొలువనేటికి. (భార. ఉద్యో. 4) (ప్రౌఢవ్యాకరణము)

☞ ఇఁదలి విశేష్యములను విధేయములను వ్రాయుఁడు.

## XII

☞ ఈ క్రింది వాక్యములలోని విశేష్యములను వ్రాయుఁడు.

'ఆ. దాని విడిచిపోవఁగా నోప కలుచుచు । నంతరిక్షమునను హంసమెల్లఁ । బిందుగట్టి తిరుగుచుండె'

క. "నలుఁడు ధరణీరాజ్యము । దలఁగఁగ సర్వఁబు నపహృతంబైనఁ గడుం । దలరి దమయంతిఁ దోడ్కొని । వెలువడియె నశేషరాజ్య విభవచ్యుతుఁడై.

'మహాయ్యక్కర. నన్ను, నా రాజునకు నెఱిఁగించి 'కరుణ నాయందుఁ గావింపు । మారంగ ననుడు నిషధవిషయమున కరిగియాహంస । వీరసేనజునకు దాని గుణరూప విభవముల్ సెప్పె' (భార. అర. అ 3)

1 వాఁడువచ్చునేని (లేక) వాఁడువచ్చిన పీఁడు వచ్చును.
2 వాఁడువచ్చునేని (లేక) వాఁడువచ్చిన పీఁడు రాఁడు.
3 వాఁడు రాఁడేని పీఁడు రాఁడు.
4 వాఁడు రాఁడేని పీఁడు వచ్చును.

5 నీ వియ్యవేని నే నియ్యను.

6 నీ వియ్యవేని నే నిత్తును.

7 నీ విత్తువేని నే నిత్తును.

8 నీ విత్తువేని నే నియ్యను.

వ. అయ్యిందుఁ గలియుట్లనియె.

గీ. అవనిలోఁ దమయంతీ స్వయంవరంబు । విస్తరిల్లుట విని కడు వేడ్కతోడ । నేను దమయంతిచే వరియింపఁబడుదు । నని తదర్థమై యరిగెద నాసఁ జేసి. (భార. అర. ఆ 2)

“గొంతిసంకటపాటుఁ గోడలిబన్నంబు” (భార. భీష్మ. ఆ. 2)

“దానవేశ్వరునకుఁ దమ్ములకును, (నిర్వ. ఆ. 2)

“అక్కట మందభాగ్యునకు నట్టి తనూనవరత్నమొప్పఁగిన్ దక్క విధాత నిర్దయుఁడై డొండంబడునే, (భాగ. ద్రో. ఆ. 2)

“క. నరకునొనరు సూనవరులను । గురుశక్తిని భీష్మబాహ్లీకులఁ గైకొన రు । ద్ధురత జరాసంధుని వెర । వంగా మెచ్చరు మహోశ వర గర్వమునన్.

(ఉ. హరి. ఆ. 4)

“ఏవాని బంధుమిత్రులు । జీవధనంబులును దప్పఁ జెందుదు గృహులై । నావాని నెన్నఁగాఁదగు,

(భార. శాంతి. ఆ. 1)

“ఉ. ధవళాక్షుల్ చనికాంచి రంతనెదురన్ దత్తీరదేశంబునం దవదాతాంబుజ ఫేనపుంజ నిభు నయ్యశ్వోత్తమున్ దవ్వులన్.

(భార. ఆది. ఆ. 2.)

"తలవణంకుచునుండు తనపితృవరుల" (భార; ఆది. ఆ, 2)

"ఆ. నలునకాని నళినదళనేత్ర వరియింపదట్టై" (భార. అర. ఆ. 2)

"వ. శకున్రిండిదియేమి యెందులకుం బోయెద వని యడిగిన"

(ప్రౌఢవ్యాకరణము) (భార. అర. ఆ. 2)

# CHAPTER XVIII

ఇంతవఱకును జక్కఁగా వ్రాయుటకు వలయు భాషాసామగ్రిని యథోచితముగాఁ దెల్పియుంటిమి. ఇఁక నావిషయములను వ్యాసమునం దెట్లు సులక్షణముగా నుపయోగ పఱుపవలయునో చెప్పెదము.

“సీ. శబ్దసంస్కార మెచ్చటను జాఱఁగనీక
పదమైత్రి యర్థసంపదలఁబొదలఁ
దలపెల్ల నక్లిష్టతను బ్రదీపితముగాఁ
బునరుక్తిదోషంబు గొంతఁబోక
యాకాంక్షితపూర్తి యాచరింపుచును శా
ఖాచంక్రమక్రియ గడపఁ జనక
ప్రకృతార్థభావంబు పాదుకొన నడుపుచు
నుపపత్తియొందు నత్యూర్జితముగ

గీ. లోకటంబూర్వోత్తర విరోధ మొందకుండఁ
దత్తదవయవ వాక్య తాత్పర్యభేద
ములు మహావాక్య తాత్పర్యమునకు నొసరఁ
బలుక నేర్చుట బహుతపః ఫలముగాదె.”

(ప్రభావతీప్రద్యుమ్నము)

## వ్యాసముల రచన

1 చెప్పవలయు నంశములు ఎదుటివారికి బోధపడునట్టి సులభశైలిని చెప్పాలి.
2 ఆ చెప్పునది యథాస్థితముగా సరళశబ్దములతోఁ జెప్పుట.
3 ముఖ్యాంశము తప్పఁబడిపోవునట్లు, అనావశ్యక గ్రంథముఁ బెంచక. సంగ్రహముగ నంశమును దెల్లము సేయుట.

4 చెప్పెడు సంశమును ఇంపుగా దేశకాల వ్యవహారముల ననుసరించి మన సున్న విషయాంతరములు నాటుకొని యభివృద్ధి యగునట్లుగాఁ జెప్పుట.

5 విషయము కప్పఁబడునట్లు గాక యాయాస్థలముల కనుకూలమగునంత శబ్దాలంకారము కలిగియుండునట్లు చెప్పుట.

6 చెప్పెడు సంశమును సయుక్తికమగు నూహాలతో బుద్ధివికసనమునకుఁ దోడ్పడునట్లు చెప్పుట. ఇవి ముఖ్యాంగములు.

చెప్పవలయు సంశమును, ఎదుటివారికి బోధపడునట్టి సులభశైలినిఁ జెప్పుట మిక్కిలి ముఖ్యము.

ఇతరులకుఁ దాను జెప్పుసంశము బోధపడకుండె నేనిఁ జెప్పినదంతయు వ్యర్థము

వినువాఁడు నిర్లక్ష్యముగా నున్నను అయస్కాంత మినుము నాకర్షించినట్లు హృదయ కుహరముంజొచ్చి వానిని విషయాభిముఖునిఁ జేయు నట్లుగా నుపన్యసింపవలెను.

దీపముచే వస్తువు వెల్లడిగాఁ గాన్పించునట్లు చక్కని శబ్దార్థములచే వక్తవ్యాంశము తేట తెల్లముగాఁ దెలియ వలయును.

ఈవిధముగాఁ జెప్పుటకుఁ గొన్ని ప్రక్రియలుకలవు.

1 క్లిష్టము పనికిరాదు.

క్లిష్టమనఁగా—(a) అప్రసిద్ధ అప్రయోగములు. ఉదా—బుభు విభుండౌ లేఖ సభామధ్యంబున భాసిల్లుమాడ్కి.

(b) దీర్ఘ వాక్య ప్రయోగములు.

(c) ఒకవాక్యముఁ జెప్పుచు నది పూర్తిగాకుండ మఱియొక వాక్యమారంభించుట.

(d) ఒక యంశమునకు శాఖగా మఱియొక యంశమును దానికి శాఖగా నింకొక యంశమును జెప్పుచు ముఖ్యాంశమును వెనుక కణఁగఁ ద్రొక్కుట.

(e) కావలసిన శబ్దములేవో యవియే కాక మఱికొన్ని యనావశ్యక శబ్దములు ప్రయోగించుట.

(f) వాక్యములకు దూరాన్వయము కలిగియుండుట.

(g) అతి సంగ్రహము చేయుట.

ఇవి పనికిరావు.

శబ్దములు సందేహార్థములగునట్లు ప్రయోగించకూడదు. సందిగ్ధాన్వయములు పనికిరావు.

1

ఉదా— ఒక గృహమునందు వాసముచేయువాఁడు తనయింటి కెన్నిగదులున్నవో, ఏయే గది కెన్నెన్ని ద్వారములున్నవో, అవి యెందెందుకు నుపయోగపడుచున్నవో, ఎఱుఁగని పక్షమున అట్టివారిని జూచి యెల్లవారును నవ్వుదురుగదా? అప్రకారముగానే మనయాత్మ సదా వాసముచేయు శరీరగృహమునుగూర్చి మనకేమియు తెలియకపోవుటకంటె పరిహాసాస్పదమయిన సంగతి మఱి యేముండును? కాఁబట్టి బుద్ధిమంతుఁడగు వాఁడు బాహ్యప్రపంచమును గుఱించి తెలిసికొనఁ బ్రయత్నించుటకంటె ముందుగా తన్ను తా నెఱుఁగుటకయి ప్రయత్నపడవలయును.

2

తనయింట నిత్యము జరుగుచుండెడు సంగతులను దెలిసికొనఁజాలని వాఁడు దేశాంతరముల యందలి విషయములను గ్రహించుటకయి చేయు కృషి యే బుద్ధిమంతుఁడు మెచ్చఁదగినదిగా నుండును? మనదేహము ఉపాశయముల యందు మనము వాసముచేయు గృహమును బోలియుండును.

3

స్తంభములు, దూలములు, వాసములు మొదలైనవి గృహము దృఢముగా నిలచుట కాధారముగా నున్నట్లే, శరీరము దృఢముగానుండి తత్తద్వ్యాపారములకు చక్కఁగా ఉపయోగించుటకు పలువిధములైన యెముకలాధారముగా నున్నవి. పయి చర్మము గృహముయొక్క కప్పును పోలియుండును. స్వేదనాళములు మఱికినీరు పయికి ప్రవహించుట కనుకూల కనకూలఁపడు తూము కాల్వవలెనుండును, కన్నులద్దములతోఁజేసిన గవాక్షములవంటివిగా నుండును. ఈ విధముగానే శరీరమునందలి యితరావయవము లనేకములు మఱికొన్ని గృహోపకరణముల పోలికను కలిగియుండును, కాని శరీరావయవములకును గృహసాధనములకును మితిమీఱిన వ్యత్యాసము కలదు. ఇంటిగోడలు మొదలయిన వాని వలెఁగాక శరీరము యొక్క యొక్కొక్క యవయవ మెన్నెన్ని విచిత్రములైన పనులకో యుపయోగపడును. ఒక్క యవయవములే యననేల ? ఒకచోట స్థిరముగానుండు గృహమువలెఁగాక మనదేహమంతయు మనసువచ్చినట్లు సర్వత్ర సంచరించు విచిత్రశక్తికలదిగా నున్నది. అంతేకాక గృహములను పరిశుద్ధముచేయుట మొదలైన పనులయందువలె మనము పాటుపడవలసిన యావశ్యకతేమియు లేక తమంతనే వివిధవ్యాపారములను నెఱవేర్చు యంత్రములు దేహమునిండ అత్యద్భుతముగా అమర్పఁబడియున్నవి.

4

మనము చూచెడి ఆవిరి యంత్రములు క్రమముగా పనిచేయుటకై జలమును, బొగ్గులను, సమకూర్పవలసినట్లే జఠరాగ్ని సాహాయ్యముచే ఉష్ణత్వము పొంది సమస్తావయవములును ఒకేవ్ధములై దేహయంత్రము తిన్నగా పనిచేయు నిమిత్తము యుక్తకాలమందు మనమాహారోదకములను మాత్రము సమకూర్చుచుండవలయును. మానవ దేహమను దివ్య యంత్రముయొక్క నిర్మాణకౌశలమును వ్యాపారచమత్కారమును తెలిసి

కొనుట హృదయమున కింతంతనరాని యాహ్లాదకరముగాను వినోదకరముగాను ఉండును గనుక ముందుగా శరీరనిర్మాణమును గూర్చిన ముఖ్యాంశములను వివరించుచున్నాను. (శారీరశాస్త్ర సంగ్రహము.)

2

చెప్పునది యథాస్థితముగా సరళశబ్దములతోఁ జెప్పుట.

రూఢములయిన శబ్దములను బ్రయోగింపవలెను. వెటుకుగా మంచి మాటలతో సహజముగాని శైలికై ప్రయత్నింపఁ గూడదు.

పుడమివల్లభు కొడుకు తోఁబుట్టువునాలుగా నున్నవాఁడని విష్ణువునకు దూరదూరముగా నర్థములుగల చుట్టుతిరుగుడు మాటలను ప్రయోగించగూడదు.

అప్రసిద్ధములగు విశేషములతో గుణవిశేషమును వర్ణించుట పాడిగాదు.

ఉదా—శత్రురాజుల నెల్లఁ దునుమాడె నతఁడు.

ఇచటఁ బరశురాముఁడని చెప్పుటకు నీశబ్దము చాలి యుండలేదు.

చిన్నచిన్న పదములతో స్వల్పవాక్యములను గూర్చవలెను.

ఒకనియందొక గుణము లేకపోవచ్చునేమోయని మనసునకుఁ దోఁచు నపుడా గుణమున్నదని వ్యక్తపరచుటకై రెండు నఞ్యులు (నిషేధములు) చేయవచ్చును.

ఉదా—రాముఁడు శౌర్యశాలి కాఁడు కాకపోలేదు,

ఇట్టిచోటఁ దప్పఁ దక్కినచోట్ల నెల్ల రెండు నిషేధములను వ్రాయఁ గూడదు,

---

సరళశబ్దములతోఁ జెప్పుట.

---

1

ఉదా—చోళమండలమునకు రాజధాని యయిన కాంచీనగరమందు కాంచనవర్మయను పేరుగల మహాధనికుఁడయిన క్షత్రియుఁడొకఁడు గలఁడు.

ఆతని పెద్దకూఁతురు గౌరీదేవి. ఆమె మిక్కిలి కోపస్వభావముకలదియగుట తిట్టుఁబోతును నయినందున కాంచీపురమునందలి వారందఱును ఆమెకు గయ్యాళిగౌరీదేవియని పేరు పెట్టిరి. ఆమెను వివాహమాడుటకయి రాజపుత్రులనేకులు కాంచీపురమునకు వచ్చియు, ప్రజలవలన నామె గయ్యాళితనమును విని యామెను చేపట్ట సాహసింపక తాము వచ్చినదారినే మరల తమతమ పురములకుఁ బోవుచు వచ్చిరి.

2

అందుచే నామెను వివాహమాడునంత శాత్త్రిముగల పురుషుఁడు ప్రపంచములో దొరకునాయని యెల్లవారును సంశయపడుచుండిరి. అయినను కాంచనవర్మ మాత్రము తన పెద్దకుమార్తె పెండ్లిచేయునిదే రెండవ కొమార్తె పెండ్లి చేయునని నియమముచేసికొని, పద్మావతియొక్క గుణసంపదను విని యామెను పాణిగ్రహణము చేసికొనుటకై యెటువంటి గొప్పయింటి రాచకొమాళ్లు వచ్చినను వారి కెవ్వరికిని కూఁతు నియ్యక నిరాకరించుచుండెను. అందుచేత బంధువు లందఱును పెద్దకుమార్తె నిమిత్తమై చిన్నకుమార్తెను చెఱఁగొట్టుచున్నాఁడని యాతని నిందింప మొదలుపెట్టిరి.

3

ఇట్లు కొంతకాలము జరిగినపిమ్మట వివాహమునిమిత్తమై రుద్రమూర్తియను రాజకుమారుఁడు కాంచీపురమునకు వచ్చి అక్కడ గౌరీదేవియొక్క గుణ మహిమను పౌరులవలన పూర్ణముగావినియు నెంతమాత్రమును వెనుక తియక యామె సౌందర్యమును ధనమును ఆశించి యామెను వివాహమై శాంతాత్మురాలును పరమసాధ్వియు నైన భార్యనుగా దిద్దుకొనుటకై నిశ్చయించుకొనెను.

4

అటువంటి అసాధ్యమైన పనిని నిర్వహింపఁ బూనుటకు సమర్థుడాతనితోసమానుఁడు మఱియొకఁ డుండఁడు. ఆతఁడు మిక్కిలి ధైర్యసైర్యములు గలవాఁడు. అనన్య సామాన్యమయిన బుద్ధికౌశలమును, వాక్చాతుర్యమును గల

వాఁడు. నిజముగా మనస్సులో నణుమాత్రమును కోపములేనప్పుడు పయికిఁ గొండంత కోపమున్నట్లభినయించుటకును, మనస్సంతయు క్రోధమయమయి యున్నప్పుడు పయికి పరమశాంతభావమును గనఁబఱచుటకును లోకములో నాతనిని మించిన వాఁడు మఱియొకఁడుండఁడు.

5

అతఁడు సహజముగా తన్నుఁగూర్చి యితరు లెంద ఱేమనుకొన్నను తన కేమి కష్టములు వచ్చినను లక్ష్యపెట్టని స్వభావము గలవాఁడు. అతఁడు గౌరీదేవిని వివాహమాడిన తరువాత తా నామెను వశపఱచుకొని సాధు చేయుటకయి వేఱుమార్గము లేదని కనిపెట్టి యాకార వికారముల చేతను మాటలచేతను చేష్టలచేతను దూర్వాసుని మించిన యతికోపశీలునివలె నటింపసాగెను.

6

రుద్రమూర్తి మొట్టమొదట కాంచనవర్మ యొద్దకుపోయి తన కుల గోత్రనామములు తెలుపుకొని, అతనితో "నీకొమార్తె యయిన గౌరీదేవి యొక్క శాంతస్వభావమును వినయవిధేయతలను విని యామెను వరించు తలఁపుతో మధురాపురమునుండి వచ్చితి" నని చెప్పెను.

(గయ్యాళిని సాధుచేయుట)

3

ముఖ్యాంశము కప్పఁబడిపోవునట్లు అనావశ్యక గ్రంథముఁ బెంచక సంగ్రహముగా నంశమును దెల్లముచేయుట.

1 అభిప్రాయమును సంగ్రహముగాఁ జెప్పిన పక్షమున నక్కఱలేని మాటలను గూర్చుటకుఁ బడు శ్రమ తగ్గుటయేగాక యంశము మనస్సునకుఁ ద్యోతకముగాఁ బోధపడును. గ్రంథము పెంచినందువలన ముఖ్యాంశము సందేహములోఁబడి జ్ఞాపక ముంచుకొనవలసిన మాటలు మఱపువచ్చును.

2 ఎక్కువ యర్థమును దక్కువమాటలలో నిముడ్చుట రచనా ప్రాగల్భ్యమును సూచించును. సంగ్రహమనఁగా నభిప్రాయమును దగ్గించుటకాదు. శబ్దజాలమును తగ్గించుట.

3 దేశీయములయందును, లోకోక్తులయందును, న్యాయముల యందును నీ సంగ్రహము కాన్పించుచున్నది.

ఉదా—అయ్యా! కృష్ణుఁడనగా నెవ్వరో మీ రెఱుఁగుదురా ? నే నాతనినిఁ జెప్పుచున్నానని వినుఁడు.

అనునీవాక్యము — "కృష్ణునిఁజెప్పెద" అను వాక్యములో నిమిడిన యర్థముగలదై యున్నది గావున నిట్లు చెప్పవలెను.

ఉదా—దశరథుఁడను భూతలాధిపతికిఁ బుత్త్రుఁడగు రాముఁడు అని జెప్పుటకు మారుగా దాశరథియని చెప్పినఁజాలు.

4 అనావశ్యకములగు విశేషణములును, ప్రస్తుతానుకూలము గాని వర్ణనలు తగ్గించుటవలన సంగ్రహ మేర్పడును.

5 తద్ధితవృత్తి, కృద్వృత్తి, సమాసవృత్తి, సనాద్యంతధాతువృత్తి, ఏకశేషవృత్తి, అనువాని నుపయోగించుటచే సంగ్రహ మేర్పడును.

6 శబ్దాలంకారమును దగ్గించుటవలన సంగ్రహ మేర్పడును.

ఉదా—ధనుర్బాణములఁ గైకొని తిరుగు రామలక్ష్మణులఁజూచి బెగ్గిలొంది సుగ్రీవుఁడు దన మంత్రులఁజూచి "వీరు వాలిపంపునఁ గపటమునులై శస్త్రాస్త్రములతో నీవనమునఁ దిరుగుచున్నవారు" అన విని యెల్లరును భీతిచే నందుండ వెడలి వనాంతరమునకుఁ బోయిరి.

పిదప నా సుగ్రీవుని మంత్రులు వనమంతుని ముందిడుకొని చేతులు జోడించియుండ నాతఁడా సుగ్రీవుఁజూచి "వీరు వాలిపంపున రాలేదు—

ఇట్టిపని వాలిసేయఁడు. నీవు క్రోధితవగుటను వివేకముచెడి యిట్లు భయపడు చున్నావు" అను హనుమంతుని "ఇట్లు వచ్చిన వీరిఁ జూచి భయము పుట్టకుండునా? వీరల వాలియే పంపినట్లు తోఁచెడిని, రాజు లెట్టివారైనఁ బగఱఁ జంపనెంతురు. ప్రచ్ఛన్నులఁ జారులచేఁ దెలియఁదగు. వారల నే నమ్మను. నీవుపోయి సంగతిఁ దెలిసికొని నిజము మునులైనచో మంచిగఁ దీసికొని రమ్ము." అన విని యాంజనేయుండు బ్రహ్మచారి వేషమున వారి కడకేగి యిట్లనియె.

"అయ్యా! యిట్టి మీరీ యడవిలోఁ గోతుల భయపెట్టుచు దిరుగుటకు గతంబేమి? మీ చేతులలోఁ గత్తు లమ్ములున్నవి యున్నవి. మీరు మునిరూపుఁదాల్చి వచ్చిన నరనారాయణులా? ఇంద్రవరుణులా? చంద్రసూర్యులా? ఇట్టి మీరు భూమియంతయు నేలుటకుఁ దగుదురుగదా! ఇట్లు నారచీరలు గట్టనేల? వాలిభయంబున సుగ్రీవుఁడు ఋశ్యమూకంబుపై నుండి మీతో సఖ్యముకై పంపఁగా. గార్యవశంబున మారువేషంబుతో వచ్చితిని, వానిమంత్రిని. నా పేరు హనుమంతుఁడు. మీరెవ్వరో చెప్పుఁడు."

అన రామునియాజ్ఞచే లక్ష్మణుఁడిట్లనియె. ఆయన దశరథుని పెద్దకొడుకు. రాముఁడు. నాకన్న. పితృవాక్య పరిపాలనకై యడవికి రాఁ మేము లేనితరి రక్కసుఁడొక్కఁడు తని భార్యయగు సీతను గొనిపోయెను. వానింగానక వెదకుచుండఁ దోవలో వనువగువాఁడు సుగ్రీవు వలన నీ సంగతి తెలియు నని దివికేఁగె. మేము సుగ్రీవునితోఁ జెల్మికై వచ్చితిమి. అక్కటా! సీతవలన నెట్టి రాజున కెట్టియిక్కట్టు వచ్చినది! నా పేరు లక్ష్మణుఁడు. మాయన్న వెంటనే నేను మునినై వచ్చితిని. అనవిని వాయుపుత్త్రుఁడిట్లనియెను.

"మీకును సుగ్రీవునకును వేగమె చెలిమి యగు. సీతన్ సాధింపఁగలరు." అన లక్ష్మణుఁడన్నం జూచి "ఈతఁడు మనమాటలు సావధానముగ వినుచుండెను గావున సఖ్యంబగు"ననఁగా రాముఁడు "మేము సూర్యకులీనులము. తాను

కార్యకారుఁడవు. కావునఁ జెలిమి సేయఁదగు"నన విని యాంజనేయుఁడు వారిం దోడ్కొనిపోయి సుగ్రీవునితో వారి వృత్తాంతముఁ జెప్పిన సంతసించి శ్రీరాముని సన్నిధిం జేతులుజోడించి "శ్రీరామా! నీగుణాతిశయ మిా మారుతివలన వింటిని. నీతో,జెల్మి సేయ బుద్ధిపుట్టుచున్నయది" అని చెప్పి చేతిలోఁ జేయుంచి యన్యోన్యాలింగన మాచరింపుడు వాయుసుతుఁడగ్నిం బ్రజ్వరిల్లం జేయ వారిద్దరు నగ్నిసాక్షికముగఁ జెల్మిచేసికొనిరి.

పిమ్మట సంతోషించుచు రామునిఁజూచి "సీతయెందున్నను దెచ్చి యిచ్చెద విచారింపకు" మని యోదార్చి రావణుఁడు గొనిపోవునప్పుడు సీత పైటచెంగునఁ గట్టివైచిన యాభరణములు గుహనుండి తెచ్చి యెదుటఁ బెట్టుడు వానిఁ జూచి రాముడు దుఃఖభరంబున మూర్ఛిల్లి మెల్లఁగఁ దెలివొంది యా తొడవులు పలుమారుఁజూచుచు నామె పైఁటచెంగును జూచి విచారించుచు నామెం దలంచుచుండఁ దస్మయత్వ మొందుడు నామెయెదుట నన్నెట్లు వగచుచుఁ బట్టఁజాలని కోపంబున "సీతం గొనిపోయిన రాక్షసుం డెందుండెనో? చెప్పుమిప్పుడచంపెద" నన సుగ్రీవుఁడు "జనవరా! స్నేహమున విన్నవించు చున్నాను. సర్వానర్థములకు మూలమగు శోకమును విడిచి శాంతి వహింపుము. నీకు వలసినసాయ మొనరించెద"నని పలుకఁ గన్నీరు తుడిచికొని "సుగ్రీవా! యిట్టిసమయమున నినుఁబోలిన మిత్రుఁడు గలఁడా? నీమాటలచే దుఃఖమును విడిచితిని. నెమ్మదిగ నుంటిని. నీవెద్ద కోరిన వైరకర్తను. సీతనెట్లు వెదకుదము? రావణునెట్లు చంపుదము?" అని యడుగ సంతసమున నా సుగ్రీవుండిట్లను.

"మనమిరువురముం గలసినచో నింద్రపదమైన నవలీలం గొనఁగలము. మన శత్రువుల మనము తెచ్చుకొనుట యేమిగొప్ప! నీ చెల్మిచే సర్వాదరణీయుఁడ వైరి వాసంగతి నే జెప్పఁదగదు. లోకులవలన వినియెదుగాక. మీవంటివారి చెల్మి నిశ్చలమైనది గదా! యెట్టివారికిని మిత్రుఁడే పరమగతి.

వానిని పెద్దలు సర్వము స్వీకుతురు" అని దగ్గరనున్నయొక చెట్టుకొమ్మం దెచ్చి దానిపై రాముండును దామను హనుమంతుఁడు తెచ్చిన కొమ్మపై లక్ష్మణుండును గూర్చుండియుండ సుగ్రీవుండిట్లనియె."

వాలి నాప్రియురాలి నపహరించి నన్నూరకుండి గెంటిన భయపడుచు నీ ఋష్యమూకంబున నున్నాఁడను. దిక్కుమాలినవాఁడను నన్ను రక్షింపు" అనుచు దీనతతో విన్నవింప విని "ఓయీ భయంకరంబులగు నా యీ బాణంబులచే వాలినింజంపెద" ననఁగా "వాలి కడు బలవంతుఁడు ఉపాయశాలి. మున్ను తనిచేఁ జచ్చిన యీ దుందుభి కళేబరంబుం జూడుము. వాలియు నేనుదక్క దీని నొరులెత్తగలరె? అట్టివానికిఁ గోపము వచ్చెనేని సర్వమున్ సంహరించును. కాఁబట్టి వాఁడు యుద్ధమునకు రాకుండఁగనె యొక్కబాణముచేఁ జంపుమని చెప్పఁగా నవ్వి లక్ష్మణుండు "మేమేమిచేసిన నమ్మెద" నన సుగ్రీవుండిట్లనియె.

"వాలి యీయేఁడు సాలంబుల కొక్కమారుఁగట్టి యాకులు రాల్చును, ఈ రాముఁడొక్కబాణముచే వీనింగూల నేసిన నమ్మెద" ననుచు దుఃఖమాపఁజాలక "శ్రీరామచంద్రా? ప్రియురాలిం గోలుపోయి తద్వియోగాగ్నిచేఁ గాలుచు దుఃఖించుచున్నాను, నీవే నాకుదిక్కు. మనమగ్ని సాక్షికముగఁ జేసిన సఖ్యమాలోచించి నా దుఃఖమును బోఁగొట్టుము. దుఃఖాతిశయమ్మునన్ దోఁచినయట్లు పలుకుచున్నాఁడ" ననుచుఁ గన్నుల నీరు గ్రమ్మ మనంబు చంచలమగుడు నిశ్చేష్టుఁడై యూరకుండెను.

(కిష్కింధా కాండ-సంగ్రహము)

చెప్పెడు నంశమును ఇంపుగా దేశకాల వ్యవహారముల ననుసరించి మనస్సున విషయాంకురములు నాటుకొని యభివృద్ధియగునట్లుగాఁ జెప్పుట.

1 వక్తవ్యాంశము నందలి ముఖ్య విషయములను బ్రస్ఫుటముగా నొక్కి చెప్పవలయును.

2 ఒక యంశమును జెప్పునప్పుడు ముఖ్యాంశములు కలిసియుండును. అందు ముఖ్యాంశములకుఁ బ్రాధాన్య వివక్ష కనఁబడునట్లు వ్రాయవలయును.

3 ప్రచుర పత్రికలను అచ్చువేయునప్పుడు ముఖ్యాంశములను బెద్దయక్షరములతో, రంగులతోఁ జేతివ్రాతలతో వేయుట మున్నగువానిచే బ్రధానాంశము వెల్లడిచేయఁ బడుటయు, నుపన్యాసములు చెప్పు నప్పుడు ధ్వనిమార్చుట యభినయము మొదలగునవియు, జరుగును. ఇఁక వ్రాయు నప్పుడట్టి యాధారము లెవ్వియు లేవు. మాటలయొక్క బలమును బట్టియు నవి వాక్యమందుంచఁబడు స్థలమును బట్టియు నుపమానములం బట్టియుఁ వ్యతిరేకములను నిషేధించుటం బట్టియు, ఇది ముఖ్యాంశమని మరల మరలఁ జెప్పుటంబట్టియుఁ బ్రధానాంశము వెల్లడియగును.

మాటలబలము

ఉదా— విద్య నరులకు దాచిపెట్టిన ధనము, విద్యయే చక్కని రూపు, విద్యయే లక్ష్మి, విద్యయే కీర్తి, విద్యయే భోగ భాగ్య సుఖకారిణి, ఇదియే గురుకోటికి మహాగురువు, విద్య విదేశ బంధువు, విద్యయే దైవము, దీనివలననే రాజవశ్యము గలుగును, ఇదియే తరణోపాయము, ఇది లేనివాఁడు మనుజుఁడు పశువగును.

శబ్దములు వాక్యములయందుంచుట.

ఉదా— "తరచికదా సురాసుర వితానము గాంచిరి సంద్రమందు సుందరతర వస్తుసంతతులఁ, దప్తముజేయఁగ దావెలుంగు బంగరువున వన్నెబుట్టెడును గాదె దధిన్మధియింప వెన్న యాకరణి విమర్శనంబునన కావ్యవిశేషము లుద్భవిల్లెడిన్."

(కా. బ్రహ్మయ్యశాస్త్రి)

## ఉపమానము.

---

ఉదా— మిత్రులారా! నేఁడు నీరాక యిష్టదేవతాదర్శనంబు లభియించినట్లును, పర్వదినంబు చేకూరినట్లుగను, చిరకాల కాంక్షితంబగు సర్థంబు సిద్ధించినట్లు, నష్టద్రవ్యము తిరుగ లభించిన చందంబునను మనంబున కత్యానందంబు గుంధించుచుండె.

---

## వ్యతిరేక నిషేధము.

---

ఉదా— భూషలుగావు మర్త్యులకు భూరిమయాంగద తారహారముల్
భూషిత కేశపాశ మృదుపుష్ప సుగంధ జలాభిషేకముల్
భూషలుగావు పూరుషుని భూషితుఁజేయుఁ బవిత్రవాణి వా
గ్భూషణమే సుభూషణము, భూషణముల్నశియించు నన్నియున్

4 యచ్ఛబ్దతచ్ఛబ్దాన్వయము, మాత్రము, వినా, నిశ్చయముగా, వాస్తవముగా అను నీశబ్దములను ప్రయోగించుటచేత ముఖ్యాంశము ప్రకటమగును.

5 ఉపసంహార వాక్యము ముఖ్యాంశముతోఁ గూడియుండవలయును. అనఁగా ఫలితార్థమును చివరఁ జెప్పుచుండవలెను.

6 వాక్యమందేయే ధర్మములు చెప్పఁబడు వాని వ్యతిరేకములను గూడఁ జెప్పి నిషేధించి పునరుద్ధారణము ; చేయుచుండవలెను.

ఉదా— "చతురమతిప్రసిద్ధియును, వచఃపరిశుద్ధి ప్రబంధవర్ధన
స్థితికలనాసమృద్ధి, రససిద్ధియుఁగాంచి యగణ్యపుణ్యభా
గతులిత కీర్తిదేహధరులై సుకవీశ్వరులెయ్యెడన్ జరా
మృతి జనితోగ్రభీతులు సహింపక యిప్పుడు నున్నవారలన్"

ఉదా— "అలాకణ్యం పగణ్యం వా వీర్యం బనిర్వాచ్యంబు"

7 మాధుర్యము, సమత, ఔదార్యము, సమాధి, మున్నగు కావ్యగుణముల వలనఁ గూడ ముఖ్యాంశము తెలియును.

8 లోకోక్తుల నుపయోగించుటవలనఁ గూడ భావప్రకటనమగును.

ఉదా— "గడచినదానికై చింతించుట గతజలసేతుబంధనము"

9 ఆశ్చర్యార్థకములు సంతాపార్థకములు ప్రయోగించుటవలనఁ గూడ భావ ప్రకటనమగును.

ఉదా—ఎకెట్టా! ఇట్టులగునా? ఏమి యీ యన్యాయము?

1 "శా. ఎట్టాయిట్టగునయ్య పెక్కుదయలే కిన్నాళ్ళునీకూడె యీ
పొట్టంజెట్టి మహోఘశుద్ధిఁ దనువుంబోషించి యిన్నాళ్ళకే
యిట్టే నొక్కతపస్వి యొక్కప్రతి రాఁడే చూడఁడే తత్కృపన్
బట్టున్నిద్ర దీనినా నొదవి యో పుణ్యాత్మయెట్లుంటివే"

(ఆముక్తమాల్యద)

2 ఉ— "నీమోవి చిగురుతేనియలు గ్రోలెడియాస
నీమొలకనవ్వు వెన్నెల చలువగొను నాస
నీమృదుకపోలసన్నిధిని మోమిడు నాస
నీమోహనశ్రోణి నిమురఁ గలిగెడు నాస
నీదుపాలిండ్ల నానెడు వతుమను నాస
నీదుశృంగారకళ కెలవులంటెడియాస
నీదుమణితామృతము నింతుఁ జెవి నను నాస
నీదు లలితోరువు ల్నెమ్మినొత్తెడు నాస
నొడలిలోఁ బ్రాణవాయువులు నాకిందాక
వెడలకుండఁగ నిట్లు విన్నవించెదఁ గాక."

(ప్రభావతీ ప్రద్యుమ్నము.)

3 ఉదా— "సీ. అయింతిఁ బ్రద్యుమ్న జాయఁగా బలికిన
గౌరిమాటకు బొంకు గలుగదనుము

దనుజ విరోధిపుత్త్రునకు నాదుష్ట దై
త్యుఁడు తనంతఁ దనూజ నొసఁగఁడనుము
ప్రద్యుమ్నుఁ డెట్లు ప్రభావతిపతియైన
దా నవునకుఁ బోరు తప్పదనుము
వజ్రపురము ప్రభావతికొడు కేలుట
యసురకు జయమైనఁ బొసఁగ దనుము

గీ, చిత్రఫలకంబు ప్రత్యక్షసిద్ధము గుటఁ
జేసియాశల యధికవిశ్వాసయోగ్య
మదియు వేసవగావున నచిరభావి
ఫలము దేవేంద్ర నీవెంచి తెలిసికొనుము.

(ప్రభావతీ ప్రద్యుమ్నము.)

4 ఉదా—ఓరాజోత్తమా ! నీవెన్ని నుడివిన నేమి ! ఆ వేల్పు లెండ్లక పలికిన పలుకులన్నియుఁ దామరాకునం బోసిన జల బిందువుల వలె నామనంబున నార్తవయ్యె. వారలు లోకాధిపతులైన నేమి ? లోకాధిపతుల కధిపతులైన నేమి ? నామనంబు వారిపైఁజో రదనుము. రుచిర పదార్థములైనను గొందరికింగొన్ని రుచింపవుగదా. వేయేల కడ నుడువు వినుము. నీవు నాయందు దయగలదేని నాపాణి నీపాణింజేర్చి ముద మొందంజేయుము. లేనిచో నీదారి నీవేగుము. నన్నటుపై దైవమెట్లు సేయనున్నదో యట్లగుంగాక. నాకుంగల పూర్వకృత సుకృతముఫలించె నేని దాని మరల్చుటకు అసురలయినం జాలరుగదా.

విషయము కప్పఁబడునట్లుగాక యాయాస్థలముల కను కూలమగు నంత శబ్దాలంకారము కలిగియుండునట్లు చెప్పుట.

1 చెవుల కింపుగానుండు శబ్దములను బ్రయోగించుటవలనను క్లిష్టములను బరిత్యజించుటవలనను రసానుగుణమగు శబ్దములవృత్తులు ప్రయోగించుట వలనను యిది నిర్వహింపఁబడును.

1 ఉదా:— ఓరోరీ! నీ యట్టి జగజెట్టిలేఁడని మిట్టిపడఁబోకు, మహా భయంకరాస్మదీయ బాహుబంధ నిష్పిష్టనిఖిల గాత్రుండవై పేరు నూరు నడంగి పోయెదవు రారమ్ము, వెనుదీయకుము. ఇటు వైఁగడంగవలయునది బాహుయుద్ధముగాని వాగ్యుద్ధముగాదు. ఇందులకు నీకు బెదరొదవెనేని సర్వావయవంబులు బుడమిం దాక సాష్టాంగ దండప్రణామంబు నొనరించి యోహరిల్లుము.

2 ఉదా:— "ఆ కాలంబున జరత్కారుండను నిరాహారి యొక్కరుండు గలఁడు. అతఁడు సంసారం బసారంబని దారపరిగ్రహంబు సేయక బ్రహ్మ చారియయి నానారణ్యంబులఁ గ్రుమ్మరువాఁడొక్క యిరవున నవ్రుగు గంటునంటి యధోముఖులై వ్రేలుచున్న కొందఱు విప్రుల గాంచి వారి కిట్లనియె. తాపసులారా! ఈ తపంబు మహోగ్రంబు. మిమ్ముఁ జూచి నప్పటినుండియు నాకిది యాచరింపం దలంపుపుట్టెను. నన్ను మీవానిఁగా భావించి దీని కలరూపుఁ దెలిపి పుణ్యాంబునం బొందుము.

(సుమనోమనోజ్ఞము.)

చెప్పెడు నంశమును సయుక్తికముగు నూహాలతో బుద్ధివికసమునకుఁ దోవ జూపునట్లు చెప్పుట.

1. గుణాదివర్ణనమువలనఁ దదాధారములగు నవయవాదులు కన్నులకుఁ గట్టి నట్లుగా వర్ణించవలెను.

1 ఉదా:— 'కలకల నవ్వినట్లు తెలికన్నుల నిక్కము చూచినట్లు తోఁ బలుకఁ గడంగినట్లు కడుభావగంభీరతలబ్బినట్లు వెం। పొలయుఁదనర్చి జీవ కళ యుట్టిపడన్ శివవ్రాసినట్టి యా। చెలువున కాభిముఖ్యము భజింప దలంకెను దాను బోఁటియున్.

(ప్రభావతీ ప్రద్యుమ్నము.)

2 ఉదా:— 'పయ్యెదచెంగు వెన్నెలపై నొక యించుక జీరుకాఁగా వెయ్యపుబోఁటు లియ్యరటు నిద్ధపుఁదీవలఁ జూపుచుండఁగా। నొయ్యనఁ

గొప్పవీడ నొక రొరకు మాటికిఁ జేతదిద్దుచుం దొయ్యలి మృద్వియయ్యెఁ
మఱుతూఁపయి డెందము దాఁకఁ గొబ్బునన్.

(శశిరేఖా నాటకము.)

3 ఉదా:— 'వెన్నెల చిన్నెలందనరు బంగరు పీట వసించి యావుపాల్
గ్రన్ననదీయఁ తల్లి వెనుకంజని వెన్నవనాని గిన్నెలో నన్నినుపంగ బాలుఁ
డుఁగు నందకుమారుఁడు వెన్నుఁడీ యెడం దిన్నని చూపుతో మనలఁ
జేర్చి ముఖంబొడఁగూర్చు నెచ్చెలీ.'

(కుచేల నాటకము.)

# CHAPTER XIX.

## వ్యాసముల రచనకనుకూలమయిన మఱికొన్ని ముఖ్యాంశములు.

——(o)——

1 ఏదయిన నొక విషయమును జెప్పునప్పుడు వక్తవ్యాంశమును దానికి సంబంధించిన యంశములను, ఒక యన్వయ సముదాయముగా నుండ వలయును. ఈసముదాయ మెంతసంగ్రహముగా నున్న నంతమంచిది.

2 ఏది వ్రాసినను సావకాశముగా నాలోచించి వ్రాయవలయును. సముదాయ మందలి ప్రధానవాక్యము ప్రారంభమునందే యుంచుట మంచిది.

3 అంశము చిత్రఫలకమువలె, నవయవపరిమాణమును, వర్ణవిభేదమును కలిగి యుండవలెను. అనఁగా స్వల్పాంశమును వ్రాయఁబూనుకొని యాయంశమునకుఁ దగని యంత పొడుగు యితిహాసములు, ఉపమానములతోఁ గూడియుండరాదు.

4 యుక్తియుక్తముగను, సందర్భోచితముగను నుండవలెను.

5 వాక్యసముదాయముల నేదియో యొక క్రమము ననుసరించి వ్రాయవలెను.

6 అనేకవిధములయిన వ్యాసములరీతులనుబట్టి వాని ప్రక్రియ మారుచుండును.

7 వ్యాసముల రీతులు.

1 కథలు:—చరిత్ర, మహాపురుషుల జీవితము, కథచెప్పుట, మొదలయినవి.

2 వర్ణన:—జంతువులు, అచేతనములు, దేశము, పుస్తకభాండాగారము, కోట మొదలయినవి.

3 విమర్శ:—రాజకీయ, చారిత్ర, సాంఘికములు, గ్రంథ విమర్శనములు మొదలయినవి.

8 ఇతరుల శైలి ననుకరింపక స్వభావజశైలిని నిర్దుష్టముగా వ్రాయుట నేర్చుకొనవలెను.

9 ఏ విషయమునుగూర్చి వ్రాయుదుమో, ఆవిషయమును వ్యక్తీకరించు శబ్దజాలము నేర్పరచుకొనవలయును.

ఉదా—ఏనుగును గూర్చి వ్రాయదలంతుమేని, ఈ శబ్దములను జ్ఞప్తియందుంచుకొనవలెను.

1. గజము, 2. కరి, 3. ద్విపము, 4. ఇభము, 5. స్తంబేరము, 6. పద్మి: 7. ద్విరదము, 8. అనేకపము, 9. హస్తి, 10. దంతి, 11. దంతావళము, 12. నాగము, 13. దాని, 14. ఏనుగు, 15. చేమెకము. 16. చేటచెవుల మెకము, 17. పలుగొమ్ముల మెకము, 18. ఎక్కుడుమెకము, 19. బలుకంజమెకము. 20. కుంభి, 21. కుండాలము, 22. అష్టదిగ్గజములు, ఐరావతము, పుండరీకము, వామనము, కుముదము, అంజనము, పుష్పదంతము, సార్వభౌమము, సుప్రతీకము; 23. కుండాలము, 34. తొండము. 35 హస్తము, 36. కరము, 37. మావటీడు, 38. యంత. 39. సృణి,40. అంకుశము, 41. హస్తిపకుడు, 42. అంబారీ.

ఈ పర్యాయశబ్దములును, అవి విహరించు చోట్లును, తిను నాహార పదార్థములును, వాని స్వభావమును, మున్నగు విషయములనుగూర్చి తెలిసికొనవలెను.

10 వ్రాసినదానిని బయినుండి క్రిందికొకసారి పారజూడవలయును.

11 తాను చెప్పబోవు సంగతి ఇట్టి రీతిగా, ఇది మొదలింతకును చెప్పవలయునని యారంభమున నేర్పరచుకొనవలయును. చెప్పుచున్నప్పుడంతయు

వఱకైనదనియు, ముందింత కావలయుననియు, నీ యంశమున కింతకాలము చాలుననియు గురుతులో నుంచుకొనవలయును.

B. N:— విద్యార్థులు పరీక్షాకాలములయందుఁ బయినఁ జెప్పినవిషయములను గురుతులో నుంచుకొనిన పక్షమునఁ జెప్పఁబోవు నంశమును కాలము చాలకుండుటచేఁ గొంతకొంతయే వ్రాసి విడుచుట తటస్థించును.

T .

# CHAPTER XX.

## రెండవ భాగము.

—:(o):—

ప్రథమభాగమందు వాక్యకల్పనకు వలయు వ్యాకరణాది ముఖ్యవిషయములనుగూర్చి వ్రాసితిమి. వానిం జదువుటవలన విద్యార్థులు తప్పులు లేకుండ వాక్యములను రచించుటకు సమర్థులు కావచ్చును. తప్పులు లేకుండ వాక్యములు వ్రాయుట నేర్చికొని నంతమాత్రముచేత వ్యాస ముత్తమము గాఁజాలదు. కావ్యకల్పనము చిత్రలేఖనమువంటిది. చిత్రలేఖకుని పరికరముల వంటివి శబ్దాదికములు. యథోచిత వైఖరి రంగులుపూయుట వంటివి. తప్పులు లేని కావ్యరచన జీవకళలేనిది చిత్తరువట్లు శోభాహీనమై యుండునో రసములేనికావ్యము పిప్పివలెనుండును. కావున రసవంత మగునటుల వ్యాసమునుగాని కావ్యమునుగాని వ్రాయుటకు నేర్చికొన వలయును.

### Extracts about Rhetoric-

“శక్తియు, లోకము, శాస్త్రము, కావ్యము మొదలగు వానినిఁ జూచుటవలనఁ గలిగిన నేర్పును; కావ్యము నెఱిఁగినవారిచేఁ జూపుటచే నయిన యభ్యాసము నను నీమూఁడును కావ్యనిర్మాణశక్తికి హేతువులు.”

రసము కవియొక్క ప్రాగల్భ్యమును బట్టి యుండును. ఏమినో నాలుగు శబ్దములను వ్యాకరణయుక్తముగా ఛందోబద్ధముగాఁ గూర్చిన వాఁడు కవి కాఁజాలఁడు.

గణదోషము లెఱిఁగినవాఁడు,— వివేకి.

అనుప్రాసగల పదగుంభనఁ జేయువాఁడు.— వాచికుఁడు.

అర్థములను బొందుపరచువాఁడు.— ఆర్థికుఁడు.

యమక కవిత్వమందు సమర్థుఁడు.—శిల్పకుఁడు.
అలంకారయుక్తముగఁ గవనముఁ జేయువాఁడు.—భూషణార్థి.
రసతాత్పర్యముగలవాఁడు.—మార్దవి.

(సంప్రదాయసంజీవని)

రసానుభవము వలనఁ గల తత్కాల మహానందమే కావ్యమునకు ముఖ్యఫలము.

(అహోబలుఁడు)

కావ్యమునకు ధర్మార్థకామమోక్షములను ప్రయోజనము కలదు గాని యానందమే మిక్కిలి ముఖ్యమగుఫలము.

వాక్యార్థదోషము లేనట్టియు, గుణాలంకారములతోఁ గూడి నట్టియు వాక్యార్థములు కావ్యములు. (కవిశిరోభూషణము.)

“ఇంద్రియములకువలె శబ్దములకుఁ బదార్థ వివరణమునకుఁదగినదియుఁ గదలుటకు మాఱుటకు వీలైనదియు నగు వ్యాపారము నంగీకరించవలెను” అనియు నాలోచించఁగా సంబంధమును సంధానము చేయుటయను బుద్ధి విశేషము. అది యాత్మయందున్నది యయినను శబ్దధర్మమని వ్యవహరింపఁ బడుచున్నదని సంప్రదాయవేత్తలు చెప్పుదురు.

(అహోబలపండితీయము)

“అన్వయజ్ఞానము ముందుగలిగి తర్వాతఁ బదార్థజ్ఞానము గలుగునని కొందఱు చెప్పెదరు.

ఉత్తమకావ్యమునకు ధ్వని ప్రధానము.

“ధ్వని యనాహతోఁగూడి సమర్థమగుశబ్దమగును. విభక్తి అంతమందు గల శబ్దము పదము. పదములకూడిక వాక్యము.

(ఆంగ్లేయ గ్రంథకర్త)

“ఆలోచించఁగా శబ్దార్థములు రెంటికిని వ్యంజకత్వ మున్నదిగాని ప్రత్యేకశబ్దమునకు గాని ప్రత్యేకార్థమునకుఁగాని లేదు. అయినను ఒకటి

పరిధానమును ఒకటి సాహాయ్యము చేయునదిగా నుండుటచేత నారీతిగా వ్యవహారమని ధ్వనివేత్తల చాటింపు."

"అలంకారముల వలెనే గుణములును రసమును శోభింపజేయునవి యగుటవలన గుణములకు నలంకారములకు భేదమేలేదు అందురేమో. అట్లు గాదు. అభేద సంబంధముచేత రసమును శోభింపఁజేయునవి గుణములు. భేదసంబంధముచేత రసమును శోభింపజేయునవి యలంకారములు."

(అహోబలపండితీయము)

కాఁబట్టి రసము కావ్యమునకుఁ బ్రాణము.

---

## రస ప్రకరణము.

---

ప్రాణములేని శరీరమందు హారాదుల కేరీతిగా నలంకారత్వము లేదో, అట్లే రసములేని కావ్యమం దలంకారత్వమును శోభాహేతువుగాదు.

అట్టి రసము ధ్వనివలనఁ గలుగుచుండును. ధ్వని యనఁగా విభావ, అనుభావ, సాత్త్విక, సంచారిభావములచేఁ బ్రకాశింపఁజేయఁబడు స్థాయీభావము.

### భావములు.

1 స్థాయీభావము—సముద్రము నందెన్ని నదులు గలిసినను వానిఁ గణించి సముద్రమే కాన్పించునట్లు సంచారిభావములు మొదలయినవి మధ్యమధ్య నెన్ని వచ్చినను వానిగణించి తానే కాన్పించునది స్థాయీభావము.

అది, రతి, హాసము, శోకము, యుత్సాహము, (ఉత్సాహము) భయము, జుగుప్స, కోపము, ఆశ్చర్యము, శాంతి అను వీనివలనఁ దొమ్మిది రసములు గలుగును. రతివలన శృంగారరసము, హాసమువలన హాస్యరసము, శోకము

వలన కరుణరసము, యత్నమువలన వీరరసము, భయమువలన భయానక రసము, జుగుప్సవలన బీభత్సరసము, కోపమువలన రౌద్రరసము, ఆశ్చర్యము వలన నద్భుతరసము, శాంతివలన శాంతరసము నుత్పన్నమగును.

స్త్రీ పురుషులకు భోగమందిచ్ఛగలుగుట రతి.

ఉదా — ఓ చెలియా ! లోకమందనేకులగు పురుషు లుందురుగాక కృష్ణునింబోలు సౌందర్యాదిగరిమ యెవ్వరికిగలదు ?

ఆకారవికారములు చేష్టావికారములు చూచుటవలనం గలిగిన మనోవికాసము, హాసము.

ఉదా — రాజా ! నీశత్రువులు నీరాకవినినంతనే పైటుబట్టలు జారం గాళ్ళు తడంబడ జుట్లువీడం బరువిడుచుండిరి.

ఇష్టజనుల విడచుటచే మదిం గలిగిన దుఃఖము శోకము.

ఉదా — దైవమా ! మాపతులను మమ్ము నెడబాపుజేసి తృప్తిం బొందక హా ! మమ్మిట్లు చిరజీవితలం జేసితివే యని నీ శత్రుభామినులేడ్చు చున్నారు.

గొప్పకార్యముం జేయంగోరి చేసెడి ప్రయత్నము, ఉత్సాహము.

ఉదా — సుగ్రీవా ! వానరవీరులు పరాక్రమంబున రాక్షసుల నెల్ల గుండెపిండి జేసిన పైరావణుండు మనకు లొంగకుండుండుగదా! కావున నాలసించక లంక కేగుదము.

భయంకరాకార చేష్టలంజూడ మనమునం బుట్టిన భీతి భయము.

ఉదా — నీ శత్రురాజులు వనంబులంబడి పారుచు ముండ్లచెట్లు శిల లుందగుల విడువిడు రక్షించుమని మీసైన్యనాయకులు పట్టుచుండిరని భయపడుచుండిరి.

రక్తమాంసాదులను జూచుటవలనం గలిగెడి యేవగము జుగుప్స.

ఉదా— అయ్యారే! యియ్యుద్ధంబున రక్తంబులు జలంబులుగను, మెదడు నురుగులుగను, ఎముకలు చేపలుగను, గాన్పించె. వారింజూచు వారికి మనంబున నెట్లుండునో వేఱ చెప్పనేల?

శత్రువులు మొదలగువారు చేయు దుష్కార్యములం జూచి పుట్టు రోషము, కోపము.

ఉదా— అట్లు సభాస్థలి నాంజనేయుండు పలికిన మాటలు సైరక మనంబునం గ్రోధముప్పొంగ రావణుండు కన్నులెఱ్ఱంజేసి పటపట పండ్లు గొఱికెను.

మున్నెన్నఁడుం జూడని వస్తువులంజూచి మనమునం బుట్టెడి సంతోషము విస్మయము.

ఉదా— రావణుం డట్లపరిమితమగు వానర సేనా విస్తారంబును జూచి యయ్యారే! యింతటి వానరసేనను మున్నెన్నఁడుం జూచి యుండలేదు అని యచ్చెరువొందెను.

వైరాగ్యమువలనం గలిగిన మనోనైశ్చల్యము శమము.

ఉదా— రాజా! నీశత్రురాజులు ఐశ్వర్యహీనులై సంసారముల నుజ్జగించి వైరాగ్యవృత్తిచే మౌనులంబోలె వనంబులం దపించుచుండిరి.

2 విభావము—ఆలంబన విభావము, ఉద్దీపన విభావమునని రెండువిధములు. అందు స్త్రీపురుషాదు లాలంబన విభావము, (అనఁగా రసాధారమగునది.)

వయసు అలంకారము మొదలగునది యుద్దీపన విభావము. (అనగా రసము నుద్రేకింపఁజేయునది.)

ఉదా— రతిమన్మథులంబోలె నాసీతారాములు కలసి పరస్పరశోభాహేతువులైరి. ఇది యాలంబనవిభావము.

ఉదా— ఆహా! ఆమేను, ఆవయసు, ఆ చెక్కు, ఆటుక్కు, ఎవ్వని మనసుఁగరగించదు! ఇది యుద్దీపన విభావము.

ఉద్దీపనము నందు మన్మథచంద్ర మలయానిలాదులు తటస్థములని మఱి యొక సంజ్ఞను బొందియుండును.

ఉ—ఓ మరుండా! యగ్నికిఁ గాలి తోడైనట్లు నీకు నీ చంద్ర వసంత శుకపికాదు లెట్లు తోడయ్యెను!

3 అనుభావము—కారణమైన విభావముచేఁ గలుగు రసమువలనఁ బుట్టిన కటాక్షాది వికారము లనుభావములు.

ఉదా—ఆ గోపిక చూపు మరలించుచు మరలించుచు మందహాస మించుక మోవిపై దళుకొత్తనిలచుచు నడచుచుఁ గృష్ణుం జూడసాఁగెను.

4 సాత్త్వికభావము—ఇతరులయందుగల సుఖదుఃఖాదుల జూచి తాముసట్లు సుఖదుఃఖాదు లననుభవించుట సాత్త్వికభావము.

ఇది సామాజికులు మొదలగు సహృదయులందుఁగూడ గలుగ వచ్చును. ఈ సాత్త్వికభావ మెనిమిది విధములు.

(1) స్తంభము = కదలకుండుట.
(2) ప్రళయము = వశముదప్పుట.
(3) అశ్రువు = కనులనీరు వెడలుట.
(4) రోమాంచము = ఒడలు గగుర్పొడుచుట.
(5) స్వేదము = ఒడలు చెమర్చుట.
(6) విస్వరత్వము = గద్గదిక పడుట.
(7) కంపము = ఒడలు వణకుట.
(8) వివర్ణత్వము = ఒడలు రంగుమారుట.

ఉదా—అయ్యారే! యయ్యింతి ప్రియునుంగాంచి చెయ్యాడక శిల్పపుబొమ్మయై నిలచినది. (స్తంభము)

(2) ఆయ్యింతి నేమనవచ్చును! తనతోబుట్టిన మదిరకు వశముగాకుండెను. (ప్రళయము)

(3) తొలుకారు వానచే ముత్తెపుఁజిప్పల ముత్తెంబులు గలుగునట్లు తొలి చూపున నయ్యింతి కన్నుఁగవ నశ్రుపూరంబు తోరంబయ్యె. (అశ్రువు)

(4) బాగుబాగు! తొలుకారున నేలం బైరు లంకురించునట్లు రోమంబులు మేనం గగుర్పొడిచె. (రోమాంచము)

(5) తడవునకుం బ్రియు నాలోకించిన యక్కోమలికిం బాండురగండపాళిం జెమట చినుకులు చంద్రకాంతశిలల జలబిందు సందోహంబునంబోలె వెడలసాఁగెను. (స్వేదము)

(6) అచ్చెలి ప్రియునకు వార్తం బుత్తెంచుచో దూతికకు నప్పలుకులన్నియు వెతింతిచే నుగ్గడింపఁ బడునట్లు వినవచ్చెనని. (విస్వరత్వము.)

(7) అద్దిరయ్యా! యిమ్ముద్దులగుమ్మ ప్రియుని సుద్దులు నుడువుచు గాలిం జలించు మాలతియుం బోలెఁ దూలి చలించుచుండెను. (కంపము)

(8) ఓ సుందరాంగా! యాసుందరి నెఱుకేమని చెప్పవచ్చును. తొల్లి లచ్చియుంబోలె నుండునది పలుకులచెలి తెలిడాలుందాల్చి చెలికత్తెలను గురుతుసేయ నలవిగాక యున్నది. (వైవర్ణ్యము)

5 వ్యభిచారిభావము- దీనినే సంచారిభావము అందురు-రసోత్పత్తికి సహాయములై పుట్టుచు నశించుచుండునవి సంచారిభావములు. ఇవి ముప్పది మూఁడు విధములు.

1. నిర్వేదము, 2. శ్రమము, 3. దైన్యము, 4. జాడ్యము, 5. గ్లాని 6. త్రాసము, 7. శంక, 8. ఆర్తి, 9. రోషము, 10. గర్వము, 11. ఆవేగము, 12. ధృతి, 13. స్మృతి, 14. చాపలము, 15. ఉగ్రత్వము, 16. అవహిత్థ, 17. త్రిప, 18. విషాదము, 19, మదము 20. ఉత్సుకత్వము, 21. మతి, 22. నిద్ర, 23. మోహము, 24. బోధము, 25, మృతి, 26. మోదము, 27. ఆలస్యము, 28. వితర్కణము, 29. సుప్తి, 30. అసూయ, 31, ధ్యానము, 32. భ్రమము, 33. విస్మృతి,

ఉదాహరణము —

నిర్వేదము — ఓ చెలీ ! యాతనిం జూడకున్న మణిమయాభరణంబులు శిలలుగను, హారములు సముద్రపు చినుకులుగను, గాన్పించుచున్నవి.

శ్రమము — అమ్మగనింజూచిన యమ్మగువమ నొడలెల్ల నాయాసకలితంబై చంద్రుంజూచినచంద్ర కాంతపు బొమ్మవలె స్వేదబిందు సంపూరితంబయ్యె.

దైన్యము — ఓమన్మథుఁడా ! పురవైరికిం దిరము దప్పించిన నీ కీవిరిబోడియపనెంత ! కరుణఁజూచి రక్షింపుము.

జాడ్యము — ఆసరసునకై పరికించి పరికించి యాతఁడు చెంగటంజేరుననుతనే యేమి చేయుటకుం దోఁచక యూరకుండెను.

గ్లాని — తొల్లి పూలబంతులం జేఁబూనుటకైన నలపొందు నయ్యాదు వదన కొందకం బెను బరువగు సవ్వలపు నెట్లు సైరించుచుండునోకదా.

త్రాసము — చిత్తరువునందు వ్రాసిన మన్మథునింగాంచి యయ్యింతి బెదరు చూపులతో దవ్వుగం బోవసాఁగెను.

శంక — తన చెలికత్తెలు పలుకుచుండఁ జిలుకలు పలుకుచున్నవో యనియు నిగ్గుటద్దముంగాంచి కలువ తోఁడో యనియు నచ్చెలితలఁకుచుండె.

ఆర్తి — అబ్బాలకు నొడలంగల ముత్తెపుసరులు మన్మథజ్వరము చేఁ గ్రాగి పేలిపోవుచున్నవి.

క్రోధము — అగుమాగు మెక్కుడికిఁ బోయెదవు. మేము రామ భటులమని యెఱుంగవో ! ఈపరుగు యమ పురంబునకేజుమీ.

గర్వము — ఓరోరీ ! కొండలం జెండునటులఁ జెండి తెచ్చిన మారునీవొకఁడ వెదురే !

ఆవేగము — ఆ రాక్షసభటుండు రాముని కెదురై కేలంగోలఁగీలించి కేలు వదఁక నందే విడిచెను.

ధృతి — ఆంజనేయా ! యిఁక నాజన్మమునకు రామునొకసారి కన్నులారఁ గాంచినఁజాలు.

స్మృతి— అల్లనాఁడు గోదావరీ పరిసరంబున మనమిరువురము నొకకేళిఁ గొడవతో జరిపిన యాటలు నాహృదయంబున నాటుకొని యుండెనని రాముని కెఱిఁగింపుము.

చాపలము— అమ్ముద్దులాడి, యమ్మనోనాయకుం గాంచి హారముల దిద్దుచుఁ బోవుచు మరలుచుఁ జూచుచుఁ జూపు మరలించుచుఁ బలుక గమకించుచు మరల నూరకుండెను.

ఉగ్రత్వము— ఓరోరి రావణా! జనకసుతను రామునకొసంగుము, అట్లుగానిచో నీవును నీలంకయును నమ్మహాత్ముని బాణాగ్రంబున శతాంశమునకుం జాలవు.

అవహిత్థ— ఆరాజు గుణంబులనుడివి యారామామణి మేనం బులకలలుమఁ గొన "అబ్బా! యీముత్తియంపుసరు లెంత చల్లగానున్నవి" అని వాని మరుఁగు పెట్టెను.

త్రప— తన పతి నామంబుఁ బరాకునం జేర్కొని తన నెచ్చెలి వినెఁగదా యని యబ్బోటి మోమువంచె.

విషాదము— అప్పూఁబోఁడికి పువ్వులు మరుశరంబులు, చంద్రకిరణములు శూలలునై యుండె నిఁక నేమి చేయవచ్చును. భూవరునకు దయ యుదయించదాయెఁగదా.

మదము— అమ్మధువనంబునఁ గపివరులు మధుర మధుపానవ్యామత్తులై తూలుచుఁ దేలుచు సోలుచు వివిధ గతులఁ జెలంగం దొడంగిరి.

ఔత్సుక్యము— మరుత్సూనుఁడు వచ్చి పోయినది మొదలాయమ రామలక్ష్మణులు లంకకెప్పుడరుదెంతురు ? రావణుం బరిమార్చుట యెప్పుడు ? నామనఃప్రియుని యాననం బెప్పుడు విలోకించెదనని గడియలు వెడలించుచుండెను.

మతి— ఔనౌను. దాశరథి పరతత్త్వరూపమే కాకున్న నిట్టి బల్లిదులం గాన్పించునే ? ఓపరమా ! యదియు నాకించుక భాగ్యమనియే తలంచెద.

విప్రి— అమిన్నకన్నియ స్వప్నంబునసైనఁ బ్రియావలోకనంబు లభించు నేమో యని నిద్రఁగోరి నేత్రకంజంబుల మూయుచుండెను.

మోహము—ఓ రసికశేఖరా ! ఆసరసిజారి మరుశరహతులచే ధరణికి నొరఁగి మమ్మెల్లఁ బలుమారు వెతలం గుందించుచుండె.

బోధము— రాముని విజయవార్త వినునంతనే సీతకుం దొల్లిఁటి మాంద్యమును గెంటి నవనవోద్భూతమగు తెలివి నెలవుకొనియె.

స్మృతి— ఇన్నిరో ! యీమె నేల నీవేణీభరంబు కత్తుకకు హత్తించి చుట్టిరాఁబెట్టి యొక్కపెట్టున బిగియలాగి యీ దోసగు టుసురులఁ దొలఁగించక నిలుపనేల ?

మోదము— ఆహాహా ! మున్ను నే నొనర్చిన నోములు నేఁటికింబండె నిట్టి సమయంబు చేకూరునని తలంచనైతి. రాఘవేంద్రుండు సురవైరిం దునిమెనఁట.

ఆలస్యము—స్మరమనోహరుఁడగు వరుం దలంచుచు నక్కురంగాక్షి సరసం గల సరసిజాక్షులు తన్నుఁబిలువ నెగాదిగం జూచుంగాని మారు మసలకుండె.

వితర్కము— నాకిమ్మాడ్కి నుమ్మలికంబు గ్రమ్మకొన బ్రాణసఖులకుఁ దెలుపుదమన్న మనము వెనుకదీయును. తెలుపకున్న మరుఁడుకమ్మ చ్చునంబట్టి సాఁగఁదీయును. ఏమిచేయఁగలదాన.

సుప్తి— అప్పుడప్పుడొకడి కెవ్వగకానితో నెవ్వియెవ్వియో లీలావిశేషంబులం దేలి పూఁబానుపనకు నిదుర తమిని మేనుహత్తించెను.

అసూయ— ఓక్కటకటా ! గోపాలుఁడు అత్తపని యిచ్చిన క్రొవ్విరి రుక్మిణికి నొసంగెనఁట. నన్నింత యనాదరించునే ?

ధ్యానము— అమ్మహామహుండగు రాఘవేంద్రుండు నాకన్నులకుఁగల నిప్ప చ్చరంబెట్లు తీర్చును ? ఎప్పుడు నామనంబున కాశ్వాసంబు గలుగు ? ఇది యెన్నఁడేని చేకూరునో !

భ్రమము— ఓ రసాలమా ! నాపై దయ గలిగనేని సీత యేత్రోవ నేతెంచెనో యానతిమ్ము.

విస్మృతి— చెలులారా ! మన చెలికత్తెను మారగ్రహం బావేశించెను. కావున హితమనోహరుని నామంబు అనువైవాని యమ్మంత్రిమూనుడువుచు నీమె కేగేలికి రక్ష కట్టుడమా !

---

## STYLE Etc.

## వృత్తులు.

---

వృత్తులు రచనాశ్రయములు గాని శబ్దగతములుగావు. అవి కైశికి, అరభటి, సాత్వతి, భారతి, అను నాలుగువిధములు.

1 కైశికి—మృదువయి శృంగార, కరుణ రసములను దెలుపు అర్థ రచన.

ఇందు టవర్గముతప్ప కకారము మొదలు మకారము దనుకనుండు నక్షరములు పూర్ణానుస్వార పూర్వకముగా గలవియు, దీర్ఘములులేని రేఫ ణకారములును, సమాసము లేకపోవుటగాని కొలది సమాసము లుండుట గాని గలదియు, మనురపదములతో సంబంధము గలుగు నట్టిదియు నగు మాధుర్యము గలిగియుండును.

ఉదా:— ఆ లతాంగులు మంద మందయానంబుల నందందు నింపుగ గొలుప మెలంగుచు, లతాంతంబుల పువ్వులం గోరులం జిదుముచు, మంద హాసంబులు ముఖారవిందంబుల నంకురింప, చిలుక పలుకుల పలికించు మృదుతర వచనరచన విశేషంబుల నన్యోన్యంబు గరగించుచు, సంచరించు చుండిరి.

2 అరభటి— కఠినమై, తీక్ష్ణమై, రౌద్ర, బీభత్సరసములను దెలుపు అర్థరచన.

ఇంను, వర్గులలో నొకటి మూఁడవ యక్షరములతో రెండు నాల్గవ యక్షరములకు సంబంధమును, (i, e,) రుక్షు, దిగ్ఘ్న, శ్వేచ్ఛాంద, ఉజ్ఝిత త్త్రాకృతి, ద్విడ్ఢ్నము, ఉత్థాన, ఉద్ధవ, ఇత్యాదులు.) రేఫముతో క్రిందగాని మీఁదగాని రెండువోటులగాని యేదోయొక యక్షరమునకు సంబంధమును (i, e,) అర్ఘ, రువ్రి, ఆర్ద్రి, ఇత్యాదులు, అక్షరములకు దనకు దనతో సంబంధమును. (i, e,) దిక్కరి, దిగ్గజ ఇత్యాదులు వకారము లేని టవర్గము దీర్ఘసమాసమును, కఠిన రచనయుఁగల ఓజోగుణమును గలిగియుండును.

ఉదాహరణము:—

మహోద్దండంబగు నఖండ ఖండన పాండిత్యంబున ఖడ్గంబట్టిలేక కరి ఘటాఘటంబుల కఱకఱ నఱకుచు పెక్కువగు నుక్కునఁ దిక్కరిదిల్ల యోధయూధంబుల ధిక్కరించుచు నక్షీణశిక్షణ దక్షుండై కపాల పటలంబులం బటపటఁ గొఱకుచు విస్తృతంబులగు నస్థిఘటంబులఁ జేబెత్త బాటింపక దాటించుచు నుగ్రంబులగు రక్తపూరంబుల సముగ్రంబుగ జంఘావదఘ్నంబుగా దాటుచు సమరతోషి నక్షీణ కౌక్షేయ శిక్షాదక్షత్వంబు నక్షిభయంకరంబు గావించె.

3 భారతి — కొంచెము ప్రౌఢమై హాస్య శాంతాద్భుత రసములను దెలుపునది. ఇందక్షరములు మిశ్రముగా నుండును.

ఉదా:— అమ్మునివరుండు సంసారం బసారంబని తలంచి సన్న్యస్త సర్వసంగుఁడై నదీ ప్రాంతంబులం గుసుమిత ఫలితవనంబుల సారంగ పతంగాదులు తనకు సహచరులుగా నుటజాంతరంబున నివసించి తపోనియమంబున నుండె.

4 సాత్త్వతి — కొంచెము కోమలమై వీరభయానకరసములను దెలుపు నర్థరచన. ఇచటఁ గూడ నక్షరములు మిశ్రములై యుండును.

ఉదా:— ఔరౌరా! యెదురైన యోధవీరుల నతి భయాపాదియైన తన ధనుర్దండంబు నెక్కువెట్టి నిషంగంబుల నిషుసంచయంబు వెలువరించుట తెలియకుండ ధారాధరంబులోలె బాణపరంపర లరులపైఁ గురియించె.

అర్థగాంభీర్యము పాకమనంబడును. అది రెండు విధములు 1 ద్రాక్షాపాకము, 2 నారికేళపాకము నని, వెలుపలను లోపలను స్ఫురించు చున్నరసము గలది ద్రాక్షాపాకము.

ఉదా:— వీనుల విందై యమృతపు
సోనలపొందై యనూన సుమచలదళినీ
గానము క్రిందై యాస్వన
మానంద బ్రహ్మమైన నధిపతిపలికెన్.

(వసుచరిత్ర.)

స్పష్టముగా బోధపడని గూఢమయిన రసము లోపల గలది నారికేళపాకము.

ఉదా:— "అద్ధావాగ్వి బుధమ్మహోవచన శవ్యాహార మాహోవచ।
స్సిద్ధమ్మాః కృతతాంగతః కలిరితి శ్రీసూక్తి విద్యాధరం।
మిద్ధౌద్ధత్య మగాల్లయం హిమఋతి యా మిత్థం వదత్కిన్నర।
మృద్ధీరాగ్రిణి గెల్చుటుత్సవమునందయ్యోస్న భం బంతయున్."

(ఆముక్తమాల్యద)

# CHAPTER XXI.

## Figures of Speech.

అలంకారములు.

---

### శబ్దాలంకారములు.

---

అలంకారములు రెండు విధములు.

1 శబ్దాలంకారము, 2 అర్థాలంకారము.

శబ్దాలంకారములు, అర్థము విచారించక శబ్దము వినఁగనే చెవులకింపుగా వినఁబడునవి. ఇందులో ననేక భేదములు గలవు.

### ఛేకానుప్రాసము.

రెండేసి యక్షరము లెడతెగక మరల మరల వచ్చుట.

ఉదా:— శ్రీకరకరణీయ దక్ష నీ నైపుణ్యాపుణ్యములు ప్రకటకటకాధీశ్వరు లెన్న విపుల పులకాంకురములు మేన నల్లనిలు.

### వృత్త్యనుప్రాసము.

ఒకటి రెండు మూఁడు మొదలగు నక్షరములు సంఖ్యానియమము లేకుండఁ దిరిగి తిరిగి వచ్చుట.

ఉదా:— ఆమ్యోడ నయ్యంచుబోఁడి మించిన యంచగముల బొంచి పొంచి యదలించుచు నందంబుగ మంద మంద గమనంబులఁ బొందికగా నయ్యరాళికచ మరాళ శ్రేష్ఠమును జీపట్టె.

" అఖండ భూమండల ప్రచండ రిపుప్రకాండవరకుండల మణిమండిత శిరోవిఖండనాతి పండిత వేదండశుండాదండనిభ భుజాకాండ మండలీకృత

కోదండ నిస్సరత్కాండలి సముద్దండ కాండ ప్రకాండా ధర్మజరాజనూయము.

## లాటానుప్రాసము.

తాత్పర్యభేదముతో వచ్చిన శబ్దములే మరల వచ్చుట.

ఉదా:— సత్పథలచే నడచిన దినము దినము. భగవంతుని గుణముల జెందిన కథ కథ. దయాదాక్షిణ్యాది గుణములు గుణములు. దీనులపైఁ జూపిన దయ దయ.

## యమకము.

అర్థభేదముతో వచ్చిన శబ్దములే మరల వచ్చుట.

ఉదా:— కేడబంపు చెవులు విడి వాని కేడంబంపుము. నీ విందు నేఁచిన నాతని కన్నులకు విందుకలుగునే? ఇంపొందు మాటలఁ బ్రియు పొందుఁ గాంచుము.

## ముక్తపదగ్రస్తము.

విడిచిన పదమే యవ్యవధానముగా మరల మరల వచ్చుట.

ఉదా:— వాని కీర్తి లోకమాక్రమించు మించును మించు తేజంబు జంబునదీ జంబాలంబుంబోలుఁ దమకాంతిచే నాతఁడు రంజిల్లు. జిల్లువడఁ జేయు మదనుని గర్వంబు రూపు రూపు మాపుశతృయశంబుల నాతని శక్తి.

## అర్థాలంకారములు.

అర్థము ప్రధానముగాఁ గలిగి కావ్యశోభాహేతువులైనవి.

## ఉపమ.

రెండు పదార్థములయందు వర్ణ్యా వర్ణ్యములయందు మనోహరమగు సామ్యమును స్పష్టముగాఁ జెప్పఁబడి యుండెనేని యుపమ యగును.

ఈ యలంకారమునకు—

1 ఉపమానము, 2 ఉపమేయము. 3 ఉపమావాచకము, 4 సాధారణ ధర్మము; అని నాలుగవయవములు కలవు.

ఉదా:— రాముని కీర్తి వెన్నెలవలెఁ దెల్లనైన లోకమున వ్యాపించి యున్నది.

ఒకదానితో నొకటి పోలికగల రెండు వస్తువులలో గొప్పదియగు నప్రస్తుతవస్తువు ఉపమానము. అది యిందు వెన్నెల.

అది తెలుపుచేత గొప్పదియుఁ బ్రస్తుతము వర్ణింపఁబడనిదియు నై యున్నది కావున నుపమానము.

ఉపమేయము — పోలికగల రెండు వస్తువులలోఁ గొంచెము తక్కువదై ప్రస్తుతము వర్ణింపఁబడుచున్నది యుపమేయము. అది యిందుఁ గీర్తియై యున్నది.

అది తెలుపుచే వెన్నెలకంటెఁ దక్కువదైనదియుఁ బ్రస్తుతము వర్ణింపఁబడుచున్నదియును గావున నుపమేయము.

ఉపమావాచకము — ఉపమను జెప్పుశబ్దము ఉపమావాచకము. అది యిందు "వలె" యైయున్నది.

అది కీర్తికిని వెన్నెలకును సామ్యమును జెప్పుచున్నది గావున నుపమావాచకము. ఇట్లు పోలె, వంటి, తుల, ఉద్ది, ఈడు, సరి, జత, సమానము, తుల్యము, సదృశము, నిభము, సంకాశము, నీకాశము, మిత్రము, బంధువు, చుట్టము, మొదలగునవియు నుపవాచకములే.

సాధారణధర్మము — ఉపమనోపమేయములు రెంటియందుఁ గలిగినది (దేనిచేత రెండు వస్తువులకు సామ్యము గల్గునో యది) సాధారణధర్మము.

అది యిందుఁ దెలుపు, లోకమున వ్యాపించుటయను రెండు ధర్మములై యున్నవి.

అవి యుపమేయమగు కీర్తియందును, నుపమానమగు వెన్నెలయందును గలిగియుండుటచే సమానధర్మమని చెప్పఁబడును.

ఇట్లు నాలుగును గలిగియున్నది ] పూర్ణోపమయనంబడును. వీనిలో నొకటిగాని, రెండుగాని, మూఁడుగాని లోపించినది లుప్తోపమ. నాల్గును లోపించినచో నలంకారమే యుండదు. ఇట్టి లుప్తోపమలో లోపించినవి తోఁచుచుండును.

ఉదా—1. వానిమోము చంద్ర సుందరమై యున్నది.

ఇచటఁ జంద్రుఁ డుపమానము, మోముపమేయము, సుందరత్వము సాధారణ ధర్మము నున్నవి. ఉపమా వాచకములేదు. కావున నిది వాచక లుప్త.

2. పద్మముఖుఁడు.

ఇచట నుపమానమగు పద్మము, ఉపమేయమగు ముఖమును గలవు. ఉపమా వాచకము. సాధారణధర్మమును లోపించినవి. కావున ధర్మవాచక లుప్త.

3. అతఁడు చంద్రునివలె నుండెను.

అతఁడు, ఉపమేయము, చంద్రుఁడుపమానము, వలె యుపమావాచకమును జెప్పఁబడినవి. సాధారణధర్మమగు నాహ్లాదకరత్వము జెప్పఁబడలేదు. కావున ధర్మలుప్త. ఇట్లు తక్కినవి యూహ్యంబులు.

---

## Exercises,

---

1. ఈతఁ డర్కసమ తేజుఁడు.
2. పూవులతోఁ గూడిన నారకు వాసన గలిగినట్లు సజ్జనులతోఁ సావాసించు మూర్ఖునకు మంచిగుణము గలుగుట సహజము.
3. సంగ్రామంబున నాతఁడు రాఘవు నంతటివాఁడు.
4. ఈరాజు మేఘమునకుం బ్రతివచ్చును.

5 ఈతనికిఁ దేశంబున నీడగువారు లేరు.

6. శత్రువులపాలిట నాతండు యమునివలెనుండు.

7. భీముఁ డమితబలుండై యంతకాలాంతకుండునుంబోలె మల్లచఱచె.

8. రత్నముల బోలు గుణములచే నొప్పుచున్న యాసముద్రునిం జూచితివా?

9. రాముఁడు మేరుధీరుండై యలరారె.

10. అంత దొక్క పురుషసింహుండు నియమింప వారును మఱి యిరు
వురను బ్రాహ్మణగృహంబుల భిక్షమడిగి తెచ్చుకొనిరి.

11 ఔరౌరా! యీతండు రతికాంతుం బరిహసించుచుండె.

☞ ఇందలి యుపమాలంకారభేదములను వాని నామములతోఁ గనుంగొని వ్రాయుఁడు.

## అనన్వయాలంకారము.

ఉపమానము నుపమేయము నొక్కటియేయైన యెడల ననన్వయాలంకారము.

ఉదా— దాతృత్వంబునఁ గర్ణుఁ బోలువాఁడు కర్ణుఁడే, "ఆతని కతండె సాటి, చతురబ్ధిపరీతమహీతలంబునన్" విజయవిలాసము.

## ఉపమేయోపమ.

ఉపమానోపమేయములు రెండును ఒకదాని కొకటి యుపమానములైనయెడల నుపమేయోపమ.

ఉదా— రామునికి సముద్రుఁడే సాటి, సముద్రునికి రాముఁడే సాటి.

## ప్రతీపాలంకారము.

ఉపమాన ముపమేయముగాను, ఉపమేయ ముపమానముగాను జెప్పుట ప్రతీపాలంకారము.

ఉదా— ఓరాజా! కల్పవృక్షము నినుబోలియుండె.

## రూపకాలంకారము.

ఉపమానధర్మ ముపమేయమందు రంగువలెఁ బూసి యుపమేయము నుపమానరూపమును బొందించుట రూపకాలంకారము.

ఉదా— ముఖపద్మముంజూచి యాశ్రిత మరాళము లానందించుచున్నవి.

## ఉల్లేఖాలంకారము.

ఒకవస్తువును బలువురు వారి కనుకూలించునట్లుగా బహువిధములఁ జెప్పుట యుల్లేఖాలంకారము.

ఉదా— రాముని యాచకులు కల్పవృక్షముగాను, శత్రురాజులు యమునిఁగాను, పౌరులు తండ్రిగాను దలఁచెదరు.

## భ్రాంతిమదలంకారము.

ఇతర వస్తువులయొక్క ధర్మము సంబంధించుటచే నొకవస్తువును మఱియొక వస్తువుగా భ్రమ జెందుట భ్రాంతిమదలంకారము.

ఉదా— నల్లనగు రాముని దేహచ్ఛాయ జూచి మేఘమను నూహచే చాతకములు సంతసించుచుండెను.

## అపహ్నవాలంకారము.

ప్రస్తుత వస్తువును సపటాది శబ్దములచేఁ గాని యిదియది కాదని నిషేధించుటచేఁ గాని, కప్పి మఱియొక వస్తువు నారోపించుట యపహ్నవాలంకారము,

ఉదా— ఈయది వక్త్రమిషంబున భువికిదిగిన చందురుండే.

ఇచట మిషశబ్దముచే ముఖమునుగప్పి చంద్రుఁడారోపించఁబడెను.

ఉదా— ఇది యింతిగాదు, చదురుగుణములేని మెఱపు.

ఇచట ఇంతికాదని నిషేధించి మెఱుపారోపింపఁ బడినది.

## ఉత్ప్రేక్షాలంకారము.

అప్రస్తుత వస్తువుయొక్క గుణము, క్రియ మొదలగు వాని సంబంధముచేఁ బ్రస్తుతవస్తువును నప్రస్తుతముగా నెంచుట యుత్ప్రేక్షాలంకారము.

ఈ యలంకారమునకు ధర్మము, అప్రసిద్ధము. ఉపమానమందుఁ బ్రసిద్ధము. దీనింబట్టియే ఈ రెండలంకారములకును భేదము. ఇది వాచ్యమని గమ్యమని రెండు తెఱఁగులనుండును.

తలంచెద, ఎంచెద, సత్యము, ఆదరియో, అనునట్లుఁ ఇత్యాదులుత్ప్రేక్షావాచకములు. ఇవి గలిగియున్నయెడల వాచ్యోత్ప్రేక్ష లేనియెడల గమ్యోత్ప్రేక్ష.

ఉదా — ఆనాటివెన్నెల రామాకళ్యాణమహోత్సవ దర్శన సంజాతంబగు జనుల యానందక్షీరసాగరమో యనునట్లు విలసిల్లె.

ఇచట "ఆనందక్షీరసాగరము" తెల్లనై లోకమందు వ్యాపించుట యప్రసిద్ధము. కావున నుత్ప్రేక్షాలంకారము.

ఇచట "క్షీరసాగరమో" అనుచో, "ఓ" అనునది యుత్ప్రేక్షావాచకము. కావున వాచ్యోత్ప్రేక్ష.

ఉదా — అయ్యవసరంబున యువజనహారిణంబుల వేఁటాడ శంబరాంతకుఁడు మంజులపంజరంబునఁ బెట్టి తెచ్చు కాంచనమయ మాయాకురంగిరో యన సుభద్రా భద్రేభగమన మణివికార శిబికారూఢయై యేతెంచె.

ఇచట మన్మథుఁడు కురంగమును దీసికొనివచ్చుట యప్రసిద్ధముగా వున నుత్ప్రేక్షాలంకారము.

"కురంగిరో" యనుచో, "ఓ" యనునది యుత్ప్రేక్షావాచకము.

ఉదా — రాముఁడు వనంబునకేగుచోఁ దద్రథసముద్ధత ధూళీపరంపరలు, ఆతనితో నేగు పౌరజనమనంబులు.

ఇచట "మనములు" రామునితో నేగుట యప్రసిద్ధము గావున ననుత్ప్రేక్ష. "మనంబులేమో" అను నుత్ప్రేక్షావాచకము లేనందున నిది గమ్యోత్ప్రేక్ష.

ఉదాహరణము.

1 భూదేవి ధరించిన సముద్రమనెడు యొడ్డాణంబునందు రత్నపు మొలకయున్నట్లు రత్న గోపురంబులనొప్పు ద్వారకవిలసిల్లె.

2 ప్రాగ్దిక్కను నింతి లలాటంబున నొప్పుచున్న సిందూరపు తిలకంబన సూర్యుండుదయించె.

3 అమ్మాయా కురంగము రామునికడకేగి ఓరామా! తొల్లినీచే నిహతులబడియు మరల గడ్డిదినవచ్చితివని చెప్పుచున్నదియోయనఁ దృణాంకురముల మేయసాఁగె.

4 అట్టివర్షాకాలంబునఁ దొలితొలి వానచేఁ బుడమినుండి యావిరి యొదవ వేడిమిబోవ నిట్టూర్పు పొగలనెగసె.

5 ఆకాశమను నేనుఁగును సూర్యుఁడను మావటీడస్త్రాద్రిపై వలల వైచిన వెతఁగుడిచి క్రక్కిన రక్తమో యనునట్లు సాంధ్యరాగ మొలసె.

6 సముద్రుండు తన్ను మధింపఁగడఁగు మందరముపైఁ గోపముచే వీచీబాహువుల నడంచదొడంగెను.

7 అపుడు ముకుళించుచున్న కలువపొదం జూచి నవ్వుచున్నదోయనఁ బద్మిని వికసించె.

8 ఆరాముని కళ్యాణోత్సవముం జూచుటకు గగనలక్ష్మి కోటాన కోటులు కన్నులం దాల్చెనోయన రిక్కలు పెక్కు పిక్కటిల్లె.

9 ఆరేయిఁ జీఁకటులెల్ల వేళల భవిష్య ద్రావణ కాంతాదుఃఖ పుంజంబులవా గ్రమ్ముకొనియె.

10 దశరథుఁడట్లు కైకమాటలకు లోనై చింతించుచుండ నిట్టియధర్మము నవలోకింప సమర్థుండుగాక తద్వంశంబునకుం గూటస్థుండగు సహస్రకరుం డస్తాద్రి చాటునకుం జనె.

11 అప్పురిగోపురములు స్వర్గంబునంగల దేవగృహంబులు మనతోఁ దుల్యంబులగునా యని చూడ నగ్రులు సాచెనో యన మిన్నంటి శిఖరంబులతో నొప్పుచుండెను.

12 ఆరాజు కీర్తియనెడు స్వర్వాహిని నాగలోకంబునకుం జని యందొకకట మగుటచే నిలువ నెలవలవడమి మరలివచ్చుచోఁ బొడమిన నీటి బుడగలో యన నప్పురి సౌధంబులుల్లసిల్లె.

13 అవ్వేళ సహస్రభానుండు తన కిరణహస్తంబుల నప్పురి మేడలపైఁ గలుగు రతనంబుల నపహరించు తలంపునో యన జాలాంతరాళంబులలోనికిం జొనిపె.

14 దిక్కులను దూటులనొప్పు నింగి జల్లెడనుండి జారుపిండి యనునట్లు వెన్నెల నలుదెసల నలముకొనియె.

## అతిశయోక్తి.

ఉపమేయమును గప్పివేసి, ఉపమానమును మాత్రము కవి ప్రౌఢోక్తిమూలముగాఁ జెప్పఁబడిన అతిశయోక్తి యగును. ఇది యైదువిధములు.

1 సంబంధమందు అసంబంధము. ఉదా:— ఆ రాజు దానాతిశయము విని కల్పవృక్షముల గానమడఁగెను.

2 అసంబంధమందు సంబంధము. ఉదా— ఓ రాజా! మలయపర్వతముపై నాగకన్యకలు నీ కీర్తిని బాడఁగా నది విను వేడ్కఁ దన గుజ్జునగు లేఁడి నదుపమింజేసి పయ్యెరలు మెల్లఁగా వీడుచున్నవి.

3 భేదమందు అభేదము. ఉదా — మంచి గంధపు చిగురు కర్ణభూషణ మగుచున్నది. నీ చేజిగురు కర్ణవైరి యగుచున్నది. కావున నిదియే వానికి దీనికింగల భేదము.

4 అభేదమందు భేదము. ఉదా — సకలాంగ సుందరంబగు నీతని రూపము నజుఁడు సృజించినది గాక సౌందర్యనిధియగు మరుని సృష్టిగావచ్చును.

5 కార్యకారణ వ్యత్యయము. ఉదా — ఎదిరిపోరు వైరి ధరం దొరంగిన పై నీశరంబు వాని శిరంబుం దుస్రించె.

## సమాసోక్తి.

ప్రకృతి వస్తువు యొక్క విశేషణ సామ్యముచే నప్రకృతవస్తువు గమ్యమానమైనచో సమాసోక్తి.

ఉదా—ఓ రాజా! నీ శత్రుభార్య లడవులం బరచుచుండఁ దీవెలు తో పెలపులుకలచేఁ బిలచి మాపండ్లు భుజింపుఁడని వారి పాదములపై నొరంగు చున్నవి.

ఇచటఁ దీగలయొక్క విశేషణములచే నతిథుల సత్కరించు స్త్రీలు దోఁచుచున్నారు.

## స్వభావోక్తి.

వినువారి కింపుగా నున్నవస్తువు నున్నట్లుగా వర్ణించుట స్వభావోక్తి.

ఉదా—ఆ నెలయేఱు లుభయకూలంబులయందు చెట్టుల విరిజల్లులపైఁ జెట్టులుగట్టి వాని తావులకుం దావులై తేటనీటి తేటలతో నింపు నింపు మధుర ధ్వనులతోఁ బ్రవహించుచున్నది.

## విరోధాభాసము.

విరోధమున్నట్లు గాన్పించి విరోధము లేకుంట విరోధాభాసము.

ఉదా— మిత్రతేజోహారియయ్యు నారాజమిత్ర తేజోహారియయ్యె.

ఇచట మిత్రతేజోహారియైనవాఁ డమిత్రతేజోహారియగుట విరోధము స్ఫురించినది. మిత్రతేజోహారి యనఁగా = సూర్యుని యొక్కవలెఁ దేజస్సుచే మనోహరుఁడైన వాఁడనియు, అమిత్ర తేజోహారి యనఁగా = శత్రువుల తేజస్సును హరించువాఁడనియు నీ యర్థముఁ జెప్పుటవలన విరోధము పోయినది. గావున విరోధాభాసము.

## విభావనాలంకారము.

కారణములేని కార్యము కలిగినచో విభావనాలంకారము.

ఉదా — రాజా! నీకీర్తులు చంద్రుఁడు లేని వెన్నెలలై వెలుంగు చున్నవి.

## విశేషోక్తి.

కారణముండియుఁ గార్యము కలుఁగకుండుట విశేషోక్తి.

ఉదా—రాజా! నీ బాణవర్ష మెల్లెడలఁ గురిసియు శత్రుభార్యల యానంద సస్యములు వృద్ధిఁబొందుటలేదు.

## దృష్టాంతాలంకారము.

సమాన ధర్మము రెండు వాక్యములలో నుపమానోపమేయ భావముచేఁ జెప్పఁబడిన నది దృష్టాంతాలంకారము.

ఉదా —యుద్ధరంగమున మదోద్ధతులగు శత్రువుల మదమడంచినవాఁ డీనృపకుంజరుండు. పటు బలసమేతులై దేవేంద్రాదుల నరదనే యుంచి దితిసుతుల నతుల బలముచే నిర్మూలించినవాఁడు రాముఁడు.

## విషమాలంకారము.

కార్యవిరుద్ధమగు కార్యము గల్గినను ననర్థము గలిగినను విరూపము లగు వానికి సంఘటన గలిగినను విషమాలంకారము. ఇది ముత్తెఱఁగులు గలది.

ఉదా— విషధారవలె నల్లనగు నీకత్తివలన గంగాప్రవాహమువలెఁ దెల్లనగు కీర్తిగలిగె.

ఇది విరుద్ధకార్య విషమాలంకారము.

ఉదా- ఎలుక యొక వెదురుపెట్టెపాము పెట్టెలోఁ దాను దినుటకుఁ దగిన భక్ష్యమున్నదని యదిలో ఆకఁగా భక్ష్యము లేకపోవుటయే గాక దానిలోఁగల పామెలుకను దినెను.

ఇది యనర్థవిషమాలంకారము.

ఉదా- అకటకటా! రత్నమయరాజ పీఠాధిష్ఠాతలగు నీశతృరాజు లెక్కడ? కంటకపాషాణ సంకలితంబులగు పర్వత నివాసము లెక్కడ?

ఇది విరూప ఘటన విషమాలంకారము.

## నిదర్శనాలంకారము.

సంభవించని ధర్మము గలుగునట్లుగాఁ జెప్పుటవలన నన్వయ మనుకూలించక యుపమానోపమేయముల కెచట పోలిక తోఁచుచుండునో యచట నిదర్శనాలంకారము.

ఉదా— ఈరాజు మేని సిరి మరుని సౌందర్యలక్ష్మినిఁ జెంది పొందు వహించుచున్నది.

ఇచట రాజు మేనికి మన్మథుని సౌందర్యము సంభవించదు గావున మన్మథుని సౌందర్యమువంటి సౌందర్యమని యుపమానముతోఁచు చున్నది. కావున నిదర్శనాలంకారము.

## శ్లేషము.

ప్రకృతా ప్రకృతములకు శబ్దమాత్రసామ్యము కలిగి రెండు పక్షములయందు రెండర్థముల నిచ్చునది శ్లేషాలంకారము.

ఉదా— ఉచ్ఛ్రితరుచులచే నొప్పుమీరుచు మంజు లతలచే మించు కొమ్మల కాకరంబగు నప్పురంబు కాశారామంబు కడిందినొప్పుమీరుఁను.

ఇచట సమాన ధర్మము లేకున్నను నగరమునకును నారామమునకును నుచ్చ్రాయులచే నొప్పుమీఱుచు నిత్యాదిశబ్దములు రెండు పక్షములయందు సమానముగా నుండుటవలన శ్లేషాలంకారము.

ఉచ్ఛ్రితరులచేన్ = మిక్కిలి యున్నతులైన వారిచే = పురపరము పొడవగు చెట్లచే = ఆరామపరము. మంజు లతలచే = మృదు లత్వముచే మించు = ఒప్పుచున్న, కొమ్మలకు = స్త్రీలకు, అని పురపరము. మంజులత లచే = మృదువగు తీగలచే. మించు = ఒప్పుచున్న, కొమ్మలకు = వృక్షశాఖ లకు అని యారామపరము.

## అర్థాంతరన్యాసము.

ఒకానొకవస్తువును ముందుగఁ జెప్పి దానిని సమర్థించుటకై వేఱొక యర్థము జెప్పుట యర్థాంతరన్యాసము.

ఉదా- వెలలేని రతనములచే నొప్పుచున్న యాహిమవంతుని ప్రకాశించు శోభ హానిచేయలేదు. ఒక దోషము పెక్కు గుణములయందు మునిఁగి పోవుఁగదా.

## కారణమాలాలంకారము.

క్రమముగా నొకదానినొకటి కారణములుగాఁ గొన్ని సంగతులను వర్ణించుట కారణమాలాలంకారము.

ఉదా— శివపూజవలన నైశ్వర్యము, ఐశ్వర్యముచే సాధుపూజ, సాధు పూజవలనఁ బుణ్యము, పుణ్యముచే నుత్తమ లోకావాప్తియుఁ గలుగును.

ఉదా— నరకము పాపమువలనను, పాపము దారిద్ర్యము వలనను, దారిద్ర్యము దానహీనతవలనను, సంభవించును. కాఁబట్టి దానపరుఁడవు కమ్ము.

22

## సారాలంకారము

పూర్వ పూర్వమునకంటె నుత్తరోత్తర మధికముగా వర్ణించుట సారాలంకారము.

ఉదా — తేనె తీయనిది, అమృతము, దానికంటెః దియ్యనిది, కవి వాక్యము అమృతముకంటెను తియ్యనైనది.

---

# CHAPTER XXII.

## కవిసమయములు.

——(0)——

కవులు, గ్రంథములయందు వర్ణనము సేయునపుడు కొన్ని వస్తువులను కొన్ని గుణములను నియమితముగా, పూర్వుల ననుసరించి వర్ణించుచుందురు.

ఆకాశము, పాపము, అపకీర్తి, వీనిని నల్లగను, కీర్తి, నవ్వు, ఇవి తెల్లగను, కోపము, రాగము, ఎఱ్ఱగను; పద్మములు, గలువలు, మొదలగునవి నదులయందును, సముద్రములయందును, హంసలు మొదలగు పక్షులు నీరున్నచోటనెల్ల నుండునట్లును, చకోరములు, వెన్నెలఁ ద్రావుననియు, హంసలు వర్షాకాలమున మానససరస్సునకుఁ బోవుననియు, అశోకము స్త్రీల కాలితాపున బుష్పించుననియు. పొగడచెట్టు స్త్రీల గండూషా (పుక్కిలింత) సవముచేఁ బుష్పించుననియు, పిన్నవయస్సువారి యవయవముల హారము లుండునట్లును, వియోగమునందలి తాపముచే మనస్సు విడిపోవుననియు, తుమ్మెదపఙ్క్తి మన్మథునకు నారిగను, పూవులు మన్మథుని ధనుర్బాణములుగను, మన్మథబాణములచేతను, స్త్రీల కటాక్షముల చేతను, యువజనుల మనసు బ్రద్దలగుననియు, పగలు పద్మములును, రాత్రి కలువలును, వికసించుననియును, శుక్లపక్షమందు వెన్నెలయు, మేఘము లుఱుముచుండిన నెమిళ్ళాడుననియు, అశోకవృక్షమునకు ఫలములు లేవనియు, వసంతర్తువులో జాజి యుండదనియు, మంచిగంధపుచెట్లకుఁ పండ్లు లేవనియు, ఇత్యాది కవి సమయములు మహాకవుల ప్రబంధములనుండి తెలియఁదగును.

సమయమనఁగా సంప్రదాయము, అవి లేనివి కూర్చుట. ఉన్నవికూర్చకుండుట, నియమమును బురస్కరించుటయునని మూఁడువిధములు.

లేనివికూర్చుట ఎట్లనఁగా ?

ప్రతి పర్వతమందును రత్నము లుండుననియు, ప్రతి జలాశయమందును హంసలు మొదలగు పక్షులుండుననియు, ఆకాశగంగయందు నీటియేనుఁగులు

మొదలగు జంతువు లుండుననియు, నదులలోఁ గూడఁ బద్మము లుండుననియు, చీకటి పిడికిలితో నొట్టుకొనఁదగుటయు, సూదులతో భేదింపఁబడుటయు, కీర్తి పుణ్యము మొదలగు వానియందు తెల్లదనమును, అపకీర్తి పాపము మొదలగు వానియందు, నల్లఁదనము ప్రతాపమునందు రక్తత్వము, ఉష్ణత్వము, క్రోధ, రాగములయందు, ఎఱ్ఱఁదనమును, చకోరములకు వెన్నెల త్రావుటయు, నాచునీరున్న చోట నెల్ల నుండునట్లును అకాలమందుఁ గూడ స్త్రీల కాలితాపుచే నశోకమును వారి గండూషాసవములచే వకుళమును, బూచుననియు, స్త్రీలకు వళిత్రయము (మూడుమడతలు) నూగారును, లేకున్నను వర్ణించుట.

## ఉన్నవి కూర్పకుండుట ఎట్లనఁగా ?

వసంతఋతువులో మాలతీపుష్పములను, గంధపుచెట్లకుఁ బువ్వులు, పండ్లను, కామినీదంతములయందును, మల్లెమొగ్గలయందును, రక్తత్వము, స్త్రీలకు శ్యామత్వమును స్తనపతనము, మరియు లజ్జాకరమగు నంశమును, ఉండినను వర్ణింపరాదు.

## నియమ పురస్కారము ఎట్లనిన ?

భూర్జత్వక్కులు, హిమవత్పర్వతమందే యుండుననియు, గంధపుచెట్లు మలయపర్వతమందే యుండుననియు, హేమంత శిశిర ఋతువులలోఁ దప్ప నన్ని ఋతువులలోఁ బద్మము లుండుననియు, పుష్పాలు, నీరు, గొడుగులు, వస్త్రములు; జండాలు, చామరములు, హంసలు. ముక్తాహారము, కొంగలు, భస్మము, ఇవి సామాన్యముగా తెల్లఁగను, కొండలు, చెట్లు, లతలు మొదలగునవి, మేఘములు, సముద్రము, భిల్లులు, రాక్షసులు, ధూపము, బురద, కేశములు, ఇవి సామాన్యముగ నల్లగను, గైరికాది ధాతువులు, మాణిక్యములు, జపాపుష్పము, రత్నములు, సూర్యుఁడు, పద్మములు, చిగుళ్ళు, మంకెన, దాడిమ, నఖక్షతములు, మొదలగునవి

సామాన్యముగ ఎఱ్ఱగను. సస్యము, కప్పలు, వల్కలములు, పరాగము, ఇవి సామాన్యముగ పచ్చగను. నెమిళ్ళ ప్రౌఢి వర్షాకాలమందే యుండునవియు, కోకిలధ్వని వసంతమందే యుండు నవియు, కమలాసంపదలు, నాగసర్పములు, కృష్ణహరిద్వర్ణములుగను, బంగరు, పరాగము, కుంకుమపువ్వు మొదలగునవి పీతలోహితములుగను, చంద్రునియందు చెవులపిల్లి, లేడియు నున్నట్లును, మన్మథుని జండాయందు మకర మీనములు నున్నట్లును, దానవులు, అసురులు, దైత్యులు వీరికి ఐక్యమును, చిరకాలమయినను శివుని శిరంబునందలి చంద్రుని బాలచంద్రుఁడుగను, మనుష్యుల వర్ణించునపుడు శిరస్సు మొదలు పాదములవఱకును, దేవతల వర్ణించునపుడు పాదాది శిరఃపర్యంతము లోకములు మూఁడనియు, ఏడనియు, పదునాలుగనియు, స్థలమందలి జీవములన్నియు, జలమందును నున్నట్లును, యుద్ధములోఁ జచ్చినవారు సూర్యుని బ్రద్దలుచేసుకొని పోవుదురనియు జగత్తుసృష్టికి మొదట మహత్త్వమును, తుదను, సూక్ష్మత్వమును, కొండలు మొదలగునవి ధ్వనిచే బ్రద్దలగునవియు, ఆకాశము నూఱు ధనస్సుల పెట్టు దూరమునకుఁబైగా నున్నట్లును, శివుఁడు ఆయా యుపాధులనుంబట్టి, వృషవాహనుఁడు, వృషాంకుఁడు, వృషధ్వజుఁడనియు, శూలి యనియే కాని కుర్పియనరాదనియు, ఇందుమౌళియే గాని గంగామౌళి కాడనియు, చంద్రుఁడు—శశియనియే కాని హరిణి యనఁ గూడదనియు వర్ణింపవలయును.

చంద్రుఁడు, ఇంద్రుని గుఱ్ఱము, కల్పవృక్షము, హిమవంతుఁడు, మంచు, నవ్వు, తామరతూళ్ళు, ఆకాశగంగ, ఏనుగు దంతములు, అభ్రకము, ఇసుక, అమృతము, శివుఁడు, పరశురాముఁడు, నారదుఁడు, బలరాముఁడు, శేషుఁడు, ఇంద్రుఁడు, ఐరావతము, సింహము, సౌధము, శరన్మేఘము, సూర్యకాంతము, చంద్రకాంతము, పాముపొర, లొద్దుగ, గుణములు, కైరవములు, శర్కర, ఇవి తెల్లనివి.

కృష్ణుఁడు, చంద్రుని కళంకము, వ్యాసుఁడు, శ్రీరాముఁడు, అర్జునుఁడు, శని, ద్రౌపతి, కాళి, రాజపక్షి, విమానజము, విషము, ఆకాశము

అమావాస్య, శస్త్రములు, అగురు, పాపము, చీఁకటిరాత్రులు, శృంగార రసము, అద్భుతరసము, మదము, తాపింఛము, రాహువు, బలరాముని వస్త్రము, యముఁడు, రక్కసులు, కాటుకపిట్టమెడ, నెమలిమెడ, కృత్యా ఛాయ, (నీడ) ఏనుఁగు, అంగారము, ఖలుని అంతఃకరణము, ఇవి నల్లనివి.

క్షత్రధర్మము, త్రేత, రౌద్రరసము, చకోరములయు కోయిలలయు, పారావతములయు కన్నులు, కోతిముఖము, తేజస్సు, పద్మము, అస్తమయము, అంగారకగ్రహము, కుంకుమము, తక్షకుఁడు, జిహ్వ, ఇంద్రగోపము ఖద్యోతము, విద్యుత్తు, కుంజర బిందువులు, ఇవి యెఱ్ఱనివి.

దీపము, జీవము, ఇంద్రుఁడు, గరుత్మంతుఁడు, ఈశ్వర నేత్రము, జడలు, బ్రహ్మ, వీరరసము, బంగారు, కోతి, ద్వాపరము, గోరోచనము, కింజల్కములు, చక్రవాకి మొదలగునవి, హారిదళము, మణిశిల, ఇవి పచ్చనివి.

ధూళి, లూత, (సాలెపురుగు) కరభము, గృహగోధిక, కపోతము, మూషకము, దుర్గ, కాకకంఠము, ఖరాదులు, మొదలగునవి, ధూసరవర్ణము, మార్యానిగుఱ్ఱములు, బుధుఁడు, మకరతాదులు, హరిద్వర్ణములు. రెండు రూ ఫలన్నప్రదము, ప్రసిద్ధకాన్యప్రదము, నీయమము చెప్పఁబడినది. మిగిలినవి ఏయెట్లుండునో అవి ఆట్లే వర్ణింపవలయును.

# CHAPTER XXIII.

## ఉపమానోపమేయములు.

---

కావ్య కల్పనయందుఁ భావప్రకటనార్థముగను, కావ్య శోభకును, ఒక వస్తువును వఱియొక వస్తువుతోఁ బోల్చుచుండుట సంప్రదాయముగా నున్నది.

ఉపమాలంకారమనఁగా నుపమ పూర్ణాదిగా నున్నది. దానినుండియే సమస్తాలంకారములును బుట్టినవి.

బాలకులుపమానోపమేయ వస్తువులను దెలిసికొని ప్రయోగింపవలెను.

ఉపమాలంకారములయందుఁ గాళిదాసు సర్వోత్కృష్టుఁడు. ఆసర్వజ్ఞుఁడు పార్వతీపరమేశ్వరుల నుపమానముగా వాగర్థములం జెప్పెను. ఇది సంపూర్ణోపమ. ఇది సమస్త శాస్త్ర శోధకులను నిలుచును.

ప్రాచీన కవులు వాడిన కొన్ని యుపమానోపమేయముల నుదాహరించుచుంటిమి.

ఉపమేయము— అనఁగా ప్రకృతము వర్ణించు వస్తువు.

ఉపమానము— అనఁగా నప్రకృతమైన వస్తువు. (e, i.) దేనితోఁ ప్రస్తుత వస్తువును బోల్చెదమో యది యుపమాన వస్తువు.

ప్రాచీన కవులేర్పరచిన సంకేతములను కవిసమయములందురు. అవి యెట్లన:—

ఉదా— కీర్తి = తెలుపు, అపకీర్తి = నలుపు మొదలైనవి.

ఇట్లు ప్రసిద్ధములైన యుపమానవస్తువులను స్వీకరించవలెను. గాని యప్రసిద్ధములను స్వీకరించరాదు. కీర్తినివర్ణించునపుడు హంసతో సామ్యము చెప్పవలెను గాని కొంగతోఁ జెప్పఁగూడదు. అట్లు కొంగతోఁ జెప్పిన యెడల హీనోపమ దోషము పట్టును.

## అవయవములు.

| ఉపమేయములు. | ఉపమానములు. |
|---|---|
| 1 కీర్తి— | చంద్రుఁడు, వెన్నెల, హంస, నురుగు, ముత్యము, వెండి, రజతాద్రి, హిమవత్పర్వతము, మంచు, శివుని అమృతము, శంఖము, కల్పవృక్షము, కామధేనువు. ఉచ్చైశ్శ్రవము, ఐరావతము, సింగము, ఏనుఁగు దంతము, పాలు, మంచిగంధము, నారదుఁడు. సరస్వతి, గంగ, బలభద్రుఁడు, రెల్లుపూవు, నక్షత్రములు, వజ్రము, కర్పూరము. |
| 2 ప్రతాపము — | సూర్యుఁడు, అగ్ని, పద్మరాగము, కురువిందము, |
| 3 మగవాని వక్షము— | తలుపు |
| 4 ముంగురులు — | ఇంద్రనీలములు, తుమ్మెదలు, చీఁకటి, నాచు, నీలమేఘము. |
| 5 కొప్పు — | వింజామర, నెమిలిపింఛము. |
| 6 జడ — | నల్లత్రాచు. |
| 7 ముఖము — | చంద్రుఁడు, పద్మము. |
| 8 నుదురు — | అర్ధచంద్రుఁడు. |
| 9 కనుబొమలు — | విండ్లు. |
| 10 నేత్రములు — | తామరరేకులు, లేఁడికన్నులు, తుమ్మెద, కలువ, చేపలు. |
| 11 చూపు — | బాణము. |
| 12 నాసికము — | తిలపుష్పము, సంపెఁగపుష్పము, కోటేరు. |
| 13 అధరము — | దొండపండు, మంకెనపూవు, అమృతము, పద్మరాగమణి, పంచదార, తేనె, చెఱకు, మామిడి చిగురు, పగడము. |

14 గడ్డము — మఱ్ఱిపండు.

15 కర్ణములు — శ్రీకారములు, నవసంఖ్య, చక్కిలములు.

16 చెక్కిళ్ళు — అద్దములు, కప్పూరము, చంద్రశకలము.

17 పలుకులు — కోకిలవాక్కులు, చిలుకవాక్కులు, చక్కెర, తేనె కర్పూరము, అమృతము, మామిడిపండు, చెఱకు.

18 దంతములు — మొల్లలు, ముత్యములు, దాడిమీబీజములు, వజ్రపు ముక్కలు, నక్షత్రములు, మౌక్త్యములు.

19 గళము — శంఖము, పోకకుత్తుక.

20 వళులు — తరంగములు, నిచ్చెనమెట్లు, మేడమెట్లు, ఇసుక తరంగములు.

21 నాభి — పొన్నపువ్వు, సుడి, మడుగు, నూయి; చక్రము

22 నూగారు — తుమ్మెదల చాలు, చీమలబారు, సలాకు, కత్తి, నల్లత్రాచు, ఇంద్రనీలమణుల పసస, ధూమము, మబ్బు

23 భుజములు — తామరతూండ్లు, పూవులదండలు, తీగెలు.

24 పురుషభుజములు— ఏనుఁగు తొండములు, పాములు, కాడి.

25 కరములు — పద్మము, చిగురు.

26 వ్రేళ్ళు — పద్మపు రేకులు, చిగుళ్ళు, పెసరకాయలు, పగడపు తీగెలు.

27 నఖములు — నక్షత్రములు, ముత్యములు, వజ్రపు పలుకులు, మొగలి రేకులు.

28 నడుము — ఆకసము, సింహము, పిడికిలి, వేదతనము, ఏమియు లేకుండుట.

29 పిరుదులు — భూమి, ఇసుకతిన్నెలు, బండి చక్రములు.

30 తొడలు — ఏనుఁగు తొండములు, అరటికంబములు.

31 పిక్కలు — మొగళులు, కాహళములు, వరిపొట్టలు అంబుల పొదులు, ఆవుతోంక.

32 మీగాళ్ళు — తాఁబేళ్లు.

33 పాదతలము — ఎఱ్ఱతామర, చెంగలువలు, కెంపులు, పగడములు చిగుళ్ళు.

34 మడమలు — మత్తిపండ్లు.

35 తనుకాంతి — బంగరువు, మెఱుపుతీగ, కుందనము, పచ్చపసుపుకొమ్ము.

36 తనుగంధము — కర్పూరము, ఉత్పలము, పాటలపుష్పము, పద్మము, పువ్వు, మంచిగంధము, మొగలిపువ్వు.

37 దేహము — తీగ, శంపాలత.

38 నగవు — వెన్నెల, పాలు, చంద్రకాంత మణులు, నురుగు, మల్లెపూవులు, వజ్రములు, కీర్తికిఁ జెప్పఁబడిన యింక నితర వస్తువులు.

39 నడక — హంస, ఏనుఁగు.

40 మగవాని నడక — ఏనుఁగు, సింహము, ఎద్దు.

41 కంఠధ్వని — కోకిల ధ్వని, వీణానాదము.

పోలికలు చెప్పుటయందు ఒక్కొక్క గుణమున కొందఱు పురాణ ప్రసిద్ధులగు పురుషులను చెప్పుటయు కవి సంప్రదాయము.

దానమునకు — బలి, కర్ణుఁడు, దధీచుడు, శిబి, మేఘము, కల్పవృక్షము, కామధేనువు, చింతామణి.

పరాక్రమము — కుమారస్వామి, శ్రీరామమూర్తి, అర్జునుఁడు, పరశురాముఁడు, బలరాముఁడు.

ధైర్యము — పర్వతము, (మేరువు)

గాంభీర్యము — సముద్రము.

సౌందర్యము — నలకూబరుఁడు, జయంతుఁడు, వసంతుఁడు, చంద్రుఁడు, నలుఁడు.

కాంతి — భూమి.

శాంతము — ధర్మరాజు.

ధర్మము — ధర్మరాజు, యమధర్మరాజు.

సత్యము — హరిశ్చంద్రుఁడు.

బుద్ధి — బృహస్పతి, బ్రహ్మ.

వాక్యములకు — శేషుఁడు, బృహస్పతి, బ్రహ్మ.

వైభవము — ఇంద్రుఁడు,

ధనము — కుబేరుఁడు.

ఐశ్వర్యము — ఈశ్వరుఁడు.

విద్యలు — బ్రహ్మ.

విద్య — పుంభావ సరస్వతి.

దయ — విష్ణుమూర్తి, బుద్ధుఁడు.

సాత్వికత్వము — ఋషులు.

మాయ — రాక్షసులు.

శుచిత్వము — అగ్ని.

పాతివ్రత్యము — సీత, అరుంధతి, దమయంతి, సావిత్రి, పార్వతి, సరస్వతి, లక్ష్మి.

నీతి — చాణక్యుఁడు,

వైరాగ్యము — మహర్షులు.



# CHAPTER XIV.

## Proper use of words.

### కావ్య దోషములు.

——:(o):——

శబ్దములను సందర్భోచితములుగా నుపయోగించని కావ్యరచన ప్రాజ్ఞ యాను రంజకముగా నుండకపోవుటయేగాక అపార్థములను గలిగించుచు రస విహీనముగా ననౌచిత్యముగా నుండును.

ఇట్టి దోషములలో ముఖ్యమైన వానినిఁ గొన్నింటిని క్రింద వివరించు చుంటిమి.

1 అప్రయుక్తదోషము — ముడ్డి మున్నగు నీచ జనులచే వాడఁబడు శబ్దములను ప్రయోగించరాదు. ముడ్డివిషయమై చెప్పవలసి వచ్చినప్పుడు తదర్థబోధకమగు పిరుదుశబ్దము నుపయోగించవలెను. బూతులు, కావ్యరచనయం దుపయోగించఁగూడదు. సంభోగాది శబ్దార్థములకు తెనుఁగు శబ్దములు నింద్యములు.

2 అపుష్టార్థము — ప్రకృతమున కుపయోగకముగాని పదముల నుపయోగింపరాదు,

ఉదా:— వింశత్యర్ధాననుని వింశత్యర్ధరథు కొడుకు తుంచెను. అనఁగా, దశాననుని, దశరథుని కొడుకు చంపెనని యర్థము.

ఇచట "దశ" అనుటకు ఇరువదిలో సగమని చెప్పుట యనుపయోగకము. ఇట్లు చెప్పుటవలన నేమి యుఁ బ్రయోజనము గూడ కాన్పించదు.

3 నేయార్థము = తాను క్రొత్తగాఁ గల్పించిన యర్థము. ఇట్టి శబ్దములు ప్రయోగించుట వలనఁ దనకే యర్థమగును గాని యితరుల కర్థములుకావు. లోకమునందుఁ బ్రసిద్ధమయిన పదములనే వాడుకొనవలెను.

ఉదా:— సాగర కర్ణ యాన = సాగరమనఁగా నేనుఁగు చెవి యందుఁ బుట్టునదము. సాగరకర్ణమనఁగా నేనుఁగు సాగరకర్ణయాన యన

నఁగా నేమఁగు నడకలవంటి నకడలు కలది. ఈ యర్థము క్రొత్తగాఁ గవీశ్వరుఁడు సంకేతించుకొనినదిగాని ప్రసిద్ధమయినదికాదు.

4 అసమర్థము — ప్రసిద్ధముగాని పదసంబంధము గలది.

ఉదా:— శరధర రాజ నికేతనుఁడు.

శరధర = సముద్రము, ఈశబ్దము ఈ యర్థమందుఁ బ్రసిద్ధప్రయోగము గాదు. శరధి, అబ్ధి ఇత్యాదు లుండవలెను. శరధర రాజ నికేతనుఁడనఁగా సముద్రశ్రేష్ఠము గృహముగా కలవాఁడు విష్ణుమూర్తియని యర్థము.

5 నిరర్థకము— పాదపూరణమునకై ప్రయోగించిన పదము.

ఉదా— "తలఁపగ వెలయుచు లలినుజ్జ్వలమగు నీతని విలాస సౌష్ఠ వమనఁగన్."

విలాసమను పదము మాత్రమిట ననావశ్యకము. తలఁపఁగన్, వెల యుచున్. లలిన్ అను శబ్దములు నిరర్థకములు.

6 చ్యుతసంస్కారము— వ్యాకరణ దుష్టమయిన పదము.

ఉదా— శ్రీకమలకాంతపద సేవా కర్మఠుఁడు.

ఇచటఁ గమలాశబ్దము స్త్రీలింగము గావునఁ గమలా కాంతయని యుండవలెను.

"కరుణవారిధి" ఇచట కరుణాశబ్దము స్త్రీలింగము గావునఁ గరుణా వారిధియని యుండవలెను.

7 అశ్లీలము — సిగ్గు, ఏవగము అమంగళము, కలిగించు పదములు.

ఉదా—"వసుదేవ యోని గోపీ
విసర మహా పీనకుచ నవీనాశ్లేషో
ల్లసితుండనఁ గాళిందీ
రస విహరణ కరణ నిత్య రసికుం డనఁగన్"

ఇచట యోని యనునది, సిగ్గును గలుఁగఁజేయునది. పీ అనునది యేవగము.

కాలింపీర=పూ_ర్తిగాఁ గాలిపోయెనను నర్థము స్ఫురించుచున్నది గావున నమంగళము.

8 క్లిష్టము—మూఁగమైన యర్థముకలది.

ఉదా—పవనాశనేంద్ర ధరమకుటాలంకారమణి జనకపుత్త్రిరమణ కుమారరూప దీపితుఁడు.

పవన=వాయువు, అశన=తిండిగల పాములకు, ఇంద్ర = అధిపతి యైన శేషుని, ధర = ధరించిన, ఈశ్వరునియొక్క, మకుట = కిరీటమునకు, అలంకారమణి = అలంకార మాణిక్యమగు చంద్రునికి, జనక = తండ్రియగు సముద్రునియొక్క, పుత్త్రి = కుమార్తెయగు లక్ష్మీదేవియొక్క, రమణ=పెనిమిటియగు విష్ణుమూ_ర్తియొక్క, కుమార = కొడుకయిన మన్మథునియొక్క వలె, రూప=సౌందర్యముచేత, దీపితుఁడు=ప్రకాశింప చేయఁబడినవాఁడు మన్మథుఁడని చెప్పుట కింతదూరము చెప్పుట దోషము.

9 సందిగ్ధము—సందేహమునకు స్థానమగు పదము.

ఉదా—సమరధరిత్రీ సంవీపిత జయశాలి పురందరనుత విక్రమునిరామునిండు"

ఇచట జయశాలియనునది పురందరునకు విశేషణమా? రామునకు విశేషణమాయని సందేహము గలుగుచున్నది.

10 విపరీతబుద్ధిప్రదము—విపరీతబుద్ధిని గలుగఁజేయునది.

ఉదా—అంబికావిటుఁడు = సాంబమూ_ర్తి అని ప్రయోగించిన వాని యభిప్రాయము. తల్లికి విటకాఁడని యర్థము స్ఫురించుచున్నది.

11 పరుషము—వినుటకుఁ గఠినములగు పదములు గలది పరుషము.

ఉదా—"కుథేడ్జాపతి మూర్ధధృతార్థోద్వధిపతి గొల్తు"

## వాక్యగతదోషములు.

1 అక్రమము — క్రమము దప్పినది.

ఉదా — ఇతనికీర్తి శౌర్యచ్ఛాయలు, సూర్యచంద్ర కిరణములం బోలియున్నవి.

2 పునరుక్తి — చెప్పిన శబ్దార్థములు రెండవ మారలఁ జెప్పుట.

ఉదా — "చక్రమున రాక్షసులఁ దునుమాడెను చక్రధరుఁడు"

3 అరీతి — రసముల కుచితముగాని పదవిన్యాసము.

ఉదా "విటజన హృదయ గ్రసనాగ్రహ గ్రహిళదృష్టి సముగ్రదగ్రమతీవ శృంగారము"

4 భిన్నలింగము } ఆడుదానిని మగవానితోఁ బోల్చుట, ఒకనిని అనేకులతోఁ బోల్చుట భిన్నవచనము.
భిన్నవచనము

ఉదా — ఇంతి చంద్రునివలె నుండును.

కత్తి పాములవలె నుండును.

5 పరుషము — కఠినార్థముగలది.

ఉదా — ఈతనికి మంచిబుద్ధి మర్మజ్ఞుఁడు సమానుడు"

6 విరుద్ధము — దేశకాలపాత్రముల గుణముగాని యర్థము.

ఉదా — "సమదవిలోల భ్రమరము చంపక వనము
సముదంచిత కైతకంబు చైత్రంబునఁ గన్"

ఇచట చంపక వనమందుఁ దుమ్మెదలుండుటయు, చైత్రమున మొగలి పూవులుండుట, విరుద్ధము.

7 విరసము — అనుచిత రసముగలది.

ఉదా — ఓరాజా నీశత్రు స్త్రీలు గుహలయందు దుఃఖించుచుండ
శబరులు సరసమాడుచుండిరి.

8 అతిమాత్రము — లోకాతీత మయినదానినిగాఁ జెప్పుట.

ఉదా—ఉఱిద చనుదోయి యాకాశము నిండెను.

9 హేతుశూన్యము— హేతువులేనిది.

ఉదా— సతిగనుఁగొనె భృంగపఙ్క్తి చమదెంచెనన్"

10 నిరలంకృతి— గుణములు చెప్పుటతో శూన్యమయినది.

ఉదా— "బాహుయుతుఁడు రాజు"

---

# CHAPTER XXV.

## Idioms,

### దేశీయములు

" ముంగొంగుపసిఁడి " ఇది దేశీయము ఇచట మున్ + కొంగు = ముంగొంగు = ముందఱికొంగు, పసిఁడి = బంగారము. ముందర కొంగు బంగారము. ముంగొంగు నున్న బంగారము. అనఁగా—ముంగొంగున నున్న బంగారమువలె సులభముగా నభీష్టమును తీర్చునది.

శబ్దమందున్న యర్థముగాక ప్రయోగరూఢిచేత మఱియొక యర్థమును స్ఫురింపఁజేయుచు ననేకులచేతఁ జిరకాలమునుండి యథాస్థితిగా నుపయోగింపఁబడుచుండుటచే నిది దేశీయమని చెప్పఁబడుచున్నది.

ఇట్టివి తెలుఁగుభాషలయం దనేకములు గలవు. వాని నౌచిత్యమెఱింగి ప్రయోగించిన కావ్యమునకు వన్నె వచ్చును.

ఇవి యిదివఱ కెక్కడను బ్రోవుగాఁ గూర్పఁబడి యుండని కారణమున మేమనేక ప్రసిద్ధ ప్రౌఢ ప్రబంధములను సాంగముగాఁ జూచి విద్యార్థుల యుపయోగార్థమై వ్రాయుచున్నాము.

1 తల్లియిల్లు = చొరవగాఁ బ్రవేశించుటకుఁ దగిన స్థలము, సమస్తమగు గోరికలుదీర్చు స్థలము. ఉనికిపట్టు "అశేష ధర్మ విశేషములకుం దల్లియిల్లై" (ధర్మజ రాజనూయము)

2 ఆకాశహర్మ్యము = ఆకాశమున మేడలుకట్టుట అసంభవము, అనఁగా అసంభవమైనకోర్కులు.

సీ. ఆకాశహర్మ్యంబు - లమరించి యందుండి
స్వైర విహారంబు - సలుపదలచు
(చాటుధార)

3 వెన్నతోడ = చిన్నప్పటినుండియు, "సనవిల్తుశాస్త్రంబు మనుజులా వర్తించు పని వెన్నతోడఁ బుట్టినది మాకు" (మనుచరిత్ర)

4 కన్నులఁ గప్పుకొనుట = అతిప్రేమతోఁ జూచుట, "కన్నవారి తెరఁగునఁ గన్నుల గప్పుకొను గొప్పతనంబు" (ధర్మజ)

"వేగ మ్మెదురేగు దెంచి కడుఁగన్నులఁగప్పుకొనుం బదుండనన్"

(విజయవిలాసము)

"నన్ను నల్లభుఁడు కన్నులఁ గప్పికొనంగనుండి"

(పారిజాతాపహరణము)

5 శిలాశాసనము = } స్థిరమైనది, శిలలయందుఁ జెక్కఁబడిన యక్షరము
శిలాక్షరము = } లెట్లు శిథిలముగాక యుండునో, అట్లు ఎన్నఁటికిని మార్పు జెందక శాశ్వతముగా నుండునది.

"అన్నమాట యన్న మనమ్మున శిలాశాసనమ్ముగఁ దలంచుచుండెదరు"

(ధర్మజరాజ)

"ఆనతియిచ్చెనా యది శిలాక్షరము" (విజయవిలాసము)

"పలుకు శిలాక్షరంబు జయపాలనరూపములా నిరూపముల్"

(రామాభ్యుదయము)

9 అయిదుపది చేయుట = నమస్కరించుట, అనఁగా, అయిదయిదుగానున్న రెండుచేతుల వ్రేళ్ళను గలిపి పదిచేయుట.

"సామంత భూకాంతలు ...జయజయ నివాదములతో నైదుపది చేయుచుఁగా" (ధర్మజ)

నవ సమాగమ వేళ నయ్యవసరమున
నువిదలజ్జాభరంబున కోహటించి
యైదుపది చేసె వలరాజు నంతవాఁడు
నరయ నెవ్వానిసామ్ము జయాప జయము"

(శృంగారనైషధము)

7 మాటలు చెవిని నాటుట = తెలియునట్లు స్పష్టముగాఁ జెప్పుట.

"ఏదియో నాలుగు మాటలు నీచెవి నాటబూనుకొన్నాడ"

(ధర్మజ)

8 తలపట్టులు పట్టుకొనుట = వివాదపడుట యని యర్థము. జుట్టు పట్టుకొని పోరాడుట.

"తమలోఁ దాము తలపట్టులు పట్టుకొనుచు నష్ట కష్టముల పొలుగుదురు" (ధర్మజ)

"లోఁదలపట్లు పట్టుకొని కుయ్యో యంచు మొఱ్ఱో యటంచును క్షోభిల్లుచు." (చాటుధార)

9 పట్టిపల్లార్చుట = వివాదముచే సిద్ధాంతముచేయుట.

"జారచోరాదులు సుజనములం బట్టి పల్లార్తురు" (ధర్మజ)

"నిజముగాఁ బట్టి యిపుడింత నెలఁతలార
పట్టి పల్లార్చి నామీద నట్టి లేని
పోని వాదు వేయఁగఁ బాడియౌనెమీకు"

(రసికజనమనోరంజనము)

10 తాఁబెట్టినదేభిక్షము = తనవలననే యారంభమైనది.

"సకలకృత్యములయందుఁ దాఁబెట్టినదే భిక్షమనుచు కేలని సధిక్షేపించుదు" (ధర్మజ)

11 కారాలు మిరియాలునూరుట = మిక్కిలి కోపముచేయుట, మొదట కారము, అందులో మిరియములుగూడ గలిపి నూరినపక్షమున మఱింత కారముగా నుండును.

"నోరెఱుఁగనివానిపై కారాలు మిరియాలు నూరుచు" (ధర్మజ)

12 ముక్కుకోతలు = చిక్కులు పెట్టుట,

"అనుచరా రితులు ముక్కుకోఁతలకులోనై మొక్కఁగా చిక్కులే కునికిఁ" (చాటుధార)

"రైతులకు మూక్కు-కోతలుగా కోతలువైచుచు" (ధర్మజ)

13 తల తాకట్టు పెట్టుట = తా నమ్ముడువోవుట

"ఎచ్చటనో తల తాకట్టుపెట్టి తెచ్చి" (ధర్మజ)

14 కానువీసము = కొంచెము, (పైసలో 80 వ వంతు)

"కానువీసమేని వసూలుచేయ శక్యముకాదయ్యె" (ధర్మజ)

15 నున్న నున్నంగలిసె = నశించిపోయెను.

"పనులన్నియు నున్ననున్నలం గలిసెనని యప్పులదేలిచి యొప్పగింతురు" (ధర్మజ)

16 గడ్డితినుట = లంచములఁ బట్టుట.

17 గడ్డి గఱచుట = చిక్కు-లఁబడుట.

"అడ్డమయినగడ్డి గఱచుచు సొమ్ము సంపాదించెను." (ధర్మజ)

18 అచ్చుపోడిచిన యాఁబోతులు = స్వేచ్ఛగా (హద్దులేక) తిరుగువాండ్రు.

"రాజభటుల నచ్చుబోడిచిన యాఁబోతులరీతిని విచ్చలవిడిగా విడవాడినచో" (ధర్మజ)

19 పెట్టనికోటలు = స్వతస్సిద్ధము నుండు కోటలు, ఆక్రమించ శక్యము కానివారు, నిరాకరించ శక్యముకానివారు, రక్షించువారు.

"వారలకుం బెట్టనికోటలై" (ధర్మజ)

"పెట్టనికోటగాదె గజబృందములెందును రాజధానికిన్" (విజయవిలాసము)

20 ముల్లుచూపుట = పక్షపాతములేకుండుట, త్రాసు రెండువైపుల సమానముగా నుండునప్పుడు ముల్లు కాన్పించనే కాన్పించదు. ఎటు బరువుగానున్న నావైపునకు వంగును.

ఉదా—ధర్మము వలనన మలుస్నూవు, గౌరవంబున పేర్మికి"
(భారతము)

21 అందెవేసినచేయి = నేర్పరి, అందెవేయుట యనఁగా నొక విద్యయందు సంపూర్ణ ప్రజ్ఞ కలవానినిఁగాఁ దెలియఁజేయు బిరుదు.

"అష్టాంగమయిన యాయుర్వేదమునం దీతఁ డందెవేసిన చేయి"
(ధర్మజ)

22 పేరుపెట్టుట = నే నిట్టి ప్రసిద్ధుడన" పేరుతోఁ బలుకుట.

"లోకపాలుర సభలుగాని, యా కమలాసను సభగాని నీ సభ కట్టి దుటఁ బేరుపెట్టి పలుకం దగవు"
(ధర్మజ)

23 ముంగొంగు బంగారము =
ముంగొంగుపసిఁపసిఁడి = } సులభముగా నభీష్టమును నీర్చునది.
కొంగుపసిఁడి =

"సాధువులకును సుధీజనులకు ముంగొంగు బంగారంబవై పూజ్యంబుగా రాజ్యంబు పాలింపఁగలవు"
(ధర్మజ)

" పరమార్థలాభతత్పరుఁడైన వానికి ముంగొంగుపసిఁడి శ్రీరంగశాయి"
(కవికర్ణరసాయనము)

" కోపమెుకింత లేదు బుధకోటికిఁ గొంగు పసిండి "
(విజయ)

" భక్తజనులకు ముంగొంగు పసిఁడికాఁడె "
(సారంగధరచరిత్ర)

" మాట ముంగొంగు బంగారు మాట మాకు "
(రసికజనమనోరంజనము)

24 త్రవ్వి తలకెత్తుట = నిశ్శేషముగా నిచ్చుట. ఎక్కువగా నిచ్చుట. అమితలాభము గలిగించుట.

"కొమరుఁ బుట్టి తమకేమో యట్టిత్రవ్వి తలకెత్తెదరను చిత్తంబుతో"
(ధర్మజ.)

తమకు నేమి త్రవ్వి తలకెత్తి రమరులీ, యుర్వి మనుజులేమి యొసఁగ రైరి."
(వైజయంతీవిలాసము)

25 కోరికలీరిక లెత్తుట = కోరిక లభివృద్ధినొందుట.

"ఉపవాసాయాసంబులచే మిక్కుటముఁ గోరికలీరిక లెత్త బిడ్డలంగని"
(ధర్మజ.)

26 కనుగీటుట = పిలపిచ్చుట, పురికొల్పుట.

"మీరు కాసంత కనుగీటినచో నెంతటి పనియైన నవంతలో గోటు మీటుకొని వచ్చువారము."
(ధర్మజ.)

27 గోటమీటుట = నిర్లక్ష్యముగాఁ జేయుట.

"గోటమీటుపని గొడ్డంట చేయఁదగునా!"

28 కన్నుల కఱవు = కన్నులకు మంచి విషయ పదార్థము లేక పోవుట.

నీ వచ్చుటికి విచ్చేయుటంజేసి యాకొన్న నాకన్నుల కఱవుదీరె."
(ధర్మజ)

"కంటిమాతని కన్నుల కఱవుదీర" (రసికజనమనోరంజనము)

29 కరతలామలకము = అరచేతిలో నుండు ఉసిరికకాయ, అతిసులభముగా నలవడునది. ఉసిరికకాయయే నిర్మలమై లోనుండు గింజను గాంపించును. అది యరచేత నుండిన యెడల మఱియు స్పష్టముగాఁ గాన్పించుటకు నవకాశము కలిగియుండును.

"సకల వృత్తాంతములును నీ చిత్తంబునకుఁ గరతలామలకమై యున్నవి"

29 కర బదరము = అరచేతిలోని రేఁగి పండు, సులభమైనది.

"కరబదరసమానం"

30 ముత్యమంత మాట = కొలఁది మాట,

" సత్యమగు నీ ముత్యమంత మాట " (ధర్మజ)

31 కన్నుగాన కుండుట = కంటితోఁ జూడని స్థితికి వచ్చుట, మత్తెక్కుట

" జరాసంధుఁడు గర్వాంధ కారమునఁ గన్నుగానకున్నవాఁడు." (ధర్మజ)

32 కన్నీరు మున్నీరు = కన్నీరు సముద్రము. మిక్కిలి యేడ్చుట.

" హంసుండు కన్నీరు మున్నీరగుచుండఁ గృపాణంబునకుఁ దన ప్రాణంబులు బలియిచ్చె "

33 చిగిరింతయైశ్వర్యము = చిగిరింతగడ్డి మిక్కిలి యేపుగా నెదిగి అతిశీఘ్రముగా నెండిపోవును. దానివలె నెదిగి వెంటనే నశించు నైశ్వర్యములు.

" ఈ చిగిరింత యైశ్వర్యమునకై యింతపొంగ నేల "

34 చెవులు బట్టి యాడించుట = లోకువ చేయుట.

" భూవిభుండారంభ రహితుండైనపోఁ బగవారు తలమీఁది వాని నయినం జెవులుబట్టి యాడింతురు." (ధర్మజ)

" నినుగీతి సాహితీమో హన వాణులు చెవులు బట్టి యాడింపంగాఁ " (విజయ విలాసము)

" చిన్నిప్రాయపుఁ లేడి జెవులు వట్టాడించు గతినున్నదీ రామ కన్నుదోయి "

35 తలమీఁదివారు = తనకంటె నెక్కువ వారు.

36 మాటఁ గట్టుకొనుట = సంపాదించుట.

' పాపంబు దక్కఁదా మాటఁగట్టుకొనుచదేసియుఁ జూపట్టదు" (ధర్మజ)

37 ఎండ్లును బూండ్లు = }
ఏడులు బూడులు = } అనేక సంవత్సరములు.

"ఎఱకలుఁగట్టుకొన్న మరియేడుఁబూడులుఁబట్టు"
(మనుచరిత్రం)

"మొట్టమొదటనుండి తుట్టతుదవఱకు వర్ణించుట కేడ్లంబూండ్ల నుఁబట్టును"
(ధర్మజ)

38 ముద్దులమూటఁగట్టుట = సొగసుగానుండుట,

"ముద్దుల మూటఁగట్టు తనపట్టి నక్కుఁజేర్చియెత్తుకొని"
(ధర్మజ)

"పాదలు వేఁడుక ముద్దుల మూటఁగట్టి"
(రసికజనమనోరంజనము)

39 గొండ పిండిగొట్టుట = దుర్ఘటమయిన కార్యమును సాధించుట.

"మేము ముగ్గురము పనికి మొగ్గితిమేని గొండ పిండి కొట్టనేర్తుము"
(ధర్మజ)

40 మూనాళ్ళ పట్టపగలు = అత్యల్పకాలము.

"మూనాళ్ళ పట్టపగటిసిరికే పట్టపగ్గములు లేవు"
(ధర్మజ)

41 పట్టపగ్గములు లేవు = పట్టుటకుఁ దారిళ్ళు లేవని యర్థము. అనఁగా లొంగఁడనుట.

42 బొగ్గుగఱచుట = } నీచదశకువచ్చుట.
పూరిగఱచుట = }

"వారు కట్టకడకు సిగ్గుపడి బొగ్గుకఱవకమానరు"
(ధర్మజ)

43 కన్నుగుట్టుట = సహించకపోవుట.

"వాని సిరిఁజూచి కన్నుగుట్టినది."

44 నోటికి తాళము వేయుట = మాటరాకుండఁ జేయుట.

"ఈపాటికి నోటికి తాళము వేయవచ్చును"
(ధర్మజ)

45 వెన్ను బాముకు కబురందుట = కొట్టుట.

"నీకు వెన్నుబామునకుఁ గబురందనున్నది."
(ధర్మజ)

46 మన్ను మిన్ను గానకుండుట=క్రిందుమీఁదులు తెలియకుండుట.

"మీరు మన్ను మిన్ను గానకున్నారు" (ధర్మజ)

47 మూటికి ముడివేయుట=మొండికెత్తుట.

"మూటికి ముడివేసినవారికి సిగ్గేమి యెగ్గేమి" (ధర్మజ)

48 పోచికోలుతిండ్లు = పనియేమియుఁ జేయక తినుట.

"వెండిగిన్నెలో వెన్ననించుకొని; పైఁడిగిన్నెలో పాలుఁబోసుకొని పోచికోలుతిండ్లు తినుచు" (ధర్మజ)

49 రాలచేలకు గుంటుక తోలుట = కష్టసాధ్యమయిన పని చేయుట.

50 మింటికి మంటికి నూత్రిము పన్నుట=అసందర్భాలోచనము వేయుట.

"మింటికి మంటికి నూత్రిములు పన్నుటవలన ఫలమేమి? "

51 పుక్కిటిపురాణము=వ్యర్థపుపలుకులు, అబద్ధపుపలుకులు.

"పుక్కిటిపురాణముల బ్రోద్దుఁపుచ్చునతఁడు చాలఁనె పురాణములు విప్పి చదివి చెప్ప" (రామలింగేశ్వరశతకము)

"కన్యకయిది పుక్కిటిపురాణమైతోఁచెఁజుమీ" (రామాభ్యుదయము)

52 నేలఁబెట్టికాలరాచుట=మిక్కిలి కష్టపెట్టుట.

"అప్పడుచుల నప్పగిదినేలఁబెట్టికాలరాచునట్టి యాచిన్నవాండ్రు" (ధర్మజ)

53 ఉప్పులేక ముప్పందుము త్రాగుట=తనకాధారము లేకపోయినను గొప్ప పనులకుఁ బ్రయత్నించుట, బడాయిగొట్టుట, దంభములు గొట్టుట.

"ఉప్పులేక ముప్పందుము త్రాగుచు గద్దె పొంకములు చాల దిద్ద గలరే" (ధర్మజ)

54 గద్దెపొంకములు=అధికారపీఠముపైఁ గూర్చుండి చెప్పుమాటలు.

55 నల్లేరుపైఁ బండి = నిరభ్యంతరము, సులువు.

"నల్లేరుపైఁ బండి నడకమాకు" (నానారాజసందర్శనము)

56 మిట్టపెత్తనములు = మెరకను గూర్చుండి చేయు పెత్తనము. పనికి
కట్టి పెత్తనములు = ప్రయోగించబడనుట.

"కట్టికుంటలకుఁ బనులంటఁగట్టి మట్టగిడసలవలె మిట్టపడు మిమ్ము మిట్టపెత్తనములకు విడిచి పెట్టుట మాతప్పె" (ధర్మజ.)

57 ముక్కు మొలచిపోవుట = చెడుట, గింజ ముక్కు మొలచుటచేత చెడిపోవును.

"ఒక్కసారి యక్కడికా లిక్కడకు వేసినచో ముక్కు మొలిచి పోరుగాని రండి" (ధర్మజ.)

58 ముక్కుపై వ్రేలువేసికొనుచు = ఆశ్చర్యపడుట.

"అక్కడి విశేషములు వీనుల కెక్కినంతన యెంతటివారును ముక్కుపై వ్రేలువేసికొనరు" (ధర్మజ.)

59 నక్కనడుముత్రొక్కుట=శుభకరమగుట.

"మనమీ దిన మిక్కడికి నక్క నడుము ద్రొక్కి వచ్చినారము" (ధర్మజ.)

60 ముందరికాళ్ళకు బంధములు వేయుట=రాఁబోవుదానికి, అడ్డుచెప్పుట.

"ముందరికాళ్ళకు బంధములు వేయుచు యుండెవరి నేని ముందుగా నిన్ను జెప్పి చెప్పవలయు" ధర్మజ.

61 కార్యములు గట్టెక్కించుట = నెరవేర్చుట.

"సమరంబున నరి సేలమట్టి కార్యము గట్టెక్కించుకొను వాఁడను" (ధర్మజ.)

62 కాలుత్రొక్కుకొనివచ్చుట = వెంటఁబడివచ్చుట.

"మీకును మాకును నీవైరంబెక్కడనుండి కాలుద్రొక్కుకొని వచ్చెనో యెఱుఁగను" (ధర్మజ.)

63 డొక్కలో మెదలుట = ఎల్లప్పుడు బెదరుతో జ్ఞాపకము వచ్చుట.
"మేమనఁగా నిఁక నీడొక్కలో నొక ప్రక్క మెదలువారము"
(ధర్మజ.)

64 ఆకాశపంచాంగము = నిరాధారపుమాటలు.
"నీయాకాశపంచాంగము నాచెంగట విప్పఁజనదు" (ధర్మజ.)

65 తలగిల్లి మొలవవేయుట = తలక్రించి పాతిపెట్టుట, అనఁగా నాశనము చేయుట.

"నన్నేమో మీరు తలగిల్లి మొలవవేయుదురని భీతిల్లఁబోను"
(ధర్మజ.)

66 లట్టాభట్టీయము = అసంబద్ధ ప్రలాపము.
"నీలట్టాభట్టీయము లేల నేకరువు పెట్టెదవు" (ధర్మజ.)

67 హృదయశూలము
హృదయగతశల్యము
హృదయశంకువు

బాధచేయునది.

"నేను మీకు హృదయశూలమనై యున్నాను" (ధర్మజ.)
"ఒప్పిదంబున వీనికోడిన శరధులు హృదయశల్యవ్యథ సేయకున్నె"
(కవికర్ణరసాయనము)

68 పిచ్చుకపై బ్రహ్మాస్త్రము = కొద్దివానిమీఁదవిస్తారప్రయత్నము చేయుట.
"పిచ్చుకపై బ్రహ్మాస్త్రమన్నటుల నిను గాలమట్టుటకు మేము మువ్వురమేల ?" (ధర్మజ.)

69 రాయిగుద్దుట = దృఢముగాఁజెప్పుట.
"నీవు బుద్ధిమాలినవాఁడవు గావున రాయి గుద్దు బూటకములు పాటించితివి" (ధర్మజ.)

70 కోనాకులుమేయుట = పైపైనచూచుట, లోతునకుదిగి విమర్శింపకుండుట.

71 లేఁతసొరకాయలు నరుకుట=దంభములు, పలుకుట, సొరకాయ = ఆనపకాయ, లేఁతవి నరకుట మిక్కిలి తేలిక అనగా కార్యనిర్వహణశక్తి లేనిమాటలు చెప్పుట.

"మీరు లేఁతలేఁత సొరకాయలు నరకువారు గావున మగతనమనునది మీయూరపేరఁ బిలువగానరాదు" (ధర్మజ.)

72 ఊరిపేరఁబిలుచుట=ఊరిలో పేరుపెట్టి బిలిచినను దొరకఁడు.

"ఊరిలోనే లేనపుడు వానికిని బొత్తిగా నాకరములేదు."

73 మేకపోఁతు గాంభీర్యము=మేకపోతుయొక్కవలె ధైర్యము. ఒక మేకపోఁతు అడవిలోఁ దనమంద యంతయు ముందుపోఁగాఁ దప్పిపోయి త్రోవ తెలియక యొక చోటనుండఁగా నొక సింహామువచ్చి గడ్డము పెంచితివేమని యడిగినది. అందుకు మేకపోఁతు నేనొకదీక్ష జేసితిని అంత పర్యంతము క్షురకర్మ చేయించుకొననని యా దీక్షయేమనఁగా నూరు పెద్దపులులను, ఇరువదియైదు ఏనుఁగులను, ఒక సింహామును దినవలెనని. అట్లు పెద్దపులులను ఏనుఁగులను దింటిని. ఒక సింహామును దినవలయును, తరువాత క్షురకర్మఁజేయించుకొనెదను. అని చెప్పఁగా మేకపోఁతు తన్ను దినునేమోయని సింహాము పారిపోయెను.

'వాయునందనుఁడు కను లెఱ్ఱవాఱ మిఱ్ఱిమిఱ్ఱి చూచూచు నేమో మేకపోఁతు గాంభీర్యము నభినయించుచున్నాఁడు. (ధర్మజ)

74 తూరుపాఱఁబట్టుట= తేలికచేయుట, ఎగురఁగొట్టుట, ధాన్యపుతూరు (అనఁగాఁ బొల్లు) గాలిలో నెగురునట్లు పట్టుట.

'నాలుకతుది పలుకులైన నూరక తూరుపాఱఁబట్టుచున్నాఁడవు' (ధర్మజ)

75 నాలుక తుది పలుకులు = అప్రధాన వాక్యములు.

76 త్రవ్వి తలపోసికొనుట = పూర్వపు సంగతులను మరల జ్ఞప్తికిఁదెచ్చుకొని యదియె యాలోచించుట.

'లేనిపోనివి త్రవ్వి తలపోసికొననేల, (ధర్మజ)

77 వీనులు చిల్లులుపోవుట= } చీకాకుగా మాటలాడుట, శ్రుతి
చెవులు చిల్లులుపోవుట= } కటువుగా పలుకుట,

'వీనులు చిల్లులుపోవ నాపొల్లుమాటలు వల్లించిన ఫలమేమి ?
(ధర్మజ)

'చిలుకలు వల్కునో చెవులు చిల్లులువోవఁగ నంచునెన్నఁడున్,
(శృంగారనైషధము)

78 పుంఖానుపుంఖము = ఒకదానివెంబడి నొకటి, పరంపరగా

'ఆ మగధ నాధుండును సాయంకాలవిహిత శంఖారవంబులు పుంఖానుపుంఖంబులుగా శ్రవణకుహరంబులు జొరబార, (ధర్మజ)

'పులకలు పుంఖానుపుంఖముగ భీతిమదిన్ దలకొన'
(కవికర్ణ రసాయనము)

79 శాఖోపశాఖలు=ఒకమాటవెంబడి దానితోఁ గలసిన మఱియొక మాట. ఒక కొమ్మకు బయలుదేరిన మఱికొన్ని చిన్నకొమ్మలు.

'శాఖోపశాఖవారి, వైఖరిఁ దెలుపంగ,
(శంతనూపాఖ్యానము)

80 వెఱ్ఱిమొగము = తెలివిలేనివాఁడు

ఆవెఱ్ఱిమొగము భీమునియొద్దఁ జూచుకొనియే గుండె బెదురులేక వాపోవనేరిచెను, (ధర్మజ)

81 గుండె చెఱువగుట = భీతిపుట్టుట.

'ఆ అహాశాహాళింగాంచి వారిగుండె చెఱువైపోయెను, (ధర్మజ)

82 కుడిచికూర్చుండుట=తీరికగా నుండుట.

'ఆగోపాలుఁడు కుడిచి కూర్చుండలేక చెట్టుగొట్టి వైనవేసికొనెను.

(ధర్మజ)

'కుడిచి కూర్చుండి వెతఁదెచ్చుకొంటి మొకటి,

(ప్రిభావతీప్రిద్యుమ్నము)

83 చెట్టుగొట్టి వైనవేసికొనుట = వ్యర్థముగా బాధ తెచ్చికొనుట.

84 కాలు గదల్చుట = నడచుట, వెళ్లుట.

'తమరు కాసంత కాలు గదల్చినంతన యెంతటివారును, (ధర్మజ)

85 చెట్లుపాలై గట్లపాలై = చెల్లాచెదురై.

'వారు చెట్లుపాలై గట్లపాలై పోవఁజొచ్చిరి, (ధర్మజ)

86 ఎదురెత్తు = అడ్డు, పైయెత్తువేయుట. 'అలదైవం బిత్తరి మన కెదురెత్తు వేయుచున్నది.' (ధరజ్మ)

87 దుంపలు దంపలుచేయుట = కష్టపడుట.

దుంపలు మెరకయందుఁబుట్టును. అట్టి మెరక తావులను పల్లపుతావులుఁగాజేయుట.

'దుంపలు దంపలుచేసికొని వచ్చితిమి' (ధర్మజ)

88 దారముగట్టుట = స్వాధీనము చేసికొనుట, మంగళసూత్రిము గట్టుట.

'ఏవారును మనము దారము గట్టితిమని మీఁదిచూపు చూడరాదు.

89 చేయిమీఁదగుట = ఇచ్చుట.

90 చేయక్రిందగుట = పుచ్చుకొనుట.

'ఆదిన శ్రీసతికొప్పుపై దనువుపై వాంసోత్తరీయంబుపై

పాదాబ్జంబులపైఁ గపోల తటిపైఁ బాలిండ్లపై నూత్నమ

ర్యాదంజెందుకరంబుక్రిందగుట నా హస్తంబుమీఁదౌటమే
ల్గాదేరాజ్యము గీజ్యము న్నతఁతమే కాయంబునాపాయమే.'

(భాగవతము.)

91 కత్తినూరుట = యుద్ధమునకు సిద్ధమగుట.

'ఇత్తటి మనపైఁగత్తినూరుచున్న వాఁడెవండో యెఱుఁగరా? '

(ధర్మజ)

92 వెన్నుజూపుట = ఓడిపోవుట, పారిపోవునప్పుడు వీపుజూపెననుట.

'మున్నుగనేవానికిఁ దనవెన్ను జూపమికై యొక పన్నుగడఁ బన్నను' (ధర్మజ)

93 తలదన్నుట = అతిశయించుట.

'లోకమునందన్న దలదన్నువాఁడు లేడుంకునే'

'జౌదల దన్నం జనుసట్లుమించెననినం దప్పేమి యొప్పేయగున్'

(కళాపూర్ణోదయము.)

94 మూఁడుపూవులాఱుకాయలు=అభివృద్ధి. ప్రతి పువ్వునకొక్క కాయ సహజము. ఇచట పూవునకు రెండుకాయలు చెప్పుట అతిశయ కథనము.

"మనపని మూఁడుపూవు లాఱుకాయలుగా నున్నదని యెన్నఁడు మఱియరాదు. (ధర్మజ.)

95 ఆఱుమూఁడగుట = చెడిపోయె ననుట.

"నాపని యాఱుమూఁడయ్యెను, (ధర్మజ.)

96 పట్టినదెల్లబంగారు=ప్రయత్నించిన ప్రతికార్యము సఫలమగుట.

"పట్టినదియెల్లబంగరు ముట్టినయది యెల్ల నాణెము త్రెంబయ్యెన్"

97 బుజము బుజముకలుపుట=కార్యమునకు సహాయమగుట. పుణారిమోయు నప్పుడొకఁడెగుబుజము మఱియొకఁడు దిగుబుజము వేయక సరిగాపట్టుట

"ఎన్నిగతులఁజూచినఁ దమరావెన్నునితో బుజముబుజము గలంపు టయేమేలు" (ధర్మజ.)

98 పాలముంచెదరో నీలముంచెదరో = మేలుచేసెదరో కీడుచేసెదరో.

'నీలవేణిరో దీని నీలముంచెదవో పాలముంచెదవో నీ పాలబడితిని' (స్త్రీలపాటలు)

'సీ. నీదెభారమునమ్మ నీటనుముంచెదో పాలనుముంచెదవో యీబాలనింక. (శశిరేఖావాటకము)

99 మిన్నువిరిగి మీఁదఁబడుట = ఆపత్తు తటస్థించుట.

ఇప్పుడేమి మిన్ను విరిగి మీఁదఁబడునని యెన్నుకొనుచు' (ధర్మజ.)

100 నాలుగాకు లెక్కువచదువుట = ఎక్కువ తెలిసియుండుట.

'అందుకు నాలుగాకు లెక్కువయే చదివితివి' (ధర్మజ.)

101 మింటఁబెట్టిన దీపము = గొప్పకనము, ప్రసిద్ధము,

'వాఁడు మింటఁబెట్టిన దీపమువలె మిట మిట లాడుచున్నాఁడు' (ధర్మజ.)

102 తలఁబట్టుట = సమగ్రముగాఁ దెలియుట.

"చదివిన పురాణములన్నియు నాకుఁ దలఁబట్టి పోయినవి" (ధర్మజ.)

103. తలకొట్టుట = నర్జీవము చేయుట, పరాభవము చేయుట.

"కట్టా! నాకుఁ దలకొట్టిన యట్టుల నట్టిపలుకులు నీమోడఁ బుట్టఁజనునే, (ధర్మజ.)

104 గతజల సేతుబంధనము = గతించినదానికి విచారించుట. నీరుపోయిన తరవాత సేతువుగట్టుట.

"గతజలసేతుసంబంధనము గాదె యికం బరితాపమొందుటల్" (శంతనూపాఖ్యానము.)

105 గండకత్తెర = దాటశక్యముగాని కష్టము, చావునకై మెడకుఁగత్తెరఁ దగుల్చుకొనుట,

"ఆ త్రతిదండఁజేరి గుత్తుకకు గండకత్తెఱ పొసంగిన గతి గడగడ వడంకుచు" (ధర్మజ.)

106 చాలుమూల, వీలువాలు = సందర్భము.

'చాలు మూలలేని జాలునవాచే నాలాగున వాగించితివి,

(ధర్మజ.)

107 కాలు ద్రవ్వుట = కయ్యమునకు సిద్ధపడుట = ఆఁబోతు పోట్లాడు నపుడు కాలిచే నేల త్రవ్వును. అందువలన రెండవ దానికి కోప మెక్కును.

'దవ్వు దవ్వుగా నిలిచి చివ్వకుఁగాలు ద్రవ్వుచు। (ధర్మజ)

108 రామరాజ్యము = సుఖమయిన రాజ్యము.

'జనులకు మీరాజ్యము రామరాజ్యముగఁ దోఁచుచున్నది.

(ధర్మజ)

ఈతి రహితమగునటుల భూమి రామరాజ్యముగ నేలుచుండి,

(సారంగధరచరిత్రము.)

109 సుగ్రీవాజ్ఞ = దృఢమైన శాసనము. అతిక్రమించఁగూడని ఆజ్ఞ

'మీ యాజ్ఞ సుగ్రీవాజ్ఞఁగా దోఁచుచున్నది, (ధర్మజ)

110 సిగపువ్వులు జుట్టుట = స్వేచ్ఛగా నుండుట.

'అభయంబనునది సిగపూవులు జుట్టె, (ధర్మజ)

111 తోసిరాజు = అలక్ష్యపెట్టుట. చదరంగపుటాటలో రాజుమీఁదికొక జంతువును ద్రోసి రాజనుట.

"కలికిముఖారవిందముల కల్వలు రాయనిఁదోసి రాజునక్"
(విజయవిలాసము.)

112 గోవిందలుగొట్టుట=ఉత్సాహముతో గోవిందస్మరణచేయుట.

"చతుర్విధాహార పరిధానాభీష్టమృష్టాన్నంబుల విందు పెట్టులచుకొంచు గోవిందలు కొట్టుకొంచు జిహ్వాలు చివురించునట్లు భుజించుచు.
(ధర్మజ)

113 నేత్రపర్వము = } నేత్రముల కానందముచేయునది.
కనుపండుగ = }

"ఏమేసీమల నేమేచిత్రంబున నేత్రంబుల కపూర్వ పర్వంబులొసర్చె.
(నీతిచంద్రిక-విగ్రహము)

కన్నులపండువై ధగధగం జిగి రంగు తురంగలింపఁగా"
(కవికర్ణరసాయనము.)

114 శశవిషాణము = లేనిది. కుందేటికొమ్ము. కుందేటికిఁ గొమ్ముండదు
'దేశాంతరమందున్న నాఁటి నాకుశలము శశవిషాణము,
నీతి చంద్రిక - విగ్రహము.)

'శశవిషాణంబు దీర్ఘమై సంభవించె.
వికసితంబయ్యెగగనారవిందము పుడు, (కవికర్ణరసాయనము.)

115 వెనుకముందర = మంచియుఁ జెడ్డ.
'అయిన నప్పటి వెనుక ముందర ఆలోచించి,
(నీతిచంద్రిక - విగ్రహము.)

116 వంటయింటి కుందేలు = స్వాధీనమైనది.
'వంటయింటి కుం। లేదిదయెందుఁబోఁగలదు. నేటికి నే మనియుండు కందులన్'
(విజయవిలాసము )

117 నీటివ్రాలు = నిలిచి యుండనిది.

'మన యత్నంబులన్ని నీటి వ్రాలగును,

(నీతిచంద్రిక - విగ్రహము.)

118 పులినోటికండ = తప్పక నశించుటకు సిద్ధమైనది.

"ఏమిచెప్పం బులినోటికండ విడిపడ్డట్లు దలపట్టి మాచుకొందుం జేను చేటుదప్పె ననుచున్" (ప్రభావతీప్రద్యుమ్నము)

119 కాళ్లుబట్టుకొనుట = బ్రతిమాలుకొనుట.

"పొట్టకై యట్టిహీనుని కాళ్లు పట్టుకొని కష్టపు జీవనము జీవించుటకంటె" (నీతిచంద్రిక-విగ్రహము)

120 చెప్పకచెప్పెడు = ఒకరుచెప్పక తెలియఁబడుట.

"ప్రాయపుం జిఱుతతనంబు మీ మొగము చెప్పకచెప్పెడునద్దిరయ్య"

(మనుచరిత్ర)

121 నీళ్లు నములుట = మాంద్యము వహించుట.

"నీ వివియన్నియు నీళ్లునములక దిటంబున నొక్కరుంబునఁ బలుకవలయుఁజుమీ (నీతిచంద్రిక-విగ్రహము.)

"నావుడును నీళ్లునములుచు । నావిహగము చెప్పబొంక, నంచయు దానిన్' (ప్రభావతీప్రద్యుమ్నము)

'నీళ్ళునములుచు మగువల నెలుగుపరచి; నిక్కరాయంచ నీతిండి నీరుగాను'

122 పయిబూసికొనుట = సంబంధములేనివి కలుగఁజేసికొనుట.

'అయినదానికిఁ గానిదానికి నడ్డమువచ్చి పయిబూసికొనక'

(నీతిచంద్రిక-విగ్రహము)

123 కన్నెఱుంగుట = అభిప్రాయమెఱుంగుట.

'రాజు కన్నెఱింగినవాఁడవై యాతని చిత్తవృత్తి ననువర్తింపవలయు' (నీతిచంద్రిక-విగ్రహము)

124 చర్విత-చర్వణము = } చేసినదియే మరలఁజేయుట,
పిష్టపేషణము = }

'పోయినదాని మరలఁ ద్రవ్వుట చర్విత-చర్వణము'
(నీతిచంద్రిక-విగ్రహము)

125 చెవివేయుట = చెప్పుట.

'ఎప్పటి కప్పుడు మన చెవులవేసి చనుచుండవలయును'
(నీతిచంద్రిక-విగ్రహము)

126 వ్రేలుమడచుట = లెక్కపెట్టుట,

'వ్రేలుమడచి యొక్కని నెఱిగింపుము'
(నీతిచంద్రిక-విగ్రహము)

127 చెవికిచేదు = వినుటకసహ్యమయినది.

'చెవికిఁజేదుగానున్నను దమకుఁదోఁచిన హితము నిక్కముగ వా
రికివ్వవలయును' (నీతిచంద్రిక-విగ్రహము.)

128 గుజగుజలువోవుట = రహస్యమాడుకొనుట,

'కొంతనడి పొట్టపొరలై గుజగుజలువోయి డాయఁజూచిన'
(నీతిచంద్రిక-విగ్రహము)

129 బొనఁగ = బాగుగా నున్నదనఁగా,

'అంద బొనఁబ్రతికి' (నీతిచంద్రిక-విగ్రహము)

130 చేఁదోడువాదోడు = పనికిసహాయము, మాటకుసహాయము.

'చేఁదోడు వాదోడుగన్'

131 చెవినిల్లుగట్టుకొనుట = తరుచుగాఁజెప్పుట.

'మేమెల్లఁ బలుదెఱంగులఁ జెవినిల్లుకట్టుకొనిపోరిన మామాటలు
పాటిగాఁగొనక' (నీతిచంద్రిక-విగ్రహము)

132 పెడచెవిఁ బెట్టుట = వినకుండుట.

'పెడచెవిం బెట్టి నీ మనఃబట్టుకొన్న యున్మాదంబు మానవైతివి'

(నీతిచంద్రిక-విగ్రహము)

133 ఉవ్విళ్ళూరుట = మిక్కిలి ఉత్సాహపడుట.

'వాడుకనుంగవ సోల శయ్యపై

పడఁతులు లేదు సంభ్రమము భర్తల నువ్విళులూర్చ్వగ్రమ్మరన్'

(కవికర్ణరసాయనము.)

134 చేదుమేపుట = ఇష్టములేని పనినిఁ జేయించుట.

135 కాటికిఁ గాళ్ళు జాచుకొనుట = చావసిద్ధము గానుండుట

'నేనిప్పుడు నిరాశ్రయతా దశను మ్రగ్గి కాటికిఁ గాళ్ళు సాఁచుకొనియుంటిని. (నీతిచంద్రిక-విగ్రహము)

136 గుక్కిళ్ళు మ్రింగుట = ఆశపడియుండుట.

'నేనిప్పుడు నీపొందునకే గుక్కిళ్లు మ్రింగుచుందును'

(నీతిచంద్రిక-విగ్రహము)

137 గుండియ రాయిపడి = ఒడలెఱుంగక,

'మర్జాలంబా మొఱకుం దూరమునుండి కాంచి గుండియరాయిపడి యుంగ మాకంపింప నెఱుకకిట్లనియె' (నీతిచంద్రిక-విగ్రహము.)

138 మనసువిరుగుట = ఇష్టముపోవుట.

'అంతనామాటల మనసువిరిగి' (నీతిచంద్రిక-విగ్రహము.)

139 కట్టికుడుపుట = అనుభవింపఁజేయుట.

'నాపాపఫలముతోడ నె కట్టి కుడిపినది'

(నీతిచంద్రిక-విగ్రహము.)

140 నక్కలెక్కుపడుట = మాటరాకుండుట,

'మారుతుండు దారసంబై యారసంబునఁ బోరునప్పుడు వారి నక్కలెక్కుపడను, (నీతిచంద్రిక - విగ్రహము)

141 మేకవన్నె పులి = సాధువుగాఁ గాన్పించు నసాధువు.

'ఈసర్వజ్ఞుఁడు మేకవన్నెపులి, (నీతిచంద్రిక - విగ్రహము.)

142 నూరిపోయుట = బాగుగ బోధ సేయుట.

'అప్పుడీతనిఁ జేరఁ దీయవలదని మీరందఱుంద జైనన్ని విధములనో నూరిపోసిరి, (నీతిచంద్రిక - విగ్రహము.)

143 కర్ణరసాయనము = చెవుల కింపైనది.

'మాకు గర్ణరసాయనంబుఁ గావింపుఁడు,

(నీతిచంద్రిక - సంధి)

144 పూసగ్రుచ్చిన రీతి = విశదముగా.

'తన యావద్వృత్తాంతమును బూసగ్రుచ్చిన రీతిని వినిపించెను.

(నీతిచంద్రిక - సంధి.)

'తెలుపవుకును విందుఁ జిలుకల కొలికి తెఱంగెల్లఁ బూస గ్రుచ్చిన రీతిన్, (విజయ విలాసము)

'ఒకింతయును పీడ। పూసగ్రుచ్చిన రీతి నప్పువ్వుబోఁడి। చెప్పినది విని, వారలచ్చెరువు నంది, (కళాపూర్ణోదయము)

145 ఉట్టికట్టుకొని యూగులాడుట = చావకుండుట.

'ఈలోకములోనే యెల్లకాలము నుట్టిగట్టుకొని యూగులాడుము,

(నీతిచంద్రిక - సంధి.)

'నిశ్చలత నేర్పిలెద వుట్టిగట్టుకొని దుస్సాధంబుకుమ్మా,

(పాండురంగ మహాత్మ్యము.)

176 చీటికి మాటికి = తరుచుగా.

'చీటికి మాటికిఁ దాలిమి దిగనాడుట వగపాడిగాదు.

(నీతిచంద్రిక-సంధి)

147 పులినాకి విడిచినవాఁడు = చావుదప్పినవాఁడు.

'ఈ యుపాయంబుతోఁ జచ్చి బ్రతికి పులినాకి విడిచిన వానినిగా భావించుకొనుచుంటిమి. (నీతిచంద్రిక - సంధి.)

148 కుప్ప తిప్పలు = సమృద్ధి.

'అట్టి నీవిత్తరి కుప్పతిప్పలుగా మ్రోల దుముకులాడుచు నన్ను భక్షింపనొల్లక, (నీతిచంద్రిక - సంధి.)

149 కూకటివేళ్ళతోఁ బెల్లగించుట = సమూలముగా నాశనము చేయుట.

'అతని రాజధానిం గూకటివేళ్ళతోఁ బెల్లగించి పేరులేకుండ నేల మట్టము గావింతు, (నీతిచంద్రిక - సంధి.)

150 తంగేటిజున్ను = సులభముగా లభించునది.

'అపవర్గకాంతచే నాకొన్నవానికిఁ దంగేటిజున్ను శ్రీరంగశాయి.

(కవికర్ణరసాయనము,)

'కెలకులనున్న తంగేటిజున్ను గృహమేధి' (మనుచరిత్ర)

'తంగేటిజుంటి విధంబు కోరికల్, (దాశరథివిలాసము.)

151 కన్నులపండువ = నేత్రపర్వము, మనోహరమయినది.

'కన్నులపండువై పొలుచుఁ గన్గొన నప్పుర లక్ష్మి'

(కవికర్ణరసాయనము.)

152 వీనులపండువ = చెవులకింపుగా నుండునది.

'పలుకులేచాలు వీనులకుఁ బండువుసేయ, నెఱపాటలేలాకో నేర్చిరిట్లు'

(కవికర్ణరసాయనము.)

153 బ్రిమరుగొడ్డేరగుట = వ్యర్థమగుట, నీరులేని కాలువ,
'ఏలాబిడ్డలులేని బ్రమరు గొడ్డేరమ్యెఁ జింతింపఁగన్ '
(కవికర్ణరసాయనము)

154 తెల్లచెఱకుపంట = అతి మనోహరముకై కల్పన జేసిన వస్తువు.
క. 'కుందనము కమ్మవలపుం
జెందిన చందమునఁ దెల్ల చెఱకునఁబండై
సుందరియగు నక్కన్నియ
యందెలబ్రాయంబు విమల నాయితమాయెన్ '
(కవికర్ణరసాయనము)

155 తెప్పలు తేలుట = ఎక్కువగుట,
"నిచ్చినిచ్చలుగ్రొత్తలై యెచ్చరించు
ఖేలనంబుల దెప్పలుదేలుచుండె"
(కవికర్ణ రసాయనము)

156 వాడివత్తలగుట = మిక్కిలికృశించుట
"అలజడివాడివత్తలయి రక్కటయేనిక నున్న నేమి గాఁగలదో"
(కవికర్ణ రసాయనము).
"ఇక్షుశరాసనసాయకవ్యథా, ఖిన్నతవాడివత్తలయి"
(మనుచరిత్ర)
"కమలనాళములువాడివత్తలై డీలుపడియె"
(రసికజనమనోభిరామము)
"ద్వి॥ వాడివత్తయిరేమి వాంఛచేసితివి"
(విష్ణుమాయావిలాసము).

157 చేయెత్తి చెప్పుట = దృఢముగాఁ జెప్పుట
"స్వామిహితైక్యర్యానువాదరూపంబు గాఁ జేయెత్తి విబుధులాశీర్వదింప"
(కవికర్ణ రసాయనము)

158 ముక్కువిరచుట = ఇష్టపడకపోవుట. ఆక్షేపించుట.

"బాంధవులు ముక్కువిరువఁ, బుత్రులు వేసరఁ గళత్రంబులు వేసరింప" (కవికర్ణ రసాయనము)

159 పట్టుకొమ్మలు = ఆధారములు.

"పట్టుకొమ్మలు రమణీయభావములకు" (కవికర్ణ రసాయనము)

"నూన్నకలక్ష్మికిఁబట్టుకొమ్మలై" (పాండురంగ మహాత్మ్యము)

"దయకుఁగందువదానకేలి కిరవంతశ్శుద్ధికిన్ జన్మభూ
మి యుదారత్వము రచ్చపట్టు జయలక్ష్మీలీలకుంబట్టు కొ
మ్మయ విస్ఫూర్తికినాస్పదం బఖిలవిద్యాతారతమ్యజ్ఞ తాశ్రయము,
(గ్రామాభ్యుదయము.)

160 కనిగ్రుడ్డి, వినిచెవుడు = తెలిసి తెలియకుండుట,

కం. దనుజాంతక కేశవ కృ
జన మనవరతానుభూతి సాత్రంబులచే.
గనిగ్రుడ్డియు విని చెవుడును
జనవర నీయాయకిక నసాధ్యముగలదే

(కవికర్ణ రసాయనము)

161 మేలుబంతి = శ్రేష్ఠము.

"త్రోరపుకాంతికి మేలుబంతి" (కవికర్ణ రసాయనము)

162 నిలువునీరగుట = భయపడుట,

"నిలువునీరగు టెంకయ నంటికంబముల్" (కవికర్ణ రసాయనము)

ముద్దులుగుల్కుట సొగసుగానుండుట

163 ముద్దులుగుల్కు నీభువన మోహనమండన రత్నదీధితుల్"

(కవికర్ణరసాయనము)

164 చూరలాడుట=అంతయు హరించుట

"వీఁడ కే యలయించి శ్రీతలమానంబు చూరలాడిన లోక సుందరుఁడు" (భాగవతము.)

"తేనవ్వుదోలఁకు నీదునయంబులు నామది చూరలాడెడిన్" (కవికర్ణ రసాయనము.)

165 తామర తంపరలు=సమృద్ధి. తామరవలె వృద్ధిగా నుండునవి, తామరలయొక్క సముదాయము.

"అఖిలైకధర్మములు తామరతంపరలై చెలంగ" (విజయవిలాసము)

"ప్రబలి తామరతంపరై పరిఢవిల్లి" (సారంగధరచరిత్ర,)

"ఉత్తమతనయాది సంపదలు తామరతంపరలై ప్రవర్ధిలన్" (కళాపూర్ణోదయము.)

"సం, పదతామరతంపరయై పొదలెన్ దశదిశల కీర్తి పూర్వముపర్వన్" (రామాభ్యుదయము.)

166 ఏనుఁగుపాడి=సమృద్ధి. చాలపాలిచ్చుట.

"ఇచ్చినా యేనుఁగుపాడి యీడగలరే రఘునాథ నృపాల మౌళికిన్" (విజయవిలాసము)

167 ఉక్కుతునకలు = బలశాలురు. ఉక్కుముక్కలవలెఁ బెళుసులేక బిగి గలవారు.

"గాళకు లాపురీభట శిఖామణు లెక్కటియుక్కుతునకలు" (విజయవిలాసము)

168 చిదిమిపెట్టిన బంటులు = నిగ్గుదేలిన శూరులు.

"అఖిలతరాళినుల్ చిదిమిపెట్టిన బంటులు" (విజయవిలాసము)

169 పిలువని పేరంటము = తనకుఁ దాను వచ్చినది.

"పిలువని పేరటం బనుచు దెగ్గిలినాథుల కౌఁగలింపఁగాఁ। బోలు పుగ నందుఁ బెండ్లిసడుపుల్ నడుచున్వాలి నాలి తెమ్మరల్" (విజయవిలాసము)

170 నిత్యకల్యాణము, పచ్చతోరణము = అవిచ్ఛిన్నశుభములు.

"నిత్యకల్యాణముఁ బచ్చతోరణమునై జనులందఱుం నుల్లసిల్లగన్" (విజయవిలాసము)

"నిండుగా దీవిలతు నీ యిల్లు నిత్య కళ్యాణంబుఁ బచ్చతోరణముగాఁగ" (దాసు శ్రీరాములుగారి చాటువు)

171 నడుమంత్రపుకల్మి = } మధ్యకాలములో వచ్చిన
నడుమంత్రపు సిరి = } యైశ్వర్యము.

"క్షితినిటుగాదె యొక్కొరికిన్ నడుమంత్రపు కల్మిగల్గినన్" (విజయవిలాసము.)

172 పుణికి పుచ్చుకొనుట = } సమానముగా నుంచుట.
పుడికి పుచ్చుకొనుట = }

"చందమామ నెలుఁగుల కొమరంతయుఁ బుణికి పుచ్చుకొనఁబోలుఁ జామీ" (విజయవిలాసము)

"ఎగుబుజంబులవాఁడు మృగరాజమధ్యంబు పుడికి పుచ్చుకొను నెన్నడుమువాఁడు" (విజయవిలాసము.)

173 చక్కట్లు దిద్దుట = తగవుఁ దీర్చుట.

"జక్కవ కవంజక్కట్లు దిద్దుంగుచాహంకారంబు" (విజయవిలాసము)

174 ఉట్టిపడుట = ప్రత్యక్షమగుట, జారిపడుట.

"శాంతరసమెల్ల నుట్టిపడఁగ నంగల పొందుకోరి" (విజయవిలాసము.)

"ఉట్టిపడ్డట్టు లెందుండిటువచ్చెఁ గడింది విలుదోయితో రాజ వీర యుగము" (రామాభ్యుదయము.)

175 కాయో పండో = సుఫలమో. విఫలమో.

"పొలఁతి కాయో పండో పోయినపనియన్నఁ జిలుక మాటకు నవ్వు సొలపుదేట. (విజయవిలాసము.)

"చనినపని కాయయో పండో యనుచు నడుగ"

(రసికజనమనోరంజనము.)

176 పలుకు బంగారము = అపరూపము.

"చిలుకా నీతో నైనను పలుకంగా రాదె పలుకు బంగారఁటనే" (విజయవిలాసము.)

177 ఈదాడన్నఁ గోదాడనుట = ఒకటియనిన మఱియొకటియనుట. ఈదాడు = గిలుకతాడిచెట్టు, కోదాడు = తాటిచెట్టులోని భేదము.

"ఈదాడన్నను మదనుఁడు, కోదాడనువాఁడు బిగువు కొనసాఁగునో కో" (విజయవిలాసము.)

178 తకపికలు సేయుట = ఎచ్చుతగ్గులు సేయుట.

"మకరాంకుని యనుఁగు మేనమామకునీకుం దకపికలు సేయవలదనుము" (విజయవిలాసము.)

179 పచ్చకప్పురమయ్యె పచ్చపూసాయె = అపరూపమాయెను.

"పచ్చకప్పురమయ్యె భామపల్కు"

"సొలపుబయ్యెదఁ దేరిచూతునన్నంత నే, పచ్చపూసాయెఁబో పొలఁతియారు" (విజయవిలాసము)

180 ముక్కు మొగము జూడక మొగమాటమాలోచింపక.

"ముక్కు మొగంబుఁజూడక టుబొమ్మనెదేల" (విజయవిలాసము).

181 చెక్కు చెమర్చకుండుట = కళగందకుండుట.

'నెల తుమ్మెదలు చెక్కుచెమరింపకున్నవా చిగురుఁబోఁడి'

(విజయవిలాసము)

జనూంగనా సంగమంబునం బొసంగియుఁ జెక్కుచెమర్పక, యక్కురుపీరుండు'

(విజయవిలాసము)

182 వెండుగ్రిక గట్టఁబడుట = నిరసించుట.

'కామతూపులు వెండ్రుకఁగట్టఁబడును జామమూరక యేటికి జలదరింప'

(విజయవిలాసము)

183 ఒడలెల్లఁ గన్నులు = ఎక్కువ విమర్శ.

'ఘహాప్రద్యుక్తనూజుని నొడలెల్లఁ గన్నులుగఁజూచిరి మానసము ల్లరంగఁగ'

(విజయవిలాసము)

184 కేకుమడఁచుట=కొట్టుట.

'వాని తండ్రియురమందెదిర్చినను కేకుమడంతుము మాట లేటికిన్'

(విజయవిలాసము)

185 నాగవల్లి నిష్ఠురము=పనియంతయు నైనపిమ్మట పోరాడుట.

'లోలతనిక వాగవలిలోపల నిష్ఠురమేల పల్కఁగన్'

(విజయవిలాసము)

186 ఇంద్రభోగము = ఎక్కువభోగము.

'పరిధవము నింద్రభోగమె దొరకెన్' (విజయవిలాసము)

187 పయింబక్కఁబడుట = { స్నేహముగానుండుట, ఎక్కువ మమతగానుండుట. }

'వయింబక్కఁబడఁగఁ జక్కనిపూరుని మక్కువమీఱ'

(సారంగధరచరిత్ర)

188 అంగరంగ వైభవములన్= } మిక్కిలి వైభవములచేత, అంగరంగవై
రంగరంగ వైభవములన్= } భవములు= శరీరస్థల వైభవములు, రంగరంగ వైభవములు= శ్రీరంగము లోని రంగనాయకస్వామి వైభవము.

'అంగరంగ వైభవముల సమగ్రంబులగున యారగింపుల,'
(సారంగధరచరిత్ర)

189 అసురుసురనుట = ఆయాసపడుట.
'అసురుసురై యలంతి నను మల్లలవాడఁగ' (సారంగధరచరిత్ర)

190 కొట్టి కోలాహలముచేయుట = ఎక్కువ గంద్రగోళము చేయుట.
చెండి చకపికలాడుట =
'కొట్టి కోలాహలముజేసి కూఁలఁద్రిమ్మి చెండి చెకపికలాడుచు యుండెనేని' (సారంగధరచరిత్ర)

191 పీటబెట్టుట = స్థిరపడుట,
'తగరువైఖరిమాటి తెగువనీమరగాలి' పీటవెట్టిన పంది పీచమడఁచు' (సారంగధరచరిత్ర)

192 కారాకూరము = చిందర వందర.
'సారసు కేకలువేయుచు। గారాకూరముయి మనసు కళవళ పడఁగన్' (సారంగధరచరిత్ర)

'కారాకూరంబులై ధాతునుల హృదయముల్ కార్పడెన్'
(ఉత్తరరామాయణము)

193 అరచేతిలో నిమ్మపండు = సౌఖ్యముగా నుంచవలసివస్తువు.
'విభ్యుండరచేతిలోఫలి నిమ్మపంటివలె సత్యాసక్తిమన్నింపఁగ'
(సారంగధరచరిత్ర)

194 దుద్దువెట్టుట = మోసముచేయుట.

'చక్కన్నను దుద్దువెట్టి యరకంగదలంచెను'

(సారంగధరచరిత్ర)

195 తలప్రాణము తోకవచ్చుట=ప్రాణాంతమునకు వచ్చుట, పాము తల నరుక ప్రాణము తోకబట్టును.

196 మాసిన ముత్తెము = ఎక్కువజాగ్రత్తగా నుంచినది.

'మాసినముత్తెమై వెలుగు ముద్దుకుమారునిమీద'

(సారంగధరచరిత్ర)

197 ఎండకన్ను నీడకన్ను = కష్టములు"

"ఎండకన్నును నీడకన్నెఱుంగకున్న పుట్టుభోగికి,

(సారంగధరచరిత్ర.)

"త్రేతాగ్నికణ ధూమజాత మేఘములను నెండ కన్నెఱుగని వృక్షములును, (తారాశశాంక విజయము)

198 ఒడికట్టుట = సిద్ధపడుట.

"లోకనింద కొడిగట్టితిగా" (సారంగధరచరిత్ర.)

199 కుంభద్రోణముగా=అపరిమితముగా, కడవలతోదూములతో ద్రిమ్మరంచినట్లు.

"అకాలవర్షంబు గురియింపఁ బంపు మొగుళ్ళ గములఁబగళును రేలు కుంభద్రోణములుగాఁగ" (హంసవిలాసము.)

"పాథోధరశ్రేణి కుంభద్రోణమ్ములు గ్రుమ్మరించె విమలాంభః పూర ధారావళిన్" (పాండురంగ మహాత్మ్యము.)

కుంభద్రోణముగాఁగ వానగురిసెన్ ఘోరాంబుధారాకృతిన్"

(వైజయంతీ విలాసము)

200 చలి విడుచుట=భయము వదలిపెట్టుట" గడిదేరుట.

"చలివిడిచినాడు నాటికి జగమెఱుంగ నతఁడు మెలఁగఁగదొడఁగె"

(నిరంకుశోపాఖ్యానము.)

201 గుదిగుంపులు జేయుట = అవిచ్ఛిన్నము చేయుట.

"అడిగనుక దివిజవేశ్యల । సదనంబులనున్న వస్తుసంతతి తలఁపుల్ గుదిగుంపులు జేసిమధింపదె"

(నిరంకుశోపాఖ్యానము.)

202 ఉప్పఁకుఁ జప్పఁకుఁగాఁజూచుట=మంచిచెడ్డలకుఁజూచుట.

"ఒకతె వలెనాడి యాడిం । చుకొనుటకే యిరుగుపొరుగు జూచె కొయ । ప్పఁకుఁ జప్పఁకుఁ గానను జూ । చుక నడువఁగ వలెఁగులీన కుశకల్లాపల్"

(నిరంకుశోపాఖ్యానము.)

203 చిచ్చఱపిడుగు=దిట్టముగా బాధించునది.

"వచ్చెఁగదకటుల పాలిటి । చిచ్చరపిడు గింక నేమి సేయుదుననుచున్,"

(నిరంకుశోపాఖ్యానము.)

204 బుద్ధి పెడతలఁబట్టుట = బుద్ధిచెడుట.

"పెద్దతనముబోయి బుద్ధి పెడతలఁ బట్టెన్"

(తారాశశాంకవిజయము).

"ఉవిదలకు బుద్ధి పెడతల నుండుగాదె"

(పాండురంగ మహాత్మ్యము.)

205 చుట్టాలసురభి=బంధువుల నాదరించునది.

"చుట్టాలసురభియై పేరుగనొందె నెగాని సెన్నరైనచుట్టంబు దనకుఁ గొ.

(పాండురంగ మహాత్మ్యము.)

206 ముడిచేయుట=వాదమునకు జట్టు ముడిపైచి ప్రతిజ్ఞచేయుట.

"మఃడియాౖవైవగవచ్చు మొనదారసించిన కార్యత్వమున వెన్నుఁజూపఁడ నుచు" (పాండురంగ మహాత్మ్యము.)

207 దిబ్బెమెత్తుట=దీపముతోఁ బ్రమాణము చేయుట.

"దిబ్బెమెత్తఁగవచ్చు నబ్బురంబగు కల్మిమేర మీాటినరీతి మెలఁగ డనుచు" (పాండురంగ మహాత్మ్యము.)

208 తప్పిదారి=పొరపాటు.

"ఈపరమగోప్యమోపుత్రి యోపురంధ్రి తప్పిదారియొ యెతీఁగింపఁ దరముగాదు" (పాండురంగ మహాత్మ్యము.)

209 అడుగులకు మడుగులొడ్డుట=గౌరవించుట.

"నడచుచు నడుగులకు మడుగు లొడ్డుచు"

(పాండురంగమహాత్మ్యము.)

"గడనగల మగనిజూచిన। నడుగులకును మడుగులిడుదు రతివలు దమలో" (సుమతీశతకము)

210 ఈచెవిగాడ్పాచెవిం బోవుట=ఎక్కువ వడగాడ్పు వీచుట.

"ఏచి యీాచెవిగాడ్పు నాచెవిబోవంగ నుబ్బిలింగముబోలె నుండు నెండ" (పాండురంగమహాత్మ్యము.)

211 కంపలఁబడ్డకాకి=చిక్కులలోఁ బడిన వస్తువు.

'మరుద్భుక్కుటకున్ భజించు మతిపుట్టుక కంపలపడ్డ కాకినై'

(పాండురంగ మాహాత్మ్యము.)

212 పులుఁగడిగిన ముత్యము = నిర్మలమైనది. వాసనలేకుండఁ గడగఁబడిన ముత్యము.

'పులుఁగడఁగంగఁ బడ్డ నునుముత్యముఁ బోలుచు వాలుచుం బురిన్,

(పాండురంగ మాహాత్మ్యము.)

‘ కలకంఠకంఠి యీగతిఁ బులుఁగడిగిన ముత్తియంబు పోలుపొందంగా,

(పారిజాతాపహరణము.)

213 పిల్లిశీలము = కృత్రిమ స్వభావము.

‘ శీలమఖిలంబు నిది పిల్లి శీలమనుచు ,

(పాండురంగమాహాత్మ్యము.)

214 చిల్క చదువులు = నోట నుచ్చరించుటయే గాని మనస్సునఁబట్టని పల్కులు.

‘ చదువు లివియెల్లఁ జిల్కల చదువులనుచు,

(పాండురంగ మాహాత్మ్యము.)

215 తేనెపూసిన కత్తి = పైకి నెమ్మదిగాఁ గాన్పించుచు లోనఁ గ్రౌర్యముగలఁవాఁడు.

‘ తేనెపూసిన కత్తి ధాత్రీసుతుండు

(పాండురంగ మాహాత్మ్యము.)

216 కంటవత్తికొనుట = ఎక్కువ శ్రద్ధగాఁ జెప్పుట.

‘ వెజ్జుగా చరించి యరయించె విప్రసుతుని కంటవత్తిడుకొని సైరిక ప్రభుండు ‘

(పాండురంగ మాహాత్మ్యము.)

217 తలలో నాలుక = నిరపాయముగా.

‘ తలలోపల నాలుక బలె మనసులు గలసి ,

(పాండురంగ మాహాత్మ్యము)

218 పూసలలో దారము = అభేదముగా, లోపల ప్రవేశించి, ఇష్టముగా.

‘ పూసలలో దారంబు పోలఁజల్లిన నీరుం బలె వెలియొలుంగక మనసులు గలసి ,

(పాండురంగ మాహాత్మ్యము)

219 బంగారు కుండ = అందకత్తె.

'బళిరా తేరకు తేరదకు నిటులీ బంగారు కుండంచు,

(పాండురంగ మాహాత్మ్యము.)

220 తలపుండ్లు గడుగుట = సంరక్షణ చేయుట, ఉపచారము చేయుట.

తలపుండ్లు గడిగించి తను బ్రతికించెఁగా యనఁ జోరాకాకుండ

యున దెచ్చి,

(పాండురంగ మాహాత్మ్యము)

221 కంచంత కాపురంబు = విస్తారము సంసారము.

'కాఁపుగోడలు కంచంత గాఁపురంబు పాండవాటి కులంబు గాడ్ప

రచి యురికె.

(పాండురంగ మాహాత్మ్యము)

222 ఆకు మడుంగు పిందె = మృదువైనది.

ఆకుమడుంగుపిందెయనఁ యంతి పురంబును బోలెనున్న.

(పాండురంగ మాహాత్మ్యము)

223 నోరు మెదల్పుట = మాటలాడుట;

ఎన్నఁగ నింతరత్న చయమింతగభీరిమ యింత వారపం

పన్నత యింతశుద్ధియని బ్రహ్మయు నోరుఁ గదల్పలేని య

త్యున్నతిఁగన్న పెన్నడలి నుత్థితమై వెలిపీలి చెంగటన్,

(పాండురంగ మాహాత్మ్యము.)

'తన్నట్లు పలికి దొబ్బగ । మిన్నకచన నత నోరు మెదపక,

(కళాపూర్ణోదయము)

224 పుల్లవిఱుచుట = భయముతీర్చుటకై పుల్లను విఱిచిపారవైచుట, దృష్టి

దోషమును దీర్చునట్టిది.

'పెనుచీఁకటులు గ్రమ్మ పెస్పైట వసియించి, వెఱచెగా యని పుల్ల

విఱిచి విఱిచి'

(పాండురంగ మాహాత్మ్యము)

225 పుల్లవిఱుపుమాట = కలియకుండఁజేయు భేదవాక్యము.

226 సూచీముఖభేద్యము = దట్టముగా నున్నది, సూదితో భేదింపఁదగినది
'పెరిగి సూచీముఖాభేద్యంబులగు నంధకారధారాచ్ఛటల్గాయకొనిన"
(పాండురంగ మాహాత్మ్యము.)

227 తలవెట్టి=బుద్ధిమాంద్యము.
"తలవెట్టుపచరింప నేటికి సమిద్దానంబు దానంబు"
(పాండురంగమాహాత్మ్యము.)

228 గొంతెమకోర్కెలు = అలభ్యమయిన కోరికలు.
"కొసరి గొంతెమకోరికల్ గోరనేని యిడకపోఁబోలదిడఁ బోలదు"
(పాండురంగ మాహాత్మ్యము)

229 పొగచూరుట = వన్నెతగ్గుట, చెడుట,
"నింగాసంగతి పొగచూరెను, (పాండురంగమాహాత్మ్యము.)
"వారుని కోపాగ్ని పొగచూరి మరునిదాప మసితకేసర పరివేష
మయిననాఁడు" (శృంగారనైషధము.)

230 అసిధారావ్రతము = ఉత్కృష్టమైన వ్రతము = సౌందర్యవతియు యౌవనవతియునైన స్త్రీతో నేకశయ్యయందు శయనించి యామెయందు మనసైనఁ బ్రసరింపకుండుట యసిధారావ్రతము. పదునైన కత్తిపై నాలుక తెగకుండ రాయుట.

231 మెడఁజుట్టుకొనుట = అలుముకొనుట,
"గోచికట్టిన కటువంటి గొడవ గడవరాక మెడఁజుట్టుకొనియె
మారక" (పాండురంగ మాహాత్మ్యము.)
"కొమ్మనీమెడఁ జుట్టుకొనకున్న యీ పోఁకపూఁబోత్తిఁ జిదిమిన
ఘారికలుమము" (రామాభ్యుదయము.)

232 ముద్దుగురియుట = }
233 ముద్దులు గుల్కుట = } మనోహరముగా నుండుట

" తరుణి లోచన బాష్పధారావలంబులు ముత్యాల సరులతో ముద్దు గురిసె "
(శృంగార నైషధము)

మఱికొన్ని సంగతులు ముద్దులు మూటలు గట్టఁజాలు "
(శ్రీనివాస విలాసము.)

" చెల్వానిం । గలసిన వంటినొక్కులను గందియు ముద్దులు గుల్కు-చున్న యుగ్మలి "
(రసికజనమనోరంజనము.)

234 చెవిగఱచుట = రహస్యము చెప్పుట.

" చేరువం జేరి యెవ్వరో చెవిగఱచెదరు "
(చిన్నయసూరి నీతిచంద్రిక.)

235 కొమ్మ ముద్దులాడుట = సంకేతవృత్తాంతములు పల్కుట.

236 నేలవిడిచిన సాము = నిరాధారవ్యాపారము.

" ఊరక యేల నేలవిడిచి సాము చేసెదవు ?
(చిన్నయసూరి నీతిచంద్రిక.)

237 నాలుక మిగులుట / మాటమిగులుట. } దూషించుట, వదరుట.

" నాలుక మిగుల రానీకము " (చిన్నయసూరి నీతిచంద్రిక.)

238 క్రిందుపడఁజేయుట = జయించుట.

కినుకమీఱ నసంతగిరి క్రిందుపడఁజేసె.
(పారిజాతాపహరణము.)

239 తలపూవాడక యుండుట = ఆయాసపడకుండుట.

" తలపూ వాడక యుండుమి. (పారిజాతాపహరణము)

240 మిన్నందుట = ఉప్పొంగుట.

" మిన్నంది వేఁగఁగైకొని " (పారిజాతాపహరణము )

**241** ముళ్ళమాటలు = కొండెములు.

"పలు దెఱఁగు ముళ్ళమాటల । కలహామె కల్యాణమని"

(పారిజాతాపహరణము.)

**242** తేనెలుట్టిపడుట = మధురములుగా నుండుట.

"పలుకులఁదేనెలుట్టిపడఁ బల్కవు నేఁడిదియేమి"

**243** కడగంటఁజూచుట = కటాక్షదృష్టి, దయతోఁ గూడిన చూపు.

"నిడువాలుం గడగంటఁ జూడమనుచున్"

(పారిజాతాపహరణము.)

**244** ప్రాణము ప్రాణముగా = ఏకీభావముతో.

"అని కైసంజతినిన్ను బాసిచనునో ప్రాణంబు ప్రాణంబుగా నిను మన్నింపఁడో"

(పారిజాతాపహరణము.)

**245** పైపెచ్చులు = ఎక్కువలు:

చందమామయుఁ దలంపులమాణికముఁ దలఁపఁ బైపెచ్చులదీనికిన్

(పారిజాతాపహరణము.)

**246** మక్కికిమక్కి = ఉన్నదున్నట్లు.

"తెల్గుసేయుచో । మక్కికిమక్కియన్నటుల మార్చినకావ్యము శ్రావ్యమెట్లగున్"

(శ్రీనివాసవిలాసము.)

**247** ఎదురొమ్ముకుంపటి = గుండెలబరువు. అనివార్యమయిన కష్టమును గలిగించువస్తువు.

"పతికెదురొమ్ము కుంపటిగఁ బాల్పడకుండని రత్మ్మ"

(శ్రీనివాసవిలాసము.)

**248** నలుగురినోళ్ళలోఁబడుట = అల్లరిపాలగుట, అపకీర్తినిబొందుట.

"పశుపతీద్యుండయ్యుఁ బసులఁగాచుచు నలుగురినోళ్ళలోఁబడ్డ గుఱుతువోవ"

(శ్రీనివాసవిలాసము).

249 వేదము = ప్రమాణము.

"వారివచోగుంభము వేదమే కవుల వారింపం దరంబే"

(శ్రీనివాసవిలాసము.)

250 పయిచేయి = అధికుఁడు.

"ఏరాజు ధారుణీభారంబు వహియింపఁ జిల్వరాయునికిఁ బైచేయి యయ్యె"

(శ్రీనివాసవిలాసము.)

251 త్రాఁడుబారుట = దృఢత్వమునొందుట.

"తావకాపరాధముల కంతంబుగలదె। త్రాఁడుబారెడు దోష్యంబు దవులుకతన"

(శ్రీనివాసవిలాసము.)

252 చిటికలో = శీఘ్రముగా.

"ఒక చిటుకగదా ప్రియుఁ యందుఁ జేలఁ లకుఁగలకల్"

(శ్రీనివాసవిలాసము.)

253 ఉక్కుముక్కాడనీయకుండుట = అవకాశము లేకుండఁ జేయుట.

"చలపట్టైనావైరి జనపాలకుల ఉక్కుముక్కాడనీయక యుక్కడంచు,

(కువలయాశ్వచరిత్ర.)

254 కాలిసంకెల = అడ్డు.

"తరుణీతనూగంధము కాలిసంకెలై నెరయఁగనిల్చి"

(కువలయాశ్వచరిత్ర.)

255 కత్తిమీఁదిసాములు = కష్టపుపనులు.

"దొరతనపు నసరవుల్మతి కత్తిమీఁది సాములుసుమ్మీ,

(కువలయాశ్వచరిత్ర)

256 సిగపట్లు = దెబ్బలాట, జుట్టులుజుట్టులు పట్టుకొనుట.

"పలుకులువాదు రేపి సిగపట్లకు దగ్గరచేసి"

(కువలయాశ్వచరిత్ర)

257 అరటిపండొలిచి చేతికిచ్చుట = విస్పష్టముజేయుట.

"భారతరామ కథార్థముల్ విభా । సిలఁగ నరంటి పండొలిచి చేతికి నిచ్చిన రీతి. (కళాపూర్ణోదయము.)

258 గగనకుసుమము = } ఏమియు లేనిది.
నభఃకుసుమము =

"పగలను శబ్దమాత్రము నభఃకుసుమంబు నిజంబునాన్. (కళాపూర్ణోదయము.)

259 ఒజ్జల పుచ్చకాయ = నేర్చినవిద్య మరిచిపోవుట.

"ధర్మవిధులన్నియు నొజ్జల పుచ్చకాయగావలయు, (కళాపూర్ణోదయము.)

260 అంకురార్పణము = ప్రారంభము, అంకురార్పణమను నొకకర్మ, అన్ని శుభకర్మలకుఁ బ్రారంభమునఁ జేయుకర్మ.

"రంభకు నన్నవతి పోరుగణించుట కంకురార్పణం బదియటుకొంత చేసితి" (కళాపూర్ణోదయము.)

261 పండ్లు గొరుకుట = కోపపడుట.

"పాపి తుంబురుడా యంచుఁబండ్లు గొరుకు కొంచు గోగోన నుడికితిఁ గొంతతడవు. (కళాపూర్ణోదయము)

262 కోటానకోటులు = విస్తారము.

"కోటానకోటులై కోటకొమ్మలయందు నవ్యుత్పన్న నిర్వాణంబు లగు మాణిక్యదీపంబులు" । (కళాపూర్ణోదయము.)

263 కన్నుండఁ గనుపాపఁదీయుట = మాయచేయుట.

"వినుకల్లభకన్నుండం। గనుపాపందివియ నేర్పుగలమునిముచ్చీవనిత (కళాపూర్ణోదయము.)

264 అఱచేతికిఁ బండ్లువచ్చుట = ఎక్కువ శౌర్యమునచ్చుట.

"అఱపులుడిగి పోపోనీ । యఱచేతంబండ్లు వచ్చినప్పుడు మమ్మం । గ ట చేవ చూపుగాని" (కళాపూర్ణోదయము.)

265 నీనుదుటనె బ్రొద్దుపొడిచెనా = అంతయు నీకే తెలియునా ?

"కానిమ్ము వేగిరింపకు నీనుదుటనె బ్రొద్దుపొడిచెనే"

(కళాపూర్ణోదయము.)

266 చెట్లఁగట్టుట = } కష్టపెట్టుట.
చెట్లపాలుచేయుట }

"అతనినే చెట్లఁగట్టితి నీతఁడే పోటు లంకించుకొనియె నలంఘ్యుఁడయిన

(కళాపూర్ణోదయము.)

267 కాకదంతపరీక్ష = వ్యర్థవ్యాపారము కాకికి దంతములుండవు కావున
నవి పరీక్షించుట వ్యర్థపుపని"

"వాని నేమడిగె దెవ్వఁడు కాకనీకేమి, యిది కాక దంతపరీక్ష
యమ్మ" (కళాపూర్ణోదయము)

268 వట్టిగొడ్డు తాకట్టు = వ్యర్థమైనది.

"ఇతని పోడిమిగంటిమ వట్టిగొడ్డుతాఁకట్టితఁ డెంతయున్ననిమ
గారియవెట్టు" (కళాపూర్ణోదయము)

269 మూఁడుమాటలాఱుతప్పులు = ఎక్కువ తప్పులు.

"ఏమి యీయనకు దెలియు మూఁడుమాటలాఱు తప్పులేమ
మీఁకొనరఁబల్కఁగలమే"

(కళాపూర్ణోదయము.)

270 మామాటయేమాట = నిజము.

" మాభోగంబులె యాత్మభోగములుగా మామాటయే మాటగా"

(కళాపూర్ణోదయము,)

271 కొట్టినపిండి = స్వాధీనము, ఎఱిగినది.

"కోమలినాకునెట్టి యెడఁగొట్టినపిండి సమస్తలోకముల్"

(కళాపూర్ణోదయము)

272 ఎన్నిగుండెలుగలవు = ఎంతధైర్యముండెను.

"ఎవఁడు నేఁడెఁక నేరికి నెన్నిగుం । డియలుగలవు నాదుప్రియనుఁ జేర" (కళాపూర్ణోదయము)

273 గోటికి పడగెత్తుట = మిక్కిలి కలిగియుండుట.

"అన నిట్టి పలువ యగు పులకసను గోటికిఁబడగెత్తి గురియగు పెద్ద న్నిను నమ్మరాదుగాక" (కళాపూర్ణోదయము)

274 నేలకుఁగోలకుఁదెచ్చుట = మిక్కిలి బాధపెట్టుట.

"నీయవలోకనంబాదవ నేలకుఁగోలకుఁ దెచ్చుచున్నవాఁడు"
(కళాపూర్ణోదయము)

"చాలమును చిక్క జెప్పఁగ । నాలించిన చెలి పిఱుందునందపుచూపున్ । నేలకుఁగోలకుఁదెచ్చెను । వాలాయము తనిమేను బలుడెందంబున్"
(రసికజనమనోరంజనము)

275 కకావికలగుట = చెదరిపోవుట.

"ఆత్మసైనిక చయంబు, కావికలై కలఁగి" (కళాపూర్ణోదయము)

276 చెండుబెండాడుట = ఖండించుట, బంతితో బెండుతో నాడుట.

"ఈడితశక్తి నంగ జగతీశ్వరుసైనికులట్లు చెండ్లుబెండాడఁగ"
(కళాపూర్ణోదయము.)

277 రేఁగుఁదంగేళ్ళుగఁ ద్రొక్కుట = తొందరగాఁబోవుట. రేగుచెట్లను దంగేడిచెట్లవలెఁ ద్రొక్కుట.

"కలఁగిపాఱె రేఁగులు । దంగేళ్ళుగఁదొక్కికొనుచు । దద్దయుభీతిన్"
(కళాపూర్ణోదయము)

278 పింజపింజగఱచుట = ఒకదాని వెనుక నొకటిపోవుట. పింజ = బాణము యొక్క వెనుకభాగము.

"లాఘవంబు పేర్చిపేర్చి యొండొరుపయి నేయఁ బింజపింజ గఱచు కాని పాఱుతూపు లొక్కటియవోలె" (కళాపూర్ణోదయము)

279 పయికాపు = పయిగా జాగ్రత్తపెట్టుట,

"కుచోత్థతభరంబునకుం బయికాఁపువోలెఁ దబ్బిబ్బుగఁ జేతికిన్దొరకి పెన్మిటివస్త్ర్ర మురోవృతంబుగన్" (కళాపూర్ణోదయము).

280 బులియుచుండుట = ఉబ్బుచుండుట.

"ముక్తికన్యలను బెండ్లియాడి బులియుచున్న । క్రొత్తపెండ్లికొడుకు" (కళాపూర్ణోదయము).

281 తోడునీడ = సహాయము.

"అఖిలకళలందుఁ దోడునీడగుచు మెలఁగు" (కళాపూర్ణోదయము).

282 పెంపెసలార్చుట = అతిశయింపఁజేయుట,

"యతిపరంపరఁ బెంపెసలార్చు నమ్మహామహము"

(వైజయంతీవిలాసము).

283 ఘోటకబ్రహ్మచర్యము = గుఱ్ఱము బ్రహ్మచర్యము సేయుట, అనఁగాఁ జేయదనుట

అజగరోపవాసము = కొండచిలువయనుపాము ఉపవాసము చేయుట.

పింగళాజపము = పింగళియను భోగముదాని జపము.

బకధ్యానము = కొంగధ్యానముచేయుట.

నక్కవినయము = నక్కయొక్క వినయము.

ఇవియన్నియు నసత్యములనుట.

"కదసిచూడ ఘోటక బ్రహ్మచర్యంబు । పింగళాజపంబు పిల్లిశీల మజగరోపవాస మలబకధ్యానంబు । నక్కవినయమిట్టి నయములెల్ల"

(వైజయంతీవిలాసము).

284 పడిగాపులుండుట = నిరీక్షించియుండుట.

"అంకణభూమిపల్లకులు, నందలముల్పడి గాపులుండఁగన్"

(వైజయంతీవిలాసము).

285 బంగారుకాళ్ళయ్య = శుభప్రదమయిన పాదన్యాసముకలవాఁడు.

"బంగారుకాళ్ళయ్య జేజేవేయేడులు రాజ్యమేలుమనుచున్."

(వైజయంతీవిలాసము)

286 ఇసుకపాతర = హద్దులేనిది.

"అనఘువేశ్యావిడంబ వర్తనములెన్న । నిసుకపాతర యీజోలి యేల త్రివ్వ" (వైజయంతీవిలాసము)

287 ఒడలుదాచుకొనుట = పనిచేయకుండుట.

"నేఁజేతఁబనివట్టితే జూచియుందుగాఁ దానందుకొను నొడల్దాచుకొనదు" (వైజయంతీవిలాసము)

288 పదివేలకు = శాశ్వతముగా.

"వీరుమనవలదే పదివేలకనగ" (దాశరథివిలాసము)

"చాలుపదివేలువచ్చె నీచలనువిడువు" (రసికజనమనోరంజనము)

"చాలుపదివేలువచ్చెఁ బాంచాలిదొరకె । నట్టిగద"

(పాంచాలీపరిణయము)

289 తియ్యనినోరఁ జేదుమేయుట = మంచివాఁడైయుండియుఁ జెడ్డతనము జూపించుట.

"నీయట్టి గట్టిదొరకు నుచితంబె తియ్యనినోరం జేఁదుమేయుట న్యాయంబుగాదని" (ప్రభావతీప్రద్యుమ్నము)

290 కడుపుగక్కురితి = తొందరపాటు.

"తడవులఁబట్టియేము సంతతంబునుబోదుము వానివీటికిం । గడుమతి చాలమింగ గడుపు కక్కురితిన్నరనాథ" (ప్రభావతీప్రద్యుమ్నము.)

291 చేనుగుఱ్ఱిక్కినపాటి = స్వల్పకాలము, సులువుగా.

"అరదునేంతటివారలడ్డమైనఁ జక్కడఁచుచుఁ జేనుగుఱ్ఱిక్కినపాటిగా నిష్టమైన యర్థమెల్లఁబడసి" (ప్రభావతీప్రద్యుమ్నము)

292 నాతోడు = } నాపైఒట్టు, నన్నుఁ జంపుకొనినట్టు.
నాయాన = }

"నీ నెచ్చెలితోడుసుమ్ము సఖి నిక్కము చెప్పుము"
(ప్రభావతీప్రద్యుమ్నము)

"కలయట్లుచెప్పుమీ కల్లలాడిననీకునాతోడుసుమ్ము ప్రాణసఖి వీవు"
(ప్రభావతీప్రద్యుమ్నము.)

293 చిన్నబోవుట = దైన్యమును బొందుట, ఉత్సాహము తగ్గుట, తగ్గు స్థితికి వచ్చుట.

"పొన్నవిరి నిక్కముగఁ జూచి చిన్నవోదు" (ప్రభావతీప్రద్యుమ్నము)

294 తోఁకత్రెంచుకపోవుట = పారిపోవుట.

"నీమాటవిన్నఁ దానిలుచునే మరుతేజి తోఁకత్రెంచుక కానఁదొలఁగి చనక" (రసికజనమనోరంజనము.)

295 పైవేసికొనుట = భారమువహించుట.

మీరలిప్పని బయవేసికొందుమని బల్కక యించుక యన్నజాలు.
(రసికజనమనోరంజనము.)

296 కొంపతీయుట = నాశనముచేయుట.

"ఒరులకుఁజేరదవ్వగుచు నొజ్జలకొంపలుదీసి.
(రసికజనమనోరంజనము)

297 ఉప్పుతోఁ దొమ్మిఁదియును బెట్టి = కృపణరక్షణము గావించునే గుణ సముద్రి"
(రామాభ్యుదయము.)

298 ఎదురు చుక్క =
చుక్కయెదురు = } విరోధము.

"ఓరయికగా నెదురు చుక్కయును గాకున్నన్"
(రామాభ్యుదయము.)

299 బొమ్మపెట్టుట = వెక్కిరించుట.

"దేవతానటీ। మణులకు బొమ్మపెట్టు క్రియమర్దలతాళనినాద పద్ధతిన్"
(రామాభ్యుదయము.)

300 కమ్మచ్చునఁదీయుట = లాఁగదీయుట.

301 నూటార్లు = విస్తారము.

"నోచ్చిన తరువాత దిరులు నూటార్లు వడన్వచ్చునె"

(రామాభ్యుదయము.)

"నూటాఱు సంత లేకీభవించిన భంగి" (పాంచాలీపరిణయము.)

302 మాటయిచ్చుట = కరారుచేయుట.

"కనుగొన్నంతనె యాదరించి తను లంకారాజ్యపట్టాభిషి। క్తునిగా వింపఁగ మాటయిచ్చి" (రామాభ్యుదయము)

303 పుట్టిమునుగుట=నష్టమగుట. పుట్టియన నేరుదాటించుబుట్ట.

"గాడ్పుకూర్మి వట్టినుట్టివానిపుట్టి ముంచె గట్టులన్"

(రామాభ్యుదయము)

304 ఆటపట్టు=స్థానము.

"కలుములచేడె కోడలు నిగారపు తెల్లనిమేనిచాన పల్కులనిరి కాటపట్టు" (రసికజనమనోరంజనము)

305 కొనలుసాగుట = వృద్ధిపొందుట, అగ్నిము లెదుగుటనుబట్టివచ్చినది.

"వినెడువేడుకమదిలోనఁగొనలుసాఁగ" (రసికజనమనోరంజనము.)

306 కాపులకెల్లను నోముపంట=కాపులకు కార్యసిద్ధి.

"ఒప్పు కాపులకెల్ల నోముపంట" (రసికజనమనోరంజనము.)

"వెన్నునిదళవాయి నూత్రవతి నోముల పంట కనుంగొనుంజయం। బని"

(రామాభ్యుదయము.)

307 మాటపట్టింపు = వివాదము.

"వారి మీరు వారిని చేయవచ్చునెడు। మాట పట్టింపుఁబట్టె యమ్మచ్చకంటి" (రసికజన మనోరంజనము.)

308 మించిన దానినిద్రవ్వుకొనుట=వెనుకటిగాథలను మరలఁదలపోసికొనుట

"చెవిం। బెట్టక యూరకొంటి నిటుమించిన దానిని ద్రవ్వుకొంటి"

(రసికజన మనోరంజనము)

309 చెవిలో సొంటికొమ్ముమ్ముటు = బాధపెట్టుట.

"మీ దొర మేదురాగ్రహ సమేతుఁడు సూర్యసుతుండు దేవతా। మోదన బాణవేగమున సొమ్మసిలెం జెవిలోన సొంటి కొ। మ్ముమ్మిడిన వాఁడ నైతివె యరో యిటువంటివె భృత్యకృత్యముల్" (రామాభ్యుదయము)

310 ముక్కు బట్టుకొని కూర్చుండుట = జపము చేయుచుఁ గూర్చుండుట.

"అతఁడుం బోయి నికుంభిలాటవి నిశాటానీకినీ రక్షుఁడై। హుతభుక్సన్నిధి ముక్కుఁబట్టుకొని కూర్చున్నట్టి యీయుంద్రజి। ద్దితిజుంబోరికిఁ జీరి జంపిమరలెన్ దేవేంద్రుఁడుప్పొంగ" (రామాభ్యుదయము)

311 తడిపాత్రను గొంతుఁగోయుట = ఆశపెట్టిచంపుట.

"ఉడుపతిహిమఘృణిచేబలెఁ, దడిపాత్రంగొంతుగోయు తరవెఱఁగితివో" (పాంచాలీపరిణయము)

312 తలపట్లు=పోట్లాడుట.

"వాక్యోపవాక్యంబులం। గాకై ముందలపట్లుకుందొడఁగిరాకల్యాణవేదీస్థలిన్" (పాంచాలీపరిణయము)

313 నోరాడక = మాటాడరాక.

"అచ్చటనోరాడకాయన రచ్చలో సుదిరిగద్ది యుపాయము మున్నతతిని" (శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధము)

314 పెద్దలచాటుది = అస్వతంత్రురాలు,

"నికటముగాఁగవింటెఁ దరుణీమణి పెద్దలచాటు దాన" (ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానము)

315 తలక్రిందగుట=వ్యత్యస్తమగుట.

316 కుడిబుజమగుట=సహాయమగుట.

"కుడిబుజమైరమ్మ గొబ్బున సెనుబోతు, కానుకల్ జేతు నూకాలతల్లి" (కవిచకోరచంద్రోదయము)

317 చెట్టాకపిట్టయగుట = చెల్లాచెదరగుట.

"తరుణినీనీడఁలతో సరిరాకయంచలు, చెట్టాకపిట్టయై చెదరిపారె"

(కవిచకోరచంద్రోదయము)

"చెట్టాకపిట్టయైచనిరి సేనలవారలు" (శశిరేఖానాటకము)

318 మీసాలపైతేనియల్ = అల్పసుఖము.

"మీసాలమీఁదితేనియ, లాసలపుంజంబులట్టి యైశ్వర్యంబుల్

(కుచేలోపాఖ్యానము)

"ఒడల్దిరమే చెప్పకుమిట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపైదేనియల్"

(మనుచరిత్ర)



# CHAPTER XXVI.

## న్యాయములు.

---

న్యాయమనఁగాఁ బోలిక. న్యాయములను పేరితోఁగొన్ని పోలికలు పూర్వగ్రంథ దృష్టములగుచున్నవి.

ఇవి సమయోచితముగాఁ గొన్నిచోట్లఁ బ్రయోగించినచోఁ గావ్యము శ్రావ్యముగా నుండుంగావున మాకుఁ దోఁచినవాని నీక్రింద వివరించుచున్నాము.

1. అంకుశన్యాయము=గొప్పదేనుఁగు చిన్నదియగు నంకుశమునకు లోబడినట్లు.

2 అంకోల బీజన్యాయము = ఊడుగుచెట్టుగింజలు క్రిందరాలి యురుము వినఁబడఁగానే మ్రానినంటుకొనును.

3 అండ విస్రంభన్యాయము=బుడ్డనునమ్మి యేటఁబడినట్లు.

4 అంతర్దీపికా న్యాయము=కుండలోనున్న దీపము పైకివెలుఁగక లోపలనే ప్రకాశించుచుండును.

5 అంధకరదీపికాన్యాయము = గుడ్డివానిచేతిలోని కాగడావాని కేమియు నుపయోగించదు.

6 అంధ వర్తకీయన్యాయము.

7 అంధకూప న్యాయము = కొంతమంది గుడ్డివాండ్రు, ఒకరి వెనుక నొకరు పోవుచుండ ముందువాఁడు నూతిలోఁ బడఁగా దక్కినవారును నాత్రోవనే పోవుచున్నారు గావునఁ గ్రమక్రమముగా నందఱు నూతఁబడిరి.

8 అంధగజన్యాయము = నలుగురు గుడ్డివాండ్రు ఏనుఁగును జూపుమని యడుగఁగా వాఁడొక యేనుఁగును నిలిపి తడవి చూడుఁడని చెప్పగా,

నలుగురు నాలుగవయవములు బట్టి చూచి, ఇట్లు ప్రసంగింప నారంభించిరి. కాలుతడవి చూచినవాఁడు, ఏనుఁగు రోలువలె నుండు ననెను, తోఁకఁ జూచినవాఁడు, చీపురువలెనుండుననెను. చెవులు జూచినవాఁడు చేటవలె నుండుననెను. తొండముఁ జూచినవాఁడు రోకలివలె నుండుననె నన్నట్లు.

9 అంధగోక్షేత్రన్యాయము=గ్రుడ్డియెద్దు చేనిలోఁబడి వెన్నులుదినుటకుఁ గాన్పింపక గడ్డిపరకలే తినును.

10 అంధగోలాంగూలన్యాయము = గ్రుడ్డివాఁడు ఆవుతోఁక బట్టుకొనినడచినట్లు.

11 అంధదర్పణన్యాయము=గ్రుడ్డివాని కద్దముఁ జూపించుట వ్యర్థము.

12 అంధదీపికాన్యాయము=గ్రుడ్డివానికి దీపమున్నను లేకపోయిన నొకటియే.

13 అంధపంగున్యాయము = గ్రుడ్డివాఁడును కుంటివాఁడును ప్రయాణము చేయ నారంభించి గ్రుడ్డివాని బుజము మీఁదఁ గుంటివాఁడు కూర్చుండి మార్గము దెల్పుచుండఁ గ్రుడ్డివాఁడు నడచెను. ఇట్లు చేర వలసిన తావు జేరిరనినట్లు.

14 అంధపరంపరాన్యాయము = ఒక గ్రుడ్డివాఁడొక తెలివితక్కువపనిచేసిన మొదలఁ దక్కిన గ్రుడ్డివాండ్రందఱు నదియేపని చేయుదురు.

15 అంధాంజనన్యాయము = గ్రుడ్డివానికంటికి కాటుకపెట్టిన ఫలములేదు.

16 అంధాంధన్యాయము = గ్రుడ్డివానికి గ్రుడ్డివాఁడు త్రోవఁ జూపెనన్నట్లు.

17 అంధాశ్వపాలిన్యాయము=గుఱ్ఱము గుడ్డిదైనను గుగ్గిళ్ళు తినుటలో సామర్థ్యమెక్కువ యన్నట్లు.

18 అంధాక్షిమీలన్యాయము=గ్రుడ్డికన్నులు మూసినం దెరచిన నొకటియే.

19 అగ్నిదమిత్రన్యాయము = అగ్నికి చెదలుపట్టునా ?

20 అగ్నివహ్నిన్యాయము = అగ్నిని అగ్నినీరగులఁ బెట్టఁగలదా యనునట్లు.

21 అచలచలన్యాయము = ఓడ మొదలగునవి యెక్కి పోవునప్పుడు కదల కుండునట్టి తీరములు నడచుచున్నట్లును, నడచుచున్నవోడ నిలిచి నట్లును గాన్పించుట.

22 అజగరన్యాయము = కొండచిలువ నిద్రబోవునట్టే యుండి యుండి జంతువును హఠాత్తుగా మ్రింగివేయును.

23 అజాకృపాణీయన్యాయము.

24 అజాగళస్తనన్యాయము = మేక మెడ క్రిందనుండు స్తనముల పుట్టుక నిష్ప్రయోజనము.

25 అణుమహాచలన్యాయము=పరమాణువునకును పర్వతమునకుఁ జాల హెచ్చుతగ్గుండును.

26 అతిపరిచయన్యాయము = మిక్కిలి పరిచయముచేత మనుష్యులయందు అనాదరము కలుగును.

27 అపరాహ్ణన్యాయము.

28 అపృష్టోత్తరన్యాయము = అడుగకుండ జవాబుచెప్పుట తప్పు.

29 అప్రసక్తనిషేధన్యాయము=వెనుకటి గ్రంథమువలన నెద్దియేని యొకటి సంబంధములేని స్థలమందుఁ గూడఁ బ్రసక్తించినపుడు దానిని నిషేధింప వలయునుగాని ప్రసక్తించనిది నిషేధించఁగూడదు. ఎట్లనిన:—ప్రాతఃకాలమునఁ బువ్వులు వికసించును. అనువాక్యముచే నెల్లపూవులు వికసించుట చెప్పఁగా గలువపువ్వులకుఁ గూడ వికాసము ప్రసక్తించినది. కావునఁ గలువలు వికసించవని నిషేధించవలయును. ఇది ప్రసక్తనిషేధము. చీకటి తెల్లగానుండదు. అని చెప్పుట అప్రసక్తనిషేధము.

30 అభావవిరక్తిన్యాయము = ఒకదానివిషయమై ప్రయత్నించి యది దొరకనప్పుడు దానితో మనకేమిప్రయోజనము, అని యూరకుండుట.

31 అభ్రమయూరన్యాయము=మేఘమును జూచిన నెమిలికి సంతోషమగు నట్టు.

32 అయస్కాంతసూచీన్యాయము=సూదంటురాతిని సూది చటుక్కున బట్టుకొనును.

33 అరణ్యరుదితన్యాయము=అడవిలో నేడ్చుచున్నవాని నాదరించి యోదార్చు వారుండరు.

34 అర్ధజరతీన్యాయము=శరీరమందు గొంతభాగమున ముసలితనమును, కొంతభాగమున పడుచుదనమునుగల స్త్రీయుండదు.

35 అర్థత్యాగసుఖన్యాయము = ధనము ఖర్చుచేసిన సుఖమున్నదనుట.

36 అలంకృతశిరశ్ఛేదన్యాయము = ఒడలెల్లయు నలంకరించి, తల దెగ వేయుట. అట్టివాని కలంకారమేల ?

37 అలాతపిశాచన్యాయము = కొఱవిదయ్యమనుటయేగాని చూచిన వారు లేరనుట.

38 అలాబూపాషాణన్యాయము=రాతిలోఁబుట్టిన అనపకాయ రాతినెరియ యుట్లుండనో అట్లే పెరుగుననుట.

39 అవినాభావ సంబంధ న్యాయము = ఒక దాని కొకటి సంబంధించి యుండుట, కుండకు మట్టికివలె.

40 అవ్యాపారవ్యాపారన్యాయము = కూయుచున్న గాడిదె మేయుచున్న గాడిదను చెరపె నన్నట్లు.

41 అహికుండల న్యాయము.

42 అశ్మలోష్టన్యాయము.

43 అశ్వత్థపత్రన్యాయము = రావాకుగాలి యున్నను లేకున్నను కూడ కదలు చుండును.

44 అక్షికాణ న్యాయము.

45 అక్ష్యండభేషజన్యాయము = కంటికి రాయు మందు బుడ్డకు వ్రాసినట్లు.

46 ఆకాశభేదనన్యాయము = ఆకాశమును బ్రద్దలు చేయుటకేమి యుందు శేము.

47 ఆకాశముష్టిహననన్యాయము = ఆకాశమును పిడికిలితో గ్రుద్దుటకు వీలు లేదనుట.

48 ఆదర్శన్యాయము = అద్దమువలె నిర్మలముగా నుండుట.

49 ఆదర్శగజన్యాయము = అంత యేనుఁగును చిన్న యద్దములోఁ గాన్పించుట.

50 ఆదర్శమలిన న్యాయము = అద్దమునకు మకిలపట్టుకొనిన నలుపుగా పోవుననుట.

51 ఆమ్రవణన్యాయము = అనేక వృక్షజాతులు గల తోటలో కొన్ని మామిడిచెట్లున్న మొదల దానిని మామిడితోట యన్నట్లు.

52 ఆమ్రసేక పితృతర్పణన్యాయము = మామిడిచెట్టు మొదటనే పితృతర్పణం జేసినచోఁ జెట్లకు నీరు పోసినట్లును పితృతర్పణము చేసినట్లును గూడనగును.

53 ఇషుకారన్యాయము.

54 ఉత్ఖాత దంష్ట్ర భుజగన్యాయము=కోరలు తీసిన పాము పైకి భయంకరముగాఁ గాన్పించుటయే గాని కఱవలేదు.

55 ఉలూఖల మర్దల న్యాయము = రోలు వెళ్ళి నన్ను అందఱుఁ గొట్టెదరని మద్దెలతోఁ జెప్పఁగా మద్దెల నిన్నొకవైపుననే గొట్టెదరు గాని నన్ను రెండు వైపులను గొట్టెదరని చెప్పెను.

56 ఉలూఖల శేష న్యాయము = మొఁగమోటమి గల యల్లుఁడు అత్తగారు పెట్టిన చలిమిడితినక రోటిలో మిగిలినది నాకినట్లు

57 ఉష్ట్రకంటక భక్షణన్యాయము = లొట్టిపిట్ట ముళ్ళకొమ్మలను నోటికి గుచ్చుకొనకుండ నమలును.

58 ఉష్ట్రలగుడ న్యాయము.

59 ఉష్ట్రకూలన్యాయము = రోకళ్ళతోఁ గుమ్ముట.

60 ఊషరబీజన్యాయము = చవిటినేలలో విత్తనము జల్లినట్లు.

61 ఊషరవృష్టిన్యాయము = చవిటినేల వర్షము గురిసినట్లు.

62 ఏకదేశవికృతిన్యాయము = ఒకభాగమందు వికారము గలిగినను అది మఱియొకటి కాదనునట్లు.

63 ఏకనాళ ఫల బాహుళ్యన్యాయము = ఒకకాడను చాలపండ్లు వ్రేలుచున్నట్లు.

64 కంబళిభోజన న్యాయము = గొంగళిలో భోజనము చేయుచు వెండ్రుక లేరినట్లు.

65 కజ్జల జలన్యాయము = కాటుకలో నీళ్ళుపోసి మారిన నీళ్ళు నల్లబడవు. కాటుక కరగదు.

66 కణజమూషక న్యాయము = గాదిక్రింది పందికొక్కు గాదిలోనే జీవించుననుట.

67 కతకరేణున్యాయము = చిల్లగింజ అరగదీసి నీళ్ళలోఁ గలిపినచో గంధము నీటియందలి బురదను వేఱుపరచి తాను గాన్పించకుండఁ బోయినట్లు.

68 కదంబ ముకుళన్యాయము = కడిమిచెట్టుపువ్వు ఒకదానిలోనుండి యొకటి వరుసగా దండవలె నుండుననునట్లు.

69 కమఠీదుగ్ధ పానన్యాయము = ఏమియు లేదనుట.

70 కరకావృష్టిన్యాయము.

71 కరటదంతన్యాయము = కాకిదంతములు పరిశోధించ బూనుకొనినట్లు.

72 కరతలామలకన్యాయము = చేతిలోని యుసిరికాయవలె స్పష్టముగనున్న దనునట్లు.

73 కరదీపికాన్యాయము = తనచేతిలోని దీపము తన కుపయోగించక యితరుల కుపయోగించుచున్నట్లు.

74 కరబదరన్యాయము = చేతిలోని రేగుపండువలె తేలికగానుండునన్నట్లు.

75 కరభదోహనన్యాయము = ఆవుండగా గాడిదెపాలు పితికినట్లు.

76 కరికపిత్థన్యాయము = ఏనుఁగు మ్రింగిన వెలగపండు పండువలె నుండియు లోపలి గుంజంతయు హరించుచున్నట్లు.

77 కరిణీప్రసవన్యాయము = పందికి పదిపిల్లలు పుట్టుచున్న నేనుఁగుకొక పిల్ల పుట్టిన మేలనుట.

78 కర్కటీగర్భన్యాయము = పీత, పిల్లలు పుట్టినతోడనే చచ్చుననుట.

79 కాకతాళీయన్యాయము = కాకివాలగానే అప్రయత్నముగా తాటిపండు పడునట్లు.

80 కాకక్రోటిబింబన్యాయము = కాకిముక్కున దొండపండు గట్టినట్లు.

81 కాకపక్షన్యాయము.

82 కాకపికన్యాయము = కోవెల కాకులలోఁ బెరిగియుఁ దుదకు వేరే పోవుననునట్లు.

83 కాక బలిన్యాయము.

84 కాకరుతభీరున్యాయము = పగలు కాకికూతవిని జడిసి పెనిమిటిని గౌఁగిలించుకొను వెలఁది, రాత్రి నర్మదానది దాటివెళ్ళినదనినట్లు.

85 కాకాక్షిన్యాయము = కాకికి ఒక కన్నే కనపడును. అది ఎటు త్రిప్ప గలిగిన నటున్న కన్ను కాన్పించును.

86 కాంచకుంభదీపన్యాయము = లాంతరులోని దీపము ఎంత గాలి వేసినను గదలకుండునట్లు.

87 కార్యకారణన్యాయము = కార్యవస్తువుంబట్టి కారణవస్తువు పుట్టినట్టూహించినట్లు.

88 కార్యార్థిన్యాయము = కార్యములు గోరినవారికి గర్వమేల? గర్వము వలన గార్యము చెడునన్నట్లు.

89 కాశకుశావలంబనన్యాయము = దర్భ దొరకనిచో కాశే దర్భగాఁ బెట్టికొనినట్లు.

90 కుంభదీపికాన్యాయము = కుండలోఁ బెట్టిన దీపము పైకిఁ గాన్పింపకుండినను లోపలనే వెల్గుచుండునట్లు.

91 కులాలకీటన్యాయము = కుమ్మరపుర్వు మట్టిలో గూడు నుండినను పట్టి యంటుకొనకుండునట్లు.

92 కుక్షిస్థమక్షికాన్యాయము = కడుపులోఁబడ్డ యీఁగ తినిన యన్నమంతయు వెళ్ళఁగ్రక్కించుట.

93 కూపకూర్మన్యాయము = నూతిలోనున్న తాఁబేలు ఆనూయియే సమస్త ప్రపంచమని యూహించునట్లు.

94 కూపఖనననన్యాయము = కొంపలంటుకొనిన తర్వాత నూయిద్రవ్వినట్లు.

95 కూపమండూకన్యాయము—కూపకూర్మన్యాయమువలెనే.

96 కూర్మాంగన్యాయము = తాఁబేలు తన తల కాళ్ళు మొదలగునవి లోపలికి లాగుకొని జాగ్రత్తపెట్టుకొనునట్లు.

97 కూష్మాండబీజన్యాయము.

98 కూశ్మాండస్తేయన్యాయము = గుమ్మడికాయల దొంగాయనిన బుజము తడవి చూచుకొనెనన్నట్లు.

99 కృత్రిమపుత్రికాన్యాయము.

100 కృపణధనన్యాయము = లుబ్ధుని ధనము పరుల పాలగుట.

101 కేకరాక్షన్యాయము = మెల్లకంటివాఁడు ఒకని వైపు చూచుచుండ మఱియొకని వైపు జూచుచున్నట్లు కాన్పించుట.

102 కేతకీకుసుమ న్యాయము = మొగలిపూవు సుగంధముగలదియైనను ముండ్ల చేత కోసికొన శక్యముగానట్లు.

103 ఖండితశాఖా న్యాయము = కొమ్మ తెగఁగొట్టిన మరలఁజిగురు పెట్టునన్నట్లు.

104 ఖడ్గకోశ న్యాయము = ఒఱజూచి కత్తికలదని జడిసి జారిపోయినట్లు

105 ఖరాశ్వ న్యాయము = మాటఁగా గుఱ్ఱము గాడిదయైనదనునట్లు

106 ఖర్వాపేక్షిత ఫల న్యాయము = పొట్టివాఁడు అందనిపంటికిఁ జేయిఁ జూచినట్లు.

107 ఖలే కపోత న్యాయము = కళ్ళములలోఁ బావురములు వ్రాలి గింజలు దినుచుండఁగా వానినిఁబట్టుటకై యెఱుకలవాఁడు వలవేయఁగా నవియన్నియు నొక్కుమ్మడిగా లేచి వలయెత్తుకొని పోయెననుట, అన్నియు నొక్కమాఱుగా లేవకున్న వలమీఁదికి లేవదు.

108 ఖల్వాట బిల్వీయ న్యాయము = నీడ నపేక్షించి బట్టతలవాఁడు మారేడు చెట్టుక్రిందికిరాగా కాయనెత్తిమీఁదపడి నెత్తి చిల్లిపడ్డట్లు.

109 గగనకుసుమ న్యాయము = ఏమియు లేదనునట్లు.

110 గగనరోమంథ న్యాయము.

111 గజపద్దన్యాయము = గజశీర్షు.

112 గడ్డలికా న్యాయము.

113 గతజలసేతుబంధ న్యాయము = నీరుపోయినతర్వాత గట్టువేసినట్లు.

114 గర్తజంబుక న్యాయము = గుంటనక్క చేష్టలు.

115 గర్ధభచందన న్యాయము = గాడిదమీఁద నెంత గంధపుచెక్క వేసిన దాని సువాసన తెలియకుండుట.

116 గుంజాగ్ని న్యాయము = గురవిందగింజలను నిప్పనుకొనుట.

117 గుడజిహ్వికాన్యాయము = బెల్లము నాలుకమీఁద నున్నంతసేపే రుచి యనునట్లు.

118 గుడోపలన్యాయము = బెల్లముగొట్టిన రాయివలె ననునట్లు.

119 గురుశిష్యన్యాయము.

120 గృహదీపికాన్యాయము = ఇంటదీపమున్నయెడల నిల్లంతయుఁ బ్రకాశింపఁజేయును.

121 గృహబద్ధకుమారీన్యాయము = కలబందయింట్లోఁగట్టిన పెరగను పెరగదు చావనుచావదు.

122 గృహమార్జాలన్యాయము = బయటనున్నను సేనుంగునకు గలగౌరవము ఇంటనున్నను పిల్లికిలేదు.

123 గేహేనూరన్యాయము = ఇంట్లో డంబములు కొట్టువాఁడేపనికిఁబనికిరాఁడనునట్లు.

124 గోపుచ్ఛన్యాయము = మొదటలావుగానుండి క్రమముగా సన్నముగనుండునట్లు.

125 గోబలీవర్దన్యాయము = గోశబ్దమునకు ఆవులు నెద్దులుకూడ నర్థము, బలీవర్దశబ్దమున కెద్దు లర్థము. గోబలీవర్థమనునపుడు, బలీవర్దశబ్దమున్నందువలన గోశబ్దమున కావులేయర్థము చెప్పవలయునన్నట్లు.

126 గోమయపాయసీయన్యాయము = పేడపరమాన్న మగునాయనునట్లు

127 గోముఖవ్యాఘ్రిన్యాయము = ఆవుముఖముగల పులినిజూచి, అవనుమాహాతో నితరజంతువులు దగ్గఱకురాగా వానినిమ్రింగివేయునన్నట్లు.

128 గోవత్సన్యాయము = ఆవునమ్మినప్పుడు దూడకువేరే కరీదులేదనుట

129 గోశృంగన్యాయము.

130 గోశ్వానన్యాయము.

131 గోక్షీరన్యాయము = గేదెపాలైనను, ఆవుపాలు కొంచెము కలిసిన యెడల పవిత్రమగుననుట.

132 గ్రామదూరన్యాయము = ఈయూరి కాయూరెంత దూరమో ఆయూరి కీయూరంతే దూరమనురట్లు.

133 ఘంటామణిన్యాయము.

134 ఘటీయంత్రన్యాయము = ఏతముకలె కార్యమగునంతవఱకు వంగియుండి కార్యముకాగానే మీఁదికి నిక్కుట.

135 ఘట్టకుటీ ప్రభాతన్యాయము = ఒక వ్యవహారస్థుఁ డొక పట్నముచేరి తన వ్యవహారము చేసికొని పోవునప్పుడా పట్టణములోని ఘాటిపాక దగ్గఱనుండి వెళ్ళినచో సుంకమీయవలసి వచ్చునని యర్ధరాత్రి వేళ మారుత్రోవను బోవలయునను తలంపుతో బయలుదేరి యా పట్టణము సందులు గొందులు దిరిగి త్రోవ తెలియక తుదకు ఘాటిపాకదగ్గఱకు జేరునప్పటికిఁ దెల్లవారినది. కనుక ఆయాసపడుటయు, సుంకమీయక తప్పక వచ్చెననుటయు ననునట్లును.

136 ఘరట్టన్యాయము = తిరుగలిదిమ్మలు తిరుగునదియు తిరుగనిదియు రెండునుండినగాని ఒక్క తిరిగేదానితోనే పని నెరవేరదనుట.

137 ఘుణాక్షరన్యాయము = ఒకపురుగు ఒకకఱ్ఱను దొలుచుకొని పోఁగా పోఁగా నది యొక యక్షరాకారముగా నేర్పడును, అది యప్రయత్నముగా నేర్పడినదిగాని పురుగుయొక్క ప్రయత్నముచేతఁ గాదనునట్లు.

138 ఘృతకోశన్యాయము.

139 ఘృతకోశాతకీన్యాయము = నేతిబీరకాయయని పేరేగాని అందులో నేయిలేదు సరేగదా చప్పగా నుండుననునట్లు.

140 చంద్రచకోరన్యాయము.

141 చంద్రచంద్రికాన్యాయము=చంద్రునివదలి వెన్నెలయుండదనునట్లు.

142 చక్రభ్రమిన్యాయము = చక్రపు అంచు మీఁదిది క్రిందికి, క్రిందిది మీఁదికి వచ్చుచుండునట్లు

143 చక్షుశ్శ్రవణన్యాయము=పామునకు వినికియున్నప్పుడు చూపును చూపున్నప్పుడు వినికియునుండదనునట్లు.

144 చర్వితచర్వణన్యాయము=నమలినదే మరల నమలినట్లు.

145 చాలనీన్యాయము=జల్లెడలోఁబోసి జల్లించినట్లు.

146 చిత్రపటన్యాయము=ముందు రేఖలువైచి పిదప బొమ్మను తయారు చేయుట.

147 చిత్రితాంగజంబుకన్యాయము=పులినిఁజూచి నక్క వాత పెట్టుకొన్నదనునట్లు.

148 ఛత్త్రిన్యాయము=బట్టలు వెంబడలయిన వనేకముఁడగా గొడుగువేసికొని వెళ్ళువారు అని చెప్పునట్లు.

149 ఛాగపశున్యాయము=సామాన్యముగా పశుశబ్దము వృషభాదులర్థము కలదియైనను వేదమందొకానొకచోట మేకను చెప్పుటచేత యజ్ఞములయందు సామాన్యముగా పశువనఁగా మేకయే యగుచున్నదనుట.

150 ఛురికాకూష్మాండన్యాయము = ఎంత గుమ్మడికాయయైనను చిన్న కత్తి కోసివైచుననునట్లు.

151 జంబుకారగ్వధన్యాయము = నక్క రేలకాయలు దిని కడుపు నొప్పియెత్తి యిఁక నెన్నఁడు రేలకాయలు దినరాదని యనుకొని కడుపు నొప్పి పోఁగానే మరల రేలకాయలం దినుటకు వెళ్ళినట్లు,

152 జతుకాష్ఠన్యాయము = లక్కపుల్ల యెక్కడ విరచిన నక్కడ విరిగి మరల అతికిన నతుకుకొని మరల విరిచిన విరుగునన్నట్లు.

153 జపాస్ఫటికన్యాయము = మంకెన పువ్వు స్ఫటికము దగ్గఱఁబెట్టిన స్ఫటికమంతయు నెఱ్ఱబడినట్లు.

154 జలతైలబిందున్యాయము = నీళ్ళమీఁద వేసిన నూనె చుక్క నీరంతటను గలియబారునన్నట్లు,

155 జలాగ్నిన్యాయము = అగ్ని జలము కలియునప్పుడు, అగ్నితక్కువయైన నగ్నియు, నీరు తక్కువయైన నీరును హరించు ననునట్లు.

156 జానపదన్యాయము.

157 జారభర్తృన్యాయము.

158 జాలమత్స్యన్యాయము = వలలోఁబడిన చేప లోపలనుండి సర్వముఁ జూచుచుండుంగాని యీవలికి రానేరదనునట్లు.

159 డిండిమన్యాయము

160 తటాకపరివాహన్యాయము = చెరువు నీరు తూముగుండా కొంచెము విడువని యెడల గట్టు బద్దలయి నీరంతయుఁ బోవుననునట్లు.

161 తప్తతైలాంబున్యాయము = కాగిన నూనెపై నీళ్ళ చుక్క జల్లిన భగ్గుమండునన్నట్లు,

162 తప్తాయఃపిండన్యాయము = కాలిన యినుపగుండునకు పొగ యుండదుగాని తక్కిన యగ్నిలక్షణములన్నియుఁ గలిగియుండుననుట.

163 తప్తాయఃపత్రబిందున్యాయము = కాలినయినుపరేకుపై జలబిందువుపడిన యెడల నామరూపములు లేక నశించుననునట్లు

164 తమోదీపన్యాయము = దీపమున్నచో చీఁకటి యుండదనునట్లు.

165 తరంగన్యాయము = ఒకదాని వెంబడి నొకటి విడువక వచ్చునన్నట్లు.

166 తరంగప్రతిబింబన్యాయము = తరంగమునందుఁ బ్రతిబింబించు సూర్యుఁడొక్కఁడైనను. ప్రతి బింబములు తరంగముల యందుఁ జాలగాన్పించునట్లు.

167 తాళాధిరోహణన్యాయము = తాడిచెట్టెక్కువాని నెంతదనుక నెగద్రోయుదురన్నట్లు.

168 తిలతండులన్యాయము = నువ్వులు బియ్యముకలిపినఁ గలియును విడఁదీసిన విడునన్నట్లు.

169 తీరబకన్యాయము = ఒడ్డునకొంగ జపముచేయుచున్నట్లుండి చేపచేరువకురాఁగా మ్రింగునన్నట్లు.

170 తీర్థకాకన్యాయము = కాకిగంగాదితీర్థములయందు మునుఁగును గాని దానివలనఁ గలుగుఫలము నెఱుఁగదనునట్లు.

171 తుంబీవికలవీణాన్యాయము = తుంబకాయ బుఱ్ఱలేనిదే వీణపాడదనునట్లు.

172 తులాదండన్యాయము = త్రాసునందు బరువుగానున్నవైపు క్రిందికి, తేలికగానున్నవైపు మీఁదికిఁబోవుననునట్లు.

173 తృణజలూకాన్యాయము = గడ్డివైపురుగు మూతికి సమీపమందు రెండు కాళ్లును, వెనుకవైపున చివర రెండుకాళ్లును గలది. అది వెనుక కాళ్ళతో నిలువఁబడి ముందునిలుచుట కాధారము చూచుకొనిముందు కాళ్ళనక్కడఁబెట్టిన తర్వాత వెనుక కాళ్ళు తీయునన్నట్లు.

174 తృణరజ్జున్యాయము = బలములేని గడ్డిపరకలు పోగుజేసి త్రాడల్లి యేనుఁగునైనం గట్టవచ్చుననునట్లు.

175 తేజస్తిమిరన్యాయము = వెలుఁగున్నచోటఁ జీఁకటియుండ దనునట్లు.

176 దండాపూపన్యాయము = చిలుకకొయ్యను గారెలుతగిల్చిరి, ఆచిలుక కొయ్యను ఎలుక కొట్టివేసినది. అని చెప్పిన తరువాత గారెలుతిన్నవని వేఱేచెప్పనేల? దీనినే కైముత్యన్యాయమందురు.

177 దండాభావన్యాయము = కఱ్ఱలేనివానిని గొఱ్ఱెకఱచినదనునట్లు.

178 దగ్ధపటన్యాయము = మడతబెట్టిన బట్ట కాలిపోయిన మడతలు మడత

లుగాను నూలిపోగులు స్పష్టముగాను గాన్పించును. కాని చేతితోఁ బట్టిన విడిపోవునన్నట్లు.

179 దగ్ధపదమార్జాలన్యాయము = నలుగురు దూదివర్తకులు పిల్లి నొకదానిని పెంచి దాని దాని నాలుగు కాళ్ళకు నలుగురు గజ్జెలు మువ్వలు మొదలయినవి కట్టుచునుండఁగా నందులోనొక కాలికి దెబ్బ తగిలినది. ఆదెబ్బ మాన్పుటకు ఆ కాలుగలవాఁడు దానికిఁ జమురు గుడ్డ జుట్టగా నాగుడ్డచివర దీపమంటుకొని యాపిల్లిదూదిమూటలమీఁద బరుగెత్తగా దూదియంతయుఁ గాలిపోయినది. తక్కిన ముగ్గురు దూదిధంతుగ నాల్గవవాఁడీయవలసినదని ధర్మాధికారితోఁ జెప్పికొనగా నాతఁడు నడచుటకు సాధనమయిన వీమూఁడు కాళ్లే. నడువలేని కాలితో దూదిమీఁదికి పిల్లియెట్లు వెళ్లును కావున మీరు ముగ్గురు వానినష్టము నీయవలసినదని ధర్మాధికారి తీర్పుచేయునట్లు.

180 దధిప్రీహిన్యాయము = పెరుగు వడ్లు గలసినట్లుగా నేమియు తోచక యుండెనన్నట్లు.

181 దర్వీపాకరసన్యాయము = గరిటె సమస్తవస్తువులలోను మెలఁగుచున్నను ఆవస్తువులరుచి దానికిఁ తెలియదనినటులు.

182 దశానామేకాదశన్యాయము = ఏదియో కొంతమట్టునకుఁ గర్చుచేయవలసివచ్చినప్పుడు ఇంకొకకొంచము కర్చుసహించవలెను పదింటిలోఁ బదకొండనునటులు.

183 దారుపురుషన్యాయము=కట్టెమొద్దును జూచి మనుష్యుఁడనిభ్రమపడుట

184 దివాతనచంద్రన్యాయము=పగటి చంద్రునివలెఁ గాంతహీనుఁడై యుండెనన్నట్లు.

185 దివాంధన్యాయము=అందఱికి నిష్టముగు పగలు గుడ్లగూబకు అనిష్టముగా నుండును.

186 దీపకలికాన్యాయము.

187 దూరగిరిన్యాయము = దూరముగానున్న పర్వతములు నునుపుగాఁ గాన్పించును, దగ్గరకుఁ బోవఁగుట్టలు, మెట్టలు, ముండ్లుగానుండు నట్లు.

188 దూర్వామూలన్యాయము = గరిక వేరు భూమిలోనుండియుండి చినుకు పడగానే చిగుర్చును. కాని యెన్నటికిని చావదనునట్లు.

189 దేహళీదీపన్యాయము = గడప మీఁద దీపము పెట్టిన నింటిలోనఁ బైట గూడ నుపయోగించుననినట్లు.

190 నదీసముద్రన్యాయము = అన్ని నదులకు సముద్రుఁడే గతియనునట్టులు

191 నష్టాశ్వదగ్ధరథన్యాయము = యుద్ధములో ఒకనికి గుఱ్ఱము చచ్చెను. ఇంకొకని రథము కాలిపోయెను. ఉభయులు గలిసిన రథికులయ్యెద రనునట్లు.

192 నారికేళతృణన్యాయము = కొబ్బరిచెట్టు నెందుకెక్కితివనఁగా దూడ గడ్డికై యెక్కితిననినట్లు.

193 నారికేళాంబున్యాయము = కొబ్బరికాయలోనికి నీరెట్లువచ్చునది తెలియదనినట్లు.

194 నాసికాంగుళీన్యాయము = ఎవని ముక్కు రంధ్రములో వాని వ్రేలైనను పట్టుననునట్లు.

195 నిర్వ్యాపారాంగుష్టన్యాయము = పనిలేని మఁగలి పిల్లితలగొరిగెననినట్లు.

196 నీరనీరన్యాయము = నీరును నీరును గలిసిన యెడల విడఁదీయుట యసాధ్యమనునట్లు.

197 నౌశకటన్యాయము = ఓడలు బండ్లగును, బండ్లోడ లగుననునట్లు.

198 పంకక్షాళనన్యాయము = బురదతో దిగి కాళ్లు కడుగుకొనుట కంటె దూరముగా నొత్తిగిలుటయే మంచిది,

199 పంకమగ్నగజన్యాయము = బురదలో నేనుఁగుపడినచో దాని నెత్తుట దుర్లభము. దాని నేనుఁగే యెత్తవలెననునట్లు.

200 పటకుటీరన్యాయము = డేరా యొక్కడ కావలయునన్న నచ్చట నిల్లుగా నేర్పడుననునట్లు.

201 పద్మినీపత్ర జలబిందున్యాయము = తామరాకులో నీరు ఆకునంట కుండు ననునట్లు.

202 పయోముఖ విష కుంభన్యాయము = లోపల విషము, నోటపాలును గల కుండయనినట్లు.

203 పరిణామన్యాయము=కాలమును బట్టి ప్రతివస్తువును మార్పు గలుగు ననునట్లు.

204 పరిశేషన్యాయము=ఆఁడువాండ్రును మగవాండ్రును గలిసి పదిమంది అందులో నలుగురు మగవాండ్రు, అని చెప్పఁగా మిగిలిన యారుగురు నాఁడువాండ్రని చెప్పనక్కఱలేకుండగనే తెలియుననునటులు

205 పర్జన్యన్యాయము = మేఘుఁడు చవిటి నేలను మంచి నేలనుగూడ వాన కురియును. మంచి నేలను గురిసినది యుపయోగించును. చవిటి నేలను గురిసినది వ్యర్థమగును.

206 పాటచ్చరయామికన్యాయము = దొంగవానిని గస్తీ దిరుగువానినిగా వైచిన యెడల వాఁడుచేయు దొంగతనము నెవ్వరుఁబట్టువారుండరను నటులు.

207 పాత్రేసమ్మితన్యాయము = భోజనసమయమునకు సిద్ధపడువారు పని కుపయోగించరనునటులు.

208 పిపీలికాన్యాయము = చీమ పండు నిమిత్తము చెట్టు మొదటినుండియు బ్రాకిపోయి పండునకు కన్నము వైచి లోని రసమాను ననునటులు

209 పిష్టపేషణన్యాయము = నూరినపిండినే నూరినట్లు.

210 పిష్టపరిమితపూపన్యాయము = పిండియెంతయో రొట్టెయు నంతియే యనునట్లు.

211 పూర్ణఘటన్యాయము = నిండుకుండ తొణకదనునట్లు.

212 పూర్వాహ్ణన్యాయము.

213 పృష్ఠఖలీనన్యాయము = నోటికిబెట్టు కళ్లెము ముడ్డికి బెట్టినట్లు.

214 ప్రతిబింబన్యాయము = వస్తువు కదలిన దాని నీడయుఁ గదలునట్లు.

215 ప్రధానమల్లనిబర్హణన్యాయము = సేనానాయకుని గొట్టిన యెడల సైన్యమంతయు లొంగెననునట్లు.

216 ప్రస్థితభర్తృకాన్యాయము = మగఁడు ప్రయాణము వెళ్ళఁబోవుచుండఁగా మగఁడెదుట నుండినను నేడ్చినట్లు.

217 బధిరజాపన్యాయము = చెవిటివాని చెవిలో నేకాంతముఁ జెప్పినట్లు.

218 బధిరవీణాన్యాయము = చెవిటివానికి వీణ వినిపించినట్లు.

219 బధిరశంఖన్యాయము = చెవిటివాని చెవిలో శంకూదినట్లు.

220 బిడాలవిణ్మోచనన్యాయము = పిల్లి మలవిసర్జనము చేయునపుడు గోఁటఁ ద్రవ్వి అందు విడచి పూడ్చివేయుననునట్లు.

221 బీజాంకురన్యాయము = గింజయందు మొలక అణఁగి యున్నట్లు

222 బ్రాహ్మణవసిష్ఠన్యాయము.

223 భల్లూకముష్టిన్యాయము = ఎలుగుబంటి పిడికిలి యెన్నివిధములను విడువదనినట్లు,

224 భస్మచ్ఛన్నాగ్నిన్యాయము = బూడిదచేఁ గప్పఁబడిన యగ్నిపయికి లేనట్లుండి పైకి కణకణలాడుచుండును.

225 భత్తిత్రా కాలవిత్రిన్యాయము = తిత్తిలో నేదియైన చినను వాడికిభంగము లేదు. కాని కొడవలియుంచినచోఁ జీల్చివేయు నన్నట్లు.

226 భిక్షుపాదప్రసారన్యాయము.

227 భిత్తి బిడాలన్యాయము = గోడమీఁదిపిల్లివలె నిటునటు గాక యుండె ననినట్లు.

228 భేక రవ న్యాయము.

229 భ్రమరకీటన్యాయము = తుమ్మెద పురుగుం దెచ్చి తన గూటిలోనుంచి దానిచుట్టుతిరిగి ధ్వనిచేయుచు నుండఁగా నుండఁగా నా పురుగు దీని యందే మనసునిల్పి తుమ్మెద యగునట్లు.

230 మండూక తులాన్యాయము = కప్పలను దక్కెడలోఁ బెట్టఁగా నిలువక పారిపోవుచుండునను నటులు.

231 మండూకప్లుతిన్యాయము = కప్ప దాట్లు వేసినట్లు కొంచెము పనిచేసి యదివిడిచి మఱికొంత చేయుట యన్నట్లు.

232 మండూకమక్షికా న్యాయము = కప్ప పామునోట నుండియు నీఁగను మ్రింగఁబోవునన్నట్లు.

233 మణిసూత్ర న్యాయము = పూసలలో దారమువలె లోపల కలసియుండు నన్నట్లు.

234 మధుకోశ న్యాయము.

235 మధుమక్షికా న్యాయము = ఈఁగలు చేర్చిన తేనె మనుష్యుల యధీన మగునన్నట్లు.

236 మయూరాండ న్యాయము.

337 మరుమరీచిక న్యాయము = ఎడారిలో నెండమావులు నీళ్ళవలెఁ గాన్పించి యెంతదూరముపోయిన నట్లే యుండునను నట్లు.

238 మర్కటకిశోరన్యాయము = కోతిపిల్లతల్లియెంత యజాగ్రత్తగానున్నను దల్లికడుపుబట్టుకొని విడువద నునట్లు.

239 మహానస శశన్యాయము = వంటయింటికుందేలు ఎక్కడికి పోఁగల దనునట్లు.

240 మహావాతగజన్యాయము = గొప్పగాలిలో నేనుఁగులే కొట్టుకొనిపోవు చుండఁగా నింక యల్పజంతువులలెక్క యేమియనునట్లు.

241 మాత్స్యన్యాయము = పెద్దచేపవచ్చి చిన్నచేపను తినె ననునట్లు.

242 మార్జాలమూషికన్యాయము.

243 మార్జాలకబళన్యాయము = పిల్లి భోజనము చేయువారియొద్ద గూర్చుండి వారెత్తు కబళములన్నియుఁ దన నిమిత్తమే యని తలంచుచుండు ననునట్లు.

244 మార్జాలకిశోరన్యాయము = పిల్లి తననోటితోఁ బండ్లు తగలకుండ నతిజాగ్రతతోఁ బిల్లను దీసికొని పోవును.

245 మార్జాలశీలన్యాయము = పిల్లి శీలమన్నట్లు.

246 మూలక్రిమిన్యాయము = వేరులో పురుగుబట్టిన చెట్టంతయుఁ జచ్చిపోవు నన్నట్లు.

247 మూషకాహిమంజూషాన్యాయము = ఎలుక పాముపెట్టెయందేమో కలదని కొరికి పాముచేఁ దినఁబడె ననినట్లు.

248 మృత్కపాలన్యాయము.

249 మృద్ఘటన్యాయము = పట్టికుండ తేలికగా బ్రద్దలగునన్నట్లు.

250 మేఘచాతకన్యాయము = చాతకపక్షి మేఘ మిచ్చు నీరేగాని త్రాగ దనునట్లు.

251 మేషపుచ్ఛన్యాయము.

252 మేషయుద్ధన్యాయము = పొట్టేళ్ళు దెబ్బలాడుచుండఁగా మధ్యను నక్కపడి చచ్చెనన్నట్లు.

253 యథారాజన్యాయము.

254 యథాసంఖ్యన్యాయము = ఏక సంఖ్యగల రెండు వస్తు సముదాయము లున్నప్పుడు మొదటి దానికి మొదటిదానితోను రెండవ దానికి రెండవ దానితోను ఇట్లు సంబంధము గలిగియుండును.

255 యవ వరాహన్యాయము = అడవిపంది చేను మేయఁగా నూరపంది చెవులుగోసి నదినట్లు.

256 యవాగ్రహగర్తప్లవనన్యాయము = గంజిగుంట దాటెనన్నట్లు.

257 యుధ్యత్కుక్కుటన్యాయము.

258 యూపపశున్యాయము = యూపస్తంభమునకుఁ గట్టిన పశువునకుఁ జావు సిద్ధమనినట్లు.

259 రండావివాహన్యాయము.

260 రథ్యాప్రవాహన్యాయము = వీధులలో నుండి వచ్చు పిల్ల కాల్వలు ఏరులై పాఱుననునట్లు.

261 రాజసేవాన్యాయము.

262 రామఠకరండన్యాయము = ఇంగువ పెట్టెలోని యింగువ తీసి వైచినను వాసనపోదు.

263 లవణామలకీయ న్యాయము = సముద్రపు ఉప్పు అడవి యుసిరిక కాయ కలసెనన్నట్లు.

264 లశునభక్షన్యాయము.

265 లాంగూలతరణన్యాయము=కుక్క తోకఁ బట్టుకొని గోదావరి యీదెదననినట్లు.

266 లోహఘటన్యాయము = ఇనుప కుండకు రాతి తెడ్డన్నట్లు.

267 లోహకపాలన్యాయము.

268 వంధ్యాపుత్రన్యాయము = ఏమియు లేదనినట్లు.

269 వజ్రలేపన్యాయము = ఒకచోట నొక వస్తువయుంచి దానిపైన గచ్చు చేసినయెడల నెన్నటికి నది కదలదన్నటుల

270 వటబీజన్యాయము = చిన్నవత్తిగింజయందు పెద్దచెట్టిమిడియున్నట్లు.

271 వనచంద్రికాన్యాయము = అడవిఁగాచిన వెన్నెలయను నటులు.

272 వర్షబిందున్యాయము.

273 వలీముఖనారికేళన్యాయము = కోతి కొబ్బరికాయ పైనుండి పడద్రోయుటయేగాని తినలేదను నటులు.

274 వాయుస్కంధన్యాయము.

275 వాలకర్కటకన్యాయము = నక్క తనతోకఁ పీతకన్నములోఁ బెట్టి అది పట్టుకొనఁగా నీవలకు లాగితినను నన్నటులు.

276 వాలుకాన్యాయము.

277 విప్రతిషేధన్యాయము = రెండుకార్యములకుఁ దుల్యబలవిరోధము వచ్చినపుడు మొదటిదానినివిడిచి రెండవదానినిఁ జేయుటయనునటులు. ఇది వ్యాకరణమర్యాద.

278 విషయవరూచికాన్యాయము.

279 విషవృక్షన్యాయము = విషవృక్షమైనను పెంచి తాను ఛింపఁగూడదనునటులు.

280 విహంగన్యాయము.

281 వృద్ధకుమారీవరన్యాయము.

282 వృద్ధతరుణీన్యాయము.

283 వృద్ధవేశ్యాన్యాయము.

284 వృశ్చికచోరన్యాయము = దొంగవానినిం దేలుగుట్టినట్లు.

285 వృశ్చికవానరన్యాయము = అసలే కోతి, అందుపైం దేలుగుట్టిన వికారచేష్టలు మరికొన్ని యెక్కువచేయునన్నట్లు.

286 వృశ్చికవిదూషకన్యాయము = హాస్యగానికిం దేలుగుట్టిన యెడల నదియును హాస్యమే యనుకొందురనునట్లు.

287 వేతసన్యాయము = ప్రబ్బలిచెట్టు ఏటియొడ్డుననుండి నీరువచ్చునప్పుడు వంగి నీరుపోయినపుడు మరలనిలువంబడునన్నట్లు.

288 వేశ్యాకాంతాన్యాయము = భోగముదానికి మగడు ఒకడని యేర్పాటు లేనట్లు.

289 వేశ్యాపుత్రజనకన్యాయము = భోగముదానికొడుకునకుం దండ్రియెవండో తెలియదనునట్లు.

290 వైరాగ్యన్యాయము.

291 వ్యపదేశన్యాయము = ఒకనికి నొక్కండే కొడుకున్నయెడల వానినే జ్యేష్ఠుండనియు వానినే కనిష్ఠుండనియు వ్యవహరించినట్లు.

292 వ్యాఘ్రముఖన్యాయము.

293 వ్యాఘ్రోపవాసన్యాయము.

294 వ్రాత్యసంస్కారన్యాయము.

295 శతేపంచాశన్న్యాయము.

296 శశకపింజలన్యాయము.

297 శశవిషాణన్యాయము = చెవులపిల్లికి కొమ్ములేదనునట్లు.

298 శాకటిక న్యాయము.

299 శాఖాచంక్రమణ న్యాయము = ఒక కొమ్మమీదనుండి యింకొక కొమ్మయెక్కినటులు.

300 శాఖాచంద్ర న్యాయము = ఆకాశమందున్న చంద్రుఁడు చెట్టుకొమ్మ దగ్గరగానుండెనని చూపించునటులు.

301 శిఖికర్పూర న్యాయము.

302 శుండాసూచీ న్యాయము.

303 శుక్త్యంబు బిందు న్యాయము = ముత్యపుచిప్పలోబడ్డ నీళ్ళచుక్క ముత్యమగుటులు.

304 శుష్కతటాకమత్స్య న్యాయము.

305 శ్మశానకుసుమ న్యాయము.

306 శ్వపుచ్ఛ న్యాయము = కుక్కతోకయెంత వంచికట్టినను వంకరతీరదనునటులు.

307 శ్వశ్రూభిక్షా న్యాయము = ఒక ముష్టివాఁడు రాఁగా కోడలు ముష్టిలేదుపొమ్మన, అదియత్తగారుచూచి వానినిపిలిచి ముష్టిలేదని చెప్పుటకు కోడలికి స్వాతంత్ర్యలేదు. నేను స్వతంత్రురాలను కాఁబట్టి బిచ్చములేదు పొమ్మనె ననినటులు.

308 శ్వసభ న్యాయము.

309 శ్వానమకర న్యాయము = మొసలి నీటిలోనుండి యేనుఁగునైన లాగును. పయికివచ్చి కుక్కచే భంగపడునటులు.

310 శ్రోత్రశృంగ న్యాయము.

311 శ్రోత్రియవిట న్యాయము.

312 సందంశ న్యాయము = కాయతో నొక్కిపట్టినటులు.

313 సంధిన్యాయము.

314 సన్యాసియోపాసాన్యాయము.

315 సముద్రకిట్టన్యాయము.

316 సముద్రమధుబిందున్యాయము = సముద్రములో నొక తేనె చుక్క వేసినఁ దియ్యబడునా యనునట్లు.

317 సర్పఫణాన్యాయము.

318 సర్వతోభద్రన్యాయము.

319 సింహఘంటాన్యాయము = సింహము మెడనున్న గంట యెవ్వరు విప్పలేరనునటుల.

320 సింహావలోక న్యాయము = సింహము కొంతదూరము పోయి తిరిగి చూచుచున్నటులు.

321 సుధార్ద్రహరిద్రాన్యాయము = సున్నముతోఁ దడసిన పసుపు ఎఱ్ఱబడునటులు.

322 సూకరీప్రసవన్యాయము =

323 సూచీకటాహన్యాయము = ఒక పనివానికి కాగొకటియు, సూది యొకటియుఁ జేయుమని చెప్పఁగాఁ గొంత కాలమునకు సూదియిచ్చి కాగిమ్మని తొందర చేసినప్పుడు రెండు వస్తువులలో నొకవస్తువనిచ్చి తిని గదా, ఇంత తొందరచేసెద రేమి యనినటులు.

324 సూచీశతపత్రన్యాయము = నూరు తామరరేకులు ఒకదానిపై నొకటి యుంచి సూదితోఁ గసిక్కున గ్రుచ్చగా నన్నియు నొక్కమారు చిల్లులుపడినట్లు కాన్పించును కాని నూరును నూరుకాలములయందును జిల్లులుపడినవి, అతిసూక్ష్మము గుటచేఁ దెలియదనినటులు.

325 సూత్రశాటకన్యాయము = నూలుతో బట్ట నేసెననఁగా; నూలును బట్టగా జేసెనని యర్థము.

326 సౌధసోపానన్యాయము = చిడీలన్నియు నెక్కకుండ నొక్కసారిగా మేడ యెక్కుట కష్టమనునట్లు.

327 స్థాలీపులాకన్యాయము = ఉడుకుచున్న మెతుకులలో నొకమెతుకును బట్టి చూచిన యెడల నన్నమంతయు పదును తెలియునన్నట్లు.

328 స్థూణానిఖనన్యాయము = స్తంభమొకచోటఁ బాఁతి దిట్టముగానున్నదో లేదో యని చూచుటకై యూపెనన్నట్లు.

329 స్థూలారుంధతీన్యాయము = అరుంధతీ నక్షత్రము చిన్నదిగావున దానిని జూపుటకై పెద్దనక్షత్రము నొకదానిఁ జూపించి దాని సమీపమున నున్నదని చూపునట్లు.

330 స్రోతోనిమ్నన్యాయము = నీరుపల్లమెఱుఁగును నిజము దేవుఁడెఱుగు నన్నట్లు.

331 స్వదీపచుంబన్యాయము = తన దీపమని ముద్దు పెట్టుకొనఁగా మీసములం తెగఁగాలినవి.

332 హంసపదన్యాయము.

333 హంసబకన్యాయము = కొంగలలో హంసయున్న దానిపేరు ప్రతిష్ఠయుఁ గాన్పించదనునటులు.

334 హస్తిపదన్యాయము = ఏనుఁగ యడుగులో నన్ని జంతువుల యడుగులు నిముడు నన్నటులు.

335 హస్తిమశకన్యాయము = ఏనుఁగునకు దోమకు నెంతరవో యనునటులు.

336 క్షీరనింబన్యాయము = వేపచెట్టునకుఁ బాలుపోసి పెంచినను చేదుపోదనునటులు.

337 క్షీరనీరన్యాయము = నీళ్ళుపాలు కలిపినటులు.

338 క్షీరపాషాణన్యాయము = పాలకొఱకై రాయిపోయవలెనన్నటులు.

339 క్షీరమండన్యాయము.

340 క్షురికాఖడ్గన్యాయము.

341 క్షేత్రపాలన్యాయము.

---

# CHAPTER XXV

## లోకోక్తులు.

---

ఎక్కువ యర్థమును దక్కువ శబ్దములలోఁ జెప్పుట లోకోక్తి యనఁబడును. లోకోక్తులు తరుచు దేశీయపద సమ్మిళితములై దేశాచారములను దెల్పుచుండును.

ఎంతయో గ్రంథము పెంచి వ్రాయవలసిన విషయము నీ లోకోక్తులవలన సంకుచితముగా వ్రాయుటకు వీలుకలుగును.

1 తాడిఁదన్నువానికిఁ దలదన్నువాఁడుండును = ఒకని మించి యొకఁడుండును.

ఉదా — కడుఁ బ్రావీణ్య ధురీణుఁడీతఁడయినన్ గాంధర్వ సంపూర్తినె।
ల్లెడఁ బ్రఖ్యాతి వహించునా తనకటా ! యీతుంబురుండంతయో।
క్కుడుగా గానము నేఁటివాఁక నవరంతశోభించుమన్ దాఁడిఁద।
న్నెడువానిం దలఁదన్నువాఁడు గలఁడన్వేషింప నంచెన్నితిన్.

(కళాపూర్ణోదయము.)

2 వెఱ్ఱివీర రోకలి తలఁజుట్టు మన్నట్లు = రోకలి తలఁజుట్టుటచే వెఱ్ఱి తీరలేదనుట.

ఉదా — అలయక వేదశాస్త్ర సతతాభ్యసన వ్యసన ప్రసంగతిం!
దెలివి యొకింతఁ గాంచిన గతిన్ మతి కెక్కుడు వెఱ్ఱివీర రో।
కలిఁదలఁజుట్టు మన్నక్రియ గా నొకకొందరు దల్తురప్పటిం।
గలుషపథప్రవర్తనమె కర్మప్రవాసన నన్యుఁగొల్వగన్

(కళాపూర్ణోదయము)

3 రాతిప్రతిమకుఁ జక్కిలిగింతలు.

ఉదా — అనుడు లేవునాకు నాళంక లెవ్వియు
నెన్నిమాఱ్లు జూడుమన్నఁ జూతుఁ

బడఁ తికలదె రాతిప్రతిమకుఁ జక్కిలి
గింతనాదు ధ్రితికి గెంటులేదు

(కళాపూర్ణోదయము)

4 ఎద్దులు బండియు నేకమైనఁ గొండమీఁదికిఁబోవును.

ఉదా—ఎక్కిసిద్ధేశ యెవ్వరు నెరుఁగకుండ
నెట్లుకొనిపోయెదోయన నేల శంక
ఎందునెద్దులుబండియు నేకమైనఁ
గొండమీఁదికిబోవునో కొమ్మయనుచు.

(కళాపూర్ణోదయము)

5 కడువఁబోవుచుఁ గూరల చవులడుగనేల ?

ఉదా—ఏరీతి నింత మిక్కిలి
చేరికగా నాడితనియె సిద్ధుఁడు చూడం
గా రారె కుడువఁబోవుచుఁ
గూరలచవులడుగనేల కోమలి యనియన్.

(కళాపూర్ణోదయము.)

6 ఇల్లలికినఁబండువగునా

ఉదా—తుర్రిళ్ళఁగ నేటికి నిలునిలు
మిల్లలికినఁ బండువగునె యింతటిలోనే
వల్లభునకుఁ గడు వచ్చిన
యిల్లాలవె యేనులాతినే పోఁపోలన్.

(కళాపూర్ణోదయము)

7 పేదకోపము పెదవులచేటు.

ఉదా—ఏను గినుకఁబూని యిట్లుగావింప నే
మనుచు నుడుకు నొక బలాంతకుండు

వేసకోపమెంచుఁ జెదవులచేటుగా
కుఱికి రేమిసేయ నోపునన్న.

8 బట్టతలకు మోకాళ్ళకు ముడిపెట్టుట.

ఉదా—నాకుఁజూడ ధరణి నాయకయిది యసం
గతము యీవిచిత్ర కథలఁదల్లి
దీనికొనర నేగతిని బట్టతలలు మో
కాళ్లుముళ్లు పెట్టఁగలదొ కాని.

(కళాపూర్ణోదయము)

9 పూవులమ్మినయంగటనే కట్టెలమ్ముట.

ఉదా—మునుపుఁ గూఁటికైనీ
చుల వేఁడంబోడచూరవఁ జొచ్చునతఁడు పూ
వులు ముడిచిన యంగళ్ళనె
కలకలవీడొల్లనవ్వఁ గట్టెలమోసెన్.

(పాండురంగ మాహాత్మ్యము.)

కటకటా! పూవులమ్మినంగడినె కట్టె
లమ్మఁజేసెను మిమ్ముదైవమ్మటంచు
వృద్ధవేశ్యల వాకొంతు రుద్ధతవ్రి
వర్తులగుధూర్తనటులు దుర్వారనటులు.

(వైజయంతీవిలాసము.)

10 ఈఁగకు నిలి, పామునకుబలి పెట్టఁడు,

ఉదా—ముంచియీఁగకుఁగాటు పామునకుఁబల్లియు
నొసఁగఁడనిపొమ్ము భర్తకె యువిదవదిని.

(పాండురంగ మాహాత్మ్యము.)

11 ఎంగిలి చేయి కాకికి విదల్పనివాఁడు

ఉదా— కసరి యెంగిలిచేతఁ గాకి నేయనివాఁడు
సతతాన్నదాన ప్రశస్తుఁడయ్యె.

(పాండురంగ మాహాత్మ్యము)

12 తెల్లనకుఁ బాకగుణము తెలియునా ?

ఉదా— కర్తవు గావు హర్తవును గావభిరక్షివి గావు నీవు స
త్కీర్తిసురీణ యింతయును గృష్ణుఁడె మూలము గాన పుణ్య వి
స్ఫూర్తియుఁ బాపవైకృతముఁ బూనవుఁ జెందవు నీ యనన్య
తంత్రతన్
వర్తిలుమన్కిఁ దెల్లనకు వచ్చునె పాకగుణాగుణాదులున్.

(పాండురంగ మాహాత్మ్యము)

13 గుడి మ్రింగు వానికిఁ దల్పు లప్పడములు.

ఉదా— 'అలమి గుడి మ్రింగువానికిఁ దలుపు లప్పడములు గాకుండునే,

(పాండురంగ మాహాత్మ్యము.)

14 గోళ్ళా రోఁకండ్లంబాడినది.

ఉదా— ఏరీతిం బెనఁగిన నె
వ్వారెఱుఁగరు నీదుగుట్టు వనితామణి గో
ళ్ళా రోఁకండ్లంబాడిన
తీరును లిపుడింత దాఁచుకొన్న నడఁగునే.

(ప్రభావతీప్రద్యుమ్నము.)

15 ముగ్గుఱిని గూర్చను మొండెదయ్యము.

ఉదా— ఓర్చి రణాంగణంబున నిశాగ్రనిశాచరవీరసేనఁ జే
రార్చినఁ గాంచి యాత్రిశిరుఁ డాఖరదూషణులా నితండు స
ప్తార్చి యదభ్రతేజుఁడని యద్భుతమంది తలంచి ముగ్గురం
గూర్చెను మొండెదయ్యమని కుందిరి యంతట గాఢ గాత్రులన్.

(రామాభ్యుదయము.)

16 కౌఁగిలితోఁ దలగోకికొనుట.

ఉదా—జలధిఁబడఁ గడపె మునునను
వలదు నర భ్రాంతినీవు వైరంబేలా
బలవంతునితోఁ గౌఁగిలిం
దలఁగోకికొనంగఁదగునె దనుజాధీశా.

(రామాభ్యుదయము.)

17 అందని మ్రానిపండ్ల కఱ్ఱులు జాచుట.

ఉదా—ఎందఱిఁ జూడమిద్ధరిణి నిందు నిభాగ్యలవారికెల్ల నీ
యందము చందముం గలదె యక్కట మిక్కుటమైన కోర్కెఁ జే
నందఁగరాని మ్రాని ఫలమాస యొనర్చిన చందమాయె నే
మందు మనోజుఁడేగతిని నాగడిబెట్టఁదలంచినాఁడొకో.

(తారాశశాంకవిజయము.)

18 వెదకఁబోయినతీగ కాళ్ళను దగుల్కొని నటులు.

ఉదా—వెదకం బోయిన తీగెయు
పదములఁ దగిలిన విధంబు పాటింపఁగ ని
న్నెదుటనె కనుగొంటిని సు
మ్మదమున హరిణాంక వినుము మానిని వెతలన్.

(తారాశశాంకవిజయము)

19 నాభాగ్యము దేవరచిత్తము.

ఉదా—ఏరుపడని శాపు
రము విలోకించి పాంచాలిప్రాపుఁ గాంచి
సంచరించెను మామకస్వాంతవీధి
తెలుపభాగ్యంబు దేవరచిత్త మధిప.

(పాంచాలీపరిణయము

20 గుడినుండి గుడిత్రాళ్ళు తెగఁగోయుట.

ఉదా — కుడిచిన యింటికి రెండె
ప్పుడుదలఁతు రనంగవలదు భూతలమెఱుఁగున్
గుడినుండియె గుడిత్రాళ్ళె
క్కుడుగాఁ గోయుట కుగోత్రి గుణములు సుమ్మీ.

21 దయ్యపుకంటికిఁ బేలపుగింజ పెద్దది.

ఉదా — అక్కటకటా ! దయ్యంపునీకంటికిం బేలగింజయుం బెద్దదయ్యెనే.

(శృంగారనైషధము.)

22 లోటిపిటుకూల రోకండ్లగానిపోదు.

ఉదా — అనుచు నయభాషణములాడి యాపలికిన
మంచిమాటల నరుగఁడీ మాల్గుబోఁతు
కఠిన తర వాక్యములచేతఁగాని చక్క
గాదు లోటిపిట కూఁరోకండ్లఁ గాని.

(నిరంకుశోపాఖ్యానము)

23 పచ్చవైకము గుఱ్ఱముచచ్చిన దాఁకనె,

ఉదా — ఇచ్చకపుమాటలాడుచు
వచ్చెదు మూన్నాళ్ళనుండి వదలవు నేఁడుం
బచ్చపయికంబు గుఱ్ఱము
చచ్చినదాఁకనె యటన్న సామెత వినవే.

(నిరంకుశోపాఖ్యానము)

24 అరచేతికిఁ బండ్లువచ్చుట.

ఉదా — బఱిదప్పితప్పచేతలఁ
బొఱలక యిపు డోడినట్టి పాలఁతుకఁదే నీ
యఱచేతఁ బండ్లువచ్చినఁ
గఱతువుగాకిఱు కార్ముకపరిపక్షా.

(నిరంకుశోపాఖ్యానము)

25 ఉట్టిఁబెట్టిన గుమ్మడికాయవలె.

ఉదా—అమ్మగువ గనుంగొనియెన్
ముమ్మరముగఁ బట్టెనామములు మైనెల్లం
గ్రిమ్మకొన నుట్టిఁబెట్టిన
గుమ్మడికాయయునుబోలెఁ గూర్చున్నతరిన్

(వైజయంతీవిలాసము)

26 నోసలుంబత్తెఁడు నోరు తోఁడేలు.

ఉదా—నిసుదపట్టి తిరుమణియు వైష్ణవముగాని
మీరలాడుమాట తీరుచూడ
ననఘ నొసలు బత్తెఁడును నోరు తోఁడేల
టన్నరీతి దోఁచుచున్న దిపుడు.

(వైజయంతీవిలాసము)

27 వ్రతముచెడ్డ సుఖముదక్కదు.

ఉదా—బ్రహ్మచర్యంబునకు నంతరాయమొనవ
జలజముఖిమైత్రియును గొనసాఁగదయ్యె
వసుధఁబఠికింప నిదిసుమీ, వ్రతము చెడ్డ
సుఖముదక్కదటన్న వచోనిరూఢి

(వైజయంతీవిలాసము)

28 గోడాలు బిడ్డకుప్పే మెఱుఁగురు.

ఉదా—గోలతవిటుఁ డయినం దా
నేలా కల్లుప్పృశించు నిటువేశ్యలకుం
గీలెఱుఁగక చెడిచెను విధి
కూగులు గోడాలు బిడ్డకుప్పే మెఱుఁగున్

(వైజయంతీవిలాసము)

29 తన్నుగట్టఁ ద్రాళ్ళు తానే తెచ్చుకొన్నటులు.

ఉదా—తనుగట్టఁ ద్రాళ్ళు తానై
కొనివచ్చిన జాడయనుచుఁ గుసియించి కరం
బునఁబాశముఁగొని దానన
వనధీశునిఁగట్టె ననురవర్యుండాజిన్

(కవికర్ణరసాయనము)

30 రాజుముఖాచిన కన్నుతో మగనిఁజూచిన మొట్టబుద్ధి యగును.

ఉదా—క్షితిపతిఁగన్న కన్నులనె చెన్నగు నన్యునిఁ జూపరోపరం
చతివయొకర్తు పల్కె నొకతంగన తానిటుపల్కె సత్యమే
యతివరొ రాజుమోముగని నట్టిమొగార మెసంగఁగన్నులన్
మెరకమొగంబుగల్గు మగనిం గనినంతనె మొట్టబుద్ధియౌ

(శ్రీనివాసవిలాసము)

31 అసలో కొ్రవివలె.

ఉదా—అమరపురిఁ జేరవెరచు దిశాధిపతుల
కెలుఁగఁజేయుంగ నచ్చటి కిచ్చటిని
నారదుండాను గ్రొవిచందమునఁదిరుగు (కువలయాశ్వచరిత్ర)

32 పారెడుబండ్లకెదురుగాఁ గాళ్ళుజాతురా ?

ఉదా—ఐన నేమాయెఁ గనుక ధరాధిపకులు
చేయఁదగునట్టి యీ దుష్టశిక్షణేకుఁ
బడినభారంబె పారెడుబండ్లకెదురు
కాళ్ళుసాతుర యోవెత్తికాన వినుము.

(కువలయాశ్వచరిత్ర)

34 ఈతడు లోతేమిటి ?

ఉదా—ఈకలహంసదూన నను నెక్కడి కెక్కడినుండి తెచ్చెనా
హా కడుహూనమెక్కడన యక్కనఁజేర్పక జంపుమాటలన్

వ్యాధుల పెట్టుబెల్ల విరహాంబుధిముంపకపోదు నం జల
జేకదనీఋమంచి డీక నీతకు మిక్కిలి లోతుఁగల్గనే.

(విజయవిలాసము).

**35** ఏమిచేసిన సమకాలమువారు మెచ్చరు.

ఉదా—క్షితిపయి వట్టిమాత్రిఋలు చిగిర్చ వసంతుఁడు దారసోపగుం
భిత పరవాసనల్నెరపమెచ్చక చంద్రుఁడు మిన్నునం బ్రస
న్నతయును సౌకుమార్యము గనంబడరాల్గరఁగంగఁ జేసనే
గతిరచియించిరేని సమకాలమువారలు మెచ్చరేకదా.

(విజయవిలాసము).

**36** చదువకేసిన నున్నమతియుఁ బోయె

ఉదా—ఇన్నాళ్ళు సేవచేయుచు
నున్నదియుంబోయె నేఁడయాకాఁగిలి యి
మ్మన్నంతఁ జదువఁ బెట్టఁగ
నున్నమతియు బోయెనను టవశో నిజమయ్యెన్,

(విజయవిలాసము).

**37** విల్లమ్ములు కలవారికిఁ జల్లకడవలవారు తోడా?

ఉదా—అలరువిలుకాఁడ యమృతము
చిలికడు నెలరేలుసామిచేగాదొ విరా
గుల సేచఁగ విల్లమ్ములు
గలవారికిఁదోడు చల్లకడవలవారే.

(విజయవిలాసము.).

**38** అందితేశిఖ, అందకున్న కాళ్ళు.

ఉదా—శివుఁడిటురమ్మటంచు దయచేసినపోఁదలకెక్కుడు౯నై
భవమునఁజూచుచో నడుగుబట్టితివేమనవచ్చునీగుణం

బవునవు నందిన న్శిఖరము నందక యున్న నుగాళ్ళు బట్టుకొం
దువు హరిణాంక వేళకాలందు ల్లద నీవడకల్ దలంపఁగన్.

(విజయవిలాసము)

39 మనసెఱుఁగనికల, ఒడలెఱుఁగని సివముఁగలదా ?

మనసునకు మనసే సాక్షి.

ఉదా—అనిన నగి యొందుగలదే

మనసెఱుఁగనికలయు నొడలు మఱచిన సివముం

గనె దేలామనసునకున్

మనసేతార్కాణమని కుమారుఁడు వేగన్.

(సారంగధరచరిత్రము)

"మనకేమి తెలియు శ్రీకృష్ణుని బూటకములను భూమిసురవరుమహిమల్
మనసునకు మనసెతార్కాణను సామెతవీరియందె యుందంబయ్యెన్."

(కుచేలోపాఖ్యానము)

40 సముఖమున రాయబారమేల ?

ఉదా—అతరశాక్షి డెందమున నారటమొందుచు నేమి సేయుదున్
రాతిక్కిఁ దోడువోయినది రాను కుడెందము మెత్తగాదుదా
దాతికివచ్చియుండనీక దాలిమిసెల్లునే మాఱఁడంటిమా
ఘాతకుఁడోర్వరాదు సముఖంబున నేటికి రాయబారముల్.

(సారంగధరచరిత్ర)

41 పిచ్చుకుంటుమీఁద భాగీరథి ప్రవేశించినట్లు.

ఉదా—మేలుపిచ్చుకుంటుమీఁద భాగీరథి

వచ్చెననఁగ నపుడు వానిపైని

గగనభాగతలము నిగనిగచంద్రికా

లహరియుబ్బి క్రొబ్బిలంగ నిండె.

(సారంగధరచరిత్రము)

"మెఱసిపిచ్చుగుంటమీఁద భాగీరథి । వచ్చినట్లు మిగుల వాంఛగలిగి
స్వామిమీరలటకుఁజను దెంచితిరికడు । భాగ్యయుతుఁడనైతిఁ బద్మనయన.

(కుచేలోపాఖ్యానము)

42 గచ్చపొద కదలించినట్లు.

ఉదా— కుచ్చితురాలైన యచ్చపలలోచనంజూచి పౌరు
లందఱు గచ్చుకొని గ్రచ్చపొదఁగదలించిన కైవడి విచ్చల
విడినోరికివచ్చినట్లు వెచ్చాకిచ్చువారును.

(సారంగధరచరిత్రము).

43 ఎఱుక పిడికెడు ధనము.

ఉదా— భూర్యసఖుఁడైన యాదవపుంగవుండు
మిమ్ముఁ బోడఁగన్న సిరులెల్ల మిన్నకొనఁగు
నెఱుక పిడికెడుధనమన్న గుఱుతుమాట
తథ్యమౌఁగాదె యెంతైన దానవేంద్ర.

(కుచేలోపాఖ్యానము)

45 రాజుగొట్టఁగా మొగసాలకు మొఱపెట్టుట

ఉదా— వగఁబొగులు దీనజనముల
ఖగగమనుఁడుబ్రోవకున్న గతియెవ్వరికిన్
మగువ విను రాజుగొట్టఁగ
మొగసాలకు మొఱలు వెట్టు మాధులు గలరే.

(కుచేలోపాఖ్యానము)

45 తానొకటిదలఁచిన దైవమొకటి తలఁచును.

ఉదా— పూనుకొని తన ప్రియన్నము
లే నిజములు దైవఘటన లిలలేకున్నన్
మానవుఁడొకటి తలంచినఁ
దానొక్కటి తలఁచుఁగాక దైవంబ బలా.

(కుచేలోపాఖ్యానము).

46 పట్టింటునుండి నాభాగ్యమన్న దైవము తెచ్చి యిచ్చునా ?

ఉదా— పరగ పట్టింటునుండి నా భాగ్యమనిన
దైవమెక్కడ గొని తెచ్చి తనకు నిచ్చుఁ
జేయఁదగిన ప్రయత్నము లేనియఁజేయ
నధిప యటుమీఁద వారి భాగ్యంబు కొలఁది.

(కుచేలోపాఖ్యానము.)

47 చేతులు చేయవు నోరు తినదు.

ఉదా— అడుగక యుండినఁ దగు వర
మిడునే నిష్కారణంబ యీశ్వరుఁడైనం
బుడమిం జేయవు చేతులు।
కుడువదు నోరనెడు మాటకును దప్పగునే॥

(కుచేలోపాఖ్యానము.)

48 ముంజేయి యాడిన మోచేయి యాడును.

ఉదా— రంజిలి తామును మున్నుగ
నంజలి పడకిచ్చెనేని నయముగ మారుం
గొంజక యిత్తురు క్రిమ్మర
ముంజేయును నాడెనేని మోచేయాడున్.

(కుచేలోపాఖ్యానము.)

49 ఆత్మబుద్ధి సుఖము.

ఉదా— ఆత్మబుద్ధియె కడు సుఖంబన్నిఁటికినిఁ
జెలఁగిగురుబుద్ధి కొంత విశేషమరయఁ
బరుల బుద్ధి వినాశంబు బరగఁ జేయు
స్త్రీల బుద్ధులు ప్రళయముల్ చిత్తగింప.

(కుచేలోపాఖ్యానము)

50 కల్పవృక్షము దగ్గఱకు వెళ్ళి కాయయడిగినట్లు.

ఉదా— కల్పవృక్షమునకుఁ గదిసి కాయడిగిన
చందమునను శౌరిసమ్ముఖమునఁ
జేరి తుచ్ఛమయిన సిరి వేడికొననయ్యె
నాసదోసమెఱుఁగదనుట నిజము.

(కుచేలోపాఖ్యానము)

51 తన దీపమని ముద్దుపెట్టుకొన్న నోరు గాలును.

ఉదా— ఇంటిదీపమనుచు నిగిలించుకొని ముద్దు
పెట్టుకొన్న నోరు బెట్టు గాలు
నృపులసమ్ముఖంబు నెవరు లెంచు చుఁ జను
వాఁడు మిగులఁ బరిభవంబు నొందు.

కుచేలోపాఖ్యానము.)

52 పాలొల్లని పిల్లియున్నదా ?

ఉదా— ఈ లోకంబున రాజ్యము
లేలంగలిగినను జాలం డెంత విరక్తుం
డేలవిసర్జన సేయును
పాలొల్లని పిల్లిగలదె పరికింపంగన్.

(కుచేలోపాఖ్యానము)

53 గోచిపాతరాయఁడు దొంగలమిండఁడు.

ఉదా— పేర్మి నదరుగుండె పిక్కబెదరు లేక
యుండవచ్చుఁ జేదయులుకుఁదక్క,
రమణగోచిపాతరాయఁడు దొంగల
మిండఁడనెడుమాట మేలు దెలిసి.

కుచేలోపాఖ్యానము )

54 మూలనున్నవాని ముంగిలిం బెట్టుట.

ఉదా— మూలనున్నవాని ముంగిటఁ బడవైచి
సిరులలో సంగినట్టు చేసినావు
దండిసంపదలు వృథాడంబరంబుల
యేలమమ్ము బోంట్లకిని మహాత్మ

(కుచేలోపాఖ్యానము.)

55 బూడిదలో హోమముచేసినట్లు.

ఉదా— కూడిన ద్రవ్య మపాత్రుల
కాడంబరవృత్తినొసఁగ నది వృథ యయగుం
బూడిదలో హోమమువలెఁ
బాడింటికి నిడిన దీపపఙ్క్తియుఁబోలెన్

(కుచేలోపాఖ్యానము)

56 పాడింట్లో దీపము బెట్టినట్లు

ఉదా— పాడింటికి నిడినదీప పఙ్క్తియుఁబోలెన్

(కుచేలోపాఖ్యానము.)

57 చచ్చినవాని పెండ్లికి వచ్చినంతయే కట్నము కానుక.

ఉదా— తనగుట్టు బయలఁ బెట్టి చచ్చినవాని పెండ్లికి వచ్చినంతయే కట్నము
చాలు నన్నటుల వచ్చినంత గాఁబట్టుకొనుచు,

(ధర్మజరాజసూయము.)

58 ఊరిపైనూరుపడ్డను కరణముపైఁ గాసుపడదు.

ఉదా— ఊరిపై నూరుపడినను కరణముపైఁ గాసైనఁ బడదను వచనమ్మునఁ
జేలుపాడైన మీకేమి? బీడయిన మీకేమి?

(ధర్మజరాజసూయము.)

59 పనిచేసిన సాతిక నష్టము.

ఉదా— దేశదేశములపాలు గావలసిన వారము మేము పనిచేసిన సాతిక

కట్టమను మాట మదిఁ బెట్టక తెల్లమొగములఁ గావలి పెట్టి గొల్లఁ బోఁగొట్టుకొంటిమి.

(ధర్మజరాజసూయము.)

60 హనుమంతు నెదుట కుప్పిగంతులు వైచినట్లు.

ఉదా— హనుమంతు నెదుటనా కుప్పిగంతు లన్నట్లు నాయెదుటనా బింకంబులును బొంకంబులును,

(ధర్మజరాజసూయము.)

61 ఆడఁబోయిన తీర్థ మెదురైనట్లు.

ఉదా— నీవు భీమునితోఁ బోరు కోరుకొనుటం జేసి మాకాడఁబోయిన తీర్థ మెదురయ్యె.

(ధర్మజరాజసూయము.)

62 కానున్నది కాకమానదు.

ఉదా— రానున్నది రాకమానదు. కానున్నది కాకమానదు, నిన్నుఁ బని యేమున్నది.

(ధర్మజరాజసూయము.)

63 కీడెంచి మే లెంచుట.

ఉదా— ఎందును గీడెంచి మే లెంచుట మంచిదిగాన నిటుల నీకు వినిపించితిని.

(ధర్మజరాజసూయము.)

64 రాల రువ్వినవారినిఁ బూల రువ్వరు.

ఉదా— లోకంబున నెట్టి కట్టెకును వ్యతివాడికంబు చెట్టులఁ బుట్టించక పోదు. ఎవ్వరును రాలరువ్విన వానిఁ బూలరువ్వరు.

(నీతిచంద్రిక — విగ్రహము,)

65 ఇంటఁ గుడిచి ఇంటివాసములు లెక్కబెట్టినట్లు.

ఉదా— ఓ స్వామిద్రోహీ! యింటఁ గుడిచి యింటివాసము లెన్నిక

యిడిన వడువున మాదేశమునఁ గ్రుమ్మరుచు మాస్వామి నే యాజ్ఞాపింపఁ జొచ్చితివి.

(నీతిచంద్రిక—విగ్రహము)

**66** దున్న యీనిన దనదూడను కట్టుమన్నట్లు.

ఉదా— చెప్పెడివాఁడొకవేళఁ జెప్పినను వినెడువారికయిన వివేక ముండవలెనుగదా. అట్లుగాక దున్న యీనిన దన దూడను గట్టుమన్న మతి పశు వొక్కఁడే రచ్చకెక్కుం గాని దాన నభిమత కార్యకరణంబుచేకూర నేరదు.

(నీతిచంద్రిక—విగ్రహము)

**67** ఇనుమునుగూడిన యగ్గికి సమ్మెటదెబ్బలు.

ఉదా—ఇనుమునుగూడి వేఁడివెల్చునకు సమ్మెట పెట్లబ్బునట్లు హీనునిగూడిన మాననీయునకు లాఘవంబుగలుగుట సహజము.

(నీతిచంద్రిక—విగ్రహము)

**68** తాఁజెడ్డకోఁతి వనమెల్లఁ జెరచెను.

ఉదా— తాఁజెడ్డ కోఁతి వనమెల్ల జెరచిన దన్నట్లు దుర్జనుండు తాను జెడుట చాలక తనవారికిఁ గూడ వీడని కీడుఁ దెచ్చిపెట్టును.

(నీతిచంద్రిక—విగ్రహము)

**69** కుక్కతోఁకఁ బట్టికొని గోదావరి యీదుట.

ఉదా—క్రొత్తవాని సాహాయ్యంబునఁ బ్రత్యయంబునిడి కడిఁదిమార్తురఁ బరిమార్తుమంటు శునకవాలంబు బట్టుకొని కడలి గడవఁ గడఁగుట.

(నీతిచంద్రిక—విగ్రహము)

**70** చెట్టు చెడుకాలమునకుఁ గుక్కమూతిపిందె.

ఉదా—చెట్టు చెడుకాలమునకుఁ గుక్కమూతి పిందెయన్నట్లు చేటుకాలంబు కడునికటంబైన వీనికి దుర్బుద్ధి ఘటిల్లెనుగాఁబోలును.

(నీతిచంద్రిక—విగ్రహము)

71 సిరిరా మోకాలడ్డనేల ?

ఉదా — సిరిరాఁగా మోకాలడ్డనేల ? మనపాలింటఁ బుణ్యస్వరూపంబు సన్నిహితంబయిన ట్లీశని ప్రాపుదొరకినది.

(నీతిచంద్రిక — విగ్రహము)

72 తోఁకఁద్రొక్కిన త్రాచువలె

ఉదా — అనినం దోఁకఁద్రొక్కిన త్రాచుచందంబున సముత్థితుండై దళత్పక్షీంద్రుండు రోషావేశంబున.

(నీతిచంద్రిక — విగ్రహము)

73 ఆవు, ఆవు కుమ్ములాడి లేగకాలు విరగద్రొక్కినట్లు.

ఉదా — ఆవు నావునుం గుమ్ములాడ నడిమిలేఁబెయ్య కాళ్లు రాల్లు విరిచినట్లు రాజునుం బోట్లాడ మాత్రకర్గుసేయ దగ్గరుదురే ?

(నీతిచంద్రిక — విగ్రహము)

74 ఇంటగెలిచి రచ్చగెలువవలెను,

ఉదా — దేవా ! యింటగెలిచి మఱిరచ్చ గెలువవలయును. మనలోని మాట విచారింతుము.

(నీతిచంద్రిక — విగ్రహము)

75 చిన్నపామునైనఁ బెద్దకఱ్ఱతోఁ గొట్టవలెను.

ఉదా — చిన్నపామునైనఁ బెద్దకఱ్ఱతోనే కొట్టవలయును కాఁబట్టి సర్వసైన్యసమేతముగా నడచి యాకస్మికముగం బోము.

(నీతిచంద్రిక — విగ్రహము)

76 చెలిమినిఁ జేదు మేపింపవచ్చునుగాని బలిమిం బాలుద్రాగింప లేము.

ఉదా — చెలిమిమైఁ జేదు మేపింపవచ్చుంగాని బలిమిమైఁ బాలుద్రావింప రాదు అను లోకోక్తి వినలేదా ?

(నీతిచంద్రిక — విగ్రహము)

77 సన్నికల్లు దాచఁగనే పెండ్లియాగునా?

ఉదా— ఈతఁ డొక్కఁడు లేకున్నను మనకొక్క కొఱఁతరాదు. సన్ని కల్లు దాచినంతనే పెండ్లిఅగునా?

(నీతిచంద్రిక — విగ్రహము)

78 మ్రొక్కఁబోయిన గుడి విరిగి మీఁదఁబడ్డట్లు.

ఉదా— మ్రొక్కఁబోయిన గుడివిరిగి మీఁదఁ బడ్డట్లు తోడనే యాత్రించు బుసకొట్టుచు లేచి మనుష్యులు పాములం గంటఁబడినంతనే చంపుచుందురు. కాఁబట్టి యట్లు నూతులంబున కెల్లను మృత్యు ప్రాయులైనవారు దొరికినపుడు దొరింపక విడువరాదని పలుకుచు నా లుక లార్చుచుం గవిసినూతని పైబడి కరచఁబోయెను.

(నీతిచంద్రిక—సంధి.)

79 పిట్టతగవు పిల్లితీర్చినట్లు.

ఉదా—పిట్టతగవు పిల్లితీర్చినయట్లు జరఠ మార్జాలంబు కాళ్ళతో నా రెంటినిఁ జిక్కంబట్టి యొక్కట మెడలు కొరికి చిత్రవధం బొనరించెను.

(నీతిచంద్రిక—సంధి)

80 ఈనఁగాచి నక్కలపాల్సేయుట.

ఉదా—ఈనఁగాచి పొలమును నక్కలకుఁ బెట్టినట్లు బాహుబలాధిక్యంబు పేరిమినిఁ గష్టపడి రణంబునం గెలుచుకొన్న రాజ్యంబును ఫలకాలం బున నొరులపాలు సేయనేల.

(నీతిచంద్రిక—సంధి)

81 తన్నుమాలినధర్మము, మొదలు చెడ్డబేరముగలవా? యను లోకోక్తి విన్నాఁడవుగావా?

(నీతిచంద్రిక—మిత్రలాభము.)

82 రోటిలోఁ దలఁదూర్చి రోకలిపోటులకు వెఱవవచ్చునా?

ఉదా — కాకున్నది కాకమానదు. రోటిలోఁ దలఁ దూర్చి రోకటిపోటునకు వెరవఁదీరునా ?

(నీతిచంద్రిక-మిత్రలాభము)

83 నాలికతీపు లోనవిషము.

ఉదా — ఆ జిత్తులమారి మృగముయొక్క తేనెమాటలకు మోసపోయితిని. నాలికతీపు లోనవిషమని యెఱుంగుదునా ?

(నీతిచంద్రిక — మిత్రలాభము)

84 అడుసుద్రొక్కనేల ? కాలుగడుగనేల ?

ఉదా — ధర్మార్థము ధనము గోరుటకంటె నిస్పృహత్వము మంచిది. అడుసు ద్రొక్కనేల ? కాలుగడుగనేల ?

(నీతిచంద్రిక — మిత్రలాభము)

85 చంద్రునకు నూలుపోగు,

ఉదా — చంద్రునకు నూలుపోగునట్లు సర్వలోకాధీశుండగు శ్రీకృష్ణునకుఁ గుచేలుం డటుకుల నొసంగె.

(కుచేలోపాఖ్యానము)

86 కుట్టిన తేలు, కుట్టకున్న కుమ్మరపురువు.

ఉదా — అస్మదీయశాంతికి ఫలంబు తోడనఁ గలిగె. కుట్టినం దేలండ్రుం గుట్టకున్నం గుమ్మరిపుర్వండ్రుగాదె.

(నీతిచంద్రిక — మిత్రభేదము)

87 గోరఁబాపునది గొడ్డఁట నరకుట.

ఉదా — మనకిప్పుడు గోరంబోవు పని గొడ్డంటం దీర్పవలసివచ్చును.

(నీతిచంద్రిక — మిత్రభేదము)

88 ఎద్దీనం గొట్టంబునం గట్టుమన్నట్లు.

ఉదా — పార్థివుండెద్దీనె ననం గొట్టంబునం గట్టింపు మనువాఁ డయ్యోనేని లెంకలుకొంకుమాని యిచ్చకు వచ్చినట్లు లేని కార్యంబులకు లోఁచి

యశోహానిం బుట్టించి పరలోకదూరుఁ జేయుదురు.

(నీతిచంద్రిక — మిత్రభేదము)

89 తానుబట్టిన కుందేటికి మూఁడే కాళ్ళు.

ఉదా — నాకుం దోఁచినంత యుక్తి చెప్పితి. ఎంత చెప్పిన నతండు తాను బట్టిన కుందేటికి మూఁడే కాళ్ళనుచున్నవాఁడు.

(నీతిచంద్రిక — మిత్రభేదము)

90 నేలవిడిచిన సాము.

ఉదా — ఊరక యేల నేలవిడిచి సాముజేసెదవు తాళుము.

(నీతిచంద్రిక — మిత్రభేదము)

91 అందఱు, నందలమెక్కిన, మోయువారెవరు?

92 అంధునకు అద్దము జూపినట్లు.

93 అగ్నిలో మిడుతపడ్డట్లు.

94 అడకత్తెరలోనిపోక.

95 అడ్డగోడమీఁదిపిల్లి.

96 అడవిని కాచిన వెన్నెల.

97 అడవియుసిరికాయ, సముద్రపుప్పు కలిసినట్లు.

98 అడుగులోనే హంసపాదా?

99 అత్తకొట్టినకుండ అడుగోటికుండ, కోడలుకొట్టినకుండ క్రొత్తకుండ.

100 అత్తమంచియు వేములతీపి యులేదు.

101 అత్తవారింటి సుఖము మోచేతి దెబ్బవంటిది.

102 అత్తయు నొకయింటికోడలే.

103 అత్తి పూచినట్లు.

104 అనువుగానిచోట నధికులమనరాదు.

105 అభ్యాసము కూసువిద్య.

106 అమ్మఁబోయిన నడవి కొనఁబోయిన కొఱవి.

107 అయ్యవారినిఁ జేయఁబోయినఁ గోఁతియైనది
108 అరచేతి వెన్నఁ బెట్టుకొని నేతికేడ్చినట్టు.
109 అరచేతిలో వైకుంఠము చూపుట.
110 అఱచే కుక్క కఱవనేరదు.
111 అవ్వనుబట్టుకొని వసంతము లాడినట్లు.
112 ఆకును అందదు పోకను పొందదు
113 ఆచారం ముందర అనాచారం వెనుక.
114 ఆచారానకు అంతములేదు అనాచారానకు ఆదిలేదు.
115 ఆచార్యునితలఁచి నిప్పులో చెయ్యిపెట్టితే కాలదా?
116 ఆడనేరక మద్దెలవిూఁద తప్పుచెప్పినట్లు.
117 ఆడితప్పరాదు పలికి బొంకరాదు.
118 ఆతురగానికి తెలివిమట్టు.
119 ఆలులేదు చూలులేదు కొడుకుపేరు సోమలింగము.
120 ఆఱ తిన్న అన్నకు [illegible].
121 అప్పు [illegible]వాఁడు [illegible].
122 ఆశకు అంతములేదు.
123 ఇల్లు కట్టిచూడు పెండ్లి చేసిచూడు
124 ఇంటి [illegible]వాఁడు [illegible]మునా?
125 ఇల్లువిప్పి పందిరివేసినట్లు.
126 ఇంట్లో [illegible]పులి బయట పెద్దపులి.
127 ఇంట్లో యీఁగలమోఁత బయట పల్లకీమోఁత.
128 ఉట్టికి ఎగురలేనమ్మ స్వర్గానికెగురునా
129 ఎంగిలిపడిన బ్రాహ్మణార్థ [illegible]
130 ఎద్దుపుండు కాకికి ముద్దా?
131 ఎం[illegible].
132 ఎతిఅంటే ప్రతి[illegible].

133 ఒకయొరలో రెండుకత్తు లిముడవు.
134 కట్టెవంక ప్రొయ్యితీర్చుచున్నది.
135 కథకు కాళ్ళు లేవు ముంతకుఁ జెవులు లేవు.
136 కలిమి లేములు కావటికుండలు.
137 కాకిపిల్ల కాకికిముద్దు.
138 కామగొడ్డునకు రోకబందె.
139 కుండలలో గుఱ్ఱములు తోలువాఁడు.
140 కుక్క కాటునకుఁ జెప్పుదెబ్బమందు.
141 కూయుగాడిదెవచ్చి మేయుగాడిదను చెరపినది.
142 కొండతలక్రిందఁబెట్టుకొని రాళ్ళు వెదకినట్లు.
143 కొండఁదవ్వి యెలుకను బట్టినట్లు.
144 కొత్తబిచ్చపు వాడు ప్రొద్దెఱుఁగఁడు.
145 కోతికి కొబ్బరికాయ దొరికినట్లు.
146 గాజులబేరము భోజనమునకు సరి.
147 గుండ్రాయిదాచిన కూతురుపెండ్లి నిలుచునా ?
148 గ్రుడ్డియెద్దు జొన్నచేనఁబడ్డట్లు
149 గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించినది.
150 గురివిందగింజ తన యెరుపేగాని ముడ్డిక్రింది నలుపెఱుఁగదు.
151 గోవులేనియూరగొడ్డుగేదె శ్రీమహాలక్ష్మి.
152 చల్లకువచ్చి ముంత దాచికొన్నట్లు.
153 చావుతప్పి కన్నులొట్టపోయినట్టు.
154 చిత్తము శివునిమీఁద భక్తి చెప్పులమీఁద.
155 చెట్టు అయి వంగనిది మ్రానయివంగునా.
156 చెట్టుముందా విత్తుముందా యనునట్లు.
157 చెఱకుతీపియని వేళ్ళతో నమలవచ్చునా
158 జడ్డిగములో మిడతపోటు

159 తనకలిమి యింద్రభోగము తనలేమిలోక దారిద్ర్యము.
160 తనకుమాలిన ధర్మము మొదలు చెడ్డబేరము.
161 తాగ్రకతేసిపిల్లి బోర్లద్రోసికొన్నదట.
162 తాఁజెడ్డకోతి వనమెల్లఁ జెరచె.
163 తాఁటాకు చప్పుళ్ళకు కుందేళ్ళు బెదరునా ?
164 త్రాగుచాలక పోయిన నూయిపూడ్చుమన్నట్లు.
165 తావలచినది రంభ తామునిఁగినది గంగ.
166 తిన్నయింటి వాసాలెన్నువాఁడు.
167 తిమ్మనిబ్రహ్మని బ్రహ్మని తిమ్మని చేయుట.
168 తులసి వనములో గంజాయి మొక్క మొలచినట్లు.
169 దివిటీక్రింది దీపము.
170 దూడయు బఱ్ఱెయు నుండఁగా గుంజ యఱచినదన్నట్లు.
171 దొంగవాకిట మంచము వేసినట్లు.
172 నక్కయెక్కడ దేవలోకమెక్కడ ?
173 నిమ్మకు నీరెత్తినట్లు.
174 నీళ్లుపల్లమెఱుఁగు నిజముదేవుఁడెఱుఁగును.
175 నెమిలికంటనీరుగారిన వేటకానికిముద్దా ?
176 పిట్టకొంచెము కూతఘనము.
177 పిల్లకాకి యేమెఱుఁగు నుండేలుదెబ్బ.
178 పిల్లికిచెలగాటము, యెలుకకు ప్రాణసంకటము.
179 పుట్టిననాటిబుద్ధి పుడకలతోగాని పోదు.
180 పుణ్యమునకు పుట్టెడిచ్చిన పిచ్చకుంచమని పోట్లాడినట్లు.
181 పులినిఁజూచి నక్కవాఁతపెట్టుకొన్నట్లు.
182 పెదవిదాటిన పెన్నదాటుచున్నది.
183 పెరుగుట విరుగుటకొఱకే.
184 పొదుగుకోసి పాలుత్రాగినట్లు.

185 పోయినష్టి పొత్తులాభము.
186 బూడిదలో పోసినపన్నీరు.
187 భక్తిలేనిపూజ పత్రిచేటు.
188 మాటలుకోటలు దాటును, కాలు గడప దాటలేదు.
189 మ్రింగ మెతుకు లేదు మీసాలమీఁదికి సంపెంగనూనె.
190 మూలిగేనక్కమీద తాటికాయబడినట్లు.
191 రత్నాలన్నియునొక చోటు, నత్తగుల్లలన్నియునొక చోటు.
192 రాతికొద్ది గుజ్జము.
193 శంఖునఁబోసిన తీర్థము, పెంకులోఁబోసిననీళ్లు.
194 సీతపుట్టుట లంకచేటునకే.
195 హనుమంతునియెదుట కుప్పిగంతులా.
196 రొట్టెవిరిగి నేతబడ్డట్టు.
197 సన్న్యాసిపెండ్లికి జుట్టువద్దనుండి యెరువు.
198 స్వాతివానకు ముత్యపుచిప్ప తెరచునోరు మూచునట్లు.
199 సొమ్మునుబోయి దిమ్మనుబట్టె.
200 సెనగలుతిని చేయికడుగుకొన్నట్లు.

# CHAPTER XXVIII

## సంస్కృత లోకోక్తులు.

---

1 అహింసాపరమోధర్మః = హింసచేయకుండుట గొప్పధర్మము.

ఉదా — పరస్పర విరుద్ధములైన ధర్మశాస్త్రములు సహితము "అహింసాపరమోధర్మ" యనుచో నైకమత్యము కలిగియున్నవి.

(నీతిచంద్రిక.)

2 సహసావిదధీత నక్రియాం = పనిని దొందరగాఁ జేయగూడదు.

ఉదా— ఐనను సాహసంపడి యొక్క కార్యంబు చేయఁజనదు. "సహసావిదధీతనక్రియా "మని నీతికోవిదులు వక్కాణింతురు.

(నీతిచంద్రిక.)

3 నీచాఃకలహమిచ్ఛంతిసంధిమిచ్ఛంతి సాధవః = నీచులు జగడముం గోరుదురు. భాగ్యులు కలయికంగోరుదురు.

ఉదా—మా చేతనయింత దనుకం గలుపుకొలుతనంబునకు కడంగుదును "నీచాఃకలహమిచ్ఛంతిసంధిమిచ్ఛంతిసాధవః" యని ధర్మజ్ఞులు వచింతురు గాదె.

(నీతిచంద్రిక)

4 శరీరమాంద్యఖలు ధర్మసాధనం = దేహము ధర్మములను సాధించువానిలో మొదటిది.

ఉదా—శరీరంబు గల్గిన నెల్లధర్మంబులు సాధింపవచ్చును. "శరీరమాద్యంఖలు ధర్మసాధన" మని ప్రాజ్ఞులు వక్కాణింతురు.

(నీతిచంద్రిక.)

5 యథా రాజా తథా ప్రజాః = రాజెట్లుండునో ప్రజలట్లుందురు.
ఉదా — భూనాథుండు సాధుచరిత్రుండయ్యెనేనిఁ బ్రకృతివర్గంబట్లగు "యథా రాజా తథా ప్రజా" యని నీతికోవిదులు వక్కాణింతురు.
(నీతిచంద్రిక)

6 జీవన్ భద్రాణి పశ్యతి = జీవించినవాఁడై శుభములను జూచుచున్నాఁడు.
ఉదా — సాహసంపడి రణమరణంబు శ్రేయంబని కడిందిమార్తురతో నోరసి యసురు వోరంగుట ధర్మంబుగాదు. "జీవన్భద్రాణి పశ్యతి" యను వచనంబుం బాటింపరాదె.

(నీతిచంద్రిక)

7 పృష్ఠతాడనాద్దంతభంగః = తుంటిన గొట్టినఁ బండ్లు రాలినవి.
ఉదా — వృక్షంబన నెక్కడ సాక్ష్యంబు పలికెవ నెక్కడ ? "పృష్ఠతాడనాద్దంతభంగ" యనునట్లున్నది. (నీతిచంద్రిక)

8 వినాశకాలే విపరీతబుద్ధిః = నశించుపోవు కాలమున వ్యతిరేకపు తలంపులు గలుగును.
ఉదా — ఎంతచెప్పిన నతండు తాను బట్టిన కుందేటికి మూఁడే కాళ్ళనుచున్నవాఁడు. "వినాశకాలే విపరీతబుద్ధి" యను వచనంబేల తప్పు.
(నీతిచంద్రిక.)

9 శుభస్య శీఘ్రం = శుభమునకుఁ ద్వరకావలయును.
ఉదా — నిశ్చితకార్యమునకు జాగేల "శుభస్య శీఘ్ర" మ్మనిన వినయముగా మంత్రి యిట్లనియె. (నీతిచంద్రిక-విగ్రహము.)

10 అత్యుచ్ఛ్రయః పతనహేతుః = మిక్కిలి యెదుగుట పడుటకుఁ గారణము.
ఉదా — అత్యుచ్ఛ్రయః పతనహేతుః అని యార్యులు వచియింతురు గావునఁ బెటిఁగెడివాఁడే విఱిగెడివాఁడు.

(నీతిచంద్రిక-విగ్రహము)

11 రాజ్యాంతే నరకంధ్రువం = రాజ్యాంతమున నరకమువచ్చుట నిజము.
ఉదా—పుడమిపై నిట్టి రాజోత్తము లుండఁబట్టియేకదా "రాజ్యాంతే నరకంధ్రువ" మ్మను పండితోక్తి యెల్లెడలను జెల్లకనిలచెల్లెను

(నీతిచంద్రిక—విగ్రహము.)

12 దుర్బలస్య బలంరాజా = బలములేనివానికి రాజే బలము.
ఉదా—రాజుల కార్త రక్షణంబులంబోలు ధర్మంబు లొండులేవు.
"దుర్బలస్యబలంరాజా" యను నిజాఙ్ఞే.

(నీతిచంద్రిక—విగ్రహము.)

13 స్వాశ్రితావన సమో నహిధర్మః = ఆశ్రితుల రక్షించుటతో సమమగు ధర్మములేదుగదా ?
ఉదా—తత్వజ్ఞులెప్పుడును హింసకుం గనుదవ్వుగఁ జరియించు చుందురు. "స్వాశ్రితావన సమో నహిధర్మః" యని వేదము ఘోషించుచున్నదా

(నీతిచంద్రిక—విగ్రహము).

14 ఆత్మవత్సర్వభూతాని = సమస్తభూతములను దనవలెఁ జూడవలెను.
ఉదా—"ఆత్మవత్సర్వభూతాని యనెడు పలుకు। సత్యముగ నాయశోదుని చక్రవర్తి। సకల జనము నిజప్రాణసమముగాఁగఁ। దలచు శాంతుఁడును దమమును దయయుఁగలిగి॥

(కుచేలోపాఖ్యానము.)

15 అవశ్యమను భోక్తవ్యం కృతంకర్మశుభాశుభం = తాను జేసిన మేలుగాని నట్టియుఁ గీడైనట్టియును కర్మ ముఖ్యముగా ననుభవించఁదగినది.
ఉదా—కావున "నవశ్యమను భోక్తవ్యం కృతంకర్మశుభాశుభ" మ్మను కతంబునఁ బూర్వజన్మంబునఁ జేసిన పుణ్యపాప ఫలంబులు వెంబడిని జీవులనంటియుండి సుఖదుఃఖంబు లనుభవింపఁ జేయును.

(కుచేలోపాఖ్యానము.)

16 విద్వాన్ సర్వత్రపూజ్యతే = విద్యావంతుఁడంతటం బూజింపఁబడును.

ఉదా— గర్వముడిగి యట్లుండిన
నిరాశ్రయులకేమియొగ్గు నీతిఁగ "విద్వాన్
సర్వత్రపూజ్యతే" యన
నుర్వి న్విద్యాధికుండు యోగ్యుఁడు సభలన్.

(కుచేలోపాఖ్యానము.)

17 ఆడంబరాణి పూజ్యాని = డంబములు పూజింపఁబడుచున్నవి.

ఉదా— అరయ నాడంబరాణి పూజ్యాని యనుచుఁ
జాటుచుండెడి నీతిశాస్త్రము నిజంబు
బడుగు లెచ్చోట కేగిన బ్రదుకఁగలదె
బూటకులఁగాని మెచ్చరు భూమిపతులు.

(కుచేలోపాఖ్యానము.)

18 పరోపకారార్థ మిదంశరీరం = ఈ శరీరము పరుల కుపకారము చేయుట కొఱకు.

ఉదా— అరయఁ "బరోపకార్థమిదంశరీర" మ్మను వాక్యసారము
గ్రహించి.

(కుచేలోపాఖ్యానము.)

19 అనిత్యాని శరీరాణి = దేహములు నిత్యములు గావు.

ఉదా— శత్రువు "లనిత్యాని శరీరాణి" యనుమాట లాదరించు మేను
లదృశ్యముగ గణుతించి. (కుచేలోపాఖ్యానము.)

20 పాపాయ పరపీడనం = పరులను బాధించుట పాపము కొఱకు.

ఉదా— క్రియతుఁడై యన్యులకును
నేయెడఁగీడాచరించు హీనజనుఁడు "పా
పాయపరపీడన" మ్మను
న్యాయమ్మున రౌరవాది నరకములఁబడున్.

(కుచేలోపాఖ్యానము.)

21 జ్ఞానేనహీనః పశుభిస్సమానః = జ్ఞానము లేనివాఁడు పశువుతో సమానము.

22 అతిసర్వత్రవర్జయేత్ = అన్నిఁటియందు విస్తారము చేయుటను విడువ వలయును.

23 అధికస్య అధికంఫలం = గొప్పవానికి గొప్పఫలము కలుగును.

24 అన్నస్య క్షుధితం పాత్రం = ఆకలి గొన్నవాఁడే అన్నము పెట్టుటకుఁ బాత్రుఁడు.

25 అన్నాను రూపా స్తను రూపబుద్ధయః = దేహము. రూపు, బుద్ధి, ఆహారమునకుఁ దగినవై యుండును.

26 అన్యథాచింతితంకార్యందైవమన్యత్రచింతయేత్ = యొకలాగు దలఁచిన కార్యము దైవము మఱియొకలాగు దలంచును.

27 అపృష్టోపిశుభంబ్రూయాత్ = అడుగకున్నను శుభమును చెప్పవలెను.

28 అర్థస్యపురుషోదాసః = ధనమునకుఁ బురుషుఁడు దాసుఁడు.

29 అల్పవిద్యో మహాగర్వః = కొలఁది విద్యగలవాఁడు మిక్కిలి గర్వము గలవాఁడగును.

30 అవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం = తాము చేసిన పుణ్య పాప కర్మను ముఖ్యముగా ననుభవించవలయును.

# CHAPTER XXIX.

## ధ్వని మొదలగు అనుకరణములు.

---

ఆంధ్రభాషయందు ధ్వనులకుఁ బ్రసిద్ధములయిన అనుకరణములు గలవు. వాని నేవి యెట్లు ప్రయోగింపఁబడినవో తెలిసికొనక తోఁచినట్లు ప్రయోగించుట ప్రసిద్ధము కాదు.

పూర్వకవులచే రూఢిగాఁ బ్రయోగింపఁబడిన వానిలోఁ గొన్నిఁటి నీక్రింద నుదహరించుచున్నాము.

1 నవ్వుట — కికా కిక నవ్వుట, కిచ కిచ నవ్వుట, కవ కవ నవ్వుట, పక పక నవ్వుట, కిల కిల నవ్వుట, కల కల నవ్వుట

2 అల్లుట — చీకిలి మాకిలిగా నల్లుట, చికటామకటముగా నల్లుట, అల్లిబిల్లిగ నల్లుట.

3 ఆడుట=జోగుట — అల్లల నాడుట, అల్లలాడుట, జవ జవలాడుట, చెకి చెక పిక లాడుట.

4 రొప్పుట — గొట గొటమని రొప్పుట.

5 గ్రుఱ్ఱుట — గుర గుర గ్రుఱ్ఱుట.

6 మాడుట — మల మల మాడుట.

7 వేగుట — చిట పిట వేగుట, పెట పెట వేగుట.

8 మండుట — బగ్గున మండుట, బగ్గు బగ్గున మండుట.

9 మ్రోత — గల్లున మ్రోసె, గుభ గుభ దుందుభుల మ్రోత.

10 ఏడ్పు — హోరున నేడ్చె, బావుర నేడ్చె, బావురని యేడ్చె, కావు కావుగని యేడ్చె, గొల్లున నేడ్చె. వెక్కి వెక్కి యేడ్చె.

11 చొచ్చుట — మర మరని చొచ్చె, ముడి ముడి వడలుట.

12 పొఱ్ఱుట — పుర పుర పొఱ్ఱుట.

# CHAPTER XXIX.

## ధ్వని మొదలగు అనుకరణములు.

---

ఆంధ్రభాషయందు ధ్వనులకుఁ బ్రసిద్ధములయిన అనుకరణములు కలవు. వాని నేవి యెట్లు ప్రయోగింపఁబడినవో తెలిసికొనక తోఁచినట్లు ప్రయోగించుట ప్రసిద్ధము కాదు.

పూర్వకవులచే రూఢిగాఁ బ్రయోగింపఁబడిన వానిలోఁ గొన్నిఁటి నీక్రింద నుదహరించుచున్నాము.

1 నవ్వుట — కికా కిక నవ్వుట, కిచ కిచ నవ్వుట, కవ కవ నవ్వుట, పక పక నవ్వుట, కిల కిల నవ్వుట, కల కల నవ్వుట

2 అల్లుట — చీకిలి మాకిలిగా నల్లుట, చికటామకటముగా నల్లుట, అల్లిబిల్లిగ నల్లుట.

3 ఆడుట = జోగుట — అల్లల నాడుట, అల్లలాడుట, జన జవలాడుట, చెంకిచెక పిక లాడుట.

4 రొప్పుట — గొట గొటమని రొప్పుట.

5 గ్రుక్కుట — గుర గుర గ్రుక్కుట.

6 మాడుట — మల మల మాడుట.

7 వేగుట — చిట పిట వేగుట, పెట పెట వేగుట.

8 మండుట — బగ్గున మండుట, బగ్గు బగ్గున మండుట.

9 మ్రోత — ఘల్లున మ్రోఁగి, గుభ గుభ దుందుభుల మ్రోఁత.

10 ఏడ్పు — హోరున నేడ్పు, భోరున నేడ్పు, బావురని యేడ్పు, కావుకావుగని యేడ్పు, గొల్లున నేడ్పు. వెక్కి వెక్కి యేడ్పు.

11 చొచ్చుట — దుర దురని చొచ్చి, దుడి దుడి వడఁకుట.

12 ప్రాక్కుట — పుర పుర ప్రాక్కుట.

36 పాములు — బుసకొట్టును.
37 పిల్లులు — మేవుమనును.
38 కొంగలు — కొంగొంగురనును.
39 ఆంబోతులు — పుఱ్ఱుబుఱ్ఱుమనును.
40 మేకలు — అఱచును.
41 ఎలుకలు — గురగురలాడును, గుసగుసలాడును.
42 కొట్టుకొనుట — ఱెక్కలు తటతట కొట్టుకొనును, ఱెక్కలు పటపట కొట్టుకొనును, ఱెక్కలు పెటపెటఁ గొట్టుకొనుట.
43 మద్దెలమ్రోత — ధణంధణం, ధింధిం, ధిమ్మను.
44 మెఱయుట — ధగ ధగ మెఱయుట, ఒడలు చెక చెకమని మెఱయుట.
45 నొక్కుట — చిటుక్కున నొక్కుట.
46 ఘల్లుమనుట — గాజులు ఘల్లుమనుట.
47 జల్లుమనుట — మనసు జల్లుమనుట, గుండెలు జల్లుమనుట.
48 తుమ్మెదలు — ఝుమ్మనును, దిమ్మనును.
49 ఈగలు — ఝుమ్మనును.
50 ధ్వానములు — ఘుళంఘుళ ధ్వానము.
51 దంతములచప్పుళ్లు — కటీల్లుకటీల్లుమనుచప్పుడు
52 రథనేమి క్రేంకారము.
53 భేరీ భాంకారములు.
54 శింజినీ టంకారములు.
55 ఘంటికల ఘణంకారము.
56 ఓరగాల గిటుగిటు త్రిప్పుట.
57 చక్రము గిరగిరఁ ద్రిప్పుట.
58 చీమ చిటుకు మనుట.
59 చావోర్చియుండి ముద్దుచుఁ గోలుట.

60 కుర్రిక్కుమిక్కు మనకుండుట.
61 వీణా కలకలము.
62 పింజలు ఘళ ఘళ మనుట.
63 దువ్వలువలు వెళ వెళ లాడెను.
64 ఊహ్హూ అని యూదుట.
65 ధుప్పని యుమ్మివేయుట.
66 జఱజఱ పారుట.
67 జల్లున రాలెను.
68 దాఁడ దాఁడ పడెను.
69 దోణ దోణ పడెను.
70 గుండియలు తోటుకు మనుట.
71 నీళ్లు కళపెళ మరగెను.
72 అన్నము గుడ గుడ మని యుడికెను.
73 పాలు బుస బుస పొంగెను.
74 నిప్పు భగ భగ మండెను.
75 ఆవును ధేయని తోలుట.
76 ఘూకములు కుహూ కుహూ మనెను.
77 కోకిలలు కో కో యనును.
78 చిలుకలు పలుకును.
79 నిప్పు కస కస లాడును.
80 ప్రయాణభేరి బోరనమ్రోసె
81 నేయి సలసల క్రాగెను.
82 గంధముపూత చిల చిల మనెను.
83 నక్షత్రములు మినుకు మినుకు మనెను.
84 గంటలు గణ గణ మనును.

85 వాద్యఘోషము = డిబ్బు డిబ్బు ఖంగు ఖంగు ఠంగు ఠింగుమను ధ్వనులు సేయుచును.

86 రాళ్లు గుల గుల జారె.

కొన్ని శబ్దము లనుకరణమువలెనుండి యొకానొక యర్థవిశేషము నిచ్చుచున్నవి.

1 మనసు కళవళపడెను
2 చెకపికలాడెను
3 చిత్తము వకావకలయ్యెను
4 సొంపు సొటసొటవోయెను
5 బుడిబుడి యేడుపు
6 కాను నకనకలాడెను.
7 వెల వెలవెలఁ బారెను
8 వలవల కన్నీరు నించెను
9 వలవల యేడ్చెను
10 తోవలు విలవిల బడెను
11 కస్తూరి ఘుమఘుమలు
12 బంగరు నిగ నిగలు
13 మెఱుఁపుల తళతళలు
14 పసిఁడిగాజుల మిసమిసలు
15 గర్వపు మిటుమిటులు
16 శుకపికములు పిలపిల నేతేరెను
17 పాపటబొట్టుమోమున తళపికలుసేసె
18 గుసగుసలాడుట
19 ఠర ఠర
20 హటాహుటి
21 ముసిముసినవ్వులు
22 మిడిమిడియెండ.
23 యడాయడలై పఱతెంచె
24 కకాపికలై మదిలోఁచె
25 దుమదుమ వీణాధ్వని
26 మాటలు తొకతొకలై వెడలెను
27 గంటల కిల కిలలు
28 కత్తి ఝుళిపించుట
32 బిసిబిసి మాటలు
33 తెల తెల వారెను
34 వెల వెల బారె
35 అంగంబుల చకచకలు
36 మెక మెకపాటు
37 మది చివుక్కుమనెను
38 బొజ్జ పుటపుటలాడెను
39 కట పెట తొటతొట రాలెడు పొటపొటచినుకులు ధరిత్రిపాడ నట్లు వడన్। సొటసొట నాకఁట సోలుచు। తటతటపడు చాతకముల దైన్యము వాపెన్.
30 బుడిబుడి చనుడెంచుట
31 రవరవలు పొడముట = కోపము

# CHAPTER XXX

## ఉపస్కారపదములు.

---

1 చిన్నారి పొన్నారి
2 చేనుచెట్రి
3 మడిమట్రి
4 పులిబుట్రి
5 కీళపాళ
6 చేటుపాటు
7 బ్రతుకు బండారము
8 మనవి సనవులు
9 చుట్టపక్కాలు
10 కాయగసురలు
11 చెట్లు గట్లు
12 సందుగొందులు
13 వేళ్ళు వెల్లంకులు
14 పెండ్లి పేరంటము
15 పేరుపెంపు
16 ఈడు జోడు
17 రూక రట్ర
18 పండువ పబ్బము
19 కాయగూరలు
20 పొచ్చెమునొచ్చెము
21 గెంటుకుంటు
22 అంటుసంటు
23 బంటుపైర
24 మోదముసాదము
25 సైరపచ్చులు
26 ఆసంగి వెసంగి
27 కలిసిమెలసి
28 విధివిరామము
29 పూజాపురస్కారములు
30 లంచపంచము
31 తగ్గుమొగ్గు
32 అడంగిమడంగి
33 బంటుబానిస
34 రాయిరప్ప
35 పంతుకాని సాప్పకాని
36 అనలు కొనలు
37 మచ్చుమగ
38 వెచ్చ సచ్చములు,
39 చెట్టుచేమ
40 చింతలు వరింతలు
41 మురువుమూట
42 కొడుకులు కొమ్మలు
43 అడ్డా దిడ్డములు

# CHAPTER XXXI.

## Common Discriptions.

---

1 వసంతఋతువు—— ఇమ్మధుమాసంబున దినకరుండు తన కరములచే జోరుండునుంబోలె దిగంగనల మంచుముసుంగుల లాచికొనియె. కోవెల పలుకులచే వసంత ప్రభుని రాకచాటఁబడు చున్నది. ఒకయెడ మహీరుహంబులు సొరుగాకులు రాల్చి దరిద్రులవలెఁ గాన్పించు చున్నవి. మఱియొక చోఁగొమ్మలెల్లను చివురు జొంపములచేఁ గన్నులపండువసేయుచుఁ బెక్కు సిరులఁబొరలు వారివలెఁ గనుపండువు సేయుచున్నవి. రసాలసాలంబులు నిండుపువ్వులచేఁ గ్రమ్మంబడి యిదియాకు, ఇదిమ్రాఁకు, ఇదికొమ్మ, ఇదిరెమ్మయని తెలియకుండనుండెడి విగ్రహములపైదాడి సేయు మన్మథవీరుని గొప్పకొమ్మంగల విరుల మొత్తములపైఁ గ్రమ్ముకొని మనమ్మునకు సమ్మదమ్ము గ్రుమ్మరించుచున్నది. ఎల్లవారును దమతమ చిన్ని కన్నెలను జిన్నారి పొన్నారి వయసున్గల వడుగులను పెండ్లిండ్లు చేసినవారును జేయఁబోవువారును మదికి నుత్సాహంబు హెచ్చ పెరుగ నుత్సవంబు లూరూరం జేయుచుండిరి.

2 గ్రీష్మఋతువు—ఇక్కాలంబున వెక్కసంబగు వెట్టలచేఁ దెరువరులు తెరవుచెంతఁగల వృక్షంబుల నీడల నాగుచు మరలఁ బోవుచుఁ బయనములు సాఁగమికై మదులఁ దొందరజెందుచు దేవుఁడు దయకలవాఁడై యుద్దినంబులఁ బెద్దవాగ్రిద్దు గలిగించి నేఁటియొచాలునని కొంత సంతసించుచుఁ బోవుచుండిరి. సుడిగాడ్పులు రివ్వురివ్వునఁ బడమింగల పలురంగుల ధూళులపై విశ్వాగా దొప్పుచు బొంగరముద్రిప్పిన చెన్ను గలిగించుచున్నవి. ఎండమావులఁజూచి గొప్ప నదులుగా భ్రమసి లేడి గుంపులు, చిన్నకట్టిలును బరువిడి పరువిడి తొల్లింటి దూపకు మఱి

శాంతతోడప్పడ నలసి వసికి మెల్లనఁ జల్లన చెట్టుక్రిందికిఁ జేరుచుండిరి. ఇసుకబయళ్ళుగల తెల్లింటి తెరవుల నొట్టిడినట్లు మార్గస్థుఁ డొక్కఁడును గాన్పించకుండె.

3 వర్షఋతువు— అత్తఱిఁ జొత్తిల్లు వర్షధారలచే భూమ్యంతరిక్షములు చెదరిపోకుండ నతిదృఢంబుగ బంధించిన నూలిపగ్గంబులం బోలె నతిసాంద్రంబుగా నుండ నాకసంబున మెఱుగుల గములను బుడమి మొగకటపాదలును విజృంభించి నూతనంబగు జలధార కుసుమ సముదయంబుల నల్లకల్లుచుండ నక్కేతకీ కుసుమ గంధంబులు జాతీయ కుసుమ వికర సౌరభ్యంబులును గలసి మెలసి యననుభూతచరంబగు నొకానొక క్రొత్తతావి జొత్తిల్లఁజేయ నయ్యది దెసల వెదజల్లుచు శీతలవాతపోతంబులు నల్గడలఁ దిరుగుచుండ గట్టు పుట్ట మిట్ట పల్లము నేకమై స్రవంతీశతంబులు శరవేగంబున శరవేగంబుగాఁ బ్రవహించుచుండ హాలికులు పెండిలింబోలె నత్యుత్సాహంబుతో నొక్కఁడ సేతు పూరణంబగు నంబుపూరంబు ద్రిగద్రోయువారును, నొక్కఁడ గట్టుల నెగఁబెట్టువారును నొక్కఁడ మహోద్యానంబు లెసంగ దమ్ములం జిమ్మువారును సస్యాంకురంబులఁ దెమలించి మరల నాటువారునునై యుల్లసిల్ల నక్కాలంబు డెందంబున కమందానందం బొనర్చె.

4 శరదృతువు— ఆడయాడ సస్యంబులు ఫలోన్ముఖంబులయ్యె నదియాదేయేరులతోరంపు దీరంబుల నీరపూరంబుల బొంగార మెల్ల మెల్లన జరుగఁదొడంగె. ఆహా! మిన్నులచ్చి కత్తుక హత్తుకొని వ్రేలు ముత్తెపుసరులుగా నంచగములు కొంచక సంచరించుచున్నవి. మబ్బులుబ్బ దక్కి తెల్లింటి యింకి యాగిపోవ వెలవెలఁ బారు తెరంగునఁ దెల్లనై యుండె. క్షీరసాగరంబున ననంతశయానుండు మేల్కొని కన్నులు విచ్చి యుండునప్పటి సిరి నరయ నేడ్కతోఁ గుంభసంభవుం డాకసంబున నుండి తొంగితొంగి చూడ గమకించె. తటినీమధ్యంబుల సరసీరుహం

బులు నిర్నిరోధంబుగా వికసింప నదీకాంత లలపు దీర హంసములు విశే
షిల్ల నానందించు తెఱంగునఁ గాన్పించె.

5 హేమంతఋతువు— ఆహేమంతంబున సీమంతంబులు కైవడి భూమి నెల్లడల మార్గంబు లనర్గళంబుగాఁ గాన్పింపఁ బథికులు నిశ్శంకంబుగ సంచరించు చుండిరి. పద్మినీకాంత దివస దైర్ఘ్యంబు సంకుచితంబగుటం జేసి తనమనఃప్రియునిఁ బెక్కుడడవుగాఁ బొందుచు నానందించు భాగ్యంబులేమింజేసి చింతించు చందంబునఁ దమ్మిమొత్తమ్ములు సిరివరిగి యింపుగాకుండె. అట్టి పొందమ్మికొమ్మలపై దయదప్పి దాక్షిణ్యంబు వీడి ధృష్టనాయకునింబోలె వేడిఁ వెలుంగు తన సారథికి దేవుత్తరంబున నడుప నానతి యొసంగె. ఎల్లయెడల నావరించియున్న సస్యలక్ష్మి యప్పటి చలికి సహింపఁజాలక యవయవంబుల ముడిచిన తెఱంగునఁ జేలెల్ల గుప్పుబడియె.

6 శిశిరఋతువు—ఆసమయంబున మిము మంచు సైరింపఁ జాలక జనులెల్లఁ దమ యంగంబుల దట్టపు బుట్టంబులఁ గప్పికొనఁ దామునట్లు సల్పుకైవడి దశదిశలును నిరంధ్ర నీహారబిందు సందోహ సమాచ్ఛాదితంబులయ్యె. పడఁతుల వాతెఱలు బీటికలు వాఱ నధరామృతంబునకై దగ్గఱిల్లు కాంతుల దంతక్షతంబులు సైపఁజాలక మోములు ద్రిప్పు మందనకాముకుల తృష్ణలు గ్రీష్మంబున మరుదేశ పాంథులకుంబోలె నగ్గలమయ్యె. హిమాతిశయంబున జఠరంబునఁ గల్గు నగ్నియుఁ జల్లాఱుటం దదుపఘాతంబగు నుష్ణంబుపై వెసలు మండెకోయుచు చందంబున నెల్లరి మోముల నుష్ణనామంబు లుప్పతిల్లఁ దొడంగె. నెగడిసిన వెన్నెల్లపూగుత్తుల మొత్తంబుల నావరించి మంచులకయి బెదరుచుఁ గేఁటకెందంబులు విరితేనియల నానుట లేకున్నను మంచుల నానుట సిద్ధించి యాకటం గటకటంబడుచుండె.

---

## విమానము.

"అయ్యెడఁ గ్రొక్కాఱు మెఱుంగుల తెఱంగున విరాజమానంబగు నవ్విమాన రాజంబు జలయంత్రింబుం బోలెఁ బ్రవేశంబునకు గమకించు నందకంబు రకంబునఁ బొడవుగా నెరిగి యొక్కపరి రథంబు విధంబున మందగతిం జనుచు నొక్కసారి లకోరిదారి రివ్వున నిగుడుచు, నొక్కతేప బొంగరంబు రంగున బిరబిరం దిరుగుచు, నొక్కమాఱు గాలిపటంబు వీటున వని యాడుచు, నొక్కయెడఁ జుక్క తెగిపడ్డ విధంబున డిగ్గుచు నొక్కచోటం బుట్టచెండు నడుపున నుప్పరంబునం బోవుచు నొక్కవంక జీను (లంగరు) దిగవైచిన కప్పలి (ఓడ) చొప్పునఁ గదలక నిల్చుచు నొక్కపరి బయిరిడేగ యొయ్యారంబున నడ్డు నడపులం జూపుచుఁబోయె"

(కువలయాశ్వచరిత్ర)

## విద్యుద్దీపములు.

సీ. ఒకదీపమార్చిన నున్నదీపంబులు
నప్పుడ తమకుఁ దామారుటయును
దాలవృంతానిల చేలాంచలాదిక
వ్యాపారములదీప హారమియును
నారిన దీపంబు నప్రయత్నంబున
మఱి చూడఁ జూడంగ మండుటయును
మండియారియు నారిమండిన దీపంబు
వెలుఁగుఁజీఁకటియుఁ గాపించుటయును
తే. గలుగు నట్లుగ పరశక్తిఁ గడకరాజు
శిల్పమున నవ్వులాటకుఁ జేయుచుండ
దరుణి కుతుక త్రపా ద్భుతాతంక భార
సంకటస్థాయియై హారిణాంకమయ్యె.

(శృంగారనైషధము.)

## గుఱ్ఱము మీఁద బంతియాట.

"తన దండంబు వెంబడిని వారువంబు తప్పక నిలిచియుఁ, ముందరికిం బోయియుఁ దెలకులం బొరంగియుఁ, వెనుకకు సేగుదెంచియుఁ గడువేడుక నొనరింప బంతి యాడుచో బంగరుకోల (bat) నడిమింటం దిరిమ్మర దగ్గ జిల్లి కొట్టుచు బంతి నెగరవైచి కొట్టుట యెంతటి పని యని ముందరికి విసరి యది పుడమిం బడకుండ దానికన్న మున్నుగఁ జిత్రగతి వారువంబుఁ బారదోలి క్రిమ్మర మీఁదికిఁ గొట్టి తన చేతి రత్నఖచితంబగు కాంచన దండంబు కాంతులపైకిఁ గ్రమ్మ నాతండు మరల మండలాకారంబుగఁ దురగంబు వోలి యాడె, నాహయంబు మున్న మున్నగ మండలాకారంబున గిర గిరం దిరిగి కాన్పించె, నట్టుపైఁ జెంగటి ఘోటకంబులు చెదరిపారఁ జక్రాకృతినిఁ బరువిడినట్టు గాన్పించె, నట్టుపై నవయవంబులు స్ఫుటంబుగా నొక్కయవయవంబు మాడ్కిం దోఁచెఁ దుదకు గాని యలంకారముల కాంతులు మాత్రము కొఱవిం ద్రిప్పిన చందంబున మెరసెం."

(ప్రభావతీ (ప్రద్యుమ్నము.)

## కాసారవర్ణనము.

"భువనసారం బను నొక్క కాసారంబుగలదు. అయ్యది చక్ర చక్రాంగ ప్రముఖ వివిధజల విహంగమ సంచార రమ్యంబయి పుండరీక మండ సాంద్రమకరంద ధారాసార సంభ్రమద్భ్రమర ఝంకార సంకులంబయి యొసంగు."

(నీతిచంద్రిక.)

# CHAPTER XXXII.

## Colloquial Language :—గ్రామ్యభాష.

——)o(——

ఆంధ్రభాష సంస్కృత ప్రాకృత సమమై తత్సమమను పేరను, సంస్కృత భవమై తద్భవమను పేరను, దేశవ్యవహార సిద్ధమై దేశ్యమను పేరను, పామర జన వ్యవహార సిద్ధమై గ్రామ్యమను పేరను ఇట్లు నాలుగు విధములుగా నున్నది.

దేశ్యగ్రామ్యముల వలనఁగూడ భాషయొక్కవగా నేర్చికొనుట కవకాశము గలదు. ఇది గ్రంథగతము గాదు. దీని వ్యవహార సిద్ధిచేత నే తెలిసి కొనవలయును.

దేశ్యగ్రామ్యములు సంస్కరింపబడక సలక్షణభాషం జేరఁజాలవు. సలక్షణమైన భాషయే రెండుకోట్ల యెనుబది నాలుగులక్షల యాంధ్రజనులచే సర్వసామాన్యముగ వాడఁబడఁదగినది.

దేశ్యగ్రామ్యములు సంస్కరింప నందున గంజాము జిల్లాలో నుత్కళ భాషా సంబంధము వలన నొక భాషగాను, నైజాము రాజ్యమునఁ దురుష్క భాషాసంబంధము వలన నొక భాషగాను, దక్షిణదేశమున ద్రావిడ భాషా సంబంధమున నొకభాషగాను, మైసూరు రాష్ట్రమునందలి కన్నడ భాషా సంబంధమువలన నొకభాషగాను, పశ్చిమఖండమున హూణభాషాసంబంధము వలన నొకభాషగాను, ఇట్లు ప్రత్యేకభాషలుగా నేర్పడి యొకరి భాష యొకరికిఁ గొంత వఱకుఁ దెలియకపోవుటయుఁ గూడ సంభవించును.

### హిందూస్థాని తెలుఁగు.

" ఖుమారీ—సర్కార్ సాహెబు, బాకీ యిస్తం యిది. పట్టణంలో జంమా విస్తారంవుంది, ఖజానా విస్తారంవుంది, వస్తు విస్తారంవుంది. వఖతం వచ్చినైనా దైతేని దమ్మిడి సాహెబు అక్కర్లేకుండ ముస్తైదీకే యిస్తుంది

అనుకు కొండ లష్కర్ మట్టుడిదండూకి చుట్టుకొంటుంది. నూటిక్ తొంభై తొమ్మిది దాన్కి రాజాన్వయం నడిపిస్తాను. అప్పుడు మనగతి పాడ్ కత్తులో పక్షగతి అవుతుంది. అందుకు చేత సాహెబ్ నాకీయివ్వంయేమంటె, మన్కం దండంతా నడుపుకొని రాజా యెక్కడ వున్నాడు అక్కడ వెళ్ళి రాజాకి కేటు కిబ్బంది కొంచెం వుంటుంది గన్క మళభంగా, రాజాకి పట్టుకొని దేశం పంతా స్వాధీనం పుచ్చుకొని యిక్కడ యీదండుతో తమరు నబాబ్ మేము గులాం వుండవచ్చును.”

(ప్రతాపరుద్రీయము.)

## అరవ తెలుగు.

ఉదా— మహీపతి— చూడండిమీ. అయిదారు మాసం కుయ్యాకుండా గమ్మున ఉండండి, అప్పుడు మహీపతి యిట్లా వాడని మీరే చెప్పబోతారు.................. ...

మహీపతి— అంతదానా? అరుమాసంతాళి యీ మీసం గొరిగి వెయ్యండిమీ!

మహీపతి— పొద్దయింది వస్తాను.

మహీపతి— యట్లావాణ్ణి అరిచేతిలో బంబరంవారె తిప్పుతును. ఆశాస్త్రిర దెగ్గిర మన ఆట నడిచిందేకాదు. అచ్చర్యం! వాడు మహీపతిని మింగే వాడుగ దావున్నాడు. యేవిద సకానీ కొంచము కూడ బయపడడే! మన కున్నలో సందేహామే పెట్టడే, యేంచెయ్యొచ్చును? కొడుకుపైని వాడికి నిండా విస్వాసం-వుణ్ణి, వుణ్ణి, మహీపతికేనుగా విడిచుడిచేవాడుకాడు. అ పక్కానతోవ తెగలకపాతే యీ పక్కాన తగులుతుంది. యిప్పుడు మరిగిం దేమి? పోనురాను రేలుచ్చాక్షిదా లాబం! గుంటూరులో నిలిచిందానికి వొక్క ప్రియోజనం కానకపోయ, పెలకలోగానే కమత్త! అదివోకమొకే అనిపెట్టుకో, పిల్లధకేచాలకి. నా దేబాబుదగ్గిర పాటుచెప్పకొకలా నిండి కిద్దాంతి వచ్చునని యింకోటికొన్కనీఅంటిని. ఇంకమీంద రొన్నిసాళ్లు పోయి

రావలెనో. ఇక్కడ శాస్త్రికి కొడుక్కు దారంకట్టేదే మంచి సోచన. అది దా అన్నింటికీ అనుకూలం. వాఁడు వొకడు-మాదిరిపిల్లకాయ; నన్నంతగా గమనించేది లేదు. కానీ, దానికితో వకద్దు. ఎవురావచ్చేది ? కుశాల్ రాంపంతులా? వా ! తల్చిందేవచ్చెను !

(వరశుల్క-నాటకము.)

## బైబిలు తెలుగు.

ఓ దేవరా యిప్పుడు పెట్టుము, దానినిమిత్తము పూటపడుము, నాకు హస్తము యివ్వతగినవాఁడు యెవఁడు ? యేమంటే వారి హృదయమునకు జ్ఞానమును మరుగుచేస్తివి; అయినందున నీవు వారిని హెచ్చనియ్యకుండా వుందువు. యెవఁడు తనస్నేహితులతో చేటుకొరకు ద్రోహముగా మాట్లాడునో దానిపిల్లల కన్నులు చెడిపోవును. వాడు నన్ను జనులలో సామితెగా వుంచివున్నాడు; వారియెదుట నేను అసహ్యమయినువాడనై యున్నాను.

(బైబిలు)

## సర్కారు తెలుఁగు.

ఘనమయిన అయ్యా, తమ్మ ఆధీనంల్లో వున్న బేచిరాకు గ్రామం తాలూకు యీఁదాస్తిజప్తు చేసినట్లున్ను, సాతబాకీలు రైటాపు చేయించినట్టున్నూ టాగ్రిస్నఫరు అప్లికేవనుతో నిమిత్తం లేకుండా, పట్టా తర్దీలు చేసినట్టున్నూ తెలుస్తుంది. ఈ ప్రకారము చేయడము నావారసత్వమునకు నష్టకరంగా వున్నందున నేను అది తొలగించమని మనవిచేసుకొనుచున్నాను. తమరు న్యాయం కలిగిస్తారని తమఘునాన్ని ప్రార్థిస్తున్నాను.

ఇట్లు దేశగ్రామ్యములు అనేకవిధములుగాఁ గాన్పించుచున్నవి, వాని అన్నింటికిని సలక్షణమైన భాషయొక్కటియే యుండును.

దేశగ్రామ్యంబులుగా వ్రాయఁబడినవానిని గైకొని సలక్షణభాషకు మార్చి యుదాహరణములు చూపించుచుంటిమి.

☞ గ్రామ్యభాషాప్రయోగము సాధువుకాదు.

---

I గ్రామ్యభాష,

"అంతయూ ననుభవసాధ్యము. మొదలు మీ పండితులు చిన్ని నాడీ భేదము లున్నవని యొప్పుకొనజాలరుగదా? నాడివలన కాలువాపును శూల చెప్పియుయు నెట్లు గూడునని తర్కము చేతురు. మా గురువులవారు మైసూరు మహారాజులవారికి వారము దినములలో గోరుచుట్టు లేచునని నాడీ పరీక్ష వల్లనే చెప్పి మెప్పువడసిరి. మహానుభావులు అట్టివారు మరి పుట్టబోరు.

(కన్యాశుల్క నాటకము)

సలక్షణభాష.

అంతయు ననుభవసాధ్యము. మొదల మీ పండితులు చిన్ని నాడీభేదము లున్నవని యొప్పుకొనఁజాలరుగదా! నాడివలనఁ గాలువాపును, శూల నొప్పియు నెట్లు తెలియఁగూడునని తర్కము చేతురు. మా గురువులవారు మైసూరు మహారాజువారికి వారము దినములలో గోరుచుట్టు లేచునని నాడీ పరీక్ష వలననే చెప్పి మెప్పువడసిరి. మహానుభావు లట్టివారు మఱి పుట్టఁబోరు.

2. గ్రామ్యభాష.

"ఉన్నది, వున్నది. వెల్లడైన ప్రతుల్లో అది యెవరో బుద్ధిమంతులు చింపివేశారు. మా ముత్తాతగారి ప్రతి మాయింట్లో వున్నది. దానిలో యీ అధ్యాయం వున్నది. చదివి చూస్తిరా కా. కలియుగంలో మన అభివృద్ధికి కావలసిన వుపాయాలన్నీ, చెప్పివున్నవి. వెల్లడిచేస్తే అనాచారులు కల్లగాదని పోతారని యిన్నాళ్ళూ వూరుకున్నాను. యిప్పుడు బైలుపెడతాను కలియుగాన్ని అడ్డదం మకశరమా!

(కన్యాశుల్క నాటకము)

సలక్షణభాష.

ఉన్నది యున్నది. వెల్లడియైన ప్రతులలో నది యెవరో బుద్ధిమంతులు చింపివేసిరి. మా ముత్తాతగారి ప్రతి మాయింటిలో నున్నది. దానిలో నీ యధ్యాయము మున్నది. చదివి చూచితిరా. కలియుగమునందు మన యభివృద్ధికిఁ గావలసిన

నేనూ ఆతను కలిసి యే యింటికి రెండేళ్ళ యీ మధ్య యెప్పుడూ భోజనాలకు తటస్థించలేదు."

(నిరపవాద ప్రహసనము)

సలక్షణభాష.

దాఖలాకంటె నేనేమిచూపించెదను. నేను, నాతఁడు కచ్చేరీలెక్కలనుబట్టియు రికార్డులందును. అలాగున నేమియు జరుగలేదు. నేను భోజనమునకు వచ్చినచోటికితఁడు రానని మాత్రి మనేకులతో ననెనఁట. అనుటయేగాక నేను నితఁడును గలసి యేయింటికి రెండేళ్ళ యీ మధ్యమున నెప్పుడును భోజనములకుఁ దటస్థించలేదు.

6. గ్రామ్యభాష.

"అయ్యా చెయినులుగారూ! తమరు నాకొక సహాయము చెయ్యాలి, ఆపిల్ల నాబంధువురాలు. ఎవఁడో కృత్రిమంచేసి దొంగతనంగా తీసుకు వచ్చాడు. పెళ్ళిగాకుండావుండే సాధనం చెయ్యాలి.

(విధవావివాహ ప్రహసనము)

సలక్షణభాష.

అయ్యా! చయనులుగారూ! తమరునాకొక సాహాయ్యముఁ జేయవలయును. ఆపిల్ల నాబంధువురాలు. ఎవఁడో కృత్రిమముచేసి దొంగతనముగాఁ దీసికొనివచ్చెను. పెండ్లికాకుండనుండు సాధనము చెయ్యవలెను.

7 గ్రామ్యభాష.

" నిజమే మర్చిపోయినాను. వెనుక కలకత్తారోగి వచ్చినప్పుడు కూడా మన షుబేదారుగారే వాదించారు. ఈయనకు గర్భశోకపము లేదు. అందుకనే యెంతెంతవాఁడ్లని యిట్టె బుట్టలో పెట్టుతారు. ఆలోచించుకుండా ము పట్టండి ఏప్రశ్నలడిగితే బాగుంటుందో ?

(మహారోగరక్ష ప్రహసనము.)

సలక్షణభావ.

నిజమే మరచిపోతిని. వెనుకఁగలకత్తాకు రోగి వచ్చినపుడుఁ గూడ మన షుబేదారుగారే యోడించిరి. ఈయనకు సభాకంపములేదు. అందుల కనియే యెంతెంతవాండ్రను నిట్టేబుట్టలోఁ బెట్టుదురు. ఆలోచించుకొందమా పట్టుందు ఏప్రశ్నములడిగిన బాగుగనుండునో ?

8 గ్రామ్యభావ.

"రామరామ, ఇదీ మా ఆయనవేసిన భవాడాయే. అతను చదువు కుంటూవుండగా ఒకరోజున మా ఆయన నాగాజులు తీసివెయ్యమని నన్ను బలవంత పెట్టేటప్పటికి అతనుకూడా సంస్కృతము చదువుకున్నవాడు కాబట్టి యేవోశాస్త్రాలుచదివి గాజులుంచుకో వచ్చునని వాదించాడు. అప్పుడు మాఆయన యేమి యెదురుజవాబు చెప్పకపోయేటప్పటికి నేను ఫక్కున నవ్వగానే భడవాముండా నీకూ వాడికీ యేదోవుందని అల్లరి చేశారు"

(చమత్కారస్నేహప్రహసనము.)

సలక్షణభావ.

రామరామ. ఇదియు మాయాయన వేసిన భవాడాయే. అతఁడు చదువుకొనుచుండఁగా నొకరోజున మాయాయన నా గాజులు తీసివేయుమని నన్ను బలవంతపెట్టఁగా నతఁడు గూడ సంస్కృతముఁ జదువుకొనినవాఁడు కావున నేమికో శాస్త్రములు చదివి గాజు లుంచుకోవచ్చునని వాదించెను. అపుడు మాయాయన యేమియు నెదురు జవాబుఁ జెప్పకపోఁగా నేను ఫక్కున నవ్వగానే భడవాముండా నీకును వానికి నేదియో యుండెనని యల్లరి చేసిరి

9 గ్రామ్యభావ.

"అమ్మో! అతను సాధర్తే. అతఁడు యెలాకనపడకుండా వచ్చి వాఁడో చూడఁడి. ఇంతకు మనుషు యితఁడీమఠంలో ప్రవేశించడం చూచి

నాము. ఇప్పుడప్పుడే అక్కడవున్నాడు, అతడు ఇప్పుడక్కడికేలా వచ్చి నాడో వూహించడానికైనా వీలులేకుండా మహాద్భుతంగావున్నది."

(చమత్కార రత్నావళి)

సలక్షణభావ.

అమ్మా, అతడు నాభర్తయే. అతఁ డెలాగునఁ గనపడకుండ వచ్చెనో చూడుండి. ఇంతకు మును పితఁ డీపురములోఁ బ్రవేశించుటఁ జూచితిమి. ఇప్పుడప్పుడే అక్కడనుండెను. అతఁడిప్పు డక్కడికి కేలవచ్చెనో యూహించుటకైన వీలులేకుండ మహాద్భుతముగా నున్నది.

## 10 గ్రామ్యభావ

"భూతభయం లేకుండా వుండడానికి నేను చిన్నప్పుడు నేర్చుకున్న మంత్రం జపం చేసుకుంటూను. ఇది తప్పకుండా దయ్యాలదేశము. మేము దయ్యాలతోను, భూతాలతోనూ, పిశాచాలతోను, కామినీలతోనూ, మాట్లాడుతూ వున్నాముగాని మనుష్యులతో మాటాడడంలేదు. మేమీరాకాసులు చెప్పినట్టు వినకపోతే మమల్ని పీడించి పీక్కుతింటవి.

(చమత్కారరత్నావళి)

సలక్షణభావ.

భూతిభయము లేకుండ నుండుటకు నేను జిన్నప్పుడు నేర్చుకొన్న మంత్రము జపము జేసికొందుము. ఇది తప్పక దయ్యముల దేశము మేము దయ్యములతోను, భూతములతోను, పిశాచములతోను, గామినులతోను మాటలాడుచున్నాము. కాని మనుష్యులతో మాటలాడుట లేదు. మేమీరాకాసులు చెప్పినట్లు వినకపోయిన మమ్ముఁబీడించి పీకికొని తినును.

## 11. గ్రామ్యభావ,

'ఎవరైనా అతన్ని భోజనానికి పిలుచుకొని పోయినారేమో! అతడు యింటికి రాకుండానే మధ్యదారిలో నుంచే వెళ్ళి వుండవచ్చును. భోజ

నానికి వచ్చేవేళ మించిపోయింది. ఇక మనం కనిపెట్టుకొని వుండనక్కర లేదు. భోజనం చేతాములే. మగవాళ్ళు పరమ స్వతంత్రులు వాళ్లేమిచేసినా మనమేమీ అనకూడదు.'

(చమత్కారరత్నావళి)

సలక్షణభాష.

ఎవరయిన నాతనిని భోజనమునకుఁ బిలిచికొని పోయిరేమో! అతఁడింటికి రాకుండఁగనే మధ్యమున దారిలోనుండియే వెళ్ళియుండవచ్చును. భోజనమునకు వచ్చువేళ మించిపోయినది. ఇఁక మనము కనిపెట్టుకొని యుండనక్కఱలేదు. భోజనము చేతములెమ్ము. మగవాండ్రు పరమ స్వతంత్రులు. వాఁడేమిచేసినను మనమేమియు ననఁగూడదు.

12. గ్రామ్యభాష.

"ఇంత అన్యాయమైన సంబంధము యివ్వకపోతే యావజ్జీవము పిల్లనుగూర్చి దుఃఖించాలిసొస్తుంది. పైపైకబుర్లెన్నయినా చెప్పవచ్చును. ఉరుకురుకు మనే వారేగాని తోడురికేవారు లేరుగదా. ఎవరికేంపట్టింది, ఎవరి పబ్బం వారు గడుపుకొని పోతారు"

(మనోరమ)

సలక్షణభాష.

ఇంత యన్యాయమైన సంబంధ మీయకపోయిన యావజ్జీవము పిల్లను గూర్చి దుఃఖించవలసి వచ్చును. పయి పయి కబురు లెన్నయినఁ జెప్పవచ్చును. ఉరుకు మురుకు మనువారే కాని తోడ నురుకువారు లేరుగదా! ఎవరికేమి పట్టినది. ఎవరి పబ్బము వారు గడుపుకొని పోదురు.

13. గ్రామ్యభాష.

'మీరు వినలేదూ యిదేమోగాని దీని పెండ్లికే యిన్ని రాద్ధాంతాలు. పెట్టుద్దాం. భాస్కరాచార్యుల వారు రావటము. పోట్లాడుటము. యెన్నెన్నో.

మునిగినది. అబ్బబ్బ ఆ మేనరికము తప్పించుకొనేటప్పటికి చావు తప్పి కన్ను లొట్టపోయింది.

(మనోగమ)

కలుషణభావ.

మీరు వినలేదా, యిదేమో కాని దీని పెండ్లికే యిన్ని రాద్ధాంతములును పెనుయుద్ధములును. భాస్కరాచార్యులవారు వచ్చుట, పోట్లాడుట యెన్నెన్నో మునింగినవి. అబ్బబ్బ! ఆ మేనటికము తప్పించుకొను నప్పటికిఁ జావుదప్పి కన్ను లొట్టపోయినది.

## 14. గ్రామ్య భావ.

"రాజమ్మకు కోటీశ్వరునియం దెక్కువ ప్రేమ. పెంపుడు బిడ్డను చూచినట్లు చూడదు. ఎవ్వరో నూటి కొకరు కోటి కొకరు తప్ప కోటీశ్వరుడు రాజమ్మ పెంపుడు కొడుకనుకోరు. కోటీశ్వరుడును రాజమ్మను చూస్తే అమ్మ అమ్మ అంటూ పంచప్రాణములు వదిలేవాడు. వాళ్ళకు వాళ్ళకు అలా అతుక్కు పోయింది గనుకనే యేపొరపు లేకుండా వాండ్లు కావద్దాయని నలుగురిలో అనుపించుకొని బ్రతుకు చున్నారు."

(మనోరమ)

కలుషణ భావ.

రాజమ్మకుఁ గోటీశ్వరునియం దెక్కువప్రేమ, పెంపుడు బిడ్డను జూచినట్లుచూడదు. ఎవ్వరో నూటి కొక్కరు కోటి కొక్కరు దప్ప గోటీశ్వరుఁడు రాజమ్మ పెంపుడుకొడు కనుకొనరు. కోటీశ్వరుఁడును రాజమ్మను జూచిన నమ్మ యమ్మ యనుచుఁ బంచప్రాణములు వదలువాఁడు. వాండ్రకు వాండ్రకు నాలాగున నదికికొని పోయినది. కావుననే యేపొరపును లేకుండ వాండ్రు కావలదాయని నలుగురిలో ననిపించుకొని బ్రతుకుచున్నారు."

## 15. గ్రామ్యభావ.

"అమ్మా! మీతోడు నేను నిజం చెపుతూ వున్నాను. నామాటల నమ్మండి. అతణ్ని నేను చూచి చిన్నగా నిముషమయినా అయివుండదు.

ఆయన నీ పేరు పెట్టి పిలిచి యెక్కడ వున్నావని కేకలువేస్తూ నీవు కన బడిన పక్షానికి నీ మొఖం నిండా గంట్లు పెట్టి నిన్ను విరూపిని చెయ్యకపోతే తన పేరు మాఱుపేరు పెట్టుమని వొట్టు పెట్టుకుంటూ వున్నాడు."

(చమత్కార రత్నావళి]

సలక్షణ భాష.

అమ్మా! మీతోడు నేను నిజము జెప్పుచున్నాను. నా మాట నమ్ముము. అతనిని నేనుజూచి తిన్నగా నిముసమయిన నయియుండదు. ఆయన నీ పేరు పెట్టి పిలిచి యెక్కడనుంటివని కేకలువేయుచు నీవు కనబడిన పక్షమున నీ మొగము నిండ గంట్లుపెట్టి నిన్ను విరూపినిం జేయకపోయిన దన పేరు మాఱు పేరు పెట్టుమని యొట్టు పెట్టుకొనుచు నున్నాఁడు.

16 గ్రామ్యభాష.

"అక్కా! అక్కా ఇవ్వుడే పెళ్ళేమిటి? ఎవళ్ళన్నా నవ్వు తారు చాలులే. అని మనోరమను చేతంబుచ్చుకొని యీపసి దానికి దీనికా పెళ్ళి కాస్త నిన్నా మొన్నా లేచి తిచ్చాడు తున్నది. ఇవ్వుడే యిన్ని ఆలోచన లెందుకు"

(మనోరమ)

సలక్షణభాష.

అక్కా! అక్కా! ఇప్పుడే పెండ్లియేమి? ఎవ్వరైన నవ్వుదురు చాలులే. అని మనోరమను జేతంబుచ్చుకొని యీ పసిదానికి దీనికా పెండ్లి, కాసంత నిన్నను మొన్నను లేచి తిచ్చాడుచున్నది. ఇప్పుడే యిన్ని యాలో చనలెందుకు!

17. గ్రామ్య భాష.

"సుందరా! ఆయన నిన్నాప్రకారంగా నీమీద మోహం కనపఱిచే మాఎలన్నారా? అయిన పరస్పాత్రిగానే అలాగన్నారో, లేక హాస్యా నికే అన్నారో మాపులవల్లనూ ముఖచేష్టలవల్లనూ నీవు బాగా కనిపెట్టి

నావా? ఆయన గంభీరముగా చూచినాఁడా? తెల్ల తెల్లపోయి చూసాఁడా? మొకం విచారంగా వున్నదా? సంతోషంగా వున్నదా? అతని మనస్సేమయినా ముఖలక్షణమును బట్టి తెలుసుకో తగివున్నదో లేదో చెప్పు."

సలక్షణభావ.

సుభద్రా! ఆయన నిన్నుప్రీతికరముగా నీమీఁద మోహము గనబఱచు మాటలనినారా? ఆయన మనస్ఫూర్తిగానే యేలాగున ననిరో లేక వాక్యమునకే యనిరో చూపులవలనను, ముఖచేష్టలవలనను నీవు బాగుగఁ గనిపెట్టఁగలవా? ఆయన గంభీరముగాఁ జూచెనా? తెల్లతెల్లవోయి చూచెనా? మొగము విచారముగా నుండెనా? సంతోషముగా నుండెనా? అతనిమనస్సేమయినను ముఖలక్షణమును బట్టి తెలిసికొనఁదగి యున్నదో లేదో చెప్పుము.

18. గ్రామ్యభావ.

"వాడిచక్కదనము కాల్చిరి. నాతో అనేక సారులు వాడిమీద తనకసహ్యమనిన్ని తల్లిపోరు పడలేక వాడిదగ్గిరకు వెళ్ళుతాననిన్ని చెప్పినది. మొన్న పెండ్లిలో చూడలేదూ? కేజువాణీరోజున మా అన్నగారక్కడికి వెళ్ళినప్పుడు నీవు గంధం పూయమంటివి."

(ప్రణయమహిమ)

సలక్షణభావ.

వాని చక్కదనము కాల్చిరి. నాతో ననేక పర్యాయములు వాని మీఁద దన కసహ్యమనియుఁ దల్లిపోరు పడలేక వాని దగ్గఱకు వెళ్ళెద ననియుఁ జెప్పెను. మొన్న పెండ్లిలోఁ జూడలేదా! కేజువాణీరోజున మా యన్నగారక్కడికి వెళ్ళినప్పుడు నీవు గంధము పూయ మంటివి.

## 19 గ్రామ్యభాష.

" ఏడ్చావులే, గట్టిగా మాట్లాడంగా నేసరా ? అది నన్ను దగ నేలేను. దాని తల్లి కనపడి, " మహారాజులు సంస్థానము కనిపెట్టుకొని యున్నాము. తమ నిశానీ ఏదైనా వుండవలెను అన్నది. అప్పుడు జాలైనా కెంపుటుంగరము యిచ్చాను. అప్పటి మాట పోనీ యిప్పటికైనా నన్ను దమ్మిడి అడిగి యెరుగునా ?

(ప్రణయమహిమ.)

### సలక్షణభాష.

ఏడ్చితివిలే, గట్టిగా మాటాడగానే సరియా' అది నన్ను నన్నడుగ నే లేను. దాని తల్లి కనంబడిః మహారాజుల సంస్థానము గనిపెట్టుకొని యున్నాము. తను నిశాని యేదైన నుండవలెను అన్నది. అప్పుడు జాలియై నా కెంపుటుంగర మిచ్చితిని. అప్పటిమాటఁ బోనిమ్ము. ఇప్పటికైనను నన్ను దమ్మిడ యడిగి యెఱుంగునా ?

## 20 గ్రామ్యభాష.

' పోనీగాని ఈ మాట విన్నావు ? ఇది పెండ్లిలో నన్నెట్లా ప్రాధేయపడ పిలిచినదో ? ఎప్పుడూ నన్ను చూచే అభినయము చేసేది. సరసమైన జావళీలు పాడేది. స్పష్టముగా సిగ్గువిడిచి అందరి యెదుట "రమ్మనే మహారాజాగ రమ్మనే" అని జావళి పాడుతూ నాయొద్దికి వచ్చి కూరుచుని అభినయము చేసింది '

(ప్రణయమహిమ)

### సలక్షణభాష.

పోనిమ్ము కాని యీ మాట వింటివా ? అని పెండ్లిలో నన్నెట్లు ప్రాధేయపడి పిలిచెనో ? ఎప్పుడును నన్ను జూచియే యభినయము చేయునది. సరసమైన జావళీలు పాడునది. స్పష్టముగా సిగ్గువిడిచి యందరి యెదుట

'రమ్మనే మహారాజుగ రమ్మనే' అని జావళిఁ బాడుచు నా యొద్ది దగ్గఱకు వచ్చి కూరుచుండి యభినయము జేసినది.

21 గ్రామ్యభాష.

'మంత్రవన్నప్పుడు వైదీకపవాడిదేం మంత్రవండి? యీ రోజుల్లో వైదీక మంత్రాల మహిమ పోయిందండి. మంత్రమంటే నియ్యోగి ప్రభువుదే మంత్రం. తమ వంటి ప్రభురాజకులకు మంత్రం మాళ్లాడుతుందండి.'

(కన్యాశుల్కము.)

సలక్షణభా.

మంత్రమన్నప్పుడు వైదికపు వాడిదేమి మంత్రమయ్యా? యీరోజులలో వైదీకపు మంత్రముల మహిమ పోయినదిసుండీ. మంత్రమనిన నియోగి ప్రభువుదే మంత్రము! తమయట్టి ప్రభురాజకులకు మంత్రము మాటాడుచునుండీ.

22 గ్రామ్యభాష.

"ఇంత ముఖ్యమైన పద్యం మరచి పోవడం యెంత తప్పు! నోటు బుక్కు తీసి రాసుకో - "దమయంతి రెండో పెళ్ళికి, ధరనుండే రాజుళ్లెల్ల దడదడ వచ్చిరి" - చూశావా! లోకంలో వుండే రాజులంతా వెధవని పెళ్ళాడడానికి వచ్చారట, (బుచ్చమ్మవైపు జూచి) చూశారా? శాస్త్రాలన్నీ వొప్పుకోవడమే కాకుండా మీది మిక్కిలి వెధవలు పెళ్ళాడకుండా వుండిపోతే దోషమని కూడా చెప్పుతూ వున్నాయి. ఇందు విషయమై శంకరాచార్యులవారు పత్రిక కూడా యిచ్చియున్నారు."

కన్యాశుల్కము.)

సలక్షణభాష.

ఇంత ముఖ్యమయిన పద్యము మరచి పోవుట యెంత తప్పు! నోటు బుక్కుఁదీసి వ్రాసికొనుము—"దమయంతి రెండవ పెండ్లికి ధరనుండెడి రాజులెల్ల దడదడవచ్చిరి"—చూచితివా! లోకములోనుండు రాజు లందఱు

విధవను పెండ్లియాడుటకు వచ్చిరఁట. (బుచ్చమ్మవైపుఁజూచి) చూచితిరా? శాస్త్రములన్నియు నొప్పుకొనుటయే కాక మీఁదిమిక్కిలి విధవలు పెండ్లియాడకుండ నుండిపోయిన దోషమనికూడ చెప్పుచున్నవి. ఈ విషయమై శంకరాచార్యులవారు పత్రికఁగూడ నిచ్చియుండిరి.

### 23 గ్రామ్యభాష.

"అబ్బ! ఎంతశ్రమ పడ్డానండి (కాకర్లతో) తాపామర్లా పూరు కోమను, బోయిలోవాళ్ళూ, బాజావాళ్ళోళ్ళూ, పూరుచేరేటప్పటికి గోలాహాలం లావుచేస్తారు. కాళ్ళు పీక్కవచ్చాయనయ్యా, వెధవ పెద్దిపాలెం యంతదూరం వుంది! (తిరిగిచూసి) యిదేవిఁటీ పసుపుబట్టలూ పెళ్ళికూతురుతో కలిసి కూచోడవూను? పెళ్ళికొడుకుం చేయించుకున్నా వటయ్యా? ముదిమికి ముచ్చట్లులావు."

(కన్యాశుల్కము)

### సలక్షణభాష.

"అబ్బ! ఎంతశ్రమ పడితినండి. [నాకర్లతో] తాపామరపా హోరు కొండుపను. బోయి లోకంబ్రము, బాజావాండ్రొకంతు, నూరుచేరునప్పటికి గోలాహలము లావుచేసెదరు. కాళ్ళుపీకుకొని వచ్చినవయ్యా. విధవ పెద్దిపాలెము వెంతదూరమున్నది! (తిరిగిచూచి) ఇదేమి పసుపుబట్టలును పెండ్లికూఁతుతోఁ గలిసి కూర్చుండుటయును? పెండ్లికొడుకును చేయించి కొంటి వటయ్యా? ముదిమికి ముచ్చటలులావు.

### 24 గ్రామ్యభాష.

"యిలాగా, యిదుగో, యిలా చుట్టకాలిస్తే స్టీము యింజన్ లాగ, భగ్, భగ్ మని పొగ ఆకాశానికి పరిగెత్తి మేఘమై వర్షం కురిపిస్తుంది. కామంగాని పీరస్తే ఘాటుకి, ఆకాశం అస్సుకుపోతుంది. ముక్కంటు మాత్రం చిరవగ్గ ంకురిపి యిల్లూ వొళ్ళూకూడా దగ్ధి అవుతుంది. గనుక పాడుచేసే మార్గాల యింట్లో వుండే పొగాకంతా దొంగిలించి చుట్టలుగట్టి కాలెట్టి

తలవినదే. ఒకవేళ, గిరీశంగారూ, తమరు దొంగతనం చేశారు, కొద్దిరోజులు నరకానికి విజయంచెయ్యండి, అని దేవుఁడుగానీ, అన్నట్టాయనా, ఒకచిన్న లెక్చరుకొట్టి, గభరాయింప జేస్తాను"

(కన్యాశుల్కము)

సలక్షణభాష.

ఏలాగున, ఇదిగో యీలాగునఁ జుట్టకాల్చిన స్టీమింజనులాగున భగ్, భగ్ మని పొగ యాకాశమునకుఁ బరగెత్తి మేఘమై వర్షము గురిపించును. పొడుముగాని పీల్చినచో నాసాటున కాకాశమార్చికొని పోవును. ముక్కు-వెంబడిమాత్రము చిఱువర్షము కురిసి యిల్లు నోడలునుగూడ దర్ట్రియగును కనుక పొడుము చేయునట్టి మూర్ఖుల యింటిలోనుండు పొగాకంతయు దొంగిలించి చుట్టలుగట్టి తగులఁ బెట్టవలసినదే. ఒకవేళ గిరీశముగారూ, తమరు దొంగతనము చేసితిరి. కొద్దిరోజులు నరకమునకు విజయం చేయుఁడు, అని దేవుఁడుగాని యన్నట్టయిన నొక చిన్న లెక్చరుగొట్టి గభరాయింపఁజేసెదను.

25 గ్రామ్యభాష.

"యీరావప్పంతులే యీలాఁటి అపవాదలన్నీ వేస్తూవుంటాడు. కనబడ్డవాడితో అల్లావూరు పెడితే వూరంతా అనుకోరూ? బంగారం లాఁటి పిల్లని యీలాంటిమాటలని బెంబేలుపెట్టకండి. తండ్రి వెళ్ళి పోయినాడని అది రాత్రి పగలూ యేడుస్తూంది"

(కన్యాశుల్కము).

సలక్షణభాష.

ఈ రామప్పపంతులే యిట్టియపవాదము లన్నియు వేయుచుండును. కనబడినవానితో నెల్ల నుబుసుపెట్టిన నూరంతయు ననుకొనరా? బంగారము వంటిపిల్ల నీలాటిమాటలని బెంబేలుపెట్టకుఁడు. తండ్రి వెళ్ళెనని యది రాత్రియుం బగలు నేడ్చుచున్నది.

26 గ్రామ్యభాష.

"సరి మీ మానాన మీరుపోయి, నిశిరాత్రివేళ వొక్కర్తెనీ నన్ను వదిలేస్తే యీ అడివిప్రాంతాన్ని నాకు భయం కాదా? అందుచేత పల్లిగ్గా నలుగుర్నీ పిలిచి పేకాడుకున్నాను. తప్పేవుంది? మంచు పడుతూంది లోపలికి రండి (తలుపుగడియతీసి) రండి. నా ఆట మీరాడండి. నేనుపడుకుంటాను" (కన్యాశుల్కము)

సలక్షణభాష.

పతి మీ యంతట మీరుపోయి నిశీథరాత్రివేళ నొక్కరితను నన్ను వదలిపెట్టిన నీ యడవి యూరిలో నాకు భయము కాదా? అందుచేతఁ బల్లీయుగా నలుగురినిఁ బిలచి పేక యాడుచుంటిని. తప్పేమియున్నది? మంచు పడుచున్నది. లోపలికి రండు. (తలుపు గడియఁదీసి) రండు. నాయాట మీరాడుఁడు. నేను పరుండెదను.

27 గ్రామ్యభాష.

"కాశీలో రెండువందల యాభైసంవత్సరముల క్రిందట అలంగీర్ పాదుషావారి హయాంలో, ఓ సేటు మా పోటి సిద్ధులనందరిని ఖానాకి పిలిచాడు. గంగ నడిమి పడవమీద పీపాలతో సారాయి భరాయించి, బంగారపు గిన్నెలతో అందించాడు. రెండుఝాముల రాత్రి అయ్యే సరికి పీపాలు ఖాళీ అయిపోయినాయి. అంతా పడిపోయినారు."

(కన్యాశుల్కము)

సలక్షణభాష.

కాశిలో రెండువందల యేబది సంవత్సరముల క్రిందట అలంగీర్ పాదుషావారి హయాములో నొకసెట్టి మా పోటి సిద్ధులనందఱిని గూటమునకుఁ బిలిచెను. గంగ నడుమఁ బడవమీఁదఁ బీపాలలో సారాయి భరాయించి బంగారపు గిన్నెలతో నందించెను. రెండుజాములరాత్రి యగుసరికిఁ బీపాలు ఖాళీలైనవి. అందఱుఁ బడిపోయిరి.

## 28 గ్రామ్యభాష.

"కంటె పోయిందంటె మూడురూపాయలా చేతులో పెడతాడు (విరసంగా నవ్వుచు) పీడితాళం పడతాను. (హెడ్ పారేసిన కాకితపుముక్కలు యేరి) యినస్పెక్టరుకి వొకటి, తాసీల్దారుకి వొకటి. ఆకాశరామన్న అర్జీలు పంపుతాను. వెధవ, మధురవాణి దగ్గిరికి వెడతాడేమో నేను యింటికిపోతే అరుగుమీద పడుకోవాలిగాని ఆ తిక్కలంజ తలుపు తియ్యదు. లుబ్ధావధాన్లు యింటికి వెళ్ళితే వాడు కఱ్ఱిచ్చుకుంటాడు"

(కన్యాశుల్కము)

### సలక్షణభాష.

కంటె పోయినదనిన మూఁడురూపాయలా చేతిలోఁ బెట్టును? (విరసముగా నవ్వుచు) వీని తాళముఁబట్టెదను. (హెడ్ పాఱవైచిన కాకితపుముక్కలేరి) ఇనస్పెక్టరున కొకటి, తాసిల్దారున కొకటియు నాకాశ రామన్న యర్జీలు పంపెదను. విధవ, మధురవాణి దగ్గఱకు వెళ్లునేమో? నేనింటికిఁ బోయిన నరుగుఁమీదఁ బండుకొనవలెఁగాని యాతిక్కలంజ తలుపుఁ దీయదు. లుబ్ధావధాని యింటికి వెళ్ళినచో వాఁడు కఱ్ఱపుచ్చుకొనును.

## 29 గ్రామ్యభాష.

"మీరే పోక్యలాడుతున్నట్టుంది. పెళ్ళిఅయి పదిరోజులైంది. లుబ్ధావధాన్లుగారి సంబంధం అక్కరేదని మీరు రాశారట. అందుపైని యెవడో గుంటూరునుంచి వొచ్చిన ఓశాస్తుర్లు కొమార్తెని పన్నెండు వొందలిచ్చి, పెళ్ళాడాడు" (కన్యాశుల్కము)

### సలక్షణభాష.

మీరే పోక్యములాడుచున్నట్లున్నది. పెండ్లియై పదిరోజులయినది. లుబ్ధావధానిగారి సంబంధ మక్కఱలేదని మీరు వ్రాసితిరఁట. అందుపై నెవఁడో గుంటూరునుండివచ్చిన యొక శాస్త్రికుమార్తెను బన్నెండు వందలిచ్చి పెండ్లియాడెను.

## 30 గ్రామ్యభాష.

నా మాటవిని యింతో ప్రియాసంమీద యీఘట్టం కుదిర్చాను తాసీల్దారు మీదగ్గర లంచంపుచ్చుకుని కూనీకేసు కామాపుచేశాడని, యినస్పెక్టరు, డిప్టీకలెక్టరికి గట్టిగా బోధపర్చాడు. కలక్టరు సలహామీద యినస్పెక్టరు చాలా పట్టుదలగా పనిచేసి సాక్ష్యం అంతా రడీచేశాడు కేసు రుజువైనట్టాయనా యేవౌతుందో ఆలోచించుకోండి ”

(కన్యాశుల్కము.)

## సలక్షణభాష.

నా మాటవినుము. ఎంతయో ప్రియాసముమీఁద నీఘట్టము కుదిరిచితిని. తహసీలుదారు మీ దగ్గర లంచము పుచ్చుకొని కూనీకేసు మాపుచేసెనని యినస్పెక్టరు డిప్టికలెక్టరునకు గట్టిగా బోధపరచెను. కలెక్టరు సలహామీద నినస్పెక్టరు చాలా పట్టుదలగాఁ బనిచేసి సాక్ష్యమంతయు సిద్ధము చేసెను. కేసు రుజువయినట్టయిన నేమౌనో యాలోచించుకొనుఁడు.

☞ వచనముల యందలి గ్రామ్యభాషాభాగములను బండితుల యొద్ద సలక్షణభాషాశైలిని వ్రాయ జూచుచుండుటవలన తప్పులు తెలియును.

---

# CHAPTER XXXIII.

## సాంఖ్యాసూచకములు.

---

మీమాంస రెండు విధములు — పూర్వమీమాంస, ఉత్తర మీమాంస. తర్కము రెండు విధములు — న్యాయము, కాణాదము, రెండు ముఖములు గలవాఁడగ్ని, రెండు నాలుకలు గలది సర్పము, రెండు జన్మము లుగలవారుద్విజులు, 2 లోకములు — ఇహపరలోకములు, 2 ఆయనము లు—ఉత్తరాయణము, దక్షిణాయనము.

త్రిమూర్తులు — బ్రహ్మ, విష్ణు మహేశ్వరులు, త్రిలోకములు — స్వర్గ మర్త్యపాతాళములు, త్రిగుణములు—సత్త్వము, రజస్సు, తమము, త్రికరణములు—మనస్సు, వాక్కు, కాయము, త్రేతాగ్నులు—దక్షిణాగ్ని, గార్హపత్యము, ఆహవనీయము. శక్తిత్రియము—ప్రభుశక్తి. ఉత్సాహ శక్తి, మంత్రిశక్తి. నాయికాత్రియము, స్వీయ. పరకీయ సామాన్య. రీతి త్రియము-వైదర్భి, గౌడి, పాంచాలి, పాకత్రియము-నారికేళము, కదళి ద్రాక్ష. ఋణత్రియము— దేవ. పితృ, మనుష్య. ఋణములు, అవస్థా త్రియము—జాగ్రత్, స్వప్న, సుషుప్త్యవస్థలు. కాలత్రియము — భూత, భవిష్యత్, వర్తమానకాలములు, తాపత్రియము-ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, అధి దైవికము, ధనగతిత్రయము-దానము, భోగము, నాశము, గజ తిత్రియము—భద్రము, మందము, మృగము, త్రిలింగములు — స్త్రీలింగ, పుంలింగ, నపుంసకలింగములు, త్రిలక్షణములు — జహల్లక్షణము, అజ హల్లక్షణము, జహదజహల్లక్షణము, లక్షణములకు గలిగెడి త్రిదోషములు, అతివ్యాప్తి, అవ్యాప్తి, అసంభవము. త్రిస్వరములు — ఉదాత్తము, అను దాత్తము, స్వరితము.

నాలుగు ముఖములు గలవాఁడు బ్రహ్మ. చతుర్విధ పురుషార్థములు ధర్మ, అర్థ, కామ, మోక్షములు, సేనా చతురంగములు — రథ,

పంచామృతములు—ఉదకము, పాలు, పెరుగు, నేయి, తేనె. శివుని పంచముఖములు—ఈశాన, తత్పురుష, వామదేవ, సద్యోజాత, అఘోరములు. పంచబాణములు—అరవిందము, అశోకము, చూతము, నవమల్లిక, నీలోత్పలము.—మందారము, పారిజాతము, సంతానము, కల్పము, హరిచందనము, జ్ఞానేంద్రియపంచకము—త్వక్కు, చక్షుస్సు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము. కర్మేంద్రియపంచకము—వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ, పంచమహాయజ్ఞములు—పాఠము, హోమము; అతిథిపూజ, తర్పణము, బలి, పంచమహాపర్వములు-కృష్ణాష్టమి, కృష్ణచతుర్దశి, అమావాస్య, పూర్ణిమ, సంక్రాంతి, పంచప్రాణములు-ప్రాణము అపానము, వ్యానము, ఉదానము, సమానము. పంచోపవాయువులు-నాగము కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయము, పంచగంగలు—కావేరి, తుంగభద్ర, కృష్ణవేణి, గౌతమి, భాగీరథి, పంచకన్యలు—అహల్యా, ద్రౌపదీ, తారా, సీతా, మండోదరులు. పంచాంగములు—తిథివారనక్షత్ర యోగకరణములు, పంచకావ్యములు—రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము, మాఘము, నైషధము. పంచవర్ణములు—తెలుపు, నలుపు, ఎఱుపు, ఆకుపచ్చ, పంచగవ్యము గోమూత్రము, గోమయము, గోఘృతము, గోదధి, గోక్షీరము. పంచపల్లవములు—రావి, జువ్వి మఱ్ఱి. మేడి, మామిడి. పంచలోహములు—బంగారు, వెండి, తామ్రము, సీసము. ఇనుము. పంచయజ్ఞములు—దేవయజ్ఞము, పితృయజ్ఞము, భూతయజ్ఞము, బ్రహ్మయజ్ఞము, మనుష్యయజ్ఞము పంచగౌడులు-ఉత్కల, మైథిల, కనోజ, కాన్యకుబ్జ, సారస్వతులు. పంచాగ్నులు—గార్హపత్యాగ్ని, దక్షిణాగ్ని, ఆహవనీయాగ్ని, ధాన్యాగ్ని, పాకాగ్ని. పంచశక్తులు—ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి, ఆదిశక్తి, పరాశక్తి, పంచతన్మాత్రలు—శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము. పంచముద్రలు భూచరీ. ఖేచరీ, మధ్యమ, షణ్ముఖి, శాంభవి. పంచసూత్రములు—ఆపస్తంబీయము, అశ్వలాయనీయము, కాత్యాయనీయము, బోధాయనీయము, వైఖానసీయము,

పంచాక్షరములు— న, మ, శి, వా, య, పంచసంస్కారములు —తాపము, పుండ్రము, నామము, మంత్రము, వైష్ణవేష్టి. పంచకోశములు—అన్నమయము, ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయము, ఆనందమయము.

అరిషడ్వర్గములు— కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు. షట్కర్మములు—యజన, యాజన, అధ్యయన, అధ్యాపన, దాన, ప్రతిగ్రహములు. షడ్రసములు—కషాయము, మధురము, లవణము, కటువు, తిక్తము, అమ్లము, షట్చక్రవర్తులు— హరిశ్చంద్రో నలోరాజా పురుకుత్సః పురూరవాః। సగరః కార్తవీర్యశ్చ షడేతే చక్రవర్తినః। షడంగములు—శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము. షడీతులు— అతివృష్టిరనావృష్టిర్మూషికాశ్శలభాశ్శుకాః, అత్యాసన్నాశ్చరాజానః, షడేతా ఈతయస్స్మృతాః, షడ్గుణములు—సంధి, విగ్రహము, యానము. ఆసనము, ద్వైధము, ఆశ్రయము. షడ్గుణైశ్వర్యములు—మాహాత్మ్యము, ధైర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము. షట్కాలములు— ప్రాతఃకాలము, సంగమ కాలము, మధ్యాహ్నకాలము, అపరాహ్ణకాలము, సాయాహ్నము, అర్ధరాత్రి. షడ్లింగములు—ఉపక్రమము, ఉపసంహారము అభ్యాసము, అపూర్వత, అర్థవాదము, ఫలము, ఉపపత్తి, షడృతువులు— వసంతఋతువు, గ్రీష్మఋతువు, వర్షఋతువు, శరదృతువు, హేమంత ఋతువు, శిశిరఋతువు, షట్కళలు—నివృత్తి, ప్రతిష్ఠ, విద్య, శాంతి, శాంత్యతీతము, నిష్కళము. శమాదిషట్కము—శమము, దమము, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధానము.

ఏడు నాలుకలు గలవాఁడు, అగ్ని. సప్తకులపర్వతములు—మహేంద్రము, మలయము, సహ్యము, శుక్తిమంతము, గంధమాదనము. వింధ్యము, పారియాత్రము. సప్తసంతానములు—తనయుండు చెఱువును, కావ్యంబు, నిధానము, గుడి, వనంబు, భూదేవస్థాపనమును, సను నీయేడును, జనుకాన్త్ర్యము లందు సప్తసంతతులనఁగ. రాజ్యసప్తాంగములు—స్వామ్యమాత్య సుహృ

త్కోశ రాష్ట్రదుర్గబలములు, అధోలోకములు — అతల, వితల, సుతల, తలాతల, రసాతల, మహాతల, పాతాళములు. సప్తఋషులు — కశ్యప, అత్రి, భరద్వాజ, విశ్వామిత్ర, గౌతమ, జమదగ్ని, వసిష్ఠులు. సప్తద్వీపములు — జంబూప్లక్ష కుశక్రౌంచశాకశాల్మల పుష్కలములు, సప్తవ్యసనములు — జూదమాడుట, స్త్రీల గోరుట, కల్లు త్రాగుట, వేటాడుట, కఠినోక్తు లాడుట, పరుల సొమ్ము నపహరించుట, సభా సప్తాంగములు — కవీశ్వరులు, విద్వాంసులు, పౌరాణికులు, పూర్వకథలను జెప్పెడివారు, స్తుతిపాఠకులు, హాస్యకారులు, గాయకులు ఊర్ధ్వలోకములు-భూలోకము, భువర్లోకము, సువర్లోకము, తపోలోకము, సత్యలోకము, మహర్లోకము, జనర్లోకము, సప్తమరుత్తులు — ఆవహము, ప్రవహము, సంవహము, ఉద్వహము, వివహము, పరివహము, పరావహము. సప్తసముద్రములు — లవణసముద్రము, చెఱుకుపాల సముద్రము, కల్లు, సముద్రము, నేతిసముద్రము, పాలసముద్రము, పెరుగు సముద్రము, మంచినీళ్ళ సముద్రము, సప్తవిధ చిరంజీవులు — అశ్వత్థామ, బలిచక్రవర్తి, వ్యాసమహర్షి, హనుమంతుఁడు, విభీషణుఁడు, కృపాచార్యుఁడు, పరశురాముఁడు. సప్తతాళములు — ధ్రువతాళములు, మధ్యము, రూపకము, చంపు, త్రిపుట, అట, ఏకతాళము, సప్తమండలములు — వాయుమండలము, వరుణమండలము, చంద్రమండలము, సూర్యమండలము, నక్షత్రమండలము, అగ్నిమండలము, జ్యోతిర్మండలము. సప్తమేఘములు — సంవర్తము, ఆవర్తము, పుష్కలావర్తము, ద్రోణము, కాళమేఘము, నీలమేఘము. సప్తస్వరములు స, రి, గ, మ, ప, ధ, ని,

అష్టైశ్వర్యములు — దాసీజన, భృత్య, పుత్ర, మిత్ర, బంధు వాహన, ధన, ధాన్యములు. గజమదములు — దానము, సీధువు, సాగరము, శీకరము, శక్యము, మదము, ఘర్మము, మేఘము. అష్టవసువులు — అప్తము, ధ్రువుఁడు, సోముఁడు, అధ్వరుఁడు. అనిలుఁడు, ప్రత్యూషుఁడు, అనలుఁడు, ప్రభాసుఁడు.

శివుని యష్టమూర్తులు - పృథ్వి, అప్తేజో వాయ్వాకాశములు, సూర్యచంద్రులు సోమయాజి. అష్టదిగ్గజములు - ఐరావతము, పుండరీకము, వామనము, కుముదము, అంజనము, పుష్పదంతము, సార్వభౌమము, సుప్రతీకము. అష్టాంగ యోగములు — యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన ధారణ, సమాధులు. అష్ట కష్టములు — దాస్యము, దారిద్ర్యము భార్య లేకుండుట, స్వయంకృషి, చేయిచాచి యడుగుట తన్ను యాచించిన వారికి లేదనుట. అప్పు పడుట, త్రోవ నడచుట, అష్ట సిద్ధులు. అణిమ, మహిమ, లఘిమ, గరిమ, ఈశిత్వము, వశిత్వము, ప్రాప్తి, ప్రాకామ్యము. అష్టాక్షరి—ఓం, న, మో, నా, రా, యణా, య, అష్టగురువులు, అక్షరాభ్యాసము చేసినవారు, ఉపనయన కాలమందు గాయిత్రిని ఉపదేశించినవారు, వేదాధ్యయనము జేయించినవారు. శాస్త్రాభ్యాసము జేయించినవారు. పురాణేతిహాసాదులను తెలియ జేసినవారు, శైవవైష్ణవమత సాంప్రదాయములను బోధించినవారు, టక్కు, టమార, గజకర్ణ, గోకర్ణ, ఇంద్రజాల, మహేంద్రజాలాది విద్యల నుపదేశించినవారు. అష్టాంగ నమస్కారములు — కరములు, పాదములు, రొమ్ము, లలాటము, భుజములు. అష్టావధానములు-చతురంగము కవిత్వము, వ్రాయుట, చదువుట, గణితము, సంగీతము, యుక్తిచెప్పుట వ్యస్తాక్షరి. అష్టదిక్పాలకులు — ఇంద్రుడు, అగ్ని, యముడు, నిర్రృతి, వరుణుడు, వాయువు, కుబేరుడు, ఈశాన్యుడు అష్టదిక్కులు—తూర్పు, ఆగ్నేయము, దక్షిణము, నైరృతి, పశ్చిమము, వాయువు పడమర, కాచేగము, ఉత్తరము, ఈశాన్యము.

నవరసములు—శృంగార, వీర, కరుణ, అద్భుత, హాస్య, భయానక, బీభత్స, రౌద్ర, శాంతములు. నవరత్నములు—వజ్ర, వైడూర్య, గోమేధిక, పుష్యరాగ, మరకత, మాణిక్య, పద్మరాగ, మౌక్తిక ఇంద్రనీలములు. నవనిధులు— మహాపద్మము, శంఖము, మకరము, కచ్ఛపము, ముకుందము,

నీలము, పరము. నవగ్రహములు—రవి, శశి, కుజ, బుధ, గురు, శుక్ర, శని రాహుకేతువులు, నవఖండములు, —ఇవియే నవవర్షములు—భరత, హేమకూట నైషధ, ఇలావృత, నీల, శ్వేత, కురు, భద్రాశ్వ, కేతుమాలావర్షములు, నవఖండములు — భరతఖండము, ఇంద్రఖండము, చరుఖండము, గభస్తిఖండము, నాగఖండము, తామ్రఖండము, వారుణఖండము, సౌమ్యఖండము, గంధర్వఖండము. నవరసస్థాయీభావములు — ఇతిహాసము. శోకము, క్రోధము, ఉత్సాహము, భయము, జుగుప్స, విస్మయము, శాంతము.

దశవిధకావ్యగుణములు—శ్లేషము, ప్రసాదము, మాధుర్యము, సౌకుమార్యము, సమత, అర్థవ్యక్తి, ఔదార్యము, కాంతి, ఓజము, సమాధి. దశావతారములు—మత్స్యః కూర్మ వరాహశ్చ నారసింహశ్చవామనః। రామోరామశ్చకృష్ణశ్చ బుద్ధః కలికిమేవచ. దశవిధ మన్మథావస్థలు-చక్షుః ప్రీతి, మనస్సంగము, సంకల్పించుట, నిద్రబోకుండుట, చిక్కిపోవుట, అన్నివస్తువులయందు ఆశలేకుండుట, సిగ్గువిడుచుట, చిత్తభ్రమనొందుట, మూర్ఛనొందుట మరణమునకు యత్నించుట, దశదానములు — గోదానము, భూదానము, తిలదానము, హిరణ్యదానము, ఘృతదానము, వస్త్రదాము, ధాన్యదానము, గుడదానము, లవణదానము,

ఏకాదశరుద్రులు — ఉగ్రుడు, సోముడు, శర్వుడు, మృగవ్యాధుడు, రంతిజుడు, భిక్షుడు, అహిర్బుధ్న్యుడు, పినాకి, పాదుకేశ్వరుడు, కాపాలికేయుడు, భౌముడు.

ద్వాదశాదిత్యులు—అర్యముడు, మిత్రుడు, వరుణుడు అర్కుడు భృగుడు, ఇంద్రుడు, వివస్వంతుడు, పూషుడు, పర్జన్యుడు, త్వష్ట విష్ణువు, అజఘన్యుడు, ద్వాదశాళ్వారులు — పెరియాళ్వారు, పొయిగయాళ్వారు, భూధత్తాళ్వారు. పేయాళ్వారు, తిరుమళిశయాళ్వారు, నమ్మాళ్వారు, మధురకవియాళ్వారు, కులశేఖరాళ్వారు, భట్టురుపిరాన్ తొండరడిప్పొడియాళ్వారు, తిరుప్పాణి యాళ్వారు, తిరుమంగయ్యాళ్వారు.

చతుర్దశమనువులు — స్వాయంభువు, స్వారోచిషుఁడు, ఉత్తముఁడు, తామసుఁడు, రైవతుఁడు, చాక్షుషుఁడు, వైవస్వతుఁడు, సూర్యసావర్ణి, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి, ధర్మసావర్ణి, భద్రసావర్ణి, ఇంద్రసావర్ణి, చతుర్దశవిద్యలు — ఋగ్యజుస్సామాథర్వణములు, (4) శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, (6) మీమాంస, న్యాయశాస్త్రము, పురాణము, స్మృతి, (4) పదునాలుగు. చతుర్దశలోకములు — భూలోక భువర్లోక, సువర్లోక, జనర్లోక, నభోలోక, సువర్లోక, సత్యలోక, అతల, వితల, సుతల. తలాతల, రసాతల, మహాతల, పాతాళలోకములు.

షోడశమహారాజులు — గయుఁడు, అంబరీషుఁడు, శశిబిందువు, పృథువు, సుహోత్రుఁడు, భరతుఁడు, దిలీపుఁడు రంతిదేవుఁడు, మాంధాత, అంగుఁడు, శిబి, మరుత్తు, నృగుఁడు, రాముఁడు, యయాతి, భగీరథుఁడు. షోడశోపచారములు — ధ్యానము, ఆసనము అర్ఘ్యము, పాద్యము, ఆచమనము, స్నానము, గంధము, పుష్పము, వస్త్రము, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము, ఛత్రము, చామరము, పర్యంకము, షోడశకర్మలు, గర్భాధానము, సీమంతము, పుంసవనము, జాతకరణము, నామకరణము, అన్నప్రాశనము, చౌలము, ఉపనయనము, ప్రాజాపత్యము, సౌమ్యము, ఆగ్నేయము, వైశ్వదేవము, గోదానము, సమావర్తనము, . వివాహము, అంత్యకర్మ. షోడశమహాదానములు — శయ్యాదానము, ఛత్రదానము, గజదానము, అశ్వదానము, కన్యాదానము, ఉపనయనదానము, కాలపురుషదానము, చాపదానము, గృహదానము, పుస్తకదానము, పాత్రదానము, సాలగ్రామదానము, హేమకాదానము. అన్నదానము, విద్యాదానము, కృష్ణాజినదానము, షోడశచంద్రకళలు,—అమృత, మానద, పూష, తుష్టి, పుష్టి, రతి, ధృతి, శశినీ, చంద్రికా, కాంతి, జ్యోత్స్న, శ్రీకర, ప్రీతి, అంగద, పూర్ణామృతలు.




## ప్రౌఢ ప్రబంధములు

—:o:—

రాజవాహన విజయము - కాకమాని మూర్తి.

ఆంధ్ర టీకాతాత్పర్యము రు. 1/-

పాంచాలీ పరిణయము - కాకమాని మూర్తి అ. 12

రాజశేఖరచరిత్రము - మాదయ్యగారి మల్లన్న అ. 8

అచలాత్మజా పరిణయము - శ్లేషయమకచక్రవర్తి

వెంకటాచార్యులు. ప్రతిపదార్థము రు. 1

వైజయంతీ విలాసము - సారంగు తమ్మయ్య అ. 12

రామేశ్వరమాహాత్మ్యము - ఏనుగు లక్ష్మణకవి అ. 12

దిలీప చరిత్రము - వెంకటకృష్ణకవి అ. 12

తారకాంత - రాజా భుజంగరావు రు. 1

## లక్షణ గ్రంథములు

అహోబల పండితీయము (కవి శిరోభూషణము)

ఆంధ్ర వ్యాకరణము 8-8-0

సర్వలక్షణ సారసంగ్రహము - కూచిమంచి తిమ్మకవి రు. 1

ఆంధ్రసాహిత్యదర్పణము - నందిరాజు చలపతిరావు

(ఉపన్యాస దర్పణము) రు. 2

బాల సాహిత్యము - నందిరాజు చలపతిరావు

ఛందశ్శాస్త్రము. అ. 8

నిఘంటుత్రయము అ. 12

---

మంజువాణీ ప్రెస్‌లో దొరకును.